# కృష్ణదేవరాయలు

రచయిత

డా. నేలటూరు వెంకటరమణయ్య, M.A., Ph.D.






జనరల్ ఎడిటరు

మహమ్మద్ అబ్దుల్ వహీద్ ఖాన్, F. R. A. S. (Lond.)

డైరెక్టరు, పురావస్తు శాఖ,

ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు

ప్రకాశకులు

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

వెల రు. 15-00

# PREFACE

Among all the Vijayanagar rulers Krishnadevaraya had enjoyed the unique honour of being not only the conquerer of a vast empire including Kalingadesa and the Raichur doab but also a great patron of renowned poets and scholars in several branches of learning. Traditions basing on the military achievements of this great monarch were recorded in the village diaries known as *kaifiats* which have been later collected and preserved by Meckenzie during the 19th century. Similarly the numerous royal records of his time engraved on copper plates and stone speak volumes about his valour and benevolence. Last but not the least is the literary source which furnishes the historian a good deal of authentic information regarding the unparalleled political and literary career of this great emperor. Corroborating all these sources with the accounts given by the Muslim historians and the Portuguese chroniclers of that period, Dr. N. Venkataramanayya, the renowned historian, has brought forth the true character of this valorous king. I hope this monograph in Telugu from the pen of this versatile writer in English as well as Telugu will be a welcome addition to the South Indian Medieval History and I am quite sanguine that it would be of great value to research students, scholars and teachers working on the subject.

I express my grateful thanks to Dr. N. Venkataramanayya, for contributing this monograph for the departmental publication. My thanks are also due to Dr. R. Subrahmaniam for writing a valuable introduction on the subject matter of the publication.

MOHD. ABDUL WAHEED KHAN,
*Director.*

# FOREWORD

In the history of medieval South India, the empire of Vijayanagara played a very significant role. Of all the kings that ruled over this vast empire, the name of Krishnadēvaraya shines as the finest of stars. His name has come down to posterity. He was a great warrior, diplomat, man of letters and a great patron of all arts of peace. He was born at a time when the empire of Vijayanagara was very much eroded by the successful invasions of the neighbouring kings of Orissa and Gulbarga. The Gajapatis of Orissa were successful in extending their authority right upto Udayagiri Mandala and left no stone unturned to make inroads into the empire even against the capital city of Vijayanagara. The Bahmani Sultans did not lag behind, though the Sultanate slowly dismembered into five Muslim kingdoms of Bidar, Birar, Bijapur, Ahmednagar and Golconda. They also tried their best to encroach upon Vijayanagara empire and establish their authority there.

After the death of Narasā Nāyaka the regent of Immadi Narasimha, his son Veeranarasimha has ascended the throne of Vijayanagara. He was assisted in his wars as well as the administration of the empire by his able brother Krishnaraya. But, when he fell ill, the Tuluva emperor felt jealous and wanted to put an end to the life of Krishna so that his infant son might succeed to the throne. The times were turbulent and needed a competent warrior king on the throne and thanks to the manoeuvres of Sirah Pradhana Timmarusu, Krishnadēvaraya succeeded as emperor on the throne of Vijayanagara.

Almost the first task of Krishnadēvaraya after he ascended the throne, was the consolidation of his power and reconquest of the territories which his neighbours had taken from his predecessors. In a seven year war which he conducted against Prataparudra of Orissa, the armies of Krishnadēvaraya not only managed to avenge their earlier insults, but also succeeded in penetrating into the heart of the Gajapati's own kingdom and dictating terms of peace not quite honourable to the vanquished. River Krishna became the boundary between the two kingdoms and for sometime peace prevailed in that direction. Raya then marched against the Sultan of Bijapur and won a victory in the battle of Raichur in the 20s of 16th century. It was perhaps one of the most decisive battles ever fought between these two powers. No less significant was the achievement of Raya in the domain of diplomacy. His handling of the Portuguese problem, particularly his dealings with Fr. Luis, the conclusion of the treaty with the Portuguese for supply of the best breed of horses for Vijayanagara army depriving Bijapur which vied with Vijayanagara in the purchase of horses from them for the cavalry, have no parallels in the diplomatic history of medieval India.

Raya was a great devotee of Vishnu. But, as an ideal monarch, he was catholic in his outlook and gave equal patronage to all other creeds. Wherever

we go in the length and breadth of his vast empire which extended from Krishna to Kanyakumari and from the Bay of Bengal to the Western Ghats,we find the munificent hand of Raya in the stupendous constructions of temples, palaces, the master pieces of the age. Whenever he won a battle, the victory was celebrated by giving gifts to all the Siva and Vishnu temples in the South. The architecture of this age which again is a culmination of the earlier tradition of the Cholas is marked by numerous constructions of spacious halls, Kalyana Mandapas, Natya Mandapas, Sangita Mandapas within the temple enclosures and the lofty gopuras which rise high into the sky on all the four cardinal directions of the temple enclosure. His contribution to literature and art, philosophy and religion is equally significant and his reign is justly regarded as the golden age in the history of Telugu literature.

The following pages embody the history of this great potentate from the pen of Dr. N. Venkataramanayya, a scholar of great repute who spent more than 50 years in the study of Vijayanagara history and he is an acclaimed and accredited authority on Vijayanagar history. His earlier contributions *viz.*, 'Kampili and Vijayanagara', 'Founders of the City and the Empire of Vijayanagara,' 'Studies in the Third Dynasty,' 'Further Sources of Vijayanagara History' and 'Early Muslim Expansion in South India' are monumental and read by every student of history with great interest. This account of the political history of Krishnadevaraya from the pen of this versatile scholar is a welcome addition and I am sure the students of Vijayanagara history in general and the people of Andhra in particular will be beholden to him for this valuable work.

R. SUBRAHMANYAM,
*Superintending Archaeologist,*
*Archaeological Survey of India*

Jantar Mantar,
*New Delhi,*
Jan. 1, 1972.



# కృష్ణదేవరాయలు

శ్రీ నేలటూరి వెంకటరమణయ్య

## ప్రకరణము ౧. ఆధారములు

దక్షిణదేశమును పూర్వకాలమున పాలించిన హిందూ చక్రవర్తులలో కర్ణాటసామ్రాజ్యాధిపతి శ్రీకృష్ణదేవరాయలు ప్రఖ్యాతుడు. ఆ మహారాజు కీర్తిమూర్తి దాక్షిణాత్య హిందూ హృదయఫలకముల స్థిరముగ నెలకొనియున్నను, ఆయన చరిత్ర విద్యావంతులకుగూడ సుపరిచితముగాదు. ఉత్తరాపథమునందు విక్రమాదిత్య భోజనరపాలు రెట్లు ప్రసిద్ధులో కృష్ణరాయ లట్లే సర్వదక్షిణభారత భూమియం దాదరణీయుడు. ఆంధ్ర వాఙ్మయము నతడెట్లు పోషించినదియు, సంస్కృత కర్ణాటాదిభాషల నెట్లాదరించినదియు నందరెరుగుదురు. కాని యతని చరిత్రనుగూర్చి జనసామాన్యమున కెరుకపడిన విషయము మహాస్వల్పము. ఇటీవల చరిత్రపరిశోధకుల కృషివలన రాయలవారి చరిత్రకు సంబంధించిన విషయములు విదితములైనవి. లభ్యమైన చరిత్రాంశముల నెల్ల గ్రోడీకరించి శ్రీకృష్ణరాయల చరిత్రమును సాధ్యమైనంతవరకు సంపూర్ణముగ రచియింపవలయునని నాయుద్దేశము

ఆద్యమున శ్రీకృష్ణరాయచరిత్రరచనకు గల సాధనసామగ్రులను వర్ణించుట యుక్తము. ఇవి యిరుదెరగులవి. మొదట పేర్కొనదగినవి శాసనములు. తామ్రపట్టికలేమి, శిలాశాసనములేమి రాయలకాలమునాటివి దాదాపు ౫౦౦ ఇప్పటివఱకు లభ్యపడినవి. ఇవి సంస్కృతాంధ్రద్రావిడ కర్ణాటభాషలయందు విరచింపబడియున్నవి. సంఖ్య బహుళమగుటచేత నీ శాసనముల నన్నిటిని ఇట వర్ణించుటకు వలనుపడదు. ముఖ్యమైనవానిని సందర్భానుసారముగ గ్రంథమునం దుదాహరించిన చాలును. పరిశోధనాసక్తి గలవారలు మదరాసు గవర్నమెంటు శాసన పరిశోధకశాఖవారి సాంవత్సరిక నివేదికలను, ఎపిగ్రాఫియా ఇండికావంటి శాసన సంశోధక పత్రికలను, దక్షిణ ఇండియా శాసనపరంపర, ఎపిగ్రాఫియా కర్ణాటికా మొదలగు శాసనగ్రంథసంపుటములను బరిశోధించి తృప్తిపడవచ్చును.

శాసనముల తరువాత పేర్కొనదగినది వాఙ్మయము. వాఙ్మయ మనగా కేవల గద్యపద్యాత్మకమైన కావ్యమని యెంచరాదు. గ్రంథరూపమున నుండు సాక్ష్యమంతయు నీ తరగతిలో

జేరినదే. రాయలనాడు విరచితములైన కావ్యములే
కాక మహమ్మదీయ చరిత్రకారుల రచనలు, పోర్చు
గీసు గ్రంథకర్తల వృత్తాంతములు, వంశానుచరిత
ములు, తరతరములనుండి లోకమున ప్రచారము
నందుండుగాథలు, చాటూక్తులు, గ్రామకవిలెలు,
కైఫీయతులు మొదలగునవి యన్నియు నిట
గ్రాహ్యములు. ముఖ్యమైన ఆధార గ్రంథములను
సంగ్రహముగ నిచట వర్ణించుచున్నాను.

కావ్యములు : భాషననుసరించి ఇవి రెండు
తరగతులవి.

(౧) సంస్కృతమున కొన్ని గలవు.
సంస్కృతకావ్యములలో బ్రధానమైనది రాజనాథ
డిండిమవిరచిత అచ్యుతరాయాభ్యుదయము. ఇందు
కృష్ణరాయల కళింగదిగ్విజయ ప్రస్తావన గలదు.
మఱియు భండారు లక్ష్మీనారాయణకృత సంగీత
సూర్యోదయ పీఠికయందు కళింగ దిగ్విజయమును
నేదులఖానునిపై విజయమును గలుబరిగ దండ
యాత్రయు వర్ణింపబడియున్నవి.

(౨) ఆంధ్రప్రబంధములు : ఇవి ముఖ్యముగ
మూడు : (i) మొదట బేర్కొనదగినది యల్లసాని
పెద్దనార్యకృత మనుచరిత్ర. పీఠికయందును నాశ్వా
సాద్యంతములందును గటకదహనపర్యంతము గల
కృష్ణరాయల కళింగవిజయయాత్రయు, మఱి
కొన్ని యజ్ఞాత దండయాత్రలును వర్ణింపబడి
యున్నవి. (ii) కృష్ణరాయరచితాముక్తమాల్యద.
దీనికిని మనుచరిత్రకును బీఠిక చాలవఱకు సామాన్య
మైనను, ఇందు కళింగదండయాత్రయందు చేకుఱిన
విజయములు మఱియు విపులముగ వర్ణింపబడి
యున్నవి. మఱియు నిందు ఉత్తర దిగ్విజయము,
సగరపురకల్బరిగనగర ప్రాంతములదురకలతో జరిగిన
యుద్ధములును, నేదులఖానుని వధయు, కెంబావి
రణక్షేత్ర విజయమును వివరింపబడియున్నవి.
ఇంకను కృష్ణరాయవిరచితసంస్కృతాంధ్రగ్రంథము
లును నిందు బేర్కొనబడియున్నవి. (iii) ముక్కు
తిమ్మనగారి పారిజాతాపహరణము. ఇందును గృష్ణ
రాయల కళింగదిగ్విజయము వర్ణింపబడియున్నది.
ఇతర గ్రంథములందు గానరాని రాయల యుమ్మ
త్తూరు దండయాత్ర ప్రస్తావన ఇందు గలదు. ఇంత
వఱకును బేర్కొనిన మూడు ప్రబంధములయందే
కాక కృష్ణరాయల దండయాత్రలను గూర్చిన విశే
షాంశములు తరువాత యాంధ్రగ్రంథములందచట
నచట చెప్పబడియున్నవి. కాని వాని నన్నిటిని
ఇచట పేర్కొనదలపెట్టలేదు. అర్వాచీన గ్రంథము
లలో రెంటినిమాత్ర మిచట జెప్పక తప్పదు.
ఇందొకటి రాయవాచకమను వచనగ్రంథము.
దీనిని వచనకావ్యమనుట తప్పు. కావ్యలక్షణము
లెవ్వియు నందు గానరావు. యత్కృతమో తెలి
యదు. మధురనాయకుడును, అడపము చిననాగి
నాయనికుమారుడైన కట్యమువిశ్వనాథనాయకుని
స్థానాపతి యొకడు దాని రచయిత యైనట్లందు
కలదు; కొందఱిది కృష్ణరాయల కాలమున విర
చింపబడెనని తలచుచున్నారు; కాని యది క్రీ. శ.
౧౭ వ శతాబ్దారంభమునకు ముందు రచియింపబడి
యుండదని యందు వర్ణింపబడిన యంశములు
కొన్నింటివలన రుజువగుచున్నది. (౧) రాయ
వాచకమందు భాగ్యనగర ప్రస్తావన గలదు. ఇది
యిప్పటి హైదరాబాదునకు ప్రథమనామము. ఈ
భాగ్యనగరమును క్రీ. శ. ౧౫౯౧ వ సంవత్సరమున
గోల్కొండ రాజ్యమున కధిపతియైన మహమ్మదు
కులీకుతుబుశాహు తన రాజ్యారంభదశయందు
నిర్మించియుండుటచేత నా పట్టణమును బేర్కొను
రాయవాచక మంతకు పూర్వము రచియింపబడి
యుండదు. (౨) మఱియు రాయవాచక రచ
యితకు గృష్ణదేవరాయల సమకాలికుడును ప్రత్య
ర్థియునైన గజపతి యెవ్వడో తెలియదు. పేరు
జెప్పక విడిచియుండిన నతని యజ్ఞానము వెల్లడియై
యుండదు; కాని యా గజపతిపేరు ముకుందబాహు
బలేంద్రు లని చెప్పుటవలన రాయవాచకరచయిత
కృష్ణరాయలవారికి సమకాలికుడుగాడని నిశ్చయ
మగుచున్నది ఏలన కళింగరాజ్యమును బాలించిన
గజపతులలో ముకుందబాహుబలేంద్రనామధారి
యొక్కడే. ఇతడు క్రీ. శ. ౧౬ వ శతాబ్దపు
చతుర్థపాదమున కళింగదేశమును పాలించెను.
గోల్కొండ సుల్తానునకును నక్బరు పాదుశాహు
నకును కర్ణాటసామ్రాజ్యాధిపతి రెండవ వెంకటపతి
రాయలకును నితడు సమకాలికుడు; కావున

ముకుందబాహుబలేంద్రుని బేర్కొను రాయవాచకము కృష్ణరాయలనాడు రచియింపబడలేదని దృఢముగ జెప్పవచ్చును. క్రీ. శ. ౧౭వ శతాబ్ద ప్రారంభమున విరచింపబడియుండవచ్చును. రాయవాచకమంతటి విశ్వాసపాత్రమైన యాధార గ్రంథముగాదు. రక్షసితంగడి యుద్ధానంతరము కావేరికి దక్షిణమందుండు రాయరాజ్యము నాక్రమించుకొనిన మధురనాయకులు కృష్ణరాయలచే దక్షిణ రాజ్యమున బ్రతిష్ఠింపబడిరనునసత్యపు కల్పిత గాథను బ్రచారములోనికి దెచ్చుట ఈ గ్రంథము యొక్క ముఖ్యోద్దేశము. కాని యందు వర్ణింపబడియుండు కృష్ణరాయల చైత్రయాత్రాకథనమన్యచరిత్రాధారముల మూలమున వాస్తవమని తేలుచుండుటవలన దానినిమన మంగీకరించవచ్చును.

రెండవది కుమారధూర్జటికృత కృష్ణరాయ విజయము. పద్యకావ్యము. కాని దీనినొక ప్రత్యేక స్వతంత్రచరిత్రాధారగ్రంథముగ దలచుటకు వలనుపడదు. ఇది క్రీ శ. ౧౬౩౦–౧౬౪౨ల మధ్య కర్ణాటకసామ్రాజ్యమును పాలించిన ముమ్మడివెంకటపతి రాయల కాలమున రచింపబడెను. మధుర నాయకుల ప్రస్తావన యందు గానరాకపోయినను రాయవాచకమున కిది పద్యప్రతి. కొన్ని సందర్భములందు రాయవాచకమును ముందుంచుకొనిన గాని సుబోధము గాదు. కుమారధూర్జటి యుద్దేశము కృష్ణరాయల విజయములను మాత్రమే వర్ణించుట యగుటవలన రాయవాచకమందలి యన్యాంశముల నాతడు విడిచిపుచ్చెను.

మహమ్మదీయచరిత్రలు : మనకు దెలిసినంత వఱకు విజయనగరచరిత్రకు సంబంధించిన విషయములను దెలుపు మహమ్మదీయచరిత్రగ్రంథములు మూడు. ఇవి కృష్ణరాయల సమకాలరచనలు గావు ; అర్వాచీనములు. మొదట బేర్కొనదగినది తారీఖిఫరిష్తా ; క్రీ. శ. ౧౭వ శతాబ్దారంభమున రచింపబడెను. రెండవది బుర్హాన్–ఇ–మ అసీరు. కొంచెమించుమించుగ తారీఖిఫరిష్తాకు సమకాలిక రచన. ఈ రెండు గ్రంథములయందును కృష్ణరాయల ప్రస్తావన లేదు. కాని ఆ రాయల రాజ్యకాలమున దక్కనీమహమ్మదీయ రాజ్యములకును, విజయనగరసామ్రాజ్యమునకును గల పరస్పరసంబంధము వీనివలన గొంత తెలియవచ్చుచున్నది. మూడవది తారీఖిమహమ్మదు కుల్లీకుతుబ్ శాహు. ఇదియు కొంచె మించుమించుగ పై రెండుచరిత్రల రచనాకాలముననే వ్రాయబడెను ఇందువలన కృష్ణరాయలకును, గోలకొండ రాజ్యస్థాపకుడగు సుల్తాన్ కుల్లీకుతుబు శాహునకును నడచిన సమరవృత్తాంతము గొంత తెలియవచ్చుచున్నది.

పోర్చుగీసుగ్రంథకర్తలు : పోర్చుగీసువారు వర్తకముకొఱకు క్రీ. శ. ౧౪౯౦వ సంవత్సర ప్రాంతమున హిందూదేశమునకు వచ్చిరి. వీరికి మహమ్మదీయులతో సహజవైరముగలదు దీనికి గారణములు రెండు : మొదటిది మతద్వేషము ; రెండవది ఇంతకంటె ప్రబలతరమైన వర్తక ప్రతిస్పర్ధ పోర్చుగీసువారి రాకముందు పాశ్చాత్య దేశములకును హిందూస్థానమునకును మధ్య జరుగుచుండిన వాణిజ్యమంతయు నరబీపారశీ మహమ్మదీయయోడవర్తకులమూలమున నడచుచుండెను. ఈయోడవ్యాపారము దమ కాణయాచియని పై బేర్కొనిన మహమ్మదీయవర్తకులు దలచుటచేత పోర్చుగీసుల రాకను వీరు సహింపరైరి. పెక్కు నావికాయుద్ధము లిరుపక్షముల వారికిని నడచినవి. ఇందు తుదకు మహమ్మదీయు లోడిపోయిరి. పశ్చిమసముద్రతీరమందలి రేవు పట్టణములు కొన్నింటిని పోర్చుగీసు లాక్రమించుకొనిరి. మఱియు నప్పుడు గుజరాతు దక్కను దేశములు రెండును మహమ్మదీయప్రభువుల యధికారముక్రింద నుండిన కారణమున పోర్చుగీసుల కచట సులభముగ ప్రవేశము గలుగక పోవుటచేత, వారు తమవలెనే మహమ్మదీయులకు సహజశత్రువులైన విజయనగరచక్రవర్తులతో మైత్రిని గుదుర్చుకొనిరి. ఇందువలన పోర్చుగీసు రాయబారులు, వర్తకులు, ప్రయాణీకులు పెక్కండ్రు విజయనగరమునకు బలుమారువచ్చి వ్యాపారార్థమేమి, యన్యకారణములవలననేమి కర్ణాటసామ్రాజ్యమునం దంతటను సంచారముచేసి పోవుచుండిరి. ఇట్లు వచ్చిన పోర్చుగీసులం దనేకులు

కర్ణాటసామ్రాజ్యచరిత్రను గూర్చియు, మఱియు నందు తాము కన్న విన్న విషయములనుగూర్చియు గ్రంథములను వ్రాసిరి. విజయనగరసామ్రాజ్య విషయములను దెల్పు గ్రంథములు పోర్చుగీసు భాషయందు పెక్కు కలవు. కాని పోర్చుగీసు భాష దెలిసిన చరిత్రపరిశోధకు లరుదగుటచే నివి మన కందుబాటున లేవు. పిసరులెంకారువంటి పోర్చుగీసు భాషావిదులుండినను వారి కాంగ్లము దెలియకపోవుటచే వారి పరిశోధన లమూల్యము లైనను చరిత్రపరిశోధకులకు నిరుపయోగము లైనవి. కాని కొన్ని ముఖ్యపోర్చుగీసు గ్రంథము లాంగ్లములోనికి పరివర్తనము గావింపబడియున్నవి. ఇవి కృష్ణరాయచరిత్ర రచియింపదలపెట్టువారికి కర ముపయుక్తములు. అందు ముఖ్యమైనవి నాలుగు. సంగ్రహముగ వాని నిచట జెప్పుట యొప్పు.

(౧) 'కామెంటరీస్ ఆఫ్ ది గ్రేట్ ఆఫాంసో అల్బ్యూకర్క్'—ఇందు కృష్ణదేవరాయల రాజ్యారంభ దశయందు విజయనగరసామ్రాజ్యమందును, బహమనీరాజ్యముననుజరిగిన విషయములు వర్ణింపబడినవి. సమకాలికరచన యగుటచే దీని సాక్ష్య మత్యంత విశ్వాసపాత్రమైనది. అర్వాచీన మహమ్మదీయ చరిత్రలయందు గానవచ్చు కృత్రిమములు కొన్ని దీనిమూలమున వెల్లడి యగుచున్నవి. కృష్ణరాయల యుమ్మత్తూరు దండయాత్రనుగూర్చియు, బహమనీసుల్తానుతోడి యుద్ధమును గూర్చియు, మఱి యెచ్చటను గానరాని యంశము లిందు కలవు.

(౨) 'ఈస్ట్ ఆఫ్రికా అండ్ మలబార్'—ఇది దురాతీ బర్బోసా అను పోర్చుగీసుప్రయాణికుడు వ్రాసినది. ఇతడు కృష్ణదేవరాయల రాజ్యారంభ దశయందు దక్షిణహిందూదేశమునకు వచ్చి కర్ణాటసామ్రాజ్యమున సంచారము జేసెను. అతడు తానచట గన్న విషయములను దన గ్రంథమున వర్ణించియున్నాడు. కృష్ణరాయలను గూర్చి కాని, కర్ణాటకసామ్రాజ్యమునకు సంబంధించిన రాజకీయాంశములనుగాని యతడు ప్రస్తావించకపోయినను కర్ణాటకసామ్రాజ్య ప్రజల స్థితిగతులను, వారి యాచారవ్యవహారములను వర్ణించియున్నాడు. కావున కృష్ణరాయలనాటి విజయనగర చరిత్రను రచియించువారి కది మిక్కిలి యుపయుక్తమగు నాధారగ్రంథము.

(౩) 'క్రానికల్ ఆఫ్ డామింగో పయస్'—ఇతడు కృష్ణదేవరాయల రాజ్యకాలమున క్రీ. శ. ౧౫౨౨ ప్రాంతమున క్రిస్తవాఁడీ ఫిగ్వెరెడో యను పోర్చుగీసు రాయబారివెంట విజయనగరమునకు బోయి యచట కొద్దికాలము నివసించియుండెను. ఇతడు బారాస్ అను పోర్చుగీసుచరిత్రకారుని కొఱకు విజయనగరమును గూర్చియు, కృష్ణరాయలనుగూర్చియు ముఖ్య విషయములను బెక్కింటిని తెలియబఱచియున్నాడు.

(౪) 'క్రానికల్ ఆఫ్ ఫెర్నావ్ న్యూనిస్'— ఇతడు పోర్చుగీసుగుఱ్ఱపువర్తకుడు; కృష్ణదేవాచ్యుత దేవరాయలకాలమున గుఱ్ఱముల నమ్ముటకు పలుమారు విజయనగరమునకు వచ్చియుండెను. ఇతడును బారాస్ కొఱకే తన గ్రంథమును వ్రాసిపంపెను. పయస్, న్యూనిసులచే రచియింపబడిన గ్రంథములు రెండును క్రీ. శ. ౧౫౩౭ ప్రాంతమున బారాసుకు జేరెయుండుటచే నివి రెండును సమకాలిక రచనలనుట నిస్సంశయము. హిందూస్థాననివాసులగు హిందూ మహమ్మదీయుల యెడ సమాన దృష్టిగల పాశ్చాత్యుల రచన లగుటచే నివి విశ్వాసపాత్రము లనుట యొప్పు. పయస్ గ్రంథముకంటె న్యూనిసు గ్రంథము గడు ముఖ్యమైనది. రాయరాజ్యస్థాపన మొదలుకొని యచ్యుతదేవరాయల రాజ్యకాలము వఱకు గల విజయనగరసామ్రాజ్యచరిత్ర యందు వర్ణింపబడియున్నది. కృష్ణరాయల విజయములును నచ్యుతరాయల పాలనావిశేషములును విపులముగ వర్ణింపబడినవి. కావున పయస్, న్యూనిసుల గ్రంథములు రెండును కృష్ణరాయచరిత్రకు మూలాధారములనుట యతిశయోక్తి కాజాలదు.

వంశానుచరితములు : ఈ తరగతి గ్రంథములలో లింగణకృత కెళదినృపవిజయ

మొక్కటియే నిచట జేర్కొనదగినది. ఇది కన్నడ చంపూకావ్యము. కెళది నాయకరాజుల మూల పురుషుడు చౌడప్ప కృష్ణదేవరాయల నాయకుల యందొక్కడు; కృష్ణరాయలకు దురకలతో నైన యుద్ధములలో రాయల పక్షమున పోట్లాడెను. కెళదినృపవిజయమువలన గృష్ణరాయల కాలమున మలెనాడు దేశస్థితిగతులు దెలియవచ్చుచున్నవి.

గాథలు : కృష్ణరాయల రాజ్యాభిషేకమును గూర్చియు, మఱికొన్ని విశేషాంశములను గూర్చియు బెక్కు కథ లాంధ్రదేశమున బ్రచారమునందున్నవి. ఇందలి సత్యాసత్యములను నిర్ణయింపగల సాధనములు గానరావు; కాని గాథలని వీని సాత్యమును ద్రోసివేయరాదు; చిరకాలమునుండియు జనస్మరణయందివి స్థిరమై నిలిచియుండుటవలన వీనియందు కొంతయేనియు సత్యముండవచ్చును. కావున జ్ఞాతచరిత్రాంశ ములకు విరుద్ధము గానియప్పుడు వీని సాత్యము నంగీకరించుట తప్పుగాదు.

చాటూక్తులు : విజయనగర చక్రవర్తు లలో గృష్ణరాయలకు సంబంధించినన్ని చాటూక్తులు మఱియెవ్వరినిగూర్చియు గానరావు. ఇందనేకములు రాయల విద్యావ్యాసంగములను దెల్పునవి; రాయల విజయములను వర్ణించునవి పెక్కు గలవు. సాధారణముగ నిందు రాయల కళింగవిజయములును, మహమ్మదీయులతోడి సమరములును బ్రశంసింపబడియున్నవి. ఇతర ఆధారగ్రంథములందీ విజయములు విపులముగ వర్ణింపబడియుండుటవలన నివి యంత ముఖ్యములు గావు. కాని ఇతర ఆధారగ్రంథాదులవల్లన తెలియరాని విజయములను వర్ణించు చాటువులు కొన్ని కలవు. కృష్ణరాయలు బెడదకోట(బీదరు)ను జయించిన శ్లేయాధార గ్రంథాదులయందు కానరాదు. కాని—

"సమరక్షోణిని కృష్ణరాయల భుజా
శాతాసిచే బడ్డదు

ర్దమదోర్దండ బెడందకోటయవన
వ్రాతంబు సప్తాశ్వమా

ర్గమునన్ గాంచి శబా సహో హరిహరం
గాఖూబుఘోడాకితే

తుముకీ బాయిలబాయి దేములికి యం
దు ర్మింటికిన్ బోవుచున్."

అను నల్లసానిపెద్దనార్యుని చాటు వొక్కటి రాయల బీదరువిజయమును దెల్పు చున్నది ఇట్టివి ముఖ్యమైనవి

గ్రామకవిలెలు, కైఫీయతులు : పూర్వ మాంధ్రదేశమున బ్రతిగ్రామమునకును కవిలె లుండెడివి. ఇందు గ్రామముల పూర్వవృత్తములు వర్ణింపబడియుండును. ఇట్టి కవిలెలందును, వీని నాధారపఱచుకొని తయారుసేయబడిన కైఫీయతులందును కృష్ణరాయల యేలుబడిని గూర్చి కొన్ని యంశములు వివరింపబడియున్నవి. కావున గృష్ణరాయల చరిత్రను రచించువారికి నివియు నుపయుక్తములు.

ఇంతవఱకు గృష్ణరాయల చరిత్రకు గల యాధారములను స్థూలముగ వివరించితిని. అన్నిటిని విపులముగ వర్ణించుటకు సాధ్యముగాదు; కాని రాబోవు ప్రకరణములయందు సందర్భాను సారముగ నన్ని యాధారముల నుదాహరించి వలసినట్లు పరిశీలించుచున్నాడను.

## ౨. వంశాదికము

కృష్ణరాయలు చంద్ర వంశాంతర్గతతుర్వసుకుల సంభూతుడగు క్షత్రియుడని యతని శాసనము లందు చెప్పియున్నది. క్రి. శ. ౧౫౧౧-వ సం. నాటి నేర్లకెరెతామ్రశాసనమున—

"అస్తి క్షీరమయాద్దైవై
ర్మథ్యమానా న్మహాంబుధేః
నవనీతమివోద్భూత
మపనీతతమో మహః॥
తస్యాసీత్తనయ స్తపోభి
రతులైరన్వర్థనామా బుధః
పుత్రైరస్య పురూరవా
భుజబలైరాయుర్ద్విషాం నిఘ్నతః
తస్యాయుర్న హుషోఽస్య
తస్య పురుషోయుద్ధే యయాతిక్షితౌ
ఖ్యాత స్తస్యతు తుర్వసు
ర్వసునిభః శ్రీ దేవయానీపతేః॥
తద్వంశే దేవకీజాని
ర్దిదీపే తిమ్మభూపతిః
యశస్వీ తుళవేంద్రేషు
యదోః కృష్ణఇవాన్వయే ॥
తతోభూ ద్బుక్కమాజాని
రీశ్వరక్షితిపాలకః
అత్రాసమగుణోత్తంసం
మౌళిరత్నం మహీభుజాం ॥
నరసా దుదభూ త్తస్మా
న్నరసావనిపాలకః
దేవకీనందనా త్కామో
దేవకీనందనా దివ ॥

* * *

తిప్పాజీ నాగలా దేవ్యోః
కౌసల్యా శ్రీసుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేంద్రా
త్తస్మా త్పంక్తిరథాదివ ॥
వీరౌ వినయినౌ రామ
లక్ష్మణావివ నందనౌ
జాతౌ వీరనృసింహేంద్ర!
కృష్ణరాయమహీపతీ ॥"[1]

అని కృష్ణరాయలవంశము వర్ణింపబడినది. ఇందువలన చంద్రవంశమునకు జెందిన తుర్వసుని సంతతివారిలో తుళవేంద్రులయందు యశస్వియగు తిమ్మభూపతి పుట్టెననియు, నతనికి దేవకియందు బుక్కమ భర్తయగు నీశ్వరక్షితిపాలకుడు గలిగెననియు, వారికి నరసావనిపాలకు డుదయించెననియు నతని భార్యలలో దిప్పాజియందు వీరనృసింహేంద్రుడును, నాగలాదేవియందు కృష్ణరాయ మహీపతియు దశరథునకు గౌసల్యా సుమిత్రలయందు రామలక్ష్మణులవలె జనించిరనియు దెలియవచ్చుచున్నది. ఈ వంశానుక్రమణికయే ఆ కాలమున రచింపబడిన సంస్కృతాంధ్రగ్రంథముల యందును నల్పభేదములతో గానవచ్చుచున్నది అచ్యుతరాయాభ్యుదయమున బైశాసనమునందువలె చంద్రుడు మొదలు తుర్వసునివఱకు గల వంశక్రమము జెప్పబడియున్నది మఱియు తుర్వసుని వంశమున పెక్కు రాజులు గలిగిరనియు, వారియందు విఖ్యాతుడగు తిమ్మభూమిపాలకుడు జనించెననియు గలదు.

"అజాయతా వ్యాజసుహృత్ప్రజానాం
సధూర్వహ స్తుర్వసురుర్వరాయాం
తదన్వయే పుణ్యఫలాదవన్యాం
ధన్యాబభూవు ర్ధరణీభుజోఽన్యే ॥

. . . . . . . . . .

నాలీకినీనాయకవర్ధ్గ హేషు
నీహారభూమీధరవన్న గేషు

---

1. ఎపి. కర్ణా, సం. ౧౧, హొళె. నెం. ౯౪.

వలాసుహృద్వారణవద్గజేషు
తేషు ప్రతీతోఽజని తిమ్మభూపః''[2]

ఇందు తుళవేంద్రుల ప్రస్తావము లేదు: కాని కృష్ణరాయకృత ఆముక్తమాల్యద యందును, మఱియు నా రాయల కంకితము సేయబడిన యాంధ్రప్రబంధములు గొన్నింటియందును తుర్వసు వంశము తుళవాన్వయ మాయెననియు, నందు కృష్ణరాయల ప్రపితామహుఁడైన తిమ్మభూపాలు డుదయించెననియు జెప్పియున్నది. పైనుదాహృతమైన అచ్యుతరాయాభ్యుదయమున జెప్పినట్లు ముక్కుతిమ్మనార్యుని పారిజాతాపహరణము నందును :

"ఉర్వీశమౌళియగు నా
తుర్వసువంశంబునందు దుష్టారిభుజా
దుర్వారగర్వ రేఖా
నిర్వాపకు డీశ్వరాఖ్యనృపతి జనించెన్."[3]

అనియే యున్నది. తుళవేంద్రుల ప్రశంస ఇందును లేదు. కాని కృష్ణరాయకృతాముక్తమాల్యద యందును పెద్దనార్యకృత మనుచరిత్ర యందును తుర్వసుని వంశమే తుళవాన్వవాయమైనట్లు చెప్పియున్నది.

''అతనికి యదుతుర్వసులను
సుతు లుద్భవమంది రహితసూదనులు కళా
న్వితమతులు వారిలో వి
శ్రుతకీర్తి వహించె దుర్వసుడు గుణనిధియై
వాని వంశంబు తుళవాన్వవాయమయ్యె
నందు బెంకక్రదునృపు లుదయంబునొంది
నిఖిలభువనప్రపూర్ణనిర్ణిద్రకీర్తి
నధికులైరి తదీయాన్వయమున బుట్టి."[4]

తామ్రశాసనమున తుర్వసువంశజుడగు తిమ్మభూపతి తుళువేంద్రులలో యశస్వి యని యుండగా నాముక్తమాల్యద మనుచరిత్రలయందు తుర్వసుని వంశము 'తుళువాన్వవాయమయ్యె'నని చెప్పియున్నది. తుర్వసునివంశజులు తౌర్వసు లగుదురు కాని తుళువ లెట్లు కాగలరు ? 'తుళువ' శబ్దము 'తులు' శబ్దభవమగు విశేషణము. దానికి అర్థము తులుదేశసంబంధమైన, లేక తులుదేశోద్భవమైన అని. ఈ తులుదేశము పశ్చిమసముద్రమున విజయనగరసామ్రాజ్యములోని కణకువాయైయుండిన యొక మండలము. ప్రస్తుతపు దక్షిణకన్నడజిల్లా ప్రాచీనతుళువమండలమున నొక భాగము. కావున తుళువవంశమునకు తుళువమండలముతో నేదో సంబంధ ముండెనని తోచుచున్నది. సాళువనరసింహరాయల కాలమున (క్రీ. శ. ౧౪౮౬-౧౪౯౦) నందిమల్లయ్య ఘంటసింగయలచే రచింపబడి, నరసా నాయకుని కంకితముసేయబడిన, వరాహపురాణ పీఠికయందు తుళువవంశమునకు మూలపురుషుడగు తిమ్మధాత్రీరమణుడు తుళు దేశస్థుడని స్పష్టముగ జెప్పియున్నది.

''మిన్నుల మోచి భాగ్యముల
మీఱిన కోటల రమ్యహర్మ్యసం
పన్నత సస్యవాటగరి
మంబుల దోటల వాహవారణా
భ్యున్నతి గేలిదీర్ఘికల
నుగ్రభటావలి వన్నె కెక్కు వా
రాన్నిధి కాంచిపై దుళువ
రాజ్యము సంతతవీరభోజ్యమై.

ఆ తుళువరాజ్యమున వి
ఖ్యాతి వహించిరి దిగంతకరికటతటసం
భూతమదఘాళనవి
ద్యాతత్పరకీర్తి బెండ్లియాడిన రాజుల్.
వారల కగ్రగణ్యుడు ని
వారితవైరివరూథినీధవ
శ్రీరమణీవిలాసుడు వి
చిత్రకళాకుశలుండు తిమ్మధా

2. అచ్యుత. ౧: ౧౮, ౨౨, ౨౩.
3. పారి. ౧: ౮.
4. ఆముక్త. ౧: ౨౨-౨౩

"శ్రీరమణుండు సంపద వ
రించె మరాటవరాటలాటగాం
ధారయుగంధరాదిపస
్రకటీకృతభాషాలుపీర్యుడై." 5

తుళువవంశానుక్రమణిక మొట్టమొదట గానవచ్చున దీవరాహాపురాణమునందే. ఇందు చంద్రవంశముమాటగాని, తుర్వసుని ప్రస్తావనగాని లేదు. తుళువవంశమునకు మూలపురుషుడైన తిమ్మధరణీశ్వరుడు తుళువరాజ్యమున ఖ్యాతివహించిన రాజులకగ్రగణ్యుడని స్పష్టము సేయబడినది. వరాహాపురాణ పీఠికయందింకొక విశేషముగలదు ఇందు కృతిపతియైన తుళువనరసనాయకుడును నతని పూర్వికులును క్షత్రియజాతికి సహజమైన సూర్య్య చంద్రవంశములలో దేనికిజెందినవారో వివరింపకున్నను నా నరసనాయకునికి "బతియైన సాళువనరసింగరాజు "రాజమౌళి పావనాన్వయ" మునకు 'చంద్రుడు వంశకర్త' యని చెప్పియున్నది. ఇంకను నా సాళువ నరసింగరాయ మహారాజు 'తుహి నాంశువంశపాథోరాశి మాణిక్య' మని పేర్కొనబడినాడు. సాళువ నరసింగరాయల వంశము చంద్రవంశమని తెల్పిన కవులు గృతిపతియైన నరసానాయకు డేక్షత్రియశాఖకు జెందినవాడో విశదము సేయక మూకీభావము వహించియా యంశమును సన్న సన్నగా జాఱవిడుచుటను జూడ తుళువరాజులు క్షత్రియులు గారని వీరి యభిప్రాయమేమో యను సంశయము గలుగుచున్నది. ఈ సంశయమును బలపఱచగల విషయ మింకొక్కటి కలదు. సంస్కృతాంధ్రగ్రంథము లందును, శాసనములలోని సంస్కృత ప్రశస్తు లందును క్షత్రియులకు నైజములగు రాజ, నృప, పార్థివాభిధలతో బేర్కొనబడియున్నను, దేశభాషలందు ప్రకటితములైన శాసనములు దేశభాషాగ్రంథములు మున్నగువానియందు కొన్నింటి యందును రెండవ మూడవ తరముల తుళువ ప్రభువులు 'నాయకు' లనియే పిలువబడి యున్నారు. "ఇమ్మడి నరసింగరాజమహారాయర సేనాధిపతి ఈశ్వరనాయక వొడయర కుమార...నరసంణనాయకవొడయరు," "ఇమ్మడి నరసింగరాయమహారాయర కార్యకర్తరాగ నరసంణనాయక వొడయరు" ఇత్యాదులు శాసనములందు గానవచ్చుచున్నవి.[6] ఇట్లే రాయ వాచకమందును కైఫీయతులందును, 'ఈశ్వర నాయంకుడున్ను, నరసానాయంకుడున్ను, వీర నరసింహ్మరాయలవారున్ను యేలినందుకన్నా కృష్ణరాయలవారు యేలేది యేమున్నది;'[7] "నరసింహదేవరాయలవద్ద కార్యకర్త అయిన నరసానాయనింగారు"[8] మొదలైన వాక్యములలో ఈశ్వరనాయకుడు, నరసానాయకుడనియే వారి పేరులు గానవచ్చుచున్నవి సర్వసాధారణముగ నన్నియెడల నరసారాయని జ్యేష్ఠపుత్రుడు 'వీర నరసింహరాయ' లని వ్యవహరింపబడియున్నను. కాదాచిత్కముగ నీశ్వరనాయనింగారి మను మడును నరసానాయనింగారి కుమారుడునైన ఇమ్మడినరసానాయనింగార'ని శాసనములందచట నచట గానవచ్చుచున్నది[9] వరాహాపురాణ పీఠిక యందు తుళువవంశజులు క్షత్రియజాతి యందేశాఖకు జెందినవారో చెప్పకపోవుటయు, శాసనాదులందీ వంశజులగు మొదటిప్రభువులు 'నాయకాంత' నామధారులగుటయు జూడ నీవంశమువారు క్షత్రియులు గారనియు, శూద్రులనియు తలంపు గలుగవచ్చును కాని యట్లని దృఢముగ బల్కుటకు వీలులేదు. ఏలనగా, తుళువరాజులు క్షత్రియులు కారనియు, శూద్రులనియు నెచ్చటను జెప్పి యుండలేదు. మఱియు నీవంశపు మొదటిరాజులు నాయకులని పేర్కొనబడియున్నను అందువలన వారు శూద్రులని నిశ్చయించిచెప్పుటకు వీలులేదు క్రీ. శ. ౧౫, ౧౬ శతాబ్దములందు బ్రాహ్మణాదిగ సర్వవర్ణములవారును నాయకనామమును ధరించెడువారు కృష్ణదేవరాయలవారి కడపటి దినముల లోను, నచ్యుతరాయలవారి రాజ్యారంభదశ

5. వరాహా. ఆ. ౧ : ౫౫-౫౭.

6. *EC. X. In.* 259, *IX. Cp.* 52, *ARE* 143 *of* 1905, 719 *of* 1917.

7. *Further Sources. Vol. II. No.* 129(*b*)

8. *Ibid. No.* 91

9. *ARE* 54 *of* 1915.

యందును రాయలవారికి ప్రధానమంత్రియై యుండిన వీరనరసింహనాయక సాళువదణ్ణాయకుడు బ్రాహ్మణుడు. ఇతని జన్మనామము సెల్లప్ప ; అతడు తాటువకుట్టై న్దణభట్టను కాంచీపుర బ్రాహ్మణుని కుమారుడు [10]

కావున ఈశ్వరనాయక నరసనాయక ఇమ్మడి నరసనాయకాది తుళువప్రభువులు నాయక నామమును గలిగియుండిసంతమాత్రమున వారు శూద్రులనియు, క్షత్రియులు గారనియు నిర్ధరించి చెప్పుటకు వలనుపడదు. లభ్యమైన సాక్ష్యమును పరిశీలించి చూడగా తుళువరాజులు శూద్రులనుట కంటె క్షత్రియులని చెప్పుట యొప్పు.

ఇట్లు తుళువరాజులు క్షత్రియులని తలచుట సమంజసమైనను, వారు రాయపదమును బడయుటకుముందు తమ క్షత్రియత్వమును బ్రకటించుకొని యుండలేదు తుళువరాజులలో రాజ్యాభిషిక్తుడై మొదట మహారాయపదము నందినవాడు వీర నరసింహరాయడు ఇతడు క్రీ. శ. ౧౫౦౬ వ సంవత్సరమున దనకు యజమానుడైన సాళువ ఇమ్మడినరసింహ ధమ్మరాయని జంపించి సింహాసనము నాక్రమించుకొని రాజ్యాభిషేకము గావించుకొనెను. ఇతడే తుళువవంశము చంద్రవంశాంతర్గత మని మొదట చెప్పుకొనుట కారంభించినవాడు ఇతని కాలముననే శాసనములందగపడు తుళువ వంశ ప్రశస్తి రూపందినది. వీరనరసింహరాయల శాసనములలో నీ ప్రశస్తి రెండువిధములుగ గాన్పించుచున్నది. అందొకటి నరసింహార్యకృతము. ఇది యిట్లున్నది.

అజునికి అత్రి ; అతనికి చంద్రుడు ; చంద్రునికి బుధుడు ; వానికి పురూరవుడు ; పురూరవునికి ఆయువు ; అతనికి నహుషుడు ; నహుషునకు యయాతి ; వానికి తుర్వసుడును జనించిరి. అతని వంశస్థులు కురుదేశమున వృద్ధినందిరి తద్వంశజులలో కొందఱు సుగ్రీవునిచే బూజలుగొన్న రఘువంశోత్తముడగు సీతారాముని సేవింప గిష్కింధకు వచ్చి యచ్చటి దేశసౌందర్యమును మెచ్చి హేమకూటప్రాంతమున వసతులేర్పఱచుకొని యచ్చటనే నివసింపమొదలిడిరి.

వారిలో తుళువవంశాంబుధిచంద్రుడును, మహాపరాక్రమశాలియునగు దిలీపుడొక్కడు. దేవకీజానియగు నతనికీశ్వరుడు పుట్టెను. అతనికి నరసరాజు పుట్టెను [11]

ఈ వంశానుక్రమణికయందు రెండుమూడు విషయములనుగూర్చి కొంత విమర్శ కెడమున్నది.

(౧) కురుదేశస్థులును తుర్వసువంశజులగు రాజులుకొందఱు సీతారాముని సేవింప కిష్కింధకు వచ్చి యచ్చట నివాసము లేర్పఱచుకొని స్థిరముగ నిలిచిపోవుట మఱి యేశాసనమునను గ్రంథమునను, గానరానివిషయము ఇది ఈ శాసనములో గాన్పించు నూతనవిషయముల యందొకటి.

(౨) అట్లు కిష్కింధకువచ్చిన తుర్వసువంశజులందఱును తుళువరాజులు గారు. వారిలో గొందఱు మాత్రమే తుళువవంశమునకు జెందినవారు. ఇదియును గ్రొత్త సంగతియే. తుర్వసువంశజులే తుళువులైరని ఇందు చెప్పలేదు.

(౩) ఈశ్వరనాయకుని తండ్రిదిలీపుడట. అన్ని సంస్కృతాంధ్రగ్రంథములలోను శాసనములందును తిమ్మభూపతి యని యున్నది. 'దిదీపే తిమ్మభూపతిః' అనునదియే దిలీపు డనుటకు కారణమైయుండు నేమో. ఈ పౌరాణిక వంశవృక్షము వాస్తవమైనది కాదు ; కేవలము కల్పన. ప్రఖ్యాతికివచ్చిన రాజన్యకుటుంబము లన్నియు దమ కులీనతను బ్రకటించుకొనుట కిట్టి కల్పిత పౌరాణిక వంశవృక్షములను వ్రాయించుకొని నిజవంశమున కతికించుకొనుట

---

10. *ARE*. 487 *of* 1920, 225, *of* 1916.

సాళువతిమ్మరసయ్యగారి కుమారుడు తిమ్మయ్యకు 'దణాయకుడ' నియు 'తిమదణాయకుడ' నియు బేర్లుండినట్లు న్యూనిసు వ్రాసియున్నాడు. (*For. Emp.* 360-61) నేటికిని మంగుళూరుప్రాంతముల నివసించు కొంకణి తులు బ్రాహ్మణు లనేకులు 'నాయక' నామాంతధారులు గలరు. వెలమలు కమ్మలు తెలగలు మొదలగు పలు శూద్రజాతులవారేకాక మాలలుగూడ నాయకు లనబడుచుండిరి.

11. *EC*. *X gd*. 77.

సాధారణమే. ఇందు వింత యేమియు లేదు. ఏ కారణమువలననో తుళువరాజులకు నరసింహార్యునిచే ప్రథమమున వ్రాయించుకొనిన ప్రశస్తి నచ్చక పోయినది. సభాపతి శాసనగ్రంథ రచయితయైన పిమ్మట నూతనప్రశస్తిని వ్రాయించుకొనిరి. ఈ సభాపతికృతనూతన ప్రశస్తియే సర్వసామాన్యముగ తుళువ శాసనములందు గానవచ్చును

తుళువరాజులు చంద్రవంశాంతర్గతతుర్వసు కుల క్షత్రియులని దానశాసనాదులందు చెప్పబడి యున్నను కొన్నియెడల వేఱువిధముగ నున్నది. సమకాలీన గ్రంథకర్తలందరివలెను ముక్కుతిమ్మనార్యుడుగూడ తుళువరాజులు తుర్వసువంశజులని వ్రాసియున్నను పారిజాతాపహరణమునందు కృష్ణరాయలను వర్ణించుచు:—

"చకవర్తిమహాప్రశస్తి నాడును నేడు
చెలగి ధర్మక్రమస్థితి ఘటించె
భూభృదుద్ధరణవిస్ఫూర్తి నాడును నేడు
గోరక్షణఖ్యాతి గుదురుకొలిచె
సాధుబృందావనసరణి నాడును నేడు
వంశానురాగంబు వదలదయ్యె
సత్యభామాభోగసక్తి నాడును నేడు
నాకల్ప మవని నింపార నిలిపె
నాడు నేడును యాదవాన్వయమునందు
జననమందెను వసుదేవ మనుజవిభుని
కృష్ణుడనుపేర నరసేంద్రుకృష్ణదేవ
రాయ డనుపేర నాదినారాయణుండు." 12

అని కృష్ణరాయలు యాదవాన్వయమునందు పుట్టినట్లు వచించినాడు కృష్ణరాయలు యాదవుడయిన నతని పూర్వికులందఱును యాదవులు గావలయును గదా. తుర్వసుని సంతతివారిని యాదవులనుట యెట్లు ? ఈ ప్రశ్నకు దగిన సమాధాన మెద్దియో తెలియదు.

వాస్తవ మెట్లున్నను ప్రస్తుతము మనకు లభించిన సాక్ష్యమును బరిశీలించి విచారింపగా తుళువరాజులు క్షత్రియులని యంగీకరించుట సరియని తోచుచున్నది. కాని వారు క్షత్రియజాతికి సహజమైన సూర్యచంద్రాన్వయములు రెంటియందును దేనికి జెందినవారో నిశ్చయించి చెప్పుటకు దగు సాధనములులేవు. తాము చంద్రవంశమునకు జెందిన తుర్వసుకులజులమని వారు చెప్పుకొనిరి. వారి పౌరాణికవంశవృక్షము కల్పనయగుట వలన నది విశ్వాసపాత్రము గాదు. కాని దీని నంగీకరించి నందువలన కలిగెడు లాభములేదు ; త్యజించుట వలన వచ్చు నష్టమును లేదు.

౨

కృష్ణరాయలు తుళువక్షత్రియుడగు నరసానాయకునికి పుత్రుడు గావచ్చును. ఆకారణమువలన నతడును క్షత్రియుడే యని నిశ్చయించుటకు వలనుపడదు. ఆతని తల్లి క్షత్రియస్త్రీగాక క్రింది జాతులలో బుట్టినదైయుండిన నతనిది తల్లికులమగునుగాని తండ్రికులముగాజాలదు. కృష్ణరాయల జన్మమును గూర్చిన గాథలు పెక్కు ఆంధ్రదేశమున బ్రచారమునందున్నవి. కృష్ణరాయల తల్లియగు నాగలదేవి నరసానాయకుడుద్వాహము జేసికొన్న కులవధువు గాదనియు, భోగకాంత యనియు, తత్కారణమున నతడు క్షత్రియుడు గాడనియు, దాసీపుత్రుడనియు వీని సారాంశము. ఉదాహరణార్థ మొకటిరెంటి నిచట సంగ్రహముగ వివరించుట యుక్తము కృష్ణరాయల తండ్రియగు నరసింహరాయడు ఒకనా డస్తమయమైనపిమ్మట కాలోచిత కృత్యముల దీర్చుకొనుటకు బహిర్దేశములకు జనియెను. ప్రక్షాళనమునకై కొనిపోయిన యుదకపాత్రయం దొక్క తేజోవంతమగు చుక్క తెగిపడెను ; అంతట నరసింహరాజా పాత్రను దన యడపచేతితో మూసి యా వర్తమానమును తిమ్మరసునకు జెప్పి పంపెను ; తిమ్మరసామాట వినగనే రాజు నా నీరు ద్రాగమని ప్రత్యుత్తరమంపెను. తిమ్మరుసుసలహా ప్రకారము ఆ నీరు ద్రావి నరసింహరాయ లారాత్రి తన దేవితో నిద్రించుట

12. పారి. ౧ : ౧౯.

కంతఃపురమునకు బోయెను. పట్టపుదేవి తిప్పాజి బహిష్ఠయైయుండినది. దానికి చింతించి యాతడా రాత్రి దేవి చెలికత్తెలయందొక దాని సంగతి నుండెను. ఆ చెలికత్తె గర్భవతియై కాలక్రమమున గృష్ణరాయల గనెను. ఈ కథప్రకారము కృష్ణరాయల తల్లి పట్టపుదేవి తిప్పాజి చెలికత్తెలలో నొకతె. మఱియొకకథ దీనికంటె గొంచెము భిన్నమైనది :—

విజయనగర మేలిన వీరనరసింహరాయలకు చిరకాలము పుత్రసంతతి లేదు. ఒకనాడు రాజుదగ్గఱకు బ్రాహ్మణు డొకడు వచ్చి యారాత్రియొక సుముహూర్తము గలదనియు, నా ముహూర్తకాలమున బట్టపుదేవి సంగతి నుండిన సుపుత్రుడు గలుగుననియు జెప్పెను. అంతట నరసింహరాయలు అంతఃపురమునకుబోయి తిప్పాజీదేవికివర్తమానమంపెను; కాని యామె సింగారించుకొనివచ్చు లోపల నా శుభ ముహూర్తము గడచి పోవుచుండెను. రాజందుకు విసిగి పడకటింటిలో నప్పుడు దీపములు బాగు సేయుచుండిన దానిని నాగిని జూచి ముహూర్తమును వ్యర్థపడనీయక దానిగూడెను. నాగికంతట గర్భము గలిగెను. నవమాసములు నిండిన పిమ్మట నొక తేజశ్శాలి పుత్రు డుదయించెను. అతడే కృష్ణదేవరాయలు.

ఇట్టివి మఱికొన్ని కథలు గలవు. ఇవి విశ్వాసపాత్రములు గావు. న్యూనిస్‌చరిత్రయందుగాని, రాయవాచకమునందుగాని, శాసనములయందుగాని కృష్ణరాయల తల్లియగు నాగాంబ కులస్త్రీ కాదనుట కేయాధారమును గానరాదు. [12a]

న్యూనిసు నరసానాయకుని సంతతిని ఇట్లు వర్ణించి యున్నారు : "నరసానాయకునికి పుత్రులైదుగురు: ఒకడు బుస్బలరావు (భుజబలరాయలు); ఇంకొకడు క్రిస్నరావు (కృష్ణరాయలు); మఱియొకడు తెతరావు (అచ్యుతరాయలు); ఇంకొకడు రమిగప (రంగప్ప); ఇంకొకడు ఓమిసాయ(?)" [13] న్యూనిస్ కృష్ణదేవరాయల సమకాలికు డనియు, నతడు క్రీ. శ. ౧౫౩౭ నకు పూర్వము విజయనగర చరిత్రను రచించెననియు పూర్వ ప్రకరణమున జెప్పి యున్నాడను. కాని న్యూనిసు నరసనాయకుని పుత్రులను బేర్కొనెనేకాని వారి తల్లులు కులపాలికలో భోగకాంతలో తెలుపలేదు; కావున న్యూనిసు వాక్యమువలన గృష్ణరాయలు భోగకాంతపుత్రుడు గాడనియు, ధర్మపత్నిగర్భమున బుట్టినవాడనియు రుజువుసేయుటకు వీలుగాదు అను నాక్షేపణ రావచ్చును. కాని న్యూనిసుచరిత్రయందు దాపరికములు గానరావు. కృష్ణరాయల చరిత్రమునకు గళంకమును గల్గించు నంశములనుగూడ మొగమాటమించుకంతయు లేక నతడు వర్ణించియున్నాడు. చిన్నాదేవీ వృత్తాంతము దీనికి దార్కాణ.

"ఈ కృష్ణరావు పసివాడై బిస్నగపట్టణమున బెరుగుచుండినప్పుడు, చిన్నాదేవియను వెలయాలితో జంజాటము గలిగినది. దానిపై నతనికి నిర్భరమైన వలపు; మోహాతిశయమువలన దానొకవేళ రాయలైనపక్షమున దానిని వివాహమాడెదనని చెప్పియుండెను. పరియాచకమున కతడట్లన్నను, వాస్తవముగ నతడు రాయలాయెను. అట్లు చరిత్ర తెల్పుచున్నది. సింహాసనము నధిష్ఠించినపిమ్మట నతడు దత్పూర్వము పసితనమందు జేసిన చేష్టలనన్నింటిని విస్మరించినను ఆ వెలయాలిమీది వలపును మరువలేదు ; రాజమందిరము నుండి రహస్యముగ దాని యింటికి బోవువాడు. ఈ విషయమాతనిమంత్రి సల్లవతినిచ (సాళువ తిమ్మయ) యొక రాత్రి కనుగొని యతని వెంబడించి దాని యింటికిబోయి యచట నతని ఖండించి రాజమందిరమునకు మరల దోడ్కొనిపోయెను. అచట రాజు దానియందు దానెంత గాఢానురక్తుడైయుండినదియు, దానిని తానెట్లు వివాహ

---

12a. కీ. శే. వీరేశలింగం పంతులుగారు ఇట్లు వ్రాసియున్నారు : "కృష్ణదేవరాయల తండ్రియైన నరసింహరాయనికి తిప్పాంబయనియు, నాగమాంబ యనియు ఇద్దఱు భార్యలు గలరు. ఆ యిరువురిలో తిప్పాంబ పట్టపురాణియనియు నాగాంబ భోగకాంత యనియు జెప్పుదురు. కొన్ని శాసనములందు గూడ నిట్లే కానబడుచున్నది." ఆం. క. చ. రెండవ భా. పుట ౧౧. ఇది కేవలము నిరాధారమైన వ్రాత.

13. సూయెల్. ఫర్‌గాటన్ యెంపైర్ పుట ౩౧౪.

మాడెదనని వాగ్దత్తముజేసినదియు జెప్పి యెట్లైనను దానాడినట్లు చేయ నిశ్చయించు కొంటిననియు బల్కెను. అతని సంకల్పము దృఢమైనదని గ్రహించి మంత్రి యతని యిష్టాను సారము వర్తించుటమేలని తలచి యేలినవారి కపయశస్సు రానీయక నిర్వహించెదనని చెప్పెను. తాము చెప్పినట్లు సేయుటకొఅకతడు (మంత్రి) నరసింగదేశనృపాలుర యింటబుట్టిన సుందరాంగి యగు కన్యను దెచ్చి యతనికి (రాజునకు) వివాహముగావించి యుద్వాహోత్సవములు ముగిసినవెనుక నామెను నా భోగకాంతతో గూడ నొక్క మందిరమున నుంచెను.'' 14

కృష్ణరాయలు వెలయాలిని బెండ్లాడెనని చెప్పిన చరిత్రకారుడు వాస్తవముగ నతనితల్లి భోగకాంతయో, దాసియో యైయుండినయెడల నావిషయమును దెల్పకయుండడు. తన మాతృదేశమగు పోర్చుగలందు పోర్చుగీసుచరిత్రకారుని యుపయోగార్థము పోర్చుగీసుభాషయందు వ్రాసి పంపిన వృత్తాంతమున గృష్ణరాయలు నిజముగ దాసీపుత్రుడైయైయుండిన నాయంశమును జెప్పక డాచవలసిన యవసరమేమియు గానరాదు. మరియు గృష్ణరాయలతని ద్వైమాతురజ్యేష్ఠభ్రాతయగు వీరనరసింహరాయల శాసనములందిట్లు వర్ణింపబడి యున్నాడు.

'' తిప్పాజీనాగలాదేవ్యోః
కౌసల్యా శ్రీసుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేంద్రా
త్తస్మాత్వం క్ష్మీరథాదివ॥
వీరౌ వినయినౌ రామ
లక్ష్మణౌ వివనందనౌ
జాతావీరనృసింహేంద్ర
కృష్ణరాయమహీపతీ॥''15

తస్మా న్నరసరాజేంద్రా
త్తిప్పాజీనాగమాంబయోః
క్రమాద్వీరనృసింహేంద్ర
కృష్ణరాయౌ బభూవతుః ॥
అన్యోన్యోపమయోస్సర్వ
సద్గుణౌ ఘనముద్రయోః
తయో ర్వీర నృసింహేంద్రః
పిత్ర్యం సింహాసనం శ్రితః ॥ ''16

పై నుదహరింపబడిన శ్లోకములందు తిప్పాజియు నాగలాదేవియు దశరథుని కౌసల్యాసుమిత్రలవలె దేవులు. అనగా పట్టాభిషిక్తలైన భార్యలు, వారిరువురులకు సమానులు. కావుననే వారికి బుట్టిన పుత్రులు రామలక్ష్మణులతో బోల్పబడిరి. వీరనరసింహరాయలు కృష్ణరాయల తల్లిని నాగలాదేవిని తన తల్లిని బోలి నరసానాయకుని 'దేవి' యని చెప్పుటవలన నామె కులసతియేకాని భోగకాంతకాదని నిశ్చయముగ చెప్పవచ్చును. ఇంకొక విశేషము. నరసానాయకునికి భార్యలు మువ్వురుండిరి. తిప్పాజీ నాగలా దేవులు గాక రంగ తిరుమలేంద్రాచ్యుత దేవరాయ జనని యోబాంబ యను మఱియొక భార్య నరసానాయకుని కుండినను కృష్ణరాయని నతని తల్లియగు నాగలను దన శాసనములందు పేర్కొనిన వీర నరసింహరాయలు వారి మాట యెచ్చటను ఎత్తక పోవుట చిత్రము. నాగలాదేవియు ఓబాంబవలె నతనికి సవతి తల్లియేకదా. కృష్ణరాయలవలె రంగాచ్యుతులును సవతితమ్ములేకదా. నాగలాదేవిని కృష్ణరాయలను మహా గౌరవముతో బేర్కొనిన వీరనరసింహరాయలు వారి ప్రస్తావమేల చేయలేదో ?

౩

ఇంతవఱకు నడచిన చర్చవలన కృష్ణదేవరాయలు జన్మించిన తుళువవంశము క్షత్రియవంశ

---

14. సూయెలు — ఫరగాటన్ యెంపైర్. పుటలు ౩౬౨-౩.

15. కంచికామకోటిపీఠస్థులగు శ్రీ శంకరాచార్యులవారి యొద్దనుండు తామ్రశాసనములు, నెం. ౨. పుట ౨౨.

16. ఎపి. కర్ణా. సం. ౧౦ గోరి. ౭౭.

మనియు నాద్యమున నావంశమువారు తుళుదేశ వాస్తవ్యులనియు నతనితల్లి నాగలాదేవి నరస నాయకుని కులవధువనియు దేలుచున్నది. ఈపట్టున విచారించవలసిన సమస్య యొకటి గలదు. కృష్ణ దేవరాయలు క్షత్రియుడనుటసరి. కాని యాతని జాతి యెద్ది ? ఆంధ్రుడా? కర్ణాటకుడా ? ఈ ప్రశ్నలకు సమాధానము జెప్పుట సులభకార్యము గాదు. ఒకదృష్టితో జూచిన కృష్ణరాయలాంధ్రు డును గాడు, కర్ణాటకుడును గాడు. తుళువరాజ వంశమునకు మూలపురుషుడును గృష్ణరాయలకు ముత్తాతయునైన తిమ్మరాజు తుళుదేశస్థుడని వరాహాపురాణమున స్పష్టముగ జెప్పియున్నది. ఇతని వంశమున బుట్టినవారందఱు తుళుజాతి వారగుదురు కాని యన్యజాతివారు కాజాలరు; కాని మఱియొకదృష్టినిజూచిన వారాంధ్రులగు దురు గాని యన్యులు గారు. వారి ఆదిమ జన్మస్థానము తులుదేశమైనను, మూలపురుషుడైన తిమ్మరాజుదినములందే జన్మదేశమును ద్యజించి దక్షిణాంధ్రదేశమునకు వచ్చి చంద్రగిరియందు నాళువరాజుల నాశ్రయించి యచటనే స్థిరనివా సము నేర్పఱచుకొని నిలిచిపోయిరి. నాడాదిగ తుళువవంశమువారి కాంధ్రదేశము మాతృదేశ మాయెను. ఆంధ్రరాజ కుటుంబములతో సంబంధ బాంధవ్యములను గల్గించుకొనిరి. బుక్కమ్మ, తిప్పమ్మ, నాగమ్మ, ఓబమ్మ, తిరుమలమ్మ, చిన్నాదేవి, వరద రాజమ్మ మొదలగు తుళువరాణులందఱును నాంధ్ర నారీమణులే. ఆద్యమునుండి తుళుభాషను వర్జించి తెనుగునే మాతృభాషగ స్వీకరించి తెనుగుకావ్యములను రచించి తెనుగుకవుల నాదరించి పోషించి యాంధ్రవాఙ్మయమును బెంపొందించిరి. నంది మల్లయ్య, ఘంటసింగయల నీశ్వర నాయకుడు పోషించెను. నరసానాయకుడు వరాహాపురాణమును వరలక్ష్మీకల్యాణము నరసింహావిజయములను కావ్యముల నంకితముగొనెను. ప్రోలుగంటి రంగన పినతాతకుమారుడును ద్విపదనారసింహాపురాణము వచన బాలభారతము సౌభరిచరిత్ర జక్కులకథ మొదలగు గ్రంథములను రచించిన యష్టభాషా కవివర్యుడగుచెన్నకవిని వీరనరసింహారాయలగ్రహార ములను వివిధార్థములనిచ్చి సత్కరించెను. కృష్ణ దేవరాయలు స్వయమాంధ్రకావ్యనిర్మాత. అష్ట దిగ్గజములను సంరక్షించి వారినుత్తమకావ్యరచనకు బురికొల్పెను. ఆంధ్రభోజుడని కీర్తివడసెను. అచ్యుతరాయలు ఆంధ్రకవిజనకల్పభూజము. ప్రతి వర్షమును నొక యుత్తమాంధ్రకావ్యమును రచియింపజేసి తన యిష్టదైవమగు శ్రీవేంకటా చలపతి కంకిత మిప్పించెడివాడు. ఇట్లు ఆంధ్రదేశ మును స్వదేశముగను, నాంధ్రభాషను మాతృ భాషగను స్వీకరించి, యాంధ్రరాజకుటుంబములతో తరతరములుగ సంబంధబాంధవ్యములను గల్గించు కొని, యాంధ్రస్త్రీల గర్భమున జనించి, యాంధ్రులతో గూడిమాడి జీవనముసల్పి, యాంధ్రమున గ్రంథరచనజేసి, యాంధ్రకవుల నాదరించి పోషించి యాంధ్రవాఙ్మయమును బెంపందించిన తుళువరాజు లాంధ్రులుగాక యన్యు లెట్లు కాగలరు? కావున కృష్ణరాయలాంధ్రుడనుట యొప్పును.

## ౩. రాజ్యాభిషేకము

కృష్ణదేవరాయ లెప్పుడు జన్మమందెనో తెలియదు.[1]

కావలి వెంకట రామస్వామిగారు తమ దక్షిణ హిందూదేశకవులచరిత్రలో కృష్ణరాయలు తన నలువదవయేట శాలివాహనశకాబ్దములు ౧౪౪౬ వ సంవత్సరమునం, దనగా క్రీస్తుశకము ౧౫౨౪ వ సంవత్సరమున మృతి నొందినట్లు వ్రాసియున్నారు. దీని నాధారపఱచుకొని వీరేశలింగంపంతులుగారు

1. "కృష్ణరాయల జనన మొకరు ౧౪౬౫ వ సంవత్సరమునం దనియు, ఇంకొకరు ౧౪౭౧ వ సంవత్సరమునం దనియు వ్రాసియున్నారు. గాని యం దేది సత్యమయినదియు నిశ్చయించుట కాధారము లేవియు దొరకలేదు" అని కందుకూరు వీరేశలింగంపంతులుగారు వ్రాసియున్నారు. ఆంధ్రకవుల చరిత్రము. మధ్య కవులు. పుట. ౧౦. వీ రెవ్వరో పంతులుగారు పేర్కొనలేదు.

'రాయలవారు హూణశకము ౧౪౮౪ వ సంవత్సరమున బుట్టినట్లేర్పడుచున్నది. అల్లసాని పెద్దన్న చెప్పినట్లు చాటుధారగా వచ్చుచున్న 'బోరన యాచకప్రతతి' యను పద్యమునుబట్టి కూడ కృష్ణదేవరాయల మృతికాల మించుమించుగా దీనితో సరిపోవుచున్నది. గనుక మన కింతకంటె మంచి యాధారము దొరుకువఱకును రాయలవారి జన్మకాలము ౧౪౮౪ వ సంవత్సరమని నమ్మవచ్చును."[2] అని వ్రాసినారు. ఇప్పటివఱకును దొరకినశాసనముల సాక్ష్యమునుబట్టి కృష్ణరాయలవారు శకాబ్దము ౧౪౫౨ అనగా క్రీ. శ. 1530 వఱకును రాజ్యభారము వహించి యుండిరని నిశ్చయముగ దెలియవచ్చుచున్నది కావున "బోరనయాచకప్రతతి" యను చాటువున జెప్పినట్లు శకాబ్దము ౧౪౪౬ లో, ననగా క్రీ. శ. ౧౫౨౪ వ సంవత్సరమున కృష్ణరాయలు మృతినందెననుట విశ్వాసపాత్రమైన విషయము గాదు. కావుననీ చాటువు నాధారపఱచుకొని గణించిన రాయల జన్మకాలమును నమ్మదగినదికాదు. మఱియు నతడు మరణకాలమప్పుడు నలుబదియేండ్ల వాడని తలచుట కేయాధారమును గానరాదు ; ముసలివాడగునంతవఱకు జీవించియుండె ననుటకు గొంత యాధారము కలదు. రాయల వయస్సును గూర్చిన ప్రస్తావన న్యూనిజు గ్రంథమున నొకటి రెండు తావుల గానవచ్చుచున్నది. కృష్ణరాయల కుమారుని విషయము జెప్పుచు న్యూని జిట్లు వ్రాసియున్నాడు :

"రాజు (కృష్ణరాయలు) దీనిని (కలుబరిగె దండయాత్రను) ముగించి, తన శత్రులందఱిపై భూరివిజయములను బడసిన పిమ్మట, తాను అప్పటికే వృద్ధుడగుటచేత దన వార్ధక్యమునందు విశ్రాంతి నందవలయు ననియు, దన మరణానంతరము దన పుత్రుడు రాజు గావలయుననియు గోరియాత డాఱేండ్లబాలు డగుటవలన తాను గతించిన వెనుక స్థితిగతు లెట్లుండునో యని శంకించి బ్రతికి యుండగనే యతని రాజును జేయ నిశ్చయించుకొనెను. ఆ కారణమువలన నతడు దన సింహాసనమును, యావదధికారమును, (రాజ) నామమును ద్యజించి వాని దన కుమారుని కిచ్చి తా నతనికి బ్రధానియై యంతకు ముందు తనకు బ్రధానియై యుండిన సాల్వ తినిచను దనకు మంత్రిని గావించుకొని యతని పుత్రులయం దొక్కని (రాజ్యమున) మహాసామంతుని గావించెను."[3]

ఇందువలన కృష్ణరాయలు దన కుమారునికి రాజ్యాధికార మొసగినపుడు ముసలివాడని తెలియుచున్నది. రాజ్యాధికార మొసగినది కలుబరిగెదండయాత్రయైనపిమ్మట. కలుబరిగెదండయాత్ర నడచినది రాయచూరువిజయానంతరము రాయచూరు విజయము చేకూఱినది క్రీ. శ. ౧౫౨౨ వ సంవత్సరమునకు సరిపోవు ౧౪౪౪ శకాబ్దమున. కావున కృష్ణరాయలు కుమారునికి రాజ్యాధికారము నిచ్చినది శకాబ్దము, ౧౪౪౪ నకు దరువాత నని నిశ్చయమగుచున్నది. ఎంతకాలమునకు దరువాతనో సూక్ష్మముగ దెలియవలయునన్న కృష్ణరాయల శాసనములను బరిశీలింపవలసియున్నది. మొదట పరిగణింపదగినది రాయసము కొండమరసయ్య గారి చోళసముద్ర శిలాశాసనము. ఇది శకాబ్దము ౧౪౩౯ ఈశ్వర సంవత్సరమునాటిది. చోళసముద్ర చౌడేశ్వరీయాలయమునకు గృష్ణరాయలవారికి సంతానము గలుగవలయునని కొండమరసయ్యగారు చేసిన దానమునిది తెలియజేయుచున్నది.[4] ఇందువలన శకాబ్దము ౧౪౩౯ వఱకు కృష్ణరాయలకు బిడ్డలులేరని నిశ్చయమగుచున్నది. తరువాత పేర్కొనదగినది శకాబ్దము ౧౪౪౦ బహుధాన్య సంవత్సర కార్తిక శు. ౧౨ శని వారమునాడు కృష్ణదేవమహారాయలవారును, నతని పట్టపురాణి తిరుమలదేవి గారును దమ పుత్రుని మేలు గోరి యంజనగిరి తిరువెంగడనాథునికి జేసిన భూదానమును తెలియజేయు కమలాపురశిలాశాసనము.[5] ఇందువలన కృష్ణరాయలవారికి శకాబ్దము ౧౪౪౦ వ సంవత్సరమున తిరుమలరాయలను కుమారుడు పుట్టెనని నిశ్చయమగుచున్నది. కృష్ణరాయలు తన కుమారునికి రాజ్యాధికార మొప్ప

2. ఆం. క. చ. మధ్య కవులు. పుట. ౧౦.
బోరనయాచకప్రతతి భూరివిపద్దశ నొందుచుండఁగా
నారయ శాలివాహనశకాబ్దముల ద్రియుగాబ్ధిసోములం
దారణ వత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ షష్ఠి
రవివాసరంబున నృసింహుని కృష్ణుడుచేరె స్వర్గమున్
ద్వారకనున్నకృష్ణుడవతారసమాప్తమునొందు కైవడిన్

3. *Sewell : For. Emp. p.* 359.
4. *ARE.* 87 *of* 1912.
5. *ARE,* 697 *of* 1922.

జెప్పినపు డాకుమారు డాఱేండ్లవాడని న్యూనిసు చెప్పియున్నాడు. కావున రాజ్యాధికార మొప్ప జెప్పినది శకాబ్దము ౧౪౪౬ వ సంవత్సరమునందై యుండవలయును. ఈ యూహ సరియైనదని శకాబ్దము ౧౪౪౬ వ సంవత్సరమున కృష్ణరాయల పుత్రుడు తిరుమలదేవరాయలు విజయనగర సామ్రాజ్యమును పాలించుచున్నట్లు తెలియజేయు శాసనము లనేకములు రుజువుసేయుచున్నవి.[6] కావున కృష్ణరాయలు శకాబ్దము ౧౪౪౬ వ సంవత్సరమున కుమారునికి రాజ్యాధికారమొసగెననియు, నప్పుడు రాయలు వృద్ధుడనియు దేలుచున్నది.

శకాబ్దము ౧౪౪౪ వ సంవత్సరమున గృష్ణరాయలు వృద్ధుడగుట సరి. ఎన్నియేండ్లవృద్ధుడో చెప్పుటకు వీలుగాదు. కాని న్యూనిసు తన గ్రంథమునం దొకచోట వీరనరసింహరాయల మరణసమయమున గృష్ణరాయల వయ సిరువదేండ్లకు పైబడి యుండెనని వ్రాసియున్నాడు.[7] వీరనరసింహరాయలు శకాబ్దము ౧౪౩౧ వ సంవత్సరమున కాలధర్మము నందెను. అప్పుడు కృష్ణరాయలు ఇరువదియేండ్లకు పైబడిన వయసుగలవాడైనచో నతడు శకాబ్దము ౧౪౧౧వ సంవత్సరమునకు ముందు పుట్టి యుండవలయును. ఎంతముందో చెప్పుటకు వీలులేదు. కావలి వెంకటరామస్వామిగారు చెప్పినట్లు కృష్ణరాయలు దన నలువదవ యేట పరలోకగతుడాయెనని యెంచుటకు వలనుపడదు. ఏలన సమకాలికుడైన న్యూనిసు రాయలు తన పుత్రుని రాజును చేసినప్పుడే వృద్ధుడని చెప్పియున్నాడు. నలుబదియేండ్ల వయసు గల మనుష్యు నెవ్వరును వృద్ధుడని చెప్పరు. ఏబది యేండ్ల వయసుగలవానిగూడ వృద్ధుడని చెప్పుట యరుదు. ఇంచుమించుగ నఱువది యేండ్ల ప్రాయముగలవానినే లోకులు వృద్ధు డందురు. శకము ౧౪౧౧ వ సంవత్సరమున న్యూనిసు కృష్ణరాయల వయస్సు ముప్పదియని చెప్పక ఇరువది యేండ్లకు పైబడియుండెనని చెప్పియుండుటవలన నతని వయసపు డిరువది యేండ్లకెక్కువగను, ముప్పదేండ్లకు దక్కువగను నుండెనని మనము గ్రహించవచ్చును. అతని ప్రాయమపుడిరువది తొమ్మిదేండ్లై యుండెనని యనుకొన్నను, కుమారునికి రాజ్యాధికారమొసగినపుడు, అనగా శకము ౧౪౪౬ వ సంవత్సరమున నతడు నలుబది రెండేండ్లవాడై యుండును. అట్లయిన కృష్ణరాయల జననకాలము శకాబ్దము ౧౪౦౪ వ సంవత్సరము గావలయును. కాని నలుబదిరెండేండ్ల వయసుగల కృష్ణరాయలను న్యూనిసు వృద్ధుడని చెప్పుట యసంభవము ; కావున ఇరువదియేండ్ల పైబడిన వాడని చెప్పుటలో న్యూనిసు ఉద్దేశ్యము అతని వయసును లెక్కింపవలయుననికాదు; అతడు రాజ్యాధిపత్యమును వహించుట కర్హవయస్కుడని తెల్పుటయే. ఈ యభిప్రాయము సరియైనచో శకాబ్దము ౧౪౧౧ లో నిరువదేండ్లకు మించిన వయసుగల కృష్ణరాయలు మఱి పండ్రెండేండ్లు గడచిన తరువాత శకాబ్దము ౧౪౪౬ లో వృద్ధుడగుటలో వింతలేదు. అప్పుడతని వయసేబది సంవత్సరములని యెంచిన నతడు శకాబ్దము ౧౩౯౬ ప్రాంతమున బుట్టి యుండవచ్చును. కాని యిది కేవలము నిరాధారమైన యూహ. లభ్యమైన సాక్ష్యము నాధారపఱచుకొని ఇంతకంటె కచ్చితముగ నతని జన్మకాలమును నిర్ణయించి చెప్పుటకు వీలునులేదు.

## రాజ్యాభిషేకమునకు పూర్వము రాయల స్థితి

రాజ్యాభిషేకమునకు ముందు కృష్ణదేవరాయల స్థితి ఇట్టిదని నిశ్చయించి చెప్పుటకు దగిన సాక్ష్యములేదు. నరసనాయకుని పాలనక్రింద వీరనరసింహరాయనివలె నితడును రాజ్యపరిపాలనమున జాల్గొనెనేమో తెలియదు. ఒకానొక కన్నడ శాసనమున గృష్ణరాయలు చంద్రగిరి పెనుగొండ దుర్గములకు పాలకుడైనట్లు వ్రాసియున్నది. కాని

6. *ARE* 101, 115, 116, *of* 1918.

7. *Sewell. For. Emp. p.* 315.
" *Sallvatina hearing this and seeing that Crisnarao was a man of over twenty years* .........."

ఈ శాసనము కల్పన.[8] కావున నిది విశ్వాస పాత్రము గాదు. 'కొంగుదేశ రాజాక్కళిన్ చరిత్ర' యను నరవఇతిహాసగ్రంథమునందు వీరనరసింహరాయల యేలుబడిలో యన్నకు దన రాజ్యపాలనమున గృష్ణరాయలు దోడ్పడుచుండినట్లు చెప్పియున్నది.[9] దీనిని రుజువుసేయగల సాక్ష్యమేదియు నింతవఱకు లభ్యపడకపోయినను ఇది కేవలమసంగతముగాదు. వీరనరసింహరాయల శాసనములు కృష్ణరాయలయెడ సౌహార్ద్రమును సూచించుచున్నవి. మఱియు వీరనరసింహరాయల మరణపర్యంతమును గృష్ణరాయాది సోదరులందఱును విజయనగరమందు స్వేచ్ఛతో నున్నట్లు న్యూనిసు గ్రంథమువలన దెలియవచ్చుచున్నది.[10] కావున కొంగు దేశరాజాక్కళ్ చరిత్రయందు చెప్పినట్లు కృష్ణరాయలు రాష్ట్రపాలనయందు దనయన్న వీరనరసింహరాయలకు దోడ్పడుచుండినను నుండవచ్చును.

## రాజ్యాభిషేకము—గాథలు

కృష్ణరాయల రాజ్యాభిషేకమునుగూర్చిన గాథలనేకము లాంధ్రదేశమున బ్రచారమునందున్నవి. ముఖ్యమైనవాని నిచట సంగ్రహముగ బొందుపఱచుచున్నాను.

౧. నృసింహదేవరాయలు వీరనరసింహరాయనిపై జూపు ప్రేమకంటె గృష్ణరాయలపై నెక్కువ మక్కువ జూపెడివాడట. దానిగాంచి వీరనరసింహరాయనితల్లి తిప్పాజి కృష్ణరాయని జంపింప నుద్యమించెనట. ఆ సడి యెఱిగి తిమ్మరసాతని దాచి సంరక్షించుచుండెను. ఇట్లుండగా కొంతకాలమునకు నరసింహరాయలు వాపు జాడ్యముచే బీడితుడై మరణమునకు సిద్ధుడాయెను. ప్రాణావసానకాలమున గొడుకులనుబిలిచి తన వ్రేలిముద్రికను జూపి దాని దీసికొనినవాడు రాజ్యార్హుడని చెప్పెను. వ్రేలు వాచియుండుటవలన ఉంగరమును దీసికొనుటకు సాధ్యపడలేదు ఉంగరము దీసికొన వెర వెఱుగక తక్కిన కొడుకులు త్రొక్కట పడుచుండగా గృష్ణరాయలు ఖడ్గముచే దండ్రివ్రేలిని ఖండించి యుంగరమును గ్రహించెను. అతని సాహసమునకు సంతసించి నృసింహదేవరాయలతనిని బట్టాభిషిక్తుని జేయ నియమించి స్వర్గస్థుడాయెనట.

౨. నృసింహదేవరాయిలు దన మరణకాలమప్పుడు దన కొడుకులలో నర్హునికి రాజ్యమీయ నిశ్చయించి వారియం దర్హతముడెవ్వడో కని పెట్టుటకొక యుక్తిని బన్నెను. మందిరాంగణమున నొక వెడల్పైన పెద్ద జముకాణమును బఱపించి దానిమధ్య నొక ఖడ్గమునుంచి పుత్రుల నందఱి నచటికి బిలిపించి జముకాణముపై నడుగుపెట్టక పోయి యా ఖడ్గమును గైకొన్నవానికి రాజ్యమిచ్చెదననిచెప్పెను. జముకాణముపై నడుగిడక పోయి దాని నడుమ నుంచియుండు ఖడ్గమునుగొను నుపాయము నెఱుగక దన యన్నదమ్ములు దికమకపడుచుండగా గృష్ణరాయలు నేలపై బరుండి దొరలుచు జముకాణమధ్యమునకు బోయి ఖడ్గమును గొని మరల దొరలుచు వెలుపలికి వచ్చెనట.

---

8. ఎపి. కర్ణా. సం. ౧౨. గుబ్బి. నెం. ౪౬రు. కల్పన యనుటకు ముఖ్యకారణములు రెండు. (౧) దానకాలము: 'శాలివాహనశకవరుషంగళు ౧౩౨౬ నే సంద వర్తమానద స్వభానునామ సంవత్సరద చయిత్ర శు. ౯ రామోత్సవకాలదలూ'. ఇందువలన కృష్ణరాయల జననమునకు ముందే యీ దానశాసనము పుట్టినట్లు తేలుచున్నది. (౨) రాయలవంశావళి: "కాస్యప గోత్రద ఆపస్తంబసూత్రద యజుశ్శాఖాధ్యాయిగళాద శ్రీమన్మహామండలేశ్వర చంద్రగిరి సింహాసనాంక పెనుగొండపురవరాదీశ్వరరాద అనంతరాయర పౌత్రరాద అచ్యుతరాయర పుత్రరాద శ్రీకృష్ణరాయరవరు."

9. *Further Sources of Vijayanagara History Vol. II. Nos. 97, 97-a.)* "వీరనరసింగ మహారాయరెన్ను తన్నుడైయ తంబికళుడనేరాచ్చియం వెహునీతికళుడనే రెతిచ్చుకొణ్డు...." "తనక్కు తసింబియా యిరుక్కుర కిష్ణరాయరె విజయనగరిపట్టిణత్తిలే వైచ్చు తానుం అచ్చుతరాయర్ శ్రీరంగరాయర్ ఇన్నుం అనేకరాజకుమారర్గళుడనే ఉమ్మత్తూరు సమీపత్తిలే యెఱజ్గికొణ్డు...." "విద్యానగరిక్కు వన్దు కిష్ణరాయరుడనే అన్ద ఉమ్మత్తూరు శ్రీరజ్గపట్టణం వెకుపేన్దోపస్తాయిరుక్కురపడియినాలే రొంబవుం సేనైకళ్ చేతుక్కొణ్డు.... యోచనైపణ్ణి...."

10. *For. Emp. pp.* 315-16.

అతని యుక్తికి మెచ్చి తండ్రి యతనికి రాజ్యము నొసగెనట.

౩. కుమారధూర్జటికృత కృష్ణరాయ విజయమందిట్లు కలదు. (౨: ౩౭–౩౮.)

"ఇవ్విధంబున నవ్వసుంధరారమణ చంద్రుండు (వీరనరసింహరాయ పృథివీపతి) మహేంద్ర వైభవంబున ...... సామ్రాజ్యసంపన్నుడై యుండి యొక్కనాడు."

"తమరు పెద్దల రీతి నిత్తరిని గృష్ణ
రాయలను వేరి మత్పుత్రరత్నమునకు
దనర బట్టంబు గట్టెద ఘనత మీఱ
ననుచు నప్పాజితోన మంతనము జేసి."

౪. క్రీ. శ. ౧౭వ శతాబ్దప్రారంభమున విరచింపబడిన రాయవాచకమునందు వీరనరసింహ రాయలే కృష్ణరాయల పట్టాభిషేకము సేయ నాజ్ఞాపించినట్లున్నది:

"అని విన్నపం జేసి... యీ రాజ్యపట్టం కృష్ణరాయలవారికి కట్టవలెనని దళనాయకులతో పలకరించి, నందు...కృష్ణరాయలవారు[11] తాము పెద్దలమైతిమి తమ మర్యాదాగా రాజ్యపరిపాలనం జేసేటందులకు పట్టాభిషేకం అధిష్ఠానకర్తలు సేయమని మంచివేళ జూచి ముద్దుటుంగర మిచ్చినారు."

11. 'వీరనరసింహరాయలవారు' అనుటకు బదులు 'కృష్ణరాయలవారు' అని వ్రాయసకాడు తప్పు వ్రాసినాడు. కృష్ణరాయలవారు తమకు పట్టాభిషేకము జేయుటకొఱకు తమకు తామే ముద్దుటుంగర మిచ్చిరనుటలో నర్థము లేదు. కావున 'వీరనరసింహ రాయలవారు' అనియే సరియైన పాఠము.

మఱి ఈ వీరనరసింహరాయ లెవ్వరు? ఈ ప్రశ్నకు సమాధానము రాయవాచకమునందే కలదు. పట్టాభిషేక మైనపిమ్మట అప్పాజి మొదలయినవారిచే రాజనీతులను వినిన తరువాత కృష్ణరాయ లిట్లు చెప్పెనని యున్నది. "ఈవరకున్ను యీశ్వరనాయడున్ను, నరసింహ్మనాయడున్ను, వీరనరసింహ రాయలవారు రాజ్యపరిపాలనం గావించినారు." (రాయ. పుట ౨౮) మఱియొకపట్టున దొండోపండితులు మొదలగు నియ్యోగుల అభిప్రాయమును విని యాగ్రహపడి యేదులశాహువారు, "కర్ణాటకంవారు తుంగభద్ర దాటి వచ్చిరా యీవరకున్ను? యీశ్వరనాయకుండున్ను నరసానాయకుండున్ను, వీరనరసింహ్మ రాయలవారున్ను యేలినందుకన్నా కృష్ణరాయలవారు యేలేది యేమున్నది?" అని యడిగినట్లున్నది (రాయ. పుట ౪౯). ఇందువలన రాయవాచకరచయితకు నరసింహ లేక నరసానాయకుడును వీరనరసింహ్మరాయలును భిన్న పురుషులని తెలియునని స్పష్టమగుచున్నది. గ్రంథమున కృష్ణరాయలకు పట్టాభిషేకము సేయదలపెట్టినవాడు వీరనరసింహరాయ లని యున్నదికాని నరసింహ్మ లేక నరసానాయకుడని లేదు. మఱియు కృష్ణరాయలకు బూర్వము దుళువవంశాధీశులై యుండినవారిని మువ్వురిని వరుసగ బేర్కొనియున్నాడు. (౧) ఈశ్వరనాయకుడు—ఇతడు కృష్ణరాయలపితామహుడు. (౨) నరసింహ లేక నరసానాయకుడు—ఇతడు కృష్ణరాయల తండ్రి. (౩) వీరనరసింహ రాయలు—ఇతడు కృష్ణరాయల జ్యేష్ఠభ్రాత. కృష్ణ రాయలపట్టాభిషేక మొనర్చినవాడు వీరనరసింహ రాయలని యుండుటవలన నతడు కృష్ణరాయల యగ్రజుడేకాని తండ్రి కాజాలడు.

౫. కృష్ణరాయలకాలమున విజయనగరమునకు వచ్చియుండిన పోర్చుగీసు అశ్వవ్యాపారి న్యూనిసు క్రీ. శ. ౧౫౩౭ వ సంవత్సరమున కించుక పూర్వము రచించిన చరిత్రయం దిట్లు వ్రాసి యున్నాడు—

"ఈ రాజు (బుస్బలరావు = వీరనరసింహ రాయలు) జాడ్యగ్రస్తుడై బిస్నగపట్టణమున కాలధర్మము నందెను. ఆతడు తన మరణమునకు ముందు ప్రధాని సాల్వతిమ్మనను బిలువనంపి, యెనిమిదేండ్ల ప్రాయము వాడగు దన కుమారుని దన చెంతకు రప్పింపవలయునని యుత్తరువు జేసి,—యతనికి రాజ్యాధిపత్యము సేయదగిన వయసు లేకపోయినను, ప్రాయశః రాజ్యము దనసోదరుడగు కృష్ణరావుకు జెందవలసి యుండినను—నా బాలుని రాజ్యమున బ్రతిష్ఠింపవలయు ననియు; దనమరణానంతరము రాజ్యమున గలహములు లేకుండుటకొఱకు దన తమ్ముని కన్నులను బీకించి తనకడకు దెచ్చి చూపవలయుననియు సాల్వతి(మ్మ)న కాజ్ఞాపించెను. సాల్వతి(మ్మ)నయట్లే చేసెదనని చెప్పి వెడలిపోయి, కృష్ణరావును బిలిపించి యేకాంతముగ నొక యశ్వశాలకుదోడ్కొనిపోయి, యతని యన్న యతని కన్నుల నూడబెఱికించి నిజపుత్రుని రాజ్యమున కభిషిక్తుని సేయ నాజ్ఞాపించెనని తెల్పెను.

ఈ మాటలను వినగనె కృష్ణరావు హక్కు ప్రకారము దనకు రాజ్యము జెందవలసి యుండినను దనకు రాజు గావలయునని గాని, రాజ్యమున నెట్టి పదవి యైన గావలయుననిగాని, యిచ్చలేదనియు, లోకమున జోగియై కాలక్షేపము సేయగోరుచున్నాడననియు దన యన్నయెడ కన్నులు బెకిలింపదగినంతటియపరాధముదాను సేయలేదనియు జెప్పెను. దీనిని సాల్వతి(మ్మ)న విని, కృష్ణరావు ఇరువదేండ్లకు పైబడిన వాడగుటచేత నెనిమిదేండ్లప్రాయముగల బుస్బలరావు కుమారుని కంటె నతడు రాజ్యాధిపత్యము వహించుట కతిశయార్హుడని గ్రహించి, యొక యాడుమేకను దెప్పించి దాని కన్నుల బెకలించి యప్పుడె ప్రాణములు విడువబోవుచుండిన రాజునకు జూప గొనిపోయి యతని ముందుంచెను. రాజు ప్రాణములు విసర్జించిన క్షణముననే, కీర్తికాయుడైన రాజెవ్వని కన్నులను బెకలింప నాజ్ఞాపించెనో యా సోదరుడు కృష్ణరావు రాజపదమున సుప్రతిష్ఠితుడాయెను.[12]

పైనవివరించిన గాథ లైదింటిలో మొదటి మూడును విశ్వాసపాత్రములు గావు. అందు నరసింహరాయల (నరసానాయకుని) యనంతరము గృష్ణరాయలు రాజ్యాధిపత్యము వహించినట్లు చెప్పియున్నది. కృష్ణరాయవిజయమున వీరనరసింహరాయపృథ్వీపతియే కృష్ణరాయలకు రాజ్యాభిషేకము సేయ నాజ్ఞాపించినట్లు చెప్పియున్నను, 'కృష్ణరాయ లనుపేరి మత్పుత్ర రత్నమునకు' అని యుండుటచే నీ వీరనరసింహరాయ పృథివీపతి కృష్ణరాయల తండ్రియగు నరసానాయకుడేగాని అన్నయగు వీరనరసింహరాయలు గాజాలడు.[13] నరసానాయకు ననంతరము వీరనరసింహరాయలును, నతని వెనుక కృష్ణరాయలును రాజ్యమును బాలించినట్లు తుళువవంశశాసనములవల్లను, గృష్ణరాయల కంకితము సేయబడిన ఆంధ్రప్రబంధముల వల్లను దెలియవచ్చుచుండుటవలన నరసానాయకుడు గృష్ణరాయలకు రాజ్యాభిషేకము సేయ నాజ్ఞ యిచ్చెననుట విశ్వసింపదగిన విషయముగాదు. రాయవాచకమున జెప్పినట్లు వీరనరసింహరాయతే కృష్ణరాయలకు రాజ్యాభిషేకము సేయ నాజ్ఞాపించి యుండవచ్చును; కాని దీని యాదార్థ్యము స్థిరపరచగల సాక్ష్యము విశ్వాసపాత్రమైనది లభ్యపడలేదు. మఱియు న్యూనిజుచరిత్ర దీనితో బ్రత్యక్షముగ బ్రతిఘటించుచున్నది. వీరనరసింహరాయలు దన మరణానంతర మెనిమిదేండ్ల బాలుడగు దన పుత్రుని పట్టబద్ధుని సేయ నిశ్చయించి, కృష్ణరాయలవలన నతని కాపద గలుగవచ్చునని శంకించి కృష్ణరాయల కన్నుల బీకింప నిజప్రధాని తిమ్మరసున కాజ్ఞాపించెననియు, నా ప్రధాని కృష్ణరాయల పక్ష మవలంబించి తన యజమానుని మోసపుచ్చి యతనికి రాజ్యాభిషేక మొనర్చెననియు న్యూనిజుగ్రంథమువలన విదితమగుచున్నది. న్యూనిజు కృష్ణరాయలకు సమకాలికుడు. కృష్ణరాయల కాలమునను, దరువాతను నతడు పలుమారు విజయనగరమునకు వచ్చియుండెను. కృష్ణరాయల రాజ్యారంభకాలమున జరిగిన యంశములను గూర్చి ప్రత్యక్షజ్ఞానముగల వారిని జక్కగ విచారించి సత్యమును గనుగొని గ్రంథస్థము జేసియుండును; కావున వీరనరసింహరాయల కిష్టము లేకపోయినను మహాప్రధాని సాళువ తిమ్మరసయ్యగారి సహాయమువలన కృష్ణరాయలు రాజ్యాధిపతి యాయెనని మనము నిశ్చయింపవచ్చును.

ఈ పట్టున విచారించదగిన ముఖ్యాంశ మొక్కటి కలదు. వీరనరసింహరాయుల యనంతరము రాజ్యాధిపత్యపు హక్కు కృష్ణరాయలదైనట్లు న్యూనిజు సూచించియున్నాడు. ఈ క్రింది వాక్యముల యర్థము పరిశీలింపదగినది. వీరనరసింహరాయలు గృష్ణరాయల కన్నుల బెకలింపమని

12. *Sewell : For. Emp. pp.* 314-15.

13. క్రీ. శ. ౧౪౯౩వ సంవత్సరము నాటి యొక శాసనమున (మైసూ. ఆర్కి. రిపో. ౧౯౪౪ నెం. ౪౪ రు) నరసానాయకుడు 'నృసింహో నృపః. అని పేర్కొనబడియున్నాడు. ఆముక్తమాల్యద మను చరిత్ర పీఠికలందు 'నారసింహేశ్వరుండు' అనియు వరదాంబికాపరిణయమందు 'నృసింహనామానం' అనియు గలదు. (సోర్సస్ ఆఫ్ విజయనగరహిస్టరీ, పుటలు ౧౧౦, ౧౭౨.) ఇత డర్వాచీన గ్రంథకర్తలచే నరసింహ, లేక వీరనరసింహరాయ లనియు బేర్కొనబడియున్నాడు.

తిమ్మరసున కాజ్ఞాపించు సందర్భమున 'రాజ్యము ప్రాయశః తన సోదరుడగు కృష్ణరావునకు జెంద వలసియుండినను' అని చెప్పినట్లున్నది. దీని కనుగుణ్యముగ గృష్ణరాయలు వీరనరసింహరాయల యాజ్ఞను విన్నప్పుడు తిమ్మరుసుతో, 'హక్కుప్రకారము దనకు రాజ్యము జెందవలసి యుండినను' అని యన్నట్లున్నది.[14] ఈ వాక్యములను బట్టి చూడగా వీరనరసింహరాయల పుత్రునకు రాజ్యము నేలు హక్కు లేదనియు, హక్కుప్రకారము గృష్ణరాయలే రాజ్యాధిపతి కావలసియుండె ననియు విదితమగుచున్నది. కృష్ణరాయల కీ హక్కెట్లుపలబ్ధమైనదో తెలియదు. సంగమవంశజులను వెడలనడిచి క్రీ. శ. ౧౪౮౫ వ సంవత్సరమున సాళువనరసింగరాయలు విజయనగరసామ్రాజ్యము నాక్రమించుకొనెను. ఇతని తరువాత నితని పుత్రులు తిమ్మరాజును, ఇమ్మడి నరసింహరాయలును క్రీ. శ. ౧౫౦౬ వ సంవత్సరము వఱకును బాలించిరి. బాలురగుటచే నామకార్థము మాత్రమే వీరు ప్రభువులు; సర్వాధికారమును రాయలకును, సామ్రాజ్యమునకును రక్షకుడైన నరసానాయకునిచేత నుండెను. క్రీ. శ ౧౫౦౩ వ సంవత్సరమున నరసానాయకుడు శివసాయుజ్యము నందిన పిమ్మట నతని జ్యేష్ఠపుత్రుడిమ్మడి నరసానాయకుడు రక్షకు డాయెను. క్రీ. శ. ౧౫౦౬ వ సంవత్సరమున నితడు దన స్వామియగు నిమ్మడి నరసింహరాయని జంపించి రాయ సామ్రాజ్యము నాక్రమించుకొని వీరనరసింహరాయలను నామము వహించి క్రీ. శ. ౧౫౦౯ వ సంవత్సరము వఱకు రాజ్యపరిపాలనము గావించెను. కావున వీరనరసింహరాయలు గతించిన తరువాత రాజ్యము క్రమప్రకారమతని పుత్రునికి చెందవలసియుండెను. విషయ మిట్లుండగా, 'హక్కునుబట్టి' రాజ్యము గృష్ణరాయలకు జెందవలసియుండెనను న్యూనిజు వాక్యముల కర్థమేమి ? తండ్రిమూలమున గాకపోయిన గృష్ణరాయల కీ హక్కు తల్లివలన సంక్రమించి యుండగూడదా ? యను ప్రశ్న రావచ్చును. తల్లి సంగవంశముననో, సాళువ నరసింగరాయల వంశముననో పుట్టియుండిన నట్లనుకొనుట కవకాశము గలదు ? కాని కృష్ణరాయల తల్లిని గూర్చి మనకు దెలిసిన విషయ మల్పిష్ఠము. ఆమె నరసానాయకుని ద్వితీయపత్ని యని తెలియును ; అంతకు మించి మఱియేమియు దెలియదు. దీపాలనాగి కథ యొక్కటి కలదు ; కాని యది సత్యముగాదు. సత్యమే యనుకొన్నను అందుమూలమున కృష్ణరాయలకు రాజ్యాధిపత్యమున కెట్లు హక్కు గలిగెనో తెలియరాదు. ప్రస్తుతము మనకు గల చరిత్రజ్ఞానము నాధారపఱచుకొని న్యూనిజు వాక్యముల గూఢార్థమును నిర్ణయించుటకు వీలుగాదు. అందలి వాస్తవార్థము భావిపరిశోధనలవలన బయల్పడవలసియున్నది.

## రాజ్యాభిషేక కాలము

ఇంతవఱకును గృష్ణరాయల రాజ్యాభిషేకమును గూర్చిన గాథలు వివరింపబడినవి. వీరనరసింహరాయల కిష్టములేకపోయినను ప్రధాని తిమ్మరసయ్యగారి యనుగ్రహమువలన గృష్ణరాయలకు రాజ్యోపలబ్ధి గలిగెను. కాని యతని పాలన యెప్పుడు ప్రారంభమాయెనో, యెన్నడాతనికి పట్టాభిషేకము నడచెనో నిశ్చయముగ దెలియదు. శాసనముల నాధారపఱచుకొని వీనిని నిర్ధారించవలసి యున్నది. అనంతపురమండలములోని తాడిపత్రియందలి శాసన మొకదానియందు శా. శ. ౧౪౩౧ పూర్తియైనపిమ్మట శుక్ల నామ సంవత్సర వైశాఖ శు. ౧౫ శుక్రవారము (అనగా క్రీ. శ. ౧౫౦౯. మే ౪ తేది) నాడు వీరనరసింహరాయలు విజయనగరమునందు పాలించుచున్నట్లు చెప్పియున్నది.[15] దక్షిణ ఆర్కాటు జిల్లాలోని విక్రవాండిగ్రామమందలి యొక శాసనమున శా. శ. ౧౪౩౧ శుక్ల నామసంవత్సర కర్కాటక శు. ౫ శుక్ర. హస్త (క్రీ. శ. ౧౫౦౯ జూలై ౨౨ తేది) నాడు వీరనరసింహరాయలు విజయనగరమందు పృథివీసామ్రాజ్య మేలుచుండినట్లు చెప్పియున్నది.[16] ఈ రెండుశాసనములవల్లను వీరనరసింహరాయలు క్రీ. శ. ౧౫౦౯ జూలై ౨౨

14. *For. Emp. p.* 315

"*Though the kingdom ought perhaps belong to his brother , Crisnarao......*" "*Even though it (the kingdom) should come to him by right..*"

15. 342 *of* 1892.

16. 289 *of* 1915.

తేదివఱకును రాజ్యము సేయుచుండెననియు, నందాక కృష్ణరాయల పాలన ప్రారంభము గాలేదనియు దెల్లమగుచున్నది.

బళ్లారిమండలమందలి గుళ్యములో నొక శాసనమున శా. శ. ౧౪౩౧ శుక్ల శ్రావణ శు. ౧౦ బృహస్పతి వారము (క్రీ. శ. ౧౫౦౯ జూలై ౨౬ తేది) నాడు కృష్ణదేవరాయలు విజయనగరమున రత్నసింహాసనాసీనుడై పృథివీసామ్రాజ్యము పరిపాలించుచుండినట్లు చెప్పియున్నది.[17] మఱియు కడపమండలములోని పులివెందలయందొక శాసనమున శా. శ. ౧౪౩౧ శుక్లసంవత్సర కార్తిక మాసమున (క్రీ. శ. ౧౫౦౯ ఆగస్టు–సెప్టెంబరు) కృష్ణరాయలు విజయనగరమున పృథివీ సామ్రాజ్యము సేయుచుండెనని యున్నది.[18] ఇందువలన కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౦౯ జూలై ౨౨-౨౬ తేదీలమధ్య నొకనాడు రాజ్యాధిపత్యమును వహించెనని తెల్లమగుచున్నది.

ఈ రెండుశాసనములందు కృష్ణరాయల పట్టాభిషేకప్రస్తావన లేదు. పట్టాభిషేకప్రస్తావము మొట్టమొదట శా. శ. ౧౪౩౨ సం. శుక్లసం॥ మాఘశు. ౧౪ కు సరియైన క్రీ. శ. ౧౫౧౦ జనవరి ౨౪ తేదినాడు నిలిపిన హంపిశాసనమున గానవచ్చుచున్నది.[19] ఇందు కృష్ణరాయలు దన పట్టాభిషేకమహోత్సవకాలమున పంపావిరూపాక్ష స్వామివారి యాలయమునకు రంగమంటపమును గోపురమును గట్టించెనని యున్నది. దీనినిబట్టి చూడగా రాజ్యాధిపత్యమును వహించిన వెనుక యాఱుమాసములవఱకు పట్టాభిషేకము జరుగ లేదని చెప్పవలసియున్నది. కాని రాజ్యాధిపత్యము వహించుటకును, పట్టాభిషేకమహోత్సవమున కింత యెడము గల్గుటకును గారణమేమియు గానరాదు. హంపిశాసనము కృష్ణరాయల పట్టాభిషేక మహోత్సవ సమయమున నిలిపినదికాదనియు, దరువాత నొక వార్షికోత్సవమునాడు నెలకొల్పినదనియు కొందఱి యభిప్రాయము.[20]

క్రీ. శ. ౧౫౦౯ జూలై ౨౨ తేది వఱకును కృష్ణదేవరాయల పాలన ప్రారంభము గాలేదని పై నుదాహరించిన వీరనరసింహరాయల విక్రవాండి శాసనమువలన విశదమగుచున్నది. హంపిశాసన కాలమునకును దానికినిగల యెడ మాఱు మాసములే యగుటవలన హంపిశాసనము నిల్పినది పట్టాభిషేక వర్ధంత్యుత్సవమప్పుడనుట సంగతము గాదు. కాని పట్టాభిషేక మంతకు కొన్నిమాసములకు పూర్వమే జరిగెననుటకు గొంత యాధారము గలదు. శా. శ. ౧౫౨౬ పార్థివసంవత్సరమున వీరవెంకటపతిరాయలవారి యాజ్ఞ ప్రకారము వారి నగరి యఠవణీకర్తలు తయారుచేసిన 'విజయనగర సామ్రాజ్య' మను పాళ్యపట్టుడితమునందు "శాలివాహనశకం ౧౪౩౨ అగు నేటి శుక్ల సంవత్సరం ఆవణిమాసం శ్రీజయంతినాడు కృష్ణదేవరాయమహారాయలు విజయనగరమందు పట్టాభిషిక్తులై వేంచేసిరి" అని చెప్పి యున్నది[21] ఇందుదాహరింపబడిన శకాబ్దము వర్తమానాబ్దము ; గతాబ్దము గాదు. గతాబ్దము ౧౪౩౧. సామాన్యముగ గతాబ్దము నుదహరించుట వాడుకయైనను వర్తమానాబ్దముగూడ ప్రాచీన శాసనములందును, లెక్కలందును దఱచుగ గానవచ్చుచున్నది. 'విజయనగరసామ్రాజ్యము' బడి కృష్ణదేవరాయల పట్టాభిషేకము క్రీ. శ. ౧౫౦౯ ఆగస్టునెల ౭ తేది మంగళవారమునాడు జరిగియుండవలయును. కృష్ణదేవరాయలు శ్రీకృష్ణుని యవతారమని యప్పటివారి నమ్మకము. మఱియు నాతడు పరమ వైష్ణవుడు. కావున నతడు క్రీ. శ. ౧౫౦౯ జూలై ౨౨ తేది తరువాత రాజ్యభారము వహించినను నటుపిమ్మట నొకపక్షము రోజులలో వచ్చుచుండిన శ్రీకృష్ణజన్మాష్టమి వఱకును దన బట్టాభిషేకము నాపుదల జేసికొనుటయందు వింత యేమియు లేదు. కృష్ణరాయల పట్టాభిషేకము వాస్తవముగ క్రీ. శ. ౧౫౦౯ ఆగస్టు ౭ తేది నాడు జరిగెనని మనము విశ్వసింపవచ్చును.

---

17. 703 *of* 1909.
18. 498 *of* 1906
19. *A R I.* 1907-8 *p.* 174.
20. *Sewell. For. Em. p.* 120.
21. భారతి. సం. ౬. పుట ౬౧౨.

## ఉమ్మత్తూరు

"సమ్మర్దక్షమ ధీ నిబంధనవిధాసంక్రందనాచార్యశూ
రమ్మన్యాచలవజ్రపాతజగతీరక్షాంబుజాక్షాశ ర
థ్యమ్మార్గస్థదశాస్య రాజ్యసమసహ్యా ప్రోద్భవాతీర
ఖా గుమ్మత్తూరుశివంసముద్రపురవప్రోన్మూల
నాడంబరా."[1]

కృష్ణదేవరాయలురాజ్యాభిషేకము జేసికొనిన వెంటనే రాష్ట్రమున క్షుద్రశత్రువులను నిర్మూలము గావించి తన యాజ్ఞను నిర్వక్రముగ సామ్రాజ్యము నందంతటను జెల్లుబడి యగునట్లు చేయవలసి యుండెను. సంగమవంశ మంతరించినప్పటినుండియు దక్షిణ కర్ణాటకమున రాయల యధికారము సన్నగిలినది కావేరీ తటమును బాలించుచుండిన ఉమ్మత్తూరు శివం సముద్ర శ్రీరంగపట్టణపాళెగాండ్రు కేంద్రప్రభుత్వమును సరకుసేయక స్వచ్ఛందమార్గమున బ్రవర్తించుచుండిరి. వీరు తాము ప్రాచీన కర్ణాటకరాజుల సంతతివార మనియు, విజయనగర ప్రభువుల యధికారమునకు లొంగి వారికి గప్పము కట్టవలసిన యావశ్యకత లేదనియు బ్రకటించి, తమ స్వాతంత్ర్యమును స్థాపించుటకు బ్రయత్నము సల్పుచుండిరి. మహామండలేశ్వర, జవాదికోలాహల, వేషణీహనుమంత, అరసాంగసూనెగాఱ, ఘూర్జరాజ్య చక్రేశ్వర, గజబేటకాఱ, పెనుగొండచక్రేశ్వర యను బిరుదులు వీరికుండినట్లు వీరి శాసనములవల్ల దెలియవచ్చుచున్నది. "తాము హొయసలరాజ్యాధిపతులమని చెప్పుకొనెడివారు ; ప్రాచీనతేరకణాంబిరాజ్యమును గొంతకాలము వీరు పాలించినట్లున్నది మఱియు నీయుమ్మత్తూరుప్రభువులు చిరకాలము నీలగిరి ప్రాంతమును బాలించిరనుటకు సంశయము లేదు ; ఆపత్సమయముల యందచట తలదాచుకొనెడివారు."[2] పెనుగొండదుర్గము గూడ కొంతకాలము వీరి స్వాధీనమందుండినదేమో! వీరి బలమంతయు గావేరిద్వీపములయం దుండిన యుమ్మత్తూరు శివంసముద్ర శ్రీరంగపట్టణములను జలదుర్గత్రితయముపై నాధారపడియుండినది. ఇంతవఱకు లభించిన శాసనసాక్ష్యమునుబట్టి వీరి వంశావతరణ మిట్లేర్పడుచున్నది.

### వంశవృక్షము

హానుమప్ప ఉడయరు
|
సోమ లేక యిమ్మడిరాయ ఉడయరు
- దేవణ్ణ లేక దేవరాజ ఉడయరు (క్రీ. శ. ౧౪౩౮-౧౪౮౪)
  - ఇమ్మడి దేవణ్ణఉడయరు (క్రీ. శ. ౧౪౯౨-౧౫౦౮)
    - గంగరాజ ఉడయరు (క్రీ. శ. ౧౫౧౧)
    - నంజరాయ ఉడయరు (క్రీ. శ. ౧౫౧౨-౧౫౪౦)
  - చిక్కరాయ ఉడయరు (క్రీ. శ. ౧౫౦౫-?)
- నంజరాయ ఉడయరు (క్రీ. శ. ౧౪౮౨-౧౪౯౪)
  - చన్ననంజరాయ ఉడయరు (క్రీ. శ. ౧౪౯౩-౧౫౦౪)

1. పారి. ౨ : ౧౦౪.
2. ఎపి. కర్ణా. సం. ౩. పీఠిక పుట ౨౩.

ఈ వంశావళియందు పేర్కొనినవారిలో మొదటి యిద్దరిని గూర్చి మనకేమియు దెలియదు. సంగమవంశము క్రీ. శ. ౧౪౮౫ వ సంవత్సరముతో సమాప్తియైనది. క్రీ. శ. ౧౪౮౫ వ సంవత్సరమున సాళువగుండ నరసింహరాయలు సంగమవంశజులను విజయనగరమునుండి పాఱద్రోలి రత్నసింహాసనము నధిష్ఠించెను. అది మొదలు ఉమ్మత్తూరు ప్రభువులు దమ స్వాతంత్ర్యము నెలకొల్పుటకై విజయనగరరాయలతో బోరాడ నారంభించిరి. ఉమ్మత్తూరుప్రభువుల పేరు జెప్పకున్నను సాళువ నరసింగరాయలు వారి కిరవైన కొంగుదేశమును సాధించినట్లు సమకాలికాంధ్రవాఙ్మయమువలన దెలియవచ్చుచున్నది. జైమినిభారతమునందు—

“. . . కొంగుధారాపురే
పెనుగొండాద్యఖిలైకదుర్గహరణ
ప్రేంఖత్ప్రతాపోదయా.” అనియు—
“పెనుగొండకడ ప్రాలి పిక్కళ్లు మొదలైన
ప్రతిపక్షులను హతాహతముజేసి.”

అనియు జెప్పియున్నది. మఱియు వరాహ పురాణమున సాళువనరసింగరాయల సేనాధిపతి యగు ఈశ్వరనాయకుడు ‘పెనుగొండ సాధించె, బెంగళూరు హరించె’ ననియు ‘సిరంగపట్ణంబు ఖారిసమరె’ ననియు జెప్పియున్నది.[3] నీలగిరి ప్రాంతమువఱకును ఉమ్మత్తూరుదొరల యధికారము జెల్లుచుండినందున కొంగుధారాపురి వారి యేలుబడిక్రింద నుండియుండవలయును. సిరంగపట్టణము వారి దుర్గత్రితయమునందొక్కటియైన శ్రీరంగపట్టణమే. బెంగుళూరు వీరి పాలనయందుండియుండవచ్చును. కావున సాళువ నరసింగరాయల కాలముననే యుమ్మత్తూరుప్రభువులతో సమరము ప్రారంభమాయెనని నిశ్చయముగ జెప్పవచ్చును; కాని యతని ప్రతిపత్తి యెవ్వడో తెలియదు. మొదటి దేవణ్ణయొక్క తమ్ముడు నంజరాజఉడయరు క్రీ. శ. ౧౪౮౨–౧౪౯౪ ల మధ్య రాజ్యపాలన మొనర్చినట్లు శాసనసాక్ష్యము వలన రుజువగుచుండుటవలన సాళువనరసింహ రాయలతో బోరినవాడు ప్రాయశః యతడై యుండవచ్చును.

సాళువనరసింహరాయలు క్రీ. శ. ౧౪౯౦ వ సంవత్సరమున గాలధర్మము నొందెను. తదనంతర మతని కుమారుడగు నిమ్మడి నరసింహ — దమ్మ రాయలు రాజ్యాధిపతియైనను నతడు బాలుడై నిర్వాహకత లేకపోవుటవలన సర్వాధికారములును రాజ్యమునకును, రాయలకును సంరక్షకుడైన నరసానాయకునిచేత నుండినవి. రాజ్యమునందచట నచట బొడసూపిన క్షుద్రోపద్రవములను సందుచేసి కొని ఉమ్మత్తూరుప్రభువులు మరల తలెత్తిరి. కాని నరసానాయకుని ప్రతాపము నోర్వజాలక నమ్రులై కప్పముగట్ట నీయకొనవలసివచ్చెను. నరసానాయకుని విజయము అప్పటిశాసనములందును, సంస్కృతాంధ్రగ్రంథములందును వర్ణింపబడియున్నది.

“కావేరీ మాశు బద్ధ్వా బహులజలధరాం
తాం విలంఘ్యైవ శత్రుం
జీవగ్రాహం గృహీత్వా సమితిభుజబలా
త్తంచ రాజ్యం తదీయం
కృత్వా శ్రీరంగపూర్వం తదపినిజవశే
పట్టణం యో బభాసే
కీర్తిస్తంభం నిధాయ త్రిభువనభవన
స్తూయమానాపదానః.”[4]

అను సుప్రసిద్ధమైన శ్లోకము తులువరాజుల తామ్రపట్టికలయందు దన్నిటియందును గానవచ్చును. ఈ యంశమును రాజనాథడిండిముడును, దిరుమలాంబయును వర్ణించియున్నారు.

3. సోర్సస్. పుటలు ౮౭, ౮౯.
4. భారతి సం. ౯. భా. ౨. పుట ౪౨౩.

" ప్రాయోఽర్ణవే సేతుకృతోఽవతారః
ప్రాగ్జన్మసంస్కారవశా ద్విశేషః
సేతుం విధాయాంభసి సహ్యజాయాః
శ్రీరంగపూర్వం నగరీం జహార. "5

" సమగ్రతరాత్యుగ్ర శౌర్యసూర్యోదయః సాగరాన్తరావాసదుర్లంఘాం లంకామివ రఘుపుంగవః కావేరీపరివేష్టితాం శ్రీరంగపట్టణాభిధాం ఆవరిష్టపురీమ్.

స్థిరే జలే సేతు రకారి పూర్వం
త దద్భుతం నేతి క వేరజాయాః
సేతుం ప్రవాహేషు గుణాభిరామః
చిత్తే సతా మద్భుత మ ప్యబధ్నాత్.

......నిస్త్రింశయన్త్ర శిలాచక్రనిఖాత నిపాత్యమానవిజయపార్థివ శృంగసంఘాతవిశంకట శృంగసఙ్ఘాటాం పురీ మిమాం సమాక్రమ్య విత్రాసభరపుర స్థాపితసమస్త విత్తజాతమ్ అపత్యకలత్రాదిభిః మిత్రాదిభిస్సమాగత్య పదయోర్ని పత్య ఆత్మనో గత్యన్తరభావం ఉద్యోతయన్తం మహావీరం పార్థివం ప్రత్యగ్రకృపా రసాభిషిక్తం తత్ర పురి స్థాపయిత్వా..."6

మఱియు నీవిషయమునే ముక్కుతిమ్మన్నగారు " శ్రీరంగపట్టణ సీమ ఖడ్గనటీ వినోదంబు హొయ్సళేంద్రునకు జూపె. "7

అను సీసపాదమున సూచించియున్నారు.

కొంగుదేశరాజాక్కళ్ చరిత్రయందీ ప్రస్తావం కొంత కలదు.

" అందుమీదట కర్ణాటదేశములోనుండు పాళెగాండ్రును దండనాయకులును కప్పమీయక పోయినందువలన నుద్దండుడను మంత్రి రాజుగారి యుత్తరువు ప్రకారము చతురంగసేనలతోగూడ కర్ణాటదేశమునకు బోయి వారితో యుద్ధముజేసి జీవగ్రాహుని పట్టుకొని యాదేశములో దానే పట్టముగట్టికొని యా పాళెగాండ్రచేత గప్పమును గొని..."8

ఇందు ఉద్దండుడను విజయనగరమంత్రిచే జీవగ్రాహుడు పట్టుబడినట్లు చెప్పియున్నది. ఈ యుద్దండుడెవ్వడో తెలియదు. జీవగ్రాహుడు శ్రీరంగపట్టణాధిపతియగు హొయ్సళేంద్రుడే కాని యన్యుడు గాడు. 'జీవగ్రాహం గృహీత్వా' యను శాసనవాక్యమునకు సరియైన యర్థమును గ్రహింపజాలక కొంగుదేశరాజాక్కళ్ చరిత్రరచయిత యదియొక వ్యక్తియొక్క నామమని తలచి 'జీవగ్రాహు' డని వ్రాసెను. ఒక శ్రీరంగపట్టణమునుమాత్రమే కాక ఉమ్మత్తూరునుగూడ జయించినట్లు ఈ గ్రంథమున మఱియొక సందర్భమున జెప్పియున్నది. 'అట్లా వుండగా మీ తండ్రి నరసింగరాయడు బలంచాత జయించి కప్పం తీస్కునిపోయెను' అని 'త్యాపరాజు' (ఇమ్మడి దేవణ్ణ) నుడివెనట.9

పై నుదాహరింపబడిన శాసనాద్యాధారముల వలన నరసానాయకుని కాలమునగూడ ఉమ్మత్తూరుదొరలు గప్పమీయక తిరుగబడిరనియు, వారిని బలముచే నిర్జించి నరసానాయకుడు కప్పము గొనెననియు దెల్లమగుచున్నది. నరసానాయకునిచే శ్రీరంగపట్టణమున బరాజయమంది జీవగ్రాహుడైన ప్రతిపక్షి పే రెందును జెప్పియుండలేదు; కాని క్రీ. శ. ౧౪౯౨ మొదలు క్రీ. శ. ౧౫౦౦ వఱకును ఇమ్మడిదేవణ్ణఉడయ రుమ్మత్తూరురాజ్యము నేలినట్లు శాసనములవలన దెలియవచ్చుచుండుటచేత నరసానాయకుని కోడి పాదాక్రాంతుడై కప్పమును గట్టినవా డతడే కావలయును.

5. రైస్. పుట ౧౮౯.

6. రైస్. పుట ౧౨౪.

7. ఫర్దర్ సోర్సస్. సం. ౧ పుట ౧౬౦. అథోజ్ఞాపిక.

8. ఫర్దర్ సోర్సస్. సం. ౨. నెం. ౯౩ రు.

9. ఫర్దర్ సోర్సస్ సం. ౨. నెం ౯౭

నరసానాయకుని యనంతరమువీరనరసింహ రాయలు సామ్రాజ్యాధిపత్యము వహించెను. ఇతని యేలుబడియందు క్షుద్రోపద్రవములు ప్రబలి సామంతు లనేకులు గప్ప మీయక తిరుగబడిరి. అదియె తరి యని యెఱిగి యుమ్మత్తూరుప్రభువు ఇమ్మడిదేవణ్ణఉడయరు తన స్వాతంత్ర్యమును బ్రకటించి పెనుగొండదుర్గమును స్వాధీనపఱచుకొనెను.[10] వీరనరసింహరాయల కాలమున జరిగిన యుమ్మత్తూరువృత్తాంతమంతయు కొంగుదేశరాజాక్కళ్ చరిత్రయందు వర్ణింపబడియున్నది

"కర్ణాటకదేశము కొంగ (కొంగు) దేశమును రక్షించు ఉన్మత్తూరు తలైక్కాడు మొదలగు కోటలయందుండు పాళెగాండ్రు కప్పము యిచ్చి పంపక పోయినందున వీరనరసింగరాయలు మిక్కిలియు గోపించి, అనేకసేనలను చేర్చుకొని, యేనుగులు, గుఱ్ఱములు మొదలగు దండు సన్నాహము గావించుకొని, తనకు తమ్ముడై యుండిన కృష్ణరాయలను విజయనగరి పట్టణములోనుంచి, తానును అచ్యుతరాయలు శ్రీరంగరాయలు ఇంకను అనేక రాజకుమారులతోగూడ ఉన్మత్తూరు సమీపమున విడిసి, "మాకు పూర్వము ఇచ్చుచుండిన ద్రవ్యమును ఇచ్చిపంపినయెడల మిమ్ము యిచ్చటనే రాజ్యమును రక్షించుటకు నిశ్చయము జేసివేసి పోయెదము. కప్పము ఇచ్చి పంపకపోయినయెడల మీ కోటలను మేము పెఱికికొని మా మనుష్యులను ఉంచి రాజ్యమును రక్షింతుము" అని చెప్పి మనుష్యులను పంపించినారు.

అప్పుడు ఉన్మత్తూరు (నందుండు) త్యాపక్ రాజా (దేవణ్ణ లేక దేవరాజు) యనువాడు చెప్పి పంపిన వైనము :

"మేము ఈ దేశములో బహుదినముల నుండి రాజ్యమును రక్షించుకొనుచుంటిమి. మా వంశములో నుండినవారుగాని, యీ దేశములలో కొంకణవర్మ రాజులుకాని చాలకాలము రాజ్యమును పరిపాలనము జేసిరి. వారైనను వేఱొక రాజులకు గప్ప మిచ్చి యుండలేదు. అట్లుండగా మీ తండ్రి నరసింగరాయలు బలముచేత జయించి కప్పమును దీసికొనిపోయెను. వ్యవహారపడినయెడల మీకు మేము కప్ప మీయవలసిన న్యాయము లేదు. కావున మేము కప్ప మిచ్చిపంపజాలము "అని చెప్పిపంపెను.

అటుపిమ్మట ఆ సమాచారమును వీరనరసింగరాయలు విని మిక్కిలియు గోపించుకొని, "ఈ పాళెగాండ్రు మనయొక్క రాజ్యములో బట్టాభిషేకము జేసికొనియుండిన హరిహరరాయలు మొదలైనవారికి కప్ప మిచ్చుచుండి, ఇప్పుడు ఇంత వ్యవహారము జేయవలసిన కార్య మేమి యున్నది?" అని యా ఉన్మత్తూరుకోటను ముట్టడించి మూడు మాసముల పర్యంతము యుద్ధము సేయగా ఆ పాళెగాండ్రు బహుబలమును జేర్చుకొని వీరిని కోటసమీపమునకు జేరనీయక కొట్టిరి. అప్పుడు నరసింగరాయలుఆ కోటను సాధింపజాలక దండు ద్రిప్పుకొని శ్రీరంగపట్టణమునకు వచ్చి ముట్టడి వేయగా, పూర్వము పెద్దనరసింగరాయలు జీవగ్రాహునికి పట్టము గట్టియుండిరి. ఆ జీవగ్రాహుని కొడుకు బహుబలముతో శ్రీరంగపట్టణకోటను గట్టిచేసికొని, ఉన్మత్తూరు తలైక్కాడు పాళెగాండ్రకు జెప్పి పంపి యచటినుండి బహుసేనలను బిలిపించుకొని, కోటనువిడిచి బయటికివచ్చి వీరనరసింగరాయల దండుపై బడి యుద్ధముజేసిరి. అప్పుడు వీరనరసింగరాయలు కొంచెమపజయమును బొంది దండు ద్రిప్పుకొని విద్యానగరికివచ్చి కృష్ణరాయలతో నా యున్మత్తూరు శ్రీరంగపట్టణములు మిక్కిలియు బందోబస్తుగనుండుటవలన సేనల నధికముగ జేర్చుకొని యనేకవస్తుసామగ్రులను గొని యా దేశమును సాధింపవలయు నని యోచనచేసి రాజ్యపరిపాలనము జేయుచుండిరి."[11]

ఉమ్మత్తూరు ప్రభువు వీరనరసింహరాయలను బ్రతిఘటించినది నిశ్చయము. ఏలన, కృష్ణరాయలు

10. *Sewell. Forgotten Empire, p.* 126

11. *Further Sources Nos.* 97-(*a*). *of No.* 97.

రాజ్యమునకు వచ్చినవెంటనే యుమ్మత్తూరును జయించి స్వాధీనపఱచుకొనుటకు దండు వెడలవలసి వచ్చెను; కావున ఉమ్మత్తూరుప్రభు వంతకు పూర్వమే, అనగా వీరనరసింహరాయల రాజ్యకాలముననే తిరుగుబాటుచేసి యుండవలయును. కొంగుదేశ రాజాక్కళిక చరిత్రయందు చెప్పిన రీతిగనే వీర నరసింహరాయలు ఉమ్మత్తూరు దేశమును స్వాధీన పఱచుకొని యచట దన యధికారమును మరల నెలకొల్పుటకు బ్రయత్నము సల్పియుండినచో నత డోడిపోయె ననుటకు సంశయపడవలసినది లేదు.

ఇట్లు పరాజితుడై వీరనరసింహరాయలు వెనుదిరిగి పోయినపిమ్మట ఉమ్మత్తూరు ఇమ్మడి దేవ రాజు (త్యాపరాజు) పెనుగొండను స్వాధీనపుచేసి కొనెనని తోచుచున్నది. పెనుగొండ నతడు జయించి నట్లెచ్చటను జెప్పియుండలేదు. కాని, సమకాలిక పోర్చుగీసురాయబారి ఫ్రయ్యర్ లూయి కృష్ణ రాయల రాజ్యారంభ మప్పటికే రాయలను ధిక్క రించిన సామంతుడొక్కడు పెనుగొండను జయించె నని వ్రాసియున్నాడు ఉమ్మత్తూరుప్రభువు 'పెను గొండచక్రేశ్వర' బిరుదాంకితుడగుటచేతను, నతని యధికారము బెంగుళూరు తుంకూరు మండలముల పర్యంతము వ్యాపించియుండినందునను, మఱియు నా ప్రాంతమున రాయలకు మాఱొడ్డియుండిన సామంతు డితడొక్కడే యగుటచేతను పెనుగొం డను బట్టుకొనిన సామంతుడతడే కావలయును.

వీరనరసింహరాయలపై నిమ్మడి దేవరా జెప్పుడు తిరుగబడెనో అతని శిక్షించుటకు రాయ లాతనిపై దండు ఎపుడు వెట్టెనో నిశ్చయించుటకు దగిన సాక్ష్యమింతవఱకు లభ్యపడలేదు; కాని క్రీ. శ. ౧౫౦౭ డిసెంబరు ౧౫ వ తేదీనాటి మైసూరుజిల్లా మళవల్లి తాలూకా ముట్టనహళ్లిగ్రామశిలాశాసన మున 'ఉమ్మత్తూరు దేవణ్ణొడయల కుమారుడైన మల్లరాజను పేరు గల చిక్కరాయలు' శ్రీమన్మ హారాజాధిరాజ రాజపరమేశ్వర భుజబలప్రతాప నర సింహమహారాయల సామంతుడుగ రాష్ట్రపాలన సేయుచుండినట్లు చెప్పియుండుటవలన[12] నుమ్మ త్తూరుప్రభువు తిరుగుబాటును, వీరనరసింహరాయల దండయాత్రయు, ప్రాయశః క్రీ. శ. ౧౫౦౩ వ సంవత్సరముననో యించుక తరువాతనో నడచి యుండవలయును. ఉమ్మత్తూరు ప్రభువు పెనుగొండ దుర్గమును సాధించినది దానికి తరువాతనై యుండ వలయును. ఏలనగా, ఇమ్మడినరసింహ్మరాయలు క్రీ. శ. ౧౫౦౭ వఱకును వీరనరసింహరాయలచే పెనుగొండయందు కారాగారమున బంధింపబడి యుండి యచ్చట నా సంవత్సర మతనిచే వధింప బడెను కావున పెనుగొండ యప్పటివఱకును వీర నరసింహరాయల స్వాధీనముందుండెనని నిశ్చయ ముగ జెప్పవచ్చును. వీరనరసింహరాయల పరా జయమునకు ముందు ఇమ్మడి దేవణ్ణకు పెనుగొండ స్వాధీనపడియుండదు. కావున క్రీ. శ. ౧౫౦౩ వనో, ఇందుకు తరువాతనో దేవణ్ణ పెనుగొండను సాధించియుండవలయును.

అల్పరాష్ట్రాధిపతియైన ఉమ్మత్తూరు దేవరాజు రాయల నింత సులభముగ నెట్లోడింపగలైనో కను గొనవలసియున్నది. వీరనరసింహరాయలు సామ్రా జ్యాధిపత్యమును వహించిన పిమ్మట కొండఱు మండ లాధిపతులును, పలువురు సామంతులును నతనిపై దిరుగుబాటుచేసినట్లు న్యూనిసు వ్రాసియున్నాడు.[13] అట్లు తిరుగుబాటుచేసినవారిలో నిమ్మడి గాచప్ప ఉడయరు ముఖ్యుడు. నరసానాయకుని సేనాధిపతు లలో నితడొక్కడు. ఇతడు ఆదవాని దుర్గాధీశుడగు గాచప్పనాయకుని కుమారుడు. క్రీ. శ. ౧౪౯౩ వ సంవత్సరమున రాయదుర్గచావడికి జెందిన అగళిస్థల మును పాలించుచుండెను[14] అనంతపుర మండలము లోని యురువకొండయందలి శిలాశాసనమువలన క్రీ శ. ౧౫౦౪ న నితడు యాదవగిరి దుర్గమును పాలించుచుండినట్లు తెలియుచున్నది. యాదవగిరి బళ్లారిమండలములోనియాదవనిదుర్గమునకునామాం

12. ఎపి. కర్ణా. సం. ౩. మల. నెం. ౯౪
13. *Forgotten Empire*, p. 314.
14. *ARE.* 719 *of* 1917.

ళరము[15] ఇమ్మడి కాచప్ప బిజాపురసుల్తాను యూసుపు ఆదిల్ ఖానునితో మైత్రి పాటించి యతని బలము నూతకొని వీరనరసింహరాయలను ప్రతి ఘటించెను. ఈ కాచప్ప ఉడయనికి ఉమ్మత్తూరు పాలకులతో సంబంధము గలదని కొందఱ యభిప్రాయము. ఈ యభిప్రాయమును స్థిరపఱుచుటకు సాక్ష్యమెద్దియు లభింపకపోయె ను, అది యసమంజసము గాదు. కాచప్పయధి కారము పెనుగొండ ప్రాంతదేశము వఱకును వ్యాపించియుండెనని పై నుదాహరింపబడిన శాసన సాక్ష్యమువలన విశదమగుచున్నది. ఉమ్మత్తూరుదొరలు పెనుగొండను సాధించినట్లు పోర్చుగీసు రాయబార ప్రయాణికుల ఉత్తరములవలన దెలియుచున్నది. కాచప్పకును, ఉమ్మత్తూరువారికిని వీరనరసింహ రాయలు సామాన్యశత్రువు. మఱియు స్వాతంత్ర్య స్థాపనకై ఏకకాలమున వీరిరువురును రాయలతో పోరుచుండిరి. కావున కాచప్పకు ఉమ్మత్తూరు వారితో మైత్రికలుగుట యసహజము గాదు. దీని నిజానిజము లెట్లుండినను ఉమ్మత్తూరుపై వీరనర సింహరాయ లెత్తిపోయిన కాలముననే యాదవని యసంగు కాచప్ప రాయల యధికారమును ద్రోసి పుచ్చి స్వాతంత్ర్యధ్వజమును లేవనెత్తెను. అతనికి ప్రాపుగ నతని మిత్రుడు బిజాపురప్రభువు యూసుఫు ఆదిల్ ఖాను గొప్పదండుతో రాయరాజ్యముపై నెత్తివచ్చి తుంగభద్రను దాటి కందనవోలుకోట ముట్టడి వేసెను.

వీరనరసింహ రాయల యాజ్ఞమీద అరవీటి బుక్కరాజు రామరాజును, నతని పుత్రుడగు తిమ్మ రాజును కందనవోలుదగ్గరను, ఆదవానికోటను నాదిల్ ఖాను నోడించి తఱుమగొట్టిరి. కాచప్ప నోడించి బందీకృతుని గావించి యాదవాని దుర్గ ముతోగూడ నతని రాయల కొప్పగించెను. అర వీటిరాజుల తామ్రశాసనములవలనను వారు కృతులు గొనిన యాంధ్రగ్రంథముల వలనను దెలియవచ్చు చున్నది.[16] బుక్కరాజు రామరాజును నతని పుత్రు

---

15. *ARE.* 409 *of* 1920. శాసనశాఖవారి ౧౯౨౦ వ సంవత్సరపు వార్షికనివేదికయందు '*Kacha-Rajendra ruling at Devagiri*' అని యున్నది. మఱియు నీ దేవగిరి యాదవవంశనృపాలుర రాజధాని యగు నౌరంగాబాదుజిల్లాలోని దేవగిరియనియు గాచ రాజేంద్రుడా వంశమునకు జెందినవాడనియు శాసన శాఖవా రభిప్రాయపడియున్నారు. (*ARE.* 1921 *Part II para* 12) ఇది పొరబాటు. శాసన ప్రతిబింబమును బరిశీలించిచూడగా నందు 'దవగిరి' యని యున్నది కాని దేవగిరి యని లేదు. మఱియు 'ద'కుముందు శాసనశిల పేడెత్తిపోవుటవలన నొక యక్షరము మాసి పోయియున్నది. అరవీటివంశజుల శాసనములందును పద్యద్విపదబాలభాగవతములందును 'కాచప్ప' ఆద వానిదుర్గపాలకుడని యున్నది. ఆదవనిదుర్గమైకీతున దానికి యాదవగిరి యను నామాంతర ముండినట్లు చెప్పయున్నది. కావున శాసనములోని 'దవగిరి'ని [యా]దవగిరి యని సంపూర్తిచేసితిని. ఇది యంగీ కార్యము గాకపోయినను దేవగిరి యను పాఠమే సరి యైన దనుకొన్నను అప్పుడు అహమదునగిర రాజ్యాంతర్గతమును బిజాపురరాజ్యమునకు జాల యుత్తరమునం దుండిన ప్రాచీనయాదవరాజుల రాజ ధాని యది కాజాలదు. పెనుగొండకు సురగిరి దేవగిరి యను నామాంతరము లుండుట సుప్రసిద్ధము. కావున పెనుగొండయే ఈ దేవగిరి కావచ్చును.

16. అరవీటి రాజుల తామ్రశాసనములందు సామాన్యముగ గానవచ్చు నీ క్రింది శ్లోకము లిచ్చట స్మరింపదగినవి.

౧౧. సహస్రైస్సప్తత్యా సహితమపి యస్సింధురఘటా
సపాదస్యానీకం సమితి భుజశౌర్యేణమహతా,
విజిత్యాదత్తే స్మాదవనిగిరిదుర్గం విభుతయా
విధూతేంద్రః కాచప్పుడయమపి విద్రావ్య సహసా.

౧౨. కందనవోలిదుర్గ మురుకందరదఘ్నదయో
బాహుబలేన యో బహుతరేణ విజిత్యహారేః
సన్నిహితస్య తత్ర చరణాంబుజ భక్తతయా
జ్ఞాతిభి రర్పితం సుధయతిస్మ నిసేవ్య విభుః.
(ఎపి. ఇండి. సం. ౧౬ పుట [illegible])

మఱియు కోనేరునాథుని బాలభాగవతమునందు నీ విషయములు వర్ణింపబడియున్నవి.

"ఎందు నెన్నంగ జాలు నిద్ధశౌర్యమున
గందనవోలి దుర్గంబులో నుండి
బుక్కయరామభూభుజు డెల్లనృపుల
నెక్కుడ యిది యని యెన్నంగజాలి

నుండినది. కావున ఉమ్మత్తూరుప్రభువులను జిదుగ గొట్టి వారి స్వాధీనమందుండిన దుర్గములను, రాష్ట్రమును మరల రాయసామ్రాజ్యమున జేర్చుకొనుట కృష్ణరాయలకు ప్రథమకర్తవ్యమాయెను బిజాపురసుల్తాను దఱిమివేసిన వెనుక రాయలు తనపై మరల నెత్తి రాగలడని యుమ్మత్తూరిదేవరా జెలుగును. కావున నతడు రాయసైన్యము లెప్పుడు వచ్చినను దగురీతిని ప్రతిఘటించుటకు వలసిన ప్రయత్నములు సేయగడగెను. ఈ ప్రయత్నములు కొంగుదేశరాజాక్కళ్ చరిత్రయం దిట్లు వర్ణింపబడి యున్నది :

“ అప్పుడు కర్ణాటకదేశపు రాజులలో నుమ్మత్తూరు రాజులు శివసముద్రమును కైవసము చేసికొని ఆ కోట రెండుప్రక్కలను కావేరి ప్రవహించుచుండుటవలన ఆ కోటను ఒక్కగా కట్టి అనేక ఫిరంగులు మొదలగు నాయుధములవల్లను బలపఱచి ఆ త్యాపరాజు (దేవరాజు) స్వర్గమును పొందినవాడాయెను అంతట వానికుమారుడు గంగరాయుడు అచట రాజ్యమును రక్షించుకొనుచు ఆ కోటను పెక్కు ఆయుధములవల్లను అనేకజనులవల్లను బహుభద్రము జేసికొని యుండెను.[17]

కృష్ణదేవరాయలు మొట్టమొదట ఉమ్మత్తూరు మొదలుగ సర్వకర్ణాటకరాజ్యమును సాధింప నిశ్చయించుకొనెను.[18] వీరనరసింహరాయల పరాభవమొకప్రక్కను, అంతశ్శత్రువర్గమును నిర్మూలము గావించి రాజ్యమును నిష్కంటకము గావింపవలయునను ఇచ్ఛ యొకప్రక్కను ప్రేరేపింప కృష్ణరాయలుమ్మత్తూరిపై దండయాత్ర వెడలెను.[19] ఉమ్మత్తూరు దండయాత్ర వృత్తాంతము పెక్కుగ్రంథములందు వర్ణింపబడియున్నది. ముక్కు తిమ్మన్నగారు—

‘ఉమ్మత్తూరు శివన్ సముద్ర పురవ
ప్రోన్మూలనాడంబరా’[20]

అని యొక్కమాటతో దండయాత్రపర్యవసానమును సూచించినారు. అట్లే సంగీతసూర్యోదయ కర్త బండారు లక్ష్మీనారాయణ ముక్కుతిమ్మన్నగారి భాగములో సగము నొక శ్లోకమున నిమిడ్చినాడు.

“ బాల్యేఽసౌ సకలకలాకలాప్రయుక్తం
స్వప్రాణం సపది విజితం గంగరాజం.

---

17. *Further Sources, I, No.* 123.

18. కొంగుదేశరాజాక్కళ్ చరిత్రలో కృష్ణదేవరాయలు ఉమ్మత్తూరు దండయాత్రకు ముందు ద్రావిడదేశమును జయించినట్లు చెప్పియున్నది.

"అటుపిమ్మట విజయనగరికోటను జక్కగ కట్టి, పెనుగొండ చంద్రగిరి ఇవి మొదలగు కోటలు గట్టించి చాలమందిని చేర్చుకొని యనేక గజాశ్వములు మున్నగు వానిని గూర్చుకొని రాజ్యములను గట్టుకొనవలయునని ద్రావిడదేశమునకు బోయి యచట కాంచి చెంజి వేలూరు కోటలను కైవసము జేసికొని వేలూరుకోటను బహుభద్రముగ గట్టి దానియందు తమ మనుష్యులను, రాజకుమారులను గాపుంచి రాజ్యమును ధర్మనీతిని రక్షించుకొనుచుండిరి." (*Further Sources*, I. *No.* 113.)

దీని నాధారపఱచుకొని కీ. శే. డాక్టరు యస్. కృష్ణస్వామిఅయ్యంగారు "*A Yet-remembered Ruler of a Long-forgotten Empire*" (*pp.* 7-9) అను గ్రంథమున నుమ్మత్తూరురాజ్యమే కళింగ దిగ్విజయానంతరము న్యూనిజుచరిత్రబడి కృష్ణదేవరాయలు జయించిన కాటూరురాజ్య మని వాదించి యచట నతడు సాధించిన నదీశాఖలమధ్యపట్టణమే శివన్ సముద్ర మని చెప్పి, గంగరాజురాష్ట్రము చోళమండలాంతర్గతమని నిర్ధారించినారు. మఱియు న్యూనిజు పేర్కొన్న కాటూరుదేశమే కాడవరాయదేశ మని సాధించి దానిని కృష్ణరాయలు జయించెనని రుజువు సేయుటకు కొంగుదేశరాజాక్కళ్ చరిత్రయందలి పై వాక్యముల నుదాహరించిరి.

కాని కృష్ణస్వామయ్యంగారు వాదించునట్లు ఉమ్మత్తూరు చోళమండలాంతర్గతము గాదు; మఱియు కాటూరురాజ్యమును, ఉమ్మత్తూరు రాజ్యమును నొక్కటి కావు. కృష్ణరాయల కాలమునకు కాడవుల పేరు సంపూర్ణముగా మాసిపోయినది. కావున కృష్ణరాయలు ద్రావిడదేశమును జయించె నని రుజువుసేయగల విశ్వాసపాత్రమైన సాక్ష్యము గానరాదు.

19. *Forgotten Empire p.* 126

20. పారి. ౧: ౧౦౪.

భంక్త్వా తచ్ఛివనసముద్ర ముత్కటం ద్రా
గావాసం వ్యతనుత నిర్భరం శివానాం.''[21]

రాయవాచకమున నింకంతె విపులముగ,—

''గుర్రం యెక్కుకొని పయనం గతుల కదలి వుమ్మత్తూరు శివసముద్రానకు వచ్చి గంగారావు వూడెమునుంచి కార్యము సేసి వుదరదోలి ఆ స్థలాలు పక్కనాటనె సాధించి అక్కడ వూడిగాలవార్లను వుంచి అందునుండ్డి శ్రీరంగపట్ణం కోట కైచేనికోట కొత్తళములు జూచి మీద ఆది రంగనాయకుల సేవించి'' అని వర్ణింపబడి యున్నది.[22]

కృష్ణరాయ విజయమున ''ఒక్క పొలుపు మెత్తున నుమ్మత్తూరు శివసముద్రస్థలంబుల నెసంగు గంగరాజునొడయల నోడించి తదీయస్థలంబుల తాకొంబులు బలియించి శ్రీరంగపట్టణంబు నిరీక్షించి'' అని రాయవాచకములోని విషయములనే సంగ్రహించి చెప్పియున్నది.[23]

కాని కొంగుదేశరాజాక్కళిక చరిత్రయం దొక్కదానియందు మాత్రమే యీ దండయాత్ర విపులముగ వర్ణింపబడినది :

''అటుతరువాత రాయ కృష్ణరాయలు కర్ణాటక దేశపు పాళెగాండ్రు రాజులతోడ యుద్ధము చేసి జయించి ఆ దేశమును గట్టుకొనవలయునని, ముందు తనయొక్క అన్నగారగు వీరనరసింగ రాయలు జయము లేక వచ్చియుండుటచేతను, వారు కప్పమీయక యుండుటచేతను వారిపై మిక్కిలి కోపమును బొంది, ఏనుగు, గుఱ్ఱము, పదాతి (సైన్యముల తోడను) ఫిరంగి మున్నగు నాయుధములతోడను గొందరు పాళెగాండ్రతోడను గూడి బయలువెడలి కర్ణాటక దేశమున కావేరీతీరమున పశ్చిమరంగమునకు తూర్పున శివసముద్రకోటను ముట్టడివేసి వానికి (గంగరాజునకు) శత్రువుగా నుండిన చిక్కరాయని చేర్చుకొని యింకను సన్న పాళెగాండ్రతో గూడ ప్రేత పర్వతము, గౌరియనె కొండ యను స్థలముల యందు దండు దిగి యొక సంవత్సరము గడచిన వెనుక ఒత్తిన కడప కావేరి మార్గమున కోటను లగ్గలు పట్టినంతట ఆ గంగరాయడు గంగనఋచ్చి యనెడు కావేరిమడుగులో బడిపోయెను

''తరువాత కృష్ణరాయలు ఆ కోటను స్వాధీనము చేసికొని దానియందు తమ మనుష్యుల నుంచి శ్రీరంగపట్టణమునకు వచ్చి యాపట్టణము గూడ జయము చేసికొని శ్రీరంగపట్టణములో కంప గవుడు వీరప్పగవుడుల వశమున గొంత దేశమును విడిచి చిక్కరాయని వశమున మఱికొంత దేశమును విడిచి యచట నచట నుండు పాళెపట్టుల నన్నిటి జయించి యచటనచట (పాలించుటకు తన) మనుష్యులను నియమించి కర్ణాటక దేశము కోటగ్రివ్వ మని కట్టుబడిచేసి తమ దస్త్రములో లెక్క దాఖలు చేసికొని కర్ణాటదేశమునకు ముఖ్యపట్టణమగు శ్రీరంగపట్టణము గట్టి చేసికొని యందుండి శకవర్షము ౧౪౩౪ ప్రభవసన్నము...''[24]

గ్రంథాధారమువల్ల కృష్ణరాయల యుమ్మత్తూరు దండయాత్రనుగూర్చి తెలియవచ్చు విషయమంతయు నింతియే. ఇందు విశ్వాసపాత్రములుగాని యంశములెవ్వియు గానరాకపోయినను, గొన్ని యెడల విమర్శ కెడ మున్నది. మొట్టమొదట దండయాత్ర నడచినదెప్పుడో నిశ్చయింపవలసి యున్నది. పోర్చుగీసు గవర్నరు అల్బూకెర్కు క్రీ. శ. ౧౫౧౦ సెప్టెంబరు మాసమున గోవాకర పట్టణమును బిజాపుర ప్రభువు నోడించి గైకొనెను. ఆ విజయవార్త విజయనగరమునకు వచ్చినంతటనే కృష్ణరాయలు పోర్చుగీసుగవర్నరునకు తన సానుభూతిని తెలియజేయుచు రాయబారులను గోవా కంపెను. వారిచే విజయనగరమందుండిన పోర్చుగీసు రాయబారి ఫ్రయర్ లూయి యాల్బూకెర్కున కంపిన లేఖలో కృష్ణరాయలు గనకెదురు తిరిగి పెనుగొండను స్వాధీనపఱచుకొనిన సామంతునిమీది కంపుట కేడువేల మందిగల యొక చిన్న దండును సిద్ధముసేయుచుండెనని వ్రాసెను. విజయవార్త

21. *Further Sources, I, No.* 116 - (*a*) *v*. 4.
22. రాయ. పుట ౮౪.
23. కృష్ణ. ౩: ౬.
24. *Further Sources I. No.* 113.

విజయనగరము విడుటకును, అచటినుండి రాయబారులు గోవాకు బయలుదేరుటకును నొక్క మాసము పట్టియుండునని యనుకొనిన క్రీ. శ. ౧౫౧౦ చివఱకు నుమ్మత్తూరు దండయాత్ర బయలు వెడలలేదని చెప్పవచ్చును కొంగుదేశ రాజాక్కళ్‌ చరిత్రయందు శా. శ. ౧౪౩౪ ప్రభవవర్ష మప్పటికే ఉమ్మత్తూరు మొదలుగాగల సకలదక్షిణకర్ణాటకదేశమును కృష్ణరాయలు జయించి స్వాధీనపఱచుకొనె నని చెప్పియున్నది. కాని ఇచట శకాబ్దమును ప్రభవాబ్దమును సరిపోవు. శా. శ. ౧౪౩౪ నకు సరియైన ప్రభవాది వర్షము ప్రభవకాదు; అంగిరస. ఆవర్షము వఱకును వీరనరసింహరాయలు రాజ్య మొనర్చుచుండెను. శా. శ ౧౪౩౧ శుక్ల శ్రావణమునందు కాని కృష్ణరాయల రాజ్యాభిషేకము గాలేదు కావున శా. శ. ౧౪౩౪ సరియైన వర్షము ప్రభవ యగుట తప్పు. ప్రభవ సంవత్సరమున నింకను వీరనరసింహరాయలు రాజ్యము సేయుచుండెను. ఇక శా. శ. వర్షమే సరియైనదని తలచితిమేని క్రీ. శ. ౧౫౧౨–౧౩ నకు ఉమ్మత్తూరు దండయాత్ర సంపూర్ణమాయెనని యొప్పుకొనవలసియున్నది. క్రీ. శ. ౧౫౧౨ వ సంవత్సరము ఆగస్టుమాసమున కృష్ణరాయలింకను శివన్ సముద్రమందే యుండెనని అనంతపురమండలము లోని బుక్కపట్టణగ్రామమునందు నొక శిలాశాసనమున జెప్పియుండుటవలన[25] కొంగుదేశ రాజాక్కళ్‌ చరిత్రయందు సమూదు చేయబడిన శకాబ్దము సరియని యొప్పుకొనవచ్చును.

మఱియు రాయవాచకమున జెప్పినట్లు కృష్ణరాయలు ఉమ్మత్తూరు శివసముద్రములను 'ఒక్కనాటనె సాధింప' లేదు. క్రీ. శ. ౧౫౧౧ వ సంవత్సరమున విజయనగరమునుండి బయలువెడలిన రాయలు క్రీ. శ. ౧౫౧౨ ఆగస్టున నింకను శివసముద్రము ముందుండుట చూడగా నొక శివసముద్రముముట్టడియె యొక సంవత్సరమునకంటె నధికకాలము పొగెను కొంగుదేశరాజాక్కళ్‌ చరిత్రవాక్యమెక్కుడు విశ్వాసపాత్ర మని తోచెడిని. లభ్యమైన యాధారము లన్నిటిని చక్కగ పరిశీలించి చూడ నుమ్మత్తూరు దండయాత్ర దాదాపు రెండు సంవత్సరములకాలము నడచినట్లున్నది

సేనాసంఖ్యానిరూపణ:—ప్రయ్యారు లూయి అల్బూకెర్క్యునకు వ్రాసిన యుత్తరమందు కృష్ణరాయ లేడువేల మందితో చిన్నదండును పెనుగొండను సాధించుటకు సిద్ధము పఱచియున్నాడని వ్రాసెను[26]; ఉమ్మత్తూరు శివసముద్రము మొదలగు బలిష్ఠములైన దుర్గములను సాధించుటకీ దండు చాలదు. న్యూనిజు చరిత్రమున కృష్ణరాయలు రాజ్యాభిషేకమైన పదివాను ఒకటిన్నర సంవత్సరముపఱకు రాజధానియందే నివసించుచు రాజ్యపాలనా విధానమును గఱచుచుండెననియు, నా కాలమందు ౩౪౦౦౦ కాల్బలమును, ఎనిమిదివందల యేనుగులుగల బలమును సమకూర్చెననియు వ్రాసియున్నాడు [27] రాయవాచకమునందు గూడ రాజ్యాభిషేకమైనతరువాత కృష్ణరాయలు కొంతకాలము రాజధానియందే యుండి యుద్ధ ప్రయత్నములు చేయుచుండెనని చెప్పియున్నది కాని యుమ్మత్తూరుపై రాయలు దాడి వెడలినప్పుడు వెంట నడచిన దళములు న్యూనిజు చెప్పిన సంఖ్యకంటె బాల పెద్దదని తెలుపుచున్నది. అనతోగూడ యుద్ధమునకు నడచుటకు రాయలు పిలిపించిన అమర నాయకుల దళములలో ౨౪౦౦౦ గుఱ్ఱములును, ౧౨౦౦ ఏనుగులును, ౨౦౦,౦౦౦ కాల్బలమును, అమరనాయకు లీయవలసిన కప్పమునకు బదులు రాయలకు స్వాధీనము చేసిన దండులో ౧౨౦౦౦ గుఱ్ఱములును, ౫౦౦ ఏనుగులును, ౧౦౦,౦౦౦ పదాతులును నుండెననియు, నివిగాక రాయలకైతీల బలగమును పాలెపట్టు ఫౌజులును యుద్ధమునకు వచ్చెననియు వ్రాసియున్నది.[28] న్యూనిజు ఉమ్మత్తూరు దండయాత్రను పేర్కొనలేదు. కాని రాయవాచకమునందీ ప్రచండ సైన్యముతో గూడనే రాయ లుమ్మత్తూరుపై నెత్తిపోయెనని

25. *ARE* 180 *of* 1913.
26. *Forgotten Empire p.* 126.
27. *Forgotten Empire p.* 316.
28. రాయ. పు ౩౪ తరువాయి. *Further Sources II, No.* 138.

యున్నది. ఫ్రయ్యేరు లూయి యుమ్మత్తూరు దండ యాత్రయప్పుడు విజయనగరమున నివసించుచుండిన వాడు. న్యూనిజు కృష్ణరాయల యేలుబడియందు పలుమారు విజయనగరమునకు వచ్చుచు బోవు చుండినవాడు. ఇరువురును కృష్ణరాయల సమకాలి కులు కావున వారు వ్రాసిన వ్రాతలను త్రోసి పుచ్చరాదు. కాని వారు చెప్పిన వృత్తాంతము సమగ్రము గాదు. ఫ్రయ్యేరు లూయి పేర్కొనిన యేబదివేల సేన పెనుగొండ దుర్గమును సాధించు టకుగూడ చాలదు. కాల్బలమును ఏనుగులను లెక్క పెట్టిన న్యూనిజు అశ్వబలము మాట నెత్తలేదు. ఉమ్మత్తూరును జయించిన సైన్యమే బహమనీరాజ్య ముపై జైత్రయాత్రను సాగించియుండుటవలన ఫ్రయ్యేరు లూయి న్యూనిజుల సైన్యపరిగణనకంటె రాయవాచకపు గణుతియే వాస్తవమునకు చేరు వగియున్నట్లు తోచుచున్నది.

ఇంతటి ప్రబల సైన్యమును వెంటబెట్టుకొని యుద్ధమునకు బయలువెడలినను విజయలక్ష్మికై రాయలు కేవలము తన పరాక్రమమునుమీదనే యాధారపడి యుండలేదు. నయశాస్త్రముననుసరించి తనకుతోడు మొదట శత్రువులను భేదోపాయము వలన వేర్పరచి వారి బలమును తగ్గించుట యుక్తి యని తలచి గంగరాజునకు జ్ఞాతియైన చిక్కరాయని చేరదీసి రాజ్యమిచ్చెదనని యాసచూపి తనయందును చేర్చుకొనెను. విభీషణుడు శ్రీరామునికివలె చిక్క రాయలు కృష్ణరాయల కుమ్మత్తూరు రాజ్యమును సాధించుటయందు తోడ్పడెను.

దండయాత్రయందలి విశేషాంశములు: ప్రథ మమున పేర్కొనదగినది పెనుగొండ విజయము. పైనుదాహరింపబడిన యాధారగ్రంథములయందు గాని, మఱియెచటగాని కృష్ణరాయలు పెనుగొం డను జయించినట్లు చెప్పియుండలేదు. కాని ఫ్రయ్యేరు లూయి యాకోట క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరాంతమునందు శత్రువుల స్వాధీనమందుండి నట్లు వ్రాసియున్నాడు. మఱియు పైనుదాహరింప బడిన బుక్కపట్టణ శిలాశాసనములవలన క్రీ. శ. ౧౫౧౨ వ సంవత్సరమున పెనుగొండ మరల రాయల యధికారము క్రిందికి వచ్చినట్లు తెలియుచున్నది. మఱియు నప్పుడింకను కృష్ణరాయలు శివసముద్ర మును ముట్టడించియే యుండుటవలన నుమ్మత్తూరు దండయాత్రయొక్క ప్రారంభదశయందే పెను గొండ నాతడు సాధించియుండవలయును.

రెండవది యుమ్మత్తూరు: ఇది యుమ్మత్తూరు రాజ్యమునకు రాజధాని; ఆ రాజ్యములోని ప్రధాన దుర్గములయందొక్కటి. రాయలవారు సాధించిన దుర్గములలో నది యొక్కటి యని రాయవాచక మునందున్నది. ఉమ్మత్తూరుపురవప్రములను నిర్మూ లించెనని ముక్కుతిమ్మనగారి పారిజాతము ఒక్కా ణించున్నాడు. కావున కృష్ణరాయలవారీ కోటను సాధించుటతో తృప్తినందక యా కోటగోడలను నేలమట్టమునకు ఉపరము గావించినట్లున్నది.

ఉమ్మత్తూరు తరువాత శివసముద్రము. ఇది యుమ్మత్తూరురాజ్యమునందలి బలవత్తమదుర్గము. కావేరి రెండుపాయల మధ్యనుండు ద్వీపముపై నిర్మింపబడుటచే నది శత్రులకు దుస్సాధ్యము; వర్షాకాలమునందు దుర్గమము. మఱియు నీ కోట కిరుప్రక్కల శ్వేతగిరి, గౌరీసమలై యను కొండలు రెండు పెట్టని గోడలై సంరక్షించుచుండినవి. తక్కిన వైపుల కావేరి వాహిని యగాధోదకము గలదై ప్రవహించుచుండినది. ప్రకృతిచే నిట్లు కోట సంరక్షింపబడుచుండినను తృప్తినందక యుమ్మ త్తూరు ప్రభువులు దానిని బలిష్ఠమైన గోడలచే మఱియు దృఢమగు ఫిరంగులు మొదలగు నధు నాతన ఆయుధసమితిచే సురక్షితముగ చేసికొని యుండిరి. కావున కృష్ణదేవరాయలకీ దుర్గమును బట్టుకొనుటకు చాలకాలము పట్టినది. శ్వేతపర్వత గౌరీసమలైలమీద గల ముఖ్యస్కంధావారమును స్థాపించి కావేరి వైపు బలములను గాపుంచి కోట లోని వారిని వెలుపలికిని, వెలుపలివారిని కోట లోనికిని బోనీయక నరికట్టెను. గంగరాజొక సంవ త్సరమున కధికముగ రాయరాజునకు బోటు చూపి యటుపిమ్మట నిలువజాలక కోటనుండి పారి పోవుచు గంగయందు మునుగుపడి మృతుడాయెను. అంతట విజయనగర సైనికులు కోటను లగ్గపట్టి స్వాధీనము చేసికొనిరి. ఉమ్మత్తూరు కోటనువోలె శివసముద్రదుర్గము యొక్క వప్రములను రాయలు

విరుగ ద్రోయించెనని ముక్కు తిమ్మనగారును, నక్కల కునికిపట్టుగ జేసెనని భండారు లక్ష్మీనారాయణుడును వ్రాసియున్నారు.

శివసముద్రనిర్మూలముతో కర్ణాటక విద్వేషుల వెన్నెముక విరిగినది. కాని వారి యుపద్రవము సంపూర్ణముగ దొలగిపోలేదు. శ్రీరంగపట్టణ మింకను శత్రులచేతనేయుండెనది. పెక్కు పాళెగాండ్రు ద్రోహమార్గమును విడనాడలేదు. వారిని జిదుగ బొడిచినగాని రాష్ట్రము సంపూర్ణముగ స్వాధీనము గాదు. కావున కృష్ణరాయలు శివసముద్రమునుండి దండు దరలుచుకొని శ్రీరంగపట్టణముపై నడచి యా కోటను ముట్టడించెను. కోట బలిష్ఠమైనదే. శివసముద్రమువలె నదియు గావేరిమధ్యద్వీపముపై నుండినది. కాని యీ ముట్టడినిగూర్చి విశేషాంశము లెవ్వియు దెలియవు. కోట రాయలకు కైవశమాయెను. శ్రీరంగపట్టణము వశపడిన పిమ్మట కృష్ణరాయలా పరిసరప్రాంతములందుండిన చిల్లరపాళెగాండ్రను జయించి వారి పాళెపట్టు సీమలనన్నిటిని స్వాధీనము జేసికొనెను.

కృష్ణరాయలిట్లు దక్షిణకర్ణాటకమునందలి క్షుద్ర శత్రువుల నందఱిని సమూలముగ బెకలించివైచి తన యధికారమును స్థిరముగ నెలకొల్పుటకొఱకు దేశపాలనవిధానమున గొన్ని మార్పులను గావించెను. ఈ మార్పులలో ముఖ్యమైనది ప్రధాననగరనిర్ధారణ. సంగమ వంశజులకాలము నుండియు హొయ్సలదేశమునకు ముందటివలెనే ద్వారసముద్రమే ప్రధాననగరమైయుండినది. క్రమక్రమముగ దాని ప్రాముఖ్యము సన్నగిలినది. కేంద్రప్రభుత్వపు టధికారము క్షీణించుకొలది సామంతులు బలిసి యణుపరాని కడువైరి. సాళువచక్రవర్తులకాలములో గర్ణాటక సామంతుల యెడాపుడి హెచ్చె. సమయము చిక్కినప్పుడెల్ల కేంద్రప్రభుత్వమున కెదురుతిరుగుచు వచ్చిరి. రాను రాను కర్ణాటకమున కేంద్రప్రభుత్వమునకు ముఖ్యస్థానమైన ద్వారసముద్రము వెనుకబడిపోయినది. కావున కృష్ణరాయలు మారుమూలనుండిన ద్వారసముద్రమును వదలి విప్లవకారుల కునికిపట్టగు కావేరీతటదేశమున రాయపట్టైన శ్రీరంగపట్టణమును కేంద్రాధికారవర్గమునకు ముఖ్యస్థానమును గావించెను. మఱియు గర్ణాటకమున దాను జయించిన రాష్ట్రములో నొక భాగమునకు కెంపగవుడు, వీరప్పగౌడు లనువారిని పాలకులుగ నియమించెను. ఇంక కొంత దేశము నుమ్మత్తూరు దండయాత్రయందు తనకు సహాయుడును, గంగరాజునకు జ్ఞాతియు నగు చిక్కరాయల కొసగెను. శత్రువుల కడగొన్న పాళెపట్టు లన్నిటిని విశ్వాసపాత్రులగు దన యాశ్రితుల కిచ్చెను. వీరి యందనేకులు కర్ణాటకులు గారు. పూర్వదేశమునుండి వచ్చిన తెనుగువారు. మఱియు గర్ణాటకదేశమునుండి రాయభండారమునకు జెందవలసిన కప్పము కోటిద్రవ్యమని నిశ్చయించి సగిరియర్థము చిత్తాలలో దాఖలు చేయించి యచటినుండి తరలిపోయెను.

కృష్ణరాయ లొనర్చిన మార్పులవలన కర్ణాటకమున శాంతి నెలకొనెను ; మఱి నూఱేండ్లదాక స్థిరమై నిర్వక్రముగ సాగినది. అచ్యుతరాయల రాజ్యారంభ కాలమున నుమ్మత్తూరు దొరలు మరల తలయెత్తిరి. కాని వారి యాటలు సాగలేదు. శ్రీరంగపట్టణదుర్గాధ్యక్షులు స్వామిభక్తి పరాయణులై దేశమునకే విపత్తు రానీయక గాపాడుచు వచ్చిరి. కృష్ణరాయలచే గర్ణాటకమున స్థాపింపబడిన తెనుగునాయకులును, పాళెగాండ్రును గర్ణాటక సామంతులను, రాజవిద్వేషులను సణగద్రొక్కి రాయల యధికారము నిలబెట్టుటయందప్రమత్తులై యుండిరి.

## ౫. కృష్ణరాయలు—మహమ్మదీయులు

"వీరాగ్రేసరకృష్ణరాయ భవతా
కృత్వా రణప్రాఙ్గణే
ప్రౌఢాః కేచన పారసీకపతయః
ప్రాప్తాః పురీ మామరీం,
పీరుత్తేతి గురౌ బలద్విషి సుర
త్రాణేతి శచ్యామ్ పున
ర్బిబ్బీతి ప్రణతా సలామితి సురాః
స్మేరాననాః కుర్వతే"

### ౧ బహామనీ సుల్తాను

క్రీ. శ. ౧౫౧౦ జనవరి ౨౮ తేదినాటి కృష్ణరాయల హంపిశాసనమున రాయల ప్రతాపాతిశయమును వర్ణించుచు శాసన గ్రంథకర్త యతనిచే సురత్రాణుడొకడు పరిభవింపబడె నని వ్రాసియున్నాడు.[1] రాయలచే నట్లు పరాభూతుడైన సుల్తా నెవ్వడో శాసన గ్రంథమువలన విదితమగుట లేదు. కాని యతడు బహామనీసుల్తాను ఇమ్మడి మహమూదుశాహ యని దృఢముగ జెప్పవచ్చును. ఏలన, (౧) కృష్ణరాయల రాజ్యాభిషేక కాలమునను, దరువాత కొంతకాలమువఱకును బహామనీ రాజ్యమును బాలించుచుండిన ప్రభువు ఇమ్మడి మహమూదుశాహు. ఇతడు ముహమ్మదుశాహులష్కరీ యను నామాంతరము గల ఇమ్మడిముహమ్మదు శాహుబహామనీయొక్క కుమారుడు. తన తండ్రి మరణానంతరము క్రీ. శ. ౧౪౮౨వ సంవత్సరమున రాజ్యాధిపత్యము వహించి క్రీ. శ. ౧౫౧౮ వ సంవత్సరమువఱకు ముప్పదియారేండ్లు ప్రజాపాలన మొనర్చెను. కాని పేరునకుమాత్రమే ఇతడుసుల్తాను. ముహమ్మదుశాహు లష్కరీ గతించినవెనుక బహామనీ సుల్తానుల అధికారము సన్నగిల్లినది. రాజ్యమునందలి అమీరులు తిరుగబడి యెవ్వరి జాగీరులందు వారు స్వతంత్రులైరి. వీరియందు ముఖ్యులు నలుగురు: అహమదనగరనిజామనమలుక, గోలకొండ కుతుపనమలక, విజాపురఏదులఖాను, గావిల్ ఘడ ఇమాదనమలక. వీరితోగూడ బెడదకోట బరీదనముల్కను జేర్చుట యుక్తము. బరీదు తక్కినవారి వలె అధికారమును దనపేర జరుపుకొనజాలక సర్వ వ్యవహారములను సుల్తాను పేరనే సాగించవలసియుండెడిది. ఇది యతని హృదయమున గంటకప్రాయమై బాధించుచుండెను. కావున సుల్తానును దొలగించి తానే యతని స్థానము నాక్రమించుకొనవలెనని యతడు ప్రయత్న మెడతెగక సల్పుచుండువాడు; కాని యతని కడక సులభముగ నెఱవేరదాయెను. బహామనీసామంతు లందఱును ఎవ్వరికి వారే స్వతంత్రులైనను, వారిలో నొండొరులకు పోటు తప్పినది కాదు. స్వాతిశయస్థాపనకొఱకు నిరంతరము యుద్ధము సేయుచుండుటవలన నామకార్థ మందఱును సుల్తానునాధిపత్యము నంగీకరించి యెవ్వరికి లాభకరమని తోచినప్పుడు వారతని సముఖమునకు బోయి యతని యాజ్ఞకు బద్ధులైనట్లు కపటనాటక మాడుచుండువారు. అందువలన అప్పటికింకను వారెవ్వరును 'సుల్తా'నను రాజబిరుదమును ధరించలేదు. మఱియు గృష్ణరాయలేమి, సమకాలిక పోర్చుగీసులేమి బహామనీసామంతుల ప్రస్తావము వచ్చినపుడు వారిని 'సుల్తాను' లని యనక ఖానములు కాదిబిరుదులతోడనే పేర్కొనెడివారు. కావున హంపిశాసనములో గృష్ణరాయలచే బరాభూతుడైనట్లు చెప్పబడిన సుల్తాను బహామనీసుల్తానగు నిమ్మడిమహమూదుశాహే కావలయును.

(౨) ఈ యభిప్రాయమును స్థిరపఱచగల సమకాలిక పోర్చుగీసుసాక్ష్యము గొంత కలదు. క్రీ. శ. ౧౫౧౦ జనవరిమాసమున పోర్చుగీసు గవర్నరు అఫ్ఫాంసో అల్బూకెర్కు కృష్ణరాయల కడకు ఫ్రయ్యారు లూయి యనునతని రాయబారమంపుచు, దనతోగూడి కల్లికోటమీద యుద్ధము సేయ నొడంబడిన పక్షమున, 'దక్కనురాజు' (అనగా బహామనీ సుల్తాను)తో రాయలపుడు జేయు

1. *EP. Ind. I. p.* 363 'పరిభూతసురత్రాణేన' అని.

చుండిన యుద్ధమున దాను దోడ్పడెద నని చెప్పి
పంపెను. ఇందువలన క్రీ. శ. ౧౫౧౦ జనవరిమాస
మున, నన గా గృష్ణరాయల రాజ్యాభిషేకమైన
పిమ్మట నైదాఱు నెలలలో నాతడు బహమనీ
సుల్తానుతో యుద్ధము సేయుచుండెనని తెల్లమగు
చున్నది.[2] హంపిశాసనకాల మప్పటికి యుద్ధ మిం
కను ముగియకపోయినను రాయలకు జయము
చేకూడెను.[3]

## ౨. యూసుపు ఆదిల్ ఖాను

కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో దా
నుత్తరదిక్కున కేకధాటి జనినపుడు ఏదులఖానుని
జంపినట్లు చెప్పియున్నాడు.

"అలుకన్ ఘోటకధట్టికాఖుర
పుటీహల్యన్ ఖురాసానిపు
చ్చలువో దున్ని చలచ్చమూ
గజమదాసారప్లుతి న్గీర్తిపు
ష్కలసస్యం బిడి యేకధాటి
బళిరా! కట్టించి తౌ దృష్టి కే
దులఖానోగ్రకపాలమర్దపహారి
ద్భూజాంగలశ్రేణికిన్" [4]

ఈ పద్యమువలన మూడువిషయములు
దెలియవచ్చుచున్నవి :—

(౧) కృష్ణరాయ లుత్తరదిశపై నేకధాటి
వెడలెను. 'ఏకధాటి' యనగా నఖండితమైన దండ
యాత్ర, లేక అడ్డమాకలేక నిరంతరాయముగ నడ
చిన దండయాత్రయని యర్థము. అనగా గృష్ణ
రాయల కీదండయాత్రయందు శత్రునిరోధ
మెచ్చటను గలుగలేదు. (౨) అవిచ్ఛిన్నమైన ఈ
ధాటియందు రాయలకు ఖురాసానుదేశజులైన
తురకలతో యుద్ధము గలిగినది. కృష్ణరాయలు
విజయుడాయెను. (౩) యుద్ధమున గృష్ణరాయ
లేదులఖానుని వధించెను.

ఈ దండయాత్ర యెప్పుడు నడచెనో అందు
రాయలచే వధింపబడిన యేదులఖా నెవ్వడో కను
గొనవలసి యున్నది. మొదటి ప్రశ్నకు సమాధా
నము రెండవదానిపై నాధారపడి యుండుటవలన
నాద్యమున రెండవప్రశ్నకు సమాధానమును వెద
కుట యుక్తము.

'ఏదులఖా' ననునది బిరుదు. ఇది 'ఆదిల్ ఖాన్'
అను పారసీమాట కాంధ్రరూపము కృష్ణదేవ
రాయల కాలమున మనకు దెలిసినంతవఱకు ఆదిల్
ఖాను నామధారులు తురకప్రభువులు ముగ్గు
రుండిరి. వీరియందు ప్రథమగణ్యుడు యూసుపు
ఆదిల్ ఖానుడు. ఇతనికి 'సవాయీ' యను సుప్రసిద్ధ
నామాంతరము గలదు. దీనినుండియే తెనుగు
'సవా', 'సపాద' శబ్దములును, పోర్చుగీసు
'సబైయో' 'సబైయసు' శబ్దములును ఏర్పడినవి.
ఇతడు బహమనీసుల్తాను ఇమ్మడిమహమ్మదుశాహు
కొలువున బ్రవేశించి పెక్కు యుద్ధములందు దన
పరాక్రమప్రదర్శనమువలన పేరుప్రఖ్యాతులు
గడించెను; కాని ఇమ్మడిమహమ్మదుశాహు మర
ణానంతర మతని పుత్రుడిమ్మడి మహమూదు
శాహును సరకుసేయక స్వతంత్రముగ దన సంస్థాన
వ్యవహారములు నడుపుకొనుచు ననుకూలపడినప్పు
డిరుగుపొరుగు సంస్థానాధిపతులను గొట్టి వారి
రాజ్యముల నాక్రమించుకొనుచుండువాడు విజా
పురరాజ్యసంస్థాపకు డితడే. ఇతడు క్రీ. శ. ౧౪౮౯
మొదలు క్రీ. శ. ౧౫౧౦ వఱకు ప్రజాపాలన
గావించెను. ఇతని తరువాత పేర్కొనదగినవాడు
ఇతని పుత్రుడు ఇస్మాయీలు ఆదిల్ ఖానుడు. ఇతడు
క్రీ. శ. ౧౫౧౦ మొదలు ౧౫౩౪ వఱకు రాజ్యము
జేసెను మూడవవాడు ఖాన్దేశప్రభువు అజమ్
హుమాయూన్ బిరుదాంకుడగు ముమ్మడి ఆదిల్
ఖానుడు. ఇతడు క్రీ. శ. ౧౫౧౦ మొదలు క్రీ. శ.
౧౫౨౦ పర్యంతము ప్రజాపాలన మొనర్చెను.[5]

---

2. *Commentaries of Affonso Dalbuquerque, II. pp.* 74-77.

3. చూ. ఈ ప్రకరణముచివర అనుబంధము ౧. పుటలు 44 తరువాయి

4. ఆముక్త. ౧: ౪౨.

5. *Briggs' Ferishta, IV. p.* 307. కాని ఇతడు క్రీ. శ. ౧౫౧౭ వఱకే రాజ్యము జేసినట్లు గుజరాతు దేశపు అరబీ చరిత్రయం దున్నది. (*Arabic History of Gujarat, III. p* 22.)

ఈ ముప్పురు ఆదిల్ ఖానులలో రెండవవా డగు నిస్మాయిలుఆదిల్ ఖానుని ప్రస్తావము నిచట జేయవలసిన యావశ్యకత లేదు. ఏలన నతడు గృష్ణ రాయల మరణానంతరము నాలుగేండ్లకాలము జీవించి యుండెను ; కావున గృష్ణరాయలచే నితడు వధింపబడెననుట తగదు ; అజమ్‌హుమాయూన్ ముమ్మడియాదిల్ ఖానుడు కృష్ణరాయల రాజ్య కాలమున మృతి నందినను, అతడు రాయలతోడి యుద్ధమున రణశయ్య నలంకరించెనని తలచుటకు వీలులేదు. ఏలనగా క్రీ. శ. ౧౫౧౭ వఱకును గృష్ణ రాయలు కళింగదండయాత్రయందు నిమగ్నుడై యుండెను ; తరువాత కాటూరిపై దాడి. అటు పిమ్మట క్రీ. శ. ౧౫౨౦ వ సం. న రాయచూరు దండయాత్రయు, నిస్మాయిలు ఆదిల్ ఖానునితో యుద్ధము జరిగెను. కావున క్రీ. శ. ౧౫౨౦ సం. న కృష్ణరాయలు ఖాన్‌దేశముపై దండువెడలె నని కాని అజమ్‌హుమాయూన్ ముమ్మడియాదిల్ ఖానుని వధించె నని కాని తలచుటకు వలనుపడదు. ఇక మిగిలియుండువాడు యూసుఫుఆదిల్ ఖానుడు ; ఇతడు క్రీ. శ. ౧౫౦౮-౧౦ న మృతి నందెను ; కోవెలకొండలో జచ్చె నని తారీఖ మహమ్మదుకుల్లీకుతుబుశాహందును, గోవెలకొండ కనుచూపుమేర నుండగ మృతి నందెనని బుర్హాన్-ఇ-మ ఆసీరునందును జెప్పియున్నది.[6] కోవెలకొండ విజాపురగోలకొండరాజ్యముల సరదుస్థలములం దుండిన బలిష్ఠమైన దుర్గము. కృష్ణరాయలు బహ మనీసుల్తానుతో నీప్రాంతమున యుద్ధము సేయు చుండిన కాలముననే యూసుఫుఆదిల్ ఖాను మృతి నందియుండుటచేతను, రాయ లాతని రణరంగమున వధించితినని చెప్పియుండుటచేతను బహమనీ సుల్తానుతోడి యుద్ధముననే యాదిల్ ఖానుడును నిహతుడాయె నని తోచుచున్నది.[7]

### ౩. ఇస్మాయిల్ ఆదిల్ ఖానుడు

తురకలపై గృష్ణరాయల యుద్ధము యూసుఫుఆదిల్ ఖానుని వధతో ముగియలేదు. యూసుఫుఆదిల్ ఖానుడు దన జీవితకాలమున విజయనగర సామ్రాజ్యమునకు జెందిన గృష్ణా తుంగభద్రల మధ్య యంతర్వేదియందు జాలభాగ మును రాయచూరు ముదుగల్లు దుర్గములతోగూడ నాక్రమించుకొనియుండెను. కృష్ణరాయల పూర్వి కులు బలుమారీయంతర్వేదిభూములను దుర్గము లను సాధించుటకు బ్రయత్నము సల్పిరి ; కాని వారి మనోరథము నెఱవేఱదయ్యె. మఱియు సాళువనరసింగరాయలు దన మరణశాసనమునందు తన యధికారముక్రిందికి రాక యన్యాక్రాంతములై యుండిన రాచోలు ఓదగిరి కొండలగి యను ముఖ్యదుర్గములు మూడింటిని వానిక్రిందిరాష్ట్రము లను మరణ మాసన్నమగుటచే దాను జయింప జాలకపోతి ననియు, దనయనంతరము రాయపీఠము నధిష్ఠించు ప్రభువు లెవ్వైనను వానిని గైవసము జేసికొనవలయుననియు నాదేశించియుండెను.[8] కావున రాయచూరు ముదుగల్లు దుర్గములను వాని క్రిందిదేశమును సాధించుట కృష్ణరాయలకు బ్రథమకర్తవ్య మాయెను. సమయముగూడ నను కూలపడినది.

యూసుఫుఆదిల్ ఖానునిమరణానంతరమతని కుమారుడు ఇస్మాయిల్ ఆదిల్ ఖానుడు విజాపుర సంస్థానమున కధిపతి యాయెను. అతడు తరుణ వయస్కుడగుటచే నతని తండ్రి కార్యఖడ్గములకు గర్తయైయుండిన కమాల్ ఖానుడు అతనికి బ్రతిగ రాజ్యపాలన సేయ దొడగెను. కీర్తికాయు డైన తన యజమానుడగు యూసుఫుఆదిల్ ఖానుని మార్గము నవలంబించి యతడిరుగుపొరుగు సామం తుల సీమలను గబళించి విజాపురరాష్ట్రమును విస్తరించుటకు ప్రబలప్రయత్నములు సేయగడ గెను. అతని రాజ్యతృష్ణకు బహమనీసుల్తానుల ప్రాచీనరాజధాని కలుబరిగ ప్రథమకబళ మాయెను. అప్పు డాదుర్గమును, దాని కనుబంధమైయుండిన రాష్ట్రమును మల్లిక్‌దస్తూరుదీనా రను హబిసీ

---

6. *Briggs' Ferishta III (App) p.* 350. *Burhan-i-Maasir, IA-XXVIII, p.* 319.

7. చూ. ఈ ప్రకరణముచివర అనుబంధము-౨. పుటలు 51 తరువాయి

8. *Nuniz, See F.E. pp.* 308, 316.

సామంతుని పాలనక్రింద నుండెను. కమాల్ ఖా నాతనిమీద యుద్ధము ప్రకటించి కలుబరిగపై గూచిచేసి రెండునెలలపర్యంత మాకోటను ముట్ట డించి స్వాధీనము జేసికొనెను.[9] దస్తూరుదీనారు కలుబరిగనుండి పాఱిపోయి బీదరుజేరి యచట సుల్తానుకు బ్రతిగ ప్రభుత్వము సల్పుచుండిన బరీదు మమాలి కను మంత్రిని శరణుజొచ్చెను. బరీదు అతని కాశ్రయమిచ్చి యాదిల్ ఖానుని కలుబరిగె నుండి పాఱదోలుటకు సైన్యముతోగూడ బయలు వెడలెను; కాని యుద్ధమున బరాజితుడాయెను; సైన్యముతో గూడ వచ్చిన బహామనీసుల్తాను ఇమ్మడిమహామూదుశాహు కమాలుఖానునిచే జిక్కి బందీకృతు డాయెను.[10] తరువాత కమాలుఖానుడు బీదరుపై నడచి దానిని స్వాధీనము జేసికొని మహా మూదుశాహు నతని మందిరముననే చెఱబెట్టి యతని యధికారమునంతటిని నాచికొని యజ్మత్-ఉల్-ముల్కను నాదిల్ఖానుని సామంతు నాతనిపై గా పుంచెను.[11]

ఆదిల్ ఖానుని విజయవార్తయు, సుల్తాను బంధన వృత్తాంతమును దెలియవచ్చినంతటనె బహా మనీరాజ్యమునం దంతటను గొప్ప సంచలనము గలి గినది. ఆదిల్ ఖానుచే బందీకృతుడైన పిదప సుల్తా నతనికి వశవర్తి యగుటతథ్యము; సుల్తానుపేర బహామనీరాజ్యముపై నతడు దనయధికారమును సాగింపగడగుననుట నిస్సంశయము. స్వాతంత్ర్య మును రుచిచూచిన బహామనీ సామంతుల కాదిల్ ఖానుని యుత్కర్షకముగిట్టలేదు. కావున వారియందు ప్రముఖులగు బరీద్-ఇ-మమాలిక్, మల్లిక్ అహ మద్ భైరీ నిజామ్-ఉల్-ముల్కు, కుతుబ్-ఉల్-ముల్కు, దస్తూర్-ఇ-దీనారు మున్నగువారలేకమై బీదరుపై నడచి యా కోటను ముట్టడించిరి. కొంత కాలము ముట్టడి సాగినది. కోటలోనివార నేకులు మడిసిరి. జనసామాన్యమునకు రానురాను జీవనము దుర్భరము గాజొచ్చినది. కావున అజ్మత్-ఉల్-ముల్కు బరీద్-ఇ-మమాలికును గలిసికొని సంధి గావించుకొనెను.[12] అటుతరువాత సంయుక్త బహామనీసామంత సైన్య మాదిల్ ఖానుని రాష్ట్ర ముపై నడచెను; భీమాపూర్వతటమునందలి కలు బరిగ మున్నగు దుర్గములనేకములును వానిక్రింది రాష్ట్రములతోగూడ వారు వశపఱచుకొని కడపట ఆదిల్ ఖానుని రాజధానియగు విజాపురమును జయించు నుద్దేశ్యముతో బయలువెడలిరి.

శత్రువులు రాజధానిపై నెత్తివచ్చుచున్నా రనువార్త విజాపుర రాజ్యమందంతటను సంక్షోభము గలిగించినది. అప్పటి విజాపురరాజ్యస్థితిని పోర్చు గీసుగ్రంథకర్తలు జక్కగా వివరించియున్నారు. అల్బూకెర్కుకామెంటరీసునందిట్లున్నది: "సబైయో (సవాయీ = సపాద) గతించిన పిమ్మట నతని కుమా రుడగు హిదల్ ఖానుడు బాల పసివాడగుటచే దక్కను రాజ్యసామంతుల మధ్య గొప్ప కలహా ముప్పతిల్లినది. గోవాపాలకుడగు మల్లిక్ సూఫర్ గూగి, సబైయో మృతినందిన తరువాత నెవ్వరిని సరకుసేయలేదు. ఇతని కొలువున వేవురు ఆయుధో పజీవు లుండిరి. దేశములోని ప్రజలొండొరులతో గలహించుచు బోట్లాడుచుండిరి. బెల్గాములోని హిందువులు హిదల్ ఖానునిపై దిరుగబడి, పట్టణము నుండి మహమ్మదీయులను వెడలనడచి, కృష్ణదేవ రాయలను వచ్చి తమ పురము నాక్రమించుకొన వలయునని యాహ్వానించిరి.[13]

పుర్చాసు 'పిల్గ్రిం' సను గ్రంథమున నిట్లు కలదు: "సబైయసు (సవాయి = సపాద) మర ణించినపు డతనికి మిక్కిలి పసివాడు ఇదల్కాను కుమారు డుండెను. అందువలన ప్రజలతనిపై దిరుగ బడిరి. ఆతని రాజ్యమును హరించుటకొఱకు నర సింగదేశపురాజు దండెత్తి వచ్చెను. అదే సమయమని యెంచి యాల్బూకెర్కు గోవాను ముట్టడించి స్వాధీనముజేసికొనెను; కాని యనంతర మచిర కాలముననే ప్రచండ సైన్యముతో నదల్కాను

---

9. *Commentaries of Affonso Dalbuquerque III, Ch., VIII. p.* 36.

10. *Commentaries of Affonso Dalbuquerque, See, 'Yavanarajya Sthapanacharya' JOR. X, pp.* 168-171.

11. *Ibid III Ch. VIII p.* 36, *Burhan-i-Maasir I.A. XXVIII. p.* 319

12. *Burhan-i-Maasir, IA. XXVIII. pp.* 319-20.

13. *Commentaries of Affonso Dalbuquerque II. Ch. XVIII. p.* 82, *Ch. XIX p.* 85 ; *JOR. X. p.* 160.

వచ్చెను. రాతిరికి రాతిరే పోర్చుగీసులు పారి పోయిరి. నరసింగదేశపు రాజు మరల యుద్ధమునకు రాగా ఇదల్కానుడు గోవాపట్టణమున బలిష్ఠమైన తాణ్యమును గాపుంచి బలాధికుడైన శత్రునిపై గవయబోయెను. కాని యాల్బూకెర్కా తాణ్యము నోడించి పట్టణము జూఱగొనెను.''[14]

ఫ్రయ్యరు లూయి క్రీ. శ. ౧౫౧౦ డిసెంబరు మాసమం దాల్బూకెర్కుకు విజయనగరమునుండి వ్రాసిన యుత్తరమున దక్కనురాజ్య రాజకీయ స్థితి నిట్లు వివరించియున్నాడు :

''హిదల్కాను గొప్ప సైన్యముతో దక్కను రాజ (సుల్తాను) సామంతుడగు మెలిక్‌దిస్తూరను హబిసీయూబ దొర పాలనక్రింద నుండు కల్బర్గేటు (కలుబరిగ) ను సాధించుటకొఱకు బయలుదేరెనని తనకు నమ్మకమైన వార్త వచ్చిన దనియు ; నా దుర్గము ముట్టడి కాగజాలకపోవుటవలన రెండు మాసములైన తరువాత కొన్ని షరతులపై నతనికి గైవశమాయె ననియు; హిదల్కాను దక్కను రాజు (సుల్తాను) యొక్క సకలాధికారములను నాచికొని యతని వెడలగొని పోవుటవలన నా రాజ్యములోని సామంతులు నలుగురు ఆతనిని ప్రతిఘటించి యతని నిర్మూలించు నుద్దేశముతో నతనిపై నెత్తిపోయిరనియు; మార్గమున నొక నది కడకు వచ్చి దాని దాటు వెఱ వెఱుగక నచట విడిసి విశ్రాంతి నంది యుండిరనియు'' దెలియ పఱచెను.[15]

పై నుదాహరించిన పోర్చుగీసుగ్రంథకర్తల రచనల వలన యూసుపుఆదిల్ ఖానుని మరణానంతరము విజాపురరాజ్య మెట్లు సంక్షోభమందియుండెనో చక్కగ దెలియవచ్చుచున్నది. యూసుపు ఆదిల్‌ఖాను డాక్రమించుకొనియుండిన కృష్ణాతుంగభద్రల నడిమి విజయనగరరాష్ట్రమును మరల స్వాధీనపఱచుకొనుట కంతకంటె సరియైన సమయము మరల లభింపదు; కావున గృష్ణదేవరాయలు వెంటనే సైన్యముతో గదలిపోయి రాయచూరు దుర్గమునకు ముట్టడివైచెను.

విజాపుర సంస్థాన మిట్లంతఃకలహములచే గలగుండువడి పరసైన్యసమావృత మాయెను ; సంస్థానమే నిలువకపోవునేమోయను సంశయము గలిగినది. కాని రాజ్యసంరక్షకుడైన కమాలుఖానుడు ధైర్యము విడనాడలేదు. సంస్థానము నెట్లైన నిలుపవలయునని పట్టుబట్టెను. గోవా మొదలగు దుర్గములకు గాపుండిన సైన్యములను బిలిపించి, బరీద్-ఉల్-ముల్కు మొదలగు బహామనీసామంతుల నోడించి తఱుమగొట్టెను; కాని యతడు కృష్ణరాయల నెందును ఎదిర్చినట్లు కానరాదు. కృష్ణరాయలయెడ కమాలుఖాను డేల తటస్థుడై యుండెనో తెలియదు; కాని, కారణము దురూహ్యము గాదు. కృష్ణరాయలకును బోర్చుగీసుగవర్నరుకునుగల స్నేహము నత డెఱుగును. రాయలును బోర్చుగీసులును నేకమైనచో గోవాను మరల జయించుట సులభ సాధ్యముగాదు. మఱియు నొక ప్రక్క నుత్తరదిక్కున బహామనీ సామంతులతో యుద్ధము సేయ నారంభించిన పిమ్మట దక్షిణమున రాయలతో గూడ పోట్లాటబెట్టుకొనిన జయమొక్క చోటనేనియు గలుగకపోవచ్చును. ఇంతేకాదు. కమాలఖానుని హృదయమున రాజద్రోహ బీజ మంకురించినది. పసివాడగు తన యజమానుని దొలగద్రోసి సంస్థానమునకు దానే యధిపతి కావలయునను నాస యతని హృదయమున బాదుకొనినది. తన యుద్యమమును నెఱవేర్చుకొనుట

---

14. *Sewell, F.E. p.* 125. *n.* 1.
''పుర్చాసుగ్రంథము (ఫోలియో) మొదట క్రీ. శ. ౧౬౨౫ వ సంవత్సరమున బ్రకటింపబడెను. అతడు బ్యారాసు (*Dec. I. l. VIII Cap.* 10) ననుసరించుచున్నాడు.'' బ్యారాసు దన చరిత్రయందలి మొదటి డికాడాను క్రీ. శ. ౧౫౫౨ వ సంవత్సరమున బ్రకటించెను. అతడు క్రిస్టవాన్ డి ఫిగ్విరెడో, డామింగో పయస్, ఫెర్నావన్‌న్యూనిజు మొదలగు కృష్ణరాయల సమకాలికులగు పోర్చుగీసుగ్రంథకర్తల రచనలనాధారపఱచుకొని దన చరిత్రను వ్రాసెను. (*See F.E. p. V. f*) ''నరసింగరాజ్యము అనునది విజయనగర సామ్రాజ్యమునకు బోర్చుగీసురచయితలును నన్యులును తఱచుగ వాడు నామాంతరము.'' (*F. E. P.* 236 *n.* 1)

15. *Commentaries of Affonso Dalbuquerque, III. Ch. VIII. p.* 66.

కతడు మొదట బహమనీ సుల్తానుపేర బీదరును పాలించుచుండిన బరీద్-ఇ-మమాలికునకు గలుబరిగ మున్నగు భీమా పూర్వతటదుర్గములను రాష్ట్రమును వశపఱచి సంధి జేసికొనెను. అట్లే కృష్ణరాయలకును గృష్ణకు దక్షిణమున నుండు దుర్గములను సీమలను ఇచ్చివేసి సంధి చేసికొనియుండ వచ్చును. మహమ్మదీయ చరిత్రలవలన కమాలు ఖాను కృష్ణరాయలతో సంధి గావించుకొనినట్లు తెలియరాకపోయినను, పోర్చుగీసు రచయిత లిట్టి సంధి కలదని చెప్పియున్నారు. క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరమున గృష్ణరాయలు రెండు పర్యాయము లాదిల్‌ఖానుమీదికి దండువెడలెనని పుర్చాసు దన 'పిల్గ్రింసు'లో వ్రాసియున్నాడు. మొదటిదండయాత్ర క్రీ. శ. ౧౫౧౦ ఫిబ్రవరిలో నల్బూకెర్క్ గోవాను మొదటిసారి బట్టుకొనుటకు పూర్వము నడచెను. రెండవది క్రీ. శ. ౧౫౧౦ మే నెలలో నల్బూకెర్క్ నోడించి యాదిల్‌ఖానుడు గోవాను స్వాధీనపఱచుకొనినతరువాత జరిగెను. ఈ రెండు దండయాత్రల మధ్యకాలమున విజాపురవిద్యానగరరాజ్యములకు గల పరస్పరసంబంధమును పుర్చాసు వివరించియుండలేదు; కాని కృష్ణరాయల సమకాలికుడగు కాస్టన్‌హీడా, ఆదిల్‌ఖాను కృష్ణరాయలతో సంధిచేసికొనెనని వ్రాసియున్నాడు; మఱియు క్రీ. శ. ౧౫౫౮ సం.మున బ్రకటితమైన మొదటి డికాడాయందు అల్బూకెర్క్ మొదటి పర్యాయము గోవాను జయించి స్వాధీనపఱచుకొనినవెంటనే గ్యాస్పరుచనోకా యనువానిని విజయనగరమునకు రాయబారమంపెననియు, నతనికి రాయలు దర్శనమిచ్చి విశేషముగ గౌరవించినను అల్బూకెర్క్ వేడికోలు నంగీకరింపక యుచితవాక్యముల నంటియు నంటనియట్లు జవాబు జెప్పెననియు, దానికి గారణ మాదిల్‌ఖాను రాయలతో జేసికొనిన యొడంబడికయే యనియు నివేదించెనని బ్యారాసు వ్రాసియున్నాడు.[16] గోవాను పోర్చుగీసులకడనుండి జయించుట కవకాశము గల్గించుట కొఱకె కృష్ణరాయలాదిల్‌ఖానునితో నీ సంధి కొడబడియుండునని సూయెల్ అభిప్రాయపడుచున్నాడు.[17]

ఆదిల్‌ఖానునితో నిట్లు సంధి చేసికొన్నను, అత్యల్పకాలముననే కృష్ణరాయ లతనిపై మరల నేల దండు వెడలెనో కనుగొనవలసియున్నది. కమాలుఖానుడు బరీద్-ఇ-మమాలికుతో సంధిచేసికొనిన పిమ్మట షోలాపురముపై నెత్తిపోయి యా పట్టణమును మూడునెలలకాలము ముట్టడించి కైవసము గావించుకొనెను. తరువాత విజాపురమునకు దిరిగివచ్చి యచట దన ప్రభువైన ఇస్మాయీలుఆదిల్‌ఖానుని నాతని తల్లియగు బూబూజీఖానమును దుర్గమునందు చెఱబెట్టెను. ఆసమయముననే కమాలుఖానుని మిత్రుడగు బరీద్-ఇ- మమాలికు దన యజమానుడగు నిమ్మడి మహమూదుశాహును గుల్బర్గదుర్గమున చెఱయందుంచి రాజ్యము నాక్రమించుకొనెను.

తా నొకటి తలచిన దైవ మొకటి తలచును నను నార్యోక్తి కమాలుఖానునియెడ సార్థకమైనది. సింహాసనము నధిష్ఠించుటకు వలసిన ప్రయత్నములు సల్పుచుండ నకాలమృత్యు వాతని వాత వేసికొనెను. చెఱయందు బందీకృతురాలై యుండినను బూబీజీఖానము ద్రోహమున కొడిగట్టిన కమాలుఖానుని దుదముట్టించు మార్గమును వెదకుచుండినది. చిట్టచివరకు స్వామిభక్తిపరాయణులైన యనుచరులను బురికొల్పి యతని జంపించెను. కమాలుఖానుని హత్యమూలమున నిస్మాయీలాదిల్‌ఖానుడు కారాగారవిముక్తుడై మరల రాజ్యాధిపత్యమును బొందెను; కాని రాష్ట్రమున శాంతిమాత్రము గుదరలేదు. ఆదిల్‌ఖానుదర్బారు నాశ్రయించియుండిన అమీరులందఱును రెండుకక్షులుగ జీలిరి. కమాలుఖానుడు జాతిచే పారసీకుడు. పారసీకఖురాసానియమీరులకతడు నాయకుడు. తమ నాయకునిహత్య చేయించినందుకు గినిసి పారసీకఖురాసానియమీరులేకమై తురకరూమీదొరలతో బోరాడ దొడగిరి. ఇట్లుండ రాయచూరు ముదుగల్లు మొదలగు దుర్గములను కృష్ణాతుంగభద్రల నడిమిరాష్ట్రముతో గూడ జయించి స్వాధీనము జేసికొని ప్రచండ

16. *Sewell. F. E. P.* 124.

17. *Sewell. F. E. P.* 124.

సైన్యమును వెంటగొని కృష్ణదేవరాయలు కలుబరిగదుర్గముపై గూచిచేసెను.[18]

కృష్ణరాయల కలుబరిగెదండయాత్ర ప్రస్తావము మహమ్మదీయచరిత్రలయం దెచ్చటను గానరాదు. ఇంతే కాదు; ఫెరిష్తా యప్పటి కలుబరిగ వృత్తాంతము నిట్లు వర్ణించియున్నాడు. "ఇస్మాయీల్ ఆదిల్ ఖానుడు బంధవిముక్తుడాయె నను వార్త చెవి సోకినంతటనే, అమీర్ బరీదు (బరీదు-ఇ-మమాలిక్) గుల్బర్గను ద్యజించి బీదరునకు వెడలిపోయెను."[19] కాని ఫెరిష్తామాట విశ్వాసపాత్రము గాదు. ఆదిల్ ఖానుడు చెఱనుండి విముక్తుడాయె నను వార్తను వినగనే అమీరు బరీదు కలుబరిగను విడిచి పాఱిపోవలసిన యాపశ్యకత యెద్దియుగానరాదు. చెఱనుండి విముక్తుడాయెనే కాని, శత్రులకు భయము గలిగించు శక్తి యతనికెక్కడిది ? నిజరాజ్య మంతఃకలహములతో సంక్షోభించుచుండినది; తన యధికారమింకను నెల్లయెడల సాగుట లేదు. అశక్తుడైన రాజు నెవ్వరు సరకుసేయుదురు ? అంతశ్శత్రుల నణచి వారిని దన యధికారమునకు బద్ధులను గావింపజాలనివాడు పరుల నెట్లు భయపెట్టగలడు ? ఇంట గెలచికదా రచ్చ గెలునవలయును. కావున బరీదుపలాయనము వాస్తవమైనచో దాని కన్య కారణ ముండియుండవలయును.

## ४. నిజాము

కృష్ణరాయ లీ సమయమున గలుబరిగెపై దండెత్తినట్లు ఆంధ్రగ్రంథములవలన దెలియవచ్చుచున్నది. క్రి. శ. ౧౬౦४-५ వ సంవత్సరమున ఇమ్మడి వెంకటపతిదేవమహారాయలు వ్రాయించిన విజయనగరసామ్రాజ్య మను నర్థవణపత్రమున గృష్ణరాయల కలుబరిగదండయాత్ర సంగ్రహముగ నిట్లు వర్ణింపబడియున్నది :

"ప్రజోత్పత్తి సంవత్సరం తయిమాసం కుతప్ప శాహానిజాంశాహామీదికి కూచిచేసి వెలిగుడారం వేసి తరలిపోయిరి. మూడుయేండ్లు దండు జేసి మూడు సంస్థానాలమీద కార్యంచేసి కలుబరిగె వద్ద విజయస్తంభంవేయించి మూడుసంస్థానాల వారివద్ద పగుదీ తీసుకొని ముగ్గు....తో (?) పిలిపించుకొని విజయనగరపట్టణం ప్రవేశించి వుండి..."[20]

నడిమిదొడ్డిపాశెపు కైఫియతునందు కలుబరిగ ముట్టడి విపులముగ వర్ణింపబడియున్నది :

"కొన్ని దినములకు కల్యాణంకలుబరిగల మీదికి యుద్ధసన్నద్ధులై సమస్తమైన జహగీరుదార్లను పిలుపించగా కడవకొలనుగ్రామంలో మునిలిచన్నమనాయడు తన జమీయతుతో కూడా విజయనగరానకు కృష్ణరాయలవారి సముఖానకు పోయిన తదనంతరం రాయలవారు సైన్యముతో కూడా ప్రయాణమై కలుబరిగెమీదికి వెళ్లగా సమస్తమైన నిజాములు ఆ కలుబరిగదగ్గిరికి భారీ ఫౌజులు స్తోమంగా కూడివున్నందున, రాయలవారు సమస్తమైనవారిని పిలిపించి, 'యీ యుద్ధమందు వెనుకకు తిరుగక లడాయిచేసి శత్రుపలాయనం చేస్తే మీకు సకలబహుమానాలు యిప్పిస్తున్నారము' అని వీరకంకణాలు తాంబూలాలు యిచ్చినంతలోగా, లడాయికి షురుషు అయి యుద్ధము సేయగా అప్పుడు బహుమంది సర్దారులు మెసాము సిలిచన్నమనాయడు సొన్నలాపురంహండేవారు

18. రాయచూరిదుర్గపతనమునుగూర్చి ఫెరిష్తా ఇట్లు వ్రాసియున్నాడు: "కాని, తిమ్మరాజు సమయమనుకూలమై యుండుటను గని రాజు (ఆదిల్ఖాను)గారి రాష్ట్రముపై నెత్తివచ్చి, రాయచూరుముట్టడి నింకను (ఆదిల్ ఖానుడు చెఱనుండివిడుదలయైనప్పటికిని) సాగింపుచుండెను; తుద కది యతనికి లోబడెను. రాజ్యముపై దన యధికారమును మరల నెలకొలుపు ప్రయత్నములలో నిమగ్నుడై యుండినందున ఇస్మాయీలు ఆదిల్ ఖానుడు సకాలమున ముట్టడిని తొలగించుటకు దగిన బలముల నంపజాలకపోయెను."

(*Briggs' Ferishta III. pp.* 44-45)

ఫెరిష్తా కప్పటి విజయనగరరాయల పేరు తెలియదు. కావున నతడు 'తిమ్మరాజు'ను గల్పించినాడు. రాయచూరు క్రి. శ. ౧౫౧౧ ఏప్రిలు ౨౯ తేదికిని క్రి. శ. ౧౫౧४ నకును మధ్య నడచె నని చెప్పియున్నాడు.

19. *Briggs' Ferishta II. p.* 44

20. భారతి సం. ౬. భాగ ౨. పుట ౬౫౧.

యింకా పాళేలవారు యేకస్తులై యుద్ధానకు నడచినంతలో అగాధయుద్ధప్రసరిణిఅయి కృష్ణ రాయలవారిఫౌజు విరిగినందున రాయలవారు చెయ్యెత్తి ఘల్లున కూసి, 'యీసమయమందు యవ్వరు యెదు రెక్కి శత్రుపలాయనం చేస్తున్నారో వారికి సకలబహుమానాలు బిరుదులు యిప్పిస్తున్నా' మని చెప్పినందున ముసిలి చన్నమ నాయడు యింకా కొంతమంది సర్దార్లతోకూడ తురుష్కులవారి లష్కరుమీదికి యెదురెక్కి తరుముకొని వస్తూవుండిన నిజామాది ఫౌజులమీదికి దూరి చిత్తాస్వాతి సంధించినట్టుగా యుద్ధముచేసి మొదటికోపు విరుగగొట్టినందున యావత్ఫౌజు యేకరాశిన దూరగా నిజాములఫౌజు విరిగి శానా హతమై పోయినందున కలుబరిగలో వరాహధ్వజ మెత్తించి జయభేరి వేయించి....."21

ఈ దండయాత్ర నడచిన దెప్పుడో కనుగొన వలసియున్నది. కృష్ణదేవరాయలు క్రీ. శ. ౧౫౨౦ సం. న ఆదిల్ ఖాను నోడించి రాయచూరుదుర్గమును జయించిన పిమ్మట నొకసారి కలుబరిగపై దాడి వెట్టి యాదిల్ ఖానుని మరల పరాజితుని గావించి కలుబరిగను లగ్గలువట్టెనని న్యూనిజు వ్రాసి యున్నాడు. కాని పైనవర్ణింపబడిన దండయాత్ర యది కాదు; దానికంటె భిన్నమైనది. ఇట్లు చెప్పుటకు రెండు కారణములు గలవు: (౧) నడిమిదొడ్డి పాళెము కయిఫీయతుప్రకారము కలుబరిగను స్వాధీనపఱచుకొనుటకొఱకు కృష్ణ రాయలు పోట్లాడినది యాదిల్ ఖానునితో గాదు, నిజామాది ఫౌజులతో. హిదల్కాను బహమనీసుల్తాను నోడించి చెఱబట్టినందులకు గోపించి నలుగురు ముఖ్యబహమనీ సామంతు లేకమై యతనిపై నెత్తివచ్చి కలుబరిగ మున్నగు దుర్గములను జయించిరని సమకాలికపోర్చుగీసురచయితలు జెప్పియున్నారు కదా. ఇట్లేకమైన నలుగురు బహమనీసామంతుల పేర్లు మల్లిక్ బరీద్-ఇ-మమాలిక్, మల్లిక్ కుతుబ్-ఉల్-ముల్కు, మల్లిక్ దస్తూర్-ఇ- మమాలిక్ మల్లిక్ దీనారు, మల్లిక్ అహమద్ భైరీ నిజామ్-ఉల్ముల్కు లని మహమ్మదీయచరిత్రకారులు జెప్పుచున్నారు.22 వీరికి నాయకుడు మల్లిక్ అహమద్ భైరీ నిజామ్-ఉల్-ముల్కు. సమకాలికాంధ్ర ప్రబంధకర్త లితనిని 'నిజా' మనియు, 'నిజాము' డనియు బేర్కొనియున్నారు. మఱియు నప్పుడు నిజామ్-ఉల్-ముల్కు కుతుబ్-ఉల్-ముల్కులు బరీద్-ఉల్-ముల్కు పక్షమువహించి యతనికి శత్రులతో బోరాడుటకు దోడ్పడుచుండువారు. కృష్ణరాయలు కలుబరిగపై నెత్తివచ్చు నను శంక బరీదునకు గలుగకపోయినను, కారాగార విముక్తుడైనపిమ్మట సాధ్యమైనంతత్వరలో నిస్మాయీలు ఆదిల్ ఖాను డా కోటను స్వాధీనపఱచుకొనుటకు దండెత్తిరాగలడని యాత డెఱుగును. కావున కోటను ఆదిల్ ఖానునికి హస్తగతముగానీయక సంరక్షించుటకై తన మిత్రులగు నిజామ్-ఉల్-ముల్కు కుతుబ్-ఉల్-ముల్కులకు వర్తమాన మంపి వారికడనుండి దళములను రప్పించుకొని యుండును. ఆదిల్ ఖానుకంటె ముందే కృష్ణరాయలు కలుబరిగమీద నెత్తిపోవుటచే దాని సంరక్షణార్థము వచ్చియుండిన నిజామాదిఫౌజులతో రాయలు యుద్ధముసేయుటయందు వింత లేదు. ఈ విషయములను జక్కగ బరికించి చూడగా పైవర్ణింపబడిన కలుబరిగదండయాత్ర న్యూనిజు చెప్పినదానికంటె భిన్నమైనదని నిశ్చయమగుచున్నది. (౨) రాజ్యారంభకాలమున రాయ లొకసారి కలుబరిగపై దండయాత్ర సలిపినట్లు 'విజయనగరసామ్రాజ్యము' వలన దెలియవచ్చుచున్నది. కృష్ణదేవరాయలు ప్రజోత్పత్తి తయిమాసం ౧౨ వ తేది, అనగా క్రీ. శ. ౧౫౧౨ జనవరి ౯ వ తేది నాడు దండయాత్ర ప్రారంభముచేసి మూడేండ్లు దండుచేసి కలుబరిగకడ జయస్తంభము వేయించి తిరిగి విజయనగరమునకు వచ్చి, యచటనుండి శ్రీముఖసంవత్సరం చిత్రిమాసము శ్రీరామదశమి. అనగా క్రీ. శ. ౧౫౧౩ వ సంవత్సరం మార్చి నెల ౧౬ వ తేది నాడు గజపతివారిమీద దండుయెత్తి తరలిపోయినట్లు చెప్పియున్నది. కాని క్రీ. శ. ౧౫౧౨ జనవరి ౯-వ తేదికిని క్రీ. శ. ౧౫౧౩ మార్చి ౧౬ వ తేదికిని మధ్యగల యెడము ఒక

21. *Local Records. Vol.* 39. *p.* 11. *f*

22. *Burhan-i-Maasir, IA. XXVIII pp.* 319-20

సంవత్సరముపై మూడు నెలలు ఆఱుదినములు మాత్రమే. కావున నీ దండయాత్ర కాలము మూడేండ్లనుట తప్పు. దండయాత్ర నడచిన కాల వ్యవధి తప్పైనను ప్రారంభకాలమైనను సరియగునేమో కనుగొనవలసియున్నది. కృష్ణరాయలు దన రాజ్యాభిషేకమైనవెంటనే విజాపురముపై రెండు మారులు దండయాత్ర వెడలె ననియు, నందొకటి క్రీ. శ. ౧౫౧౦ ఫిబ్రవరి ౨౦ వ తేదిన యాల్బూకెర్కి గోవాకు వచ్చినపుడును మఱియొకటి కమాలుఖానుని మరణానంతరమును నడచె ననియు నింతకుముందు చెప్పియున్నాడను. క్రీ. శ. ౧౫౧౧ మే నెలలో గమాలుఖానుడు వధింపబడె నని ఫెరిష్తా వ్రాసియున్నాడు. కమాలుని వధ ఫెరిష్తా చెప్పినట్లు వాస్తవముగ క్రీ. శ. ౧౫౧౧ మే నెల యందే జరిగియుండినపక్షమున, 'విజయనగర సామ్రాజ్యము' న బేర్కొనబడిన కలుబరిగ దండయాత్ర క్రీ. శ. ౧౫౧౨ జనవరి ౯ వ తేది నాడు ప్రారంభమైయుండవచ్చును ఇందసంగత మెద్దియు లేదు.

నడిమిదొడ్డిపాళెపు కైఫియతందును, 'విజయనగరసామ్రాజ్యము' నందును వర్ణింపబడియుండు కలుబరిగదండయాత్ర యొక్కటియే. లభించిన సాక్ష్యములు బరికించిచూడగా గృష్ణరాయలు కలుబరిగమీద రెండు పర్యాయములు మాత్రమే దండయాత్ర వెడలెనని తెలియవచ్చుచున్నది. న్యూనిజు జెప్పిన దండయాత్ర నడిమిదొడ్డిపాళెపు కైఫీయతులోని దండయాత్రకంటె భిన్నమైనదని పైని నిరూపింపబడియున్నది. నడిమిదొడ్డి పాళెపు కైఫియతు నందు కలుబరిగె కోటపై వరాహధ్వజ మెత్తకముందు రాయలు నిజామాదిఫౌజుల నోడించినట్లు వ్రాసియున్నది; 'విజయనగరసామ్రాజ్యము'నందు కుతప్పశాహానిజాంశాహాలపై గూచిచేసిపోయి మూడుయేండ్ల పర్యంతము దండుచేసి మూడు సంస్థానాలమీద కార్యంజేసి కలుబరిగెదగ్గర విజయస్తంభం వేయించినట్లు చెప్పియున్నది. ఈ రెండు గ్రంథములలో వర్ణింపబడిన దండయాత్రలయందు నిజాము గృష్ణరాయలకు బ్రతిపక్షిగ గానవచ్చుచున్నాడు. నిజాముతో గృష్ణరాయలు మఱియెచ్చటను నెక్కడను యుద్ధముజేసెనని తలచుట కాధారము లేదు ; కావున నడిమిదొడ్డిపాళెపు కైఫీయతందును, విజయనగరసామ్రాజ్యమునందును వర్ణింపబడియుండు కలుబరిగ దండయాత్రయొక్కటియే యని తలచుట యుక్తము.

కలుబరిగ యుద్ధమెట్లు నడచెనో నడిమిదొడ్డి పాళెపు కైఫీయతందు చక్కగవర్ణింపబడియున్నది. మొదట రాయరాణువ శత్రువుల తాకునకు దాళజాలక విఱిగి వెన్నిచ్చెను. తురకలు విఱిగి పాఱు విజయనగరదళములను వెన్నంటి తఱుమ నారంభించిరి. అపజయము సిద్ధమని యందఱకు దట్టినది. కాని రాయలు ధైర్యమును విడనాడలేదు. పఱుగిడుచుండిన సైన్యమునడుమ నచలుడై నిలిచి చేయెత్తి ప్రళయకాల రుద్రునివలె గర్జించెను. నాయకులను పాళెగాండను దొరలను బిలిచి సకలవిధములైన బహుమానముల నిచ్చెదనని యాసచూపి యుద్ధమునకు బురికొల్పెను. రామనామము విన్న పిశాచమువలె వారి హృదయమున బాదుకొనియుండిన భయము మాయమైనది. రాయరాణువ మరల శత్రుముఖమైనది. మెసావారికి హండేవారికి ఇతర పాళెములవారికి వీరావేశము పెరిగినది. జయము చేకూడెగదా యని తలచి వ్యూహమును విసర్జించి చిల్లాపొల్లుగ దఱుముకొని వచ్చుచుండిన తురకదండున కడ్డపడి నఱుక నారంభించిరి. తలవని తలంపుగ పిడుగులవలె బైనురికిన హిందూవీరుల ధాటికి జెదరి పాఱు తెంచుచుండిన తురకదళ మాగజాలక వెన్నుజూపెను. అంతట రాయ సైన్యమంతయు నొక్కుమ్మడి వారిపై నురువడించి వారిని ఖండతుండెములుగ నఱుక సాగెను. తురకసేనయందు చాలభాగము మడిసినది. హతశేషులు కొందఱు పట్టుపడిరి. తక్కినవా రడపొడ గానరాక పరారియైరి. సమకాలికకవి యొకడు రాయలచే నిర్జితులైన మహమ్మదీయుల స్థితి నిట్లు వర్ణించియున్నాడు :

> "చెడిపిరాలొత్తిన యడుగుదమ్ములకును
> గట్టుపయ్యెద జించి కట్టుకొనుచు
> బయలైన కుచకుంభపాళులకును జంటి
> శిశువుల మాటుగా జేర్చుకొనుచు

గసుగండలకు వడగాలికి జాటుగా
గచభరంబుల విప్పి కప్పుకొనుచు
వీడిన తురుము నీవియదాక సడలించి
చేలాంతము ముసుంగు జేర్చుకొనుచు
ఖానమల్కవజీరుల మానవతులు
పాటుపరువున నీవు కల్బరిగ గొనిన
బ్రమసి నలుగడ దెసచెడి పఱతు రౌర
ఆహవోపేంద్ర! కృష్ణరాయక్షితీంద్ర! ''[23]

## ౫. బరీదు

కలుబరిగదండయాత్ర జయప్రదముగ ముగిసినది. కాని కృష్ణరాయలు యుద్ధము చాలించుకొని నిజరాజధానికి మరలిపోలేదు. బహమనీసుల్తానుల రాజధానియగు బెడదకోట (బీదరు) వైపు సైన్యములతో గూచిచేసెను. దీనికి వాస్తవమైన కారణము దెలియదు. బరీదుచే బంధితుడై కారాగారమున నుండిన ఇమ్మడి మహమూదుశాహును చెఱనుండి విడిపించి సింహాసనముపై నతని పునః ప్రతిష్ఠ సేయుట రాయల ముఖ్యోద్దేశమని తోచుచున్నది. బెడందకోట దండయాత్రను సమకాలిక కవులు బేర్కొనియున్నారు. ఒక యజ్ఞాతకవి—

''గవకుల్ బల్లిదమయ్యె ఢిల్లికిని మ
క్కాకోట మేలయ్యె మం
డువకున్ గ్రొత్తగ క్రొత్తడంబు లమరెన్
బోలేరు చందేరులన్
ఠవసం బెక్కె బెడందకోట పురకాం
తా గర్భనిర్భేదన
ప్రవణంబైన భవత్ప్రయాణజయవా
ర్తన్ గృష్ణరాయాధిపా.''

అని బెడందకోట దండయాత్రను బ్రకటించియున్నాడు. రాయరాణువ బెడదకోటను జేరెను; బరీదుదళముల గూర్చుకొని వచ్చి మాఱొడ్డి నిలచెను. భీకరసంగ్రామము పొసగినది. మహమ్మదీయ బలము లోడి పాఱిపోయెను. కృష్ణరాయల బెడంద కోట విజయము నల్లసాని పెద్దనగారిట్లు ప్రశంసించియున్నారు:

''సమరక్షోణిని గృష్ణరాయలభుజా
శాతాసిచే బడ్డ దు
ర్దమదోర్దండ బెడందకోటయవన
వ్రాతంబు సప్తాశ్వమా
ర్గమునం గాంచి 'శబాసహో!
హరిహరం గాఖూబుఖోడాకిఛే
తుముకీ బాయిలబాయిదే ములకియం
దు ర్మింటికిన్ బోవుచున్.''

ఈ విజయము సంపూర్ణమైనది. బెడందకోట హస్తగతమాయెను. క్రి. శ. ౧౫౨౩ నాటి యొక తామ్రశాసనమున గృష్ణరాయలకు 'బెడదకోట సప్తాంగహరణ' యను బిరుదుండినట్లు చెప్పియున్నది.[24] స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గ బలము లేడును రాజ్య సప్తాంగము లనబడును. బెడదకోటసప్తాంగహరణు డనగా బెడదకోట సంస్థానమును సంపూర్ణముగ జయించినవాడని యర్థము.

ఇచట స్మరింపవలసిన విషయ మొకటికలదు. కృష్ణదేవరాయలకు 'యవనరాజ్యసంస్థాపనాచార్య' యను బిరుదు కలదు. విజయనగరరాయలయందు మఱియెవ్వరికిని ఈ బిరుదు లేదు. రాయలకీబిరుదెట్లు కలిగెనో స్పష్టముగ దెలియబఱచు సాక్ష్య మెద్దియు నింతవఱకు దొరకలేదు. కాని, న్యూనిజ్ చరిత్రయందు కృష్ణరాయలు కలుబరిగ గొన్నపుడు, దక్కనుసుల్తాను పుత్రులను ముగ్గురిని యాదిల్ ఖానుచే బందీకృతులైన వారిని చెఱనుండి విడిపించి, వారియందు జ్యేష్ఠుని యతని తండ్రిసింహాసనము నెక్కించి తక్కిన ఇద్దరిని తనతోగూడ విజయనగరమునకు గొనిపోయెనని యున్నది.[25] దీని నాధారపఱచుకొని పరిశోధకులు కొందఱు కృష్ణరాయలకు 'యవనరాజ్యస్థాపనాచార్య'యను బిరుదు బహమనీ సుల్తానుకుమారుని సింహాసనము నెక్కించుటవలన

---

23. *Further Sources, I no.* 114. (*b*).
24. *A.* 9 *of* 1912-13.
25. *F. E. p.* 358.

గలిగెనని యూహింపుచున్నారు. ఇది సంగతము గాదు; ఏలనగా న్యూనిజుప్రకారము రాయలు కలుబరిగను సాధించినది క్రీ. శ. ౧౫౨౦ వ సంవత్సరమున, ఇస్మాయీలు ఆదిల్‌ఖాను నోడించి రాయచూరును స్వాధీనము జేసికొనినపిమ్మట. కావున కలుబరిగవిజయమును, బహమనీసుల్తానుపుత్రుని గద్దె యెక్కించుటయు క్రీ. శ. ౧౫౨౦ వ సంవత్సరమునకు పిమ్మట నడచియుండవలయును. కాని రాయల కీబిరుదు రాయచూరిదండయాత్రకు జాల పూర్వమునుండియు గలదని శాసనసాక్ష్యమువలన రుజువగుచున్నది. ఈ క్రింది శాసనము లీ సందర్భమున జ్ఞప్తియందుంచుకొనదగినవి :

దించుకొనలేదు. అతని తల్లి బూబూజీఖానము దన యనుచరులచే కమాలుఖానుని జంపించి క్రీ. శ. ౧౫౧౧ మే నెలలో దనకుమారుని చెఱనుండి విడిపించెను. రెండవవాడు బహమనీసుల్తాను ఇమ్మడి మహమూదుశాహు. క్రీ. శ. ౧౫౧౧ లో గమాలుఖానునితో సఖ్యముగుదుర్చుకొని యాతనికి బ్రతిగ బెడదకోట (బీదరు) రాజ్యమును బాలించుచుండిన బరీద్-ఇ-మమాలి కాతని జెఱబెట్టి సింహాసనము నాక్రమించుకొని తానె ప్రభువై స్వతంత్రముగ బ్రజాపాలనము సేయగడగెను. అతనికి నిజామ్-ఉల్-ముల్కు కుతుబ్-ఉల్-ముల్కు మొదలగు బహుమనీసామంతులు తోడగుటవలన యతడే

| | | |
|---|---|---|
| *NDI. Kr.* 27 | 1*st September* 1514 | *Yavanarajyasthapanacharya* |
| *ARE* 272 *of* 1897 | 8*th July* 1515 | " |
| *ARE* 243 *of* 1899 | 29*th March* 1516 | " |
| *ARE* 381 *of* 1907 | 1517 | " |
| *ARE* 244 *of* 1899 | 8*th August* 1519 | " |

వీనివలన కృష్ణరాయలకు 'యవనరాజ్యస్థాపనాచార్య' యను బిరుదు కనీసము క్రీ. శ. ౧౫౧౪ వ సం. నుండి యుండెనని తెల్లమగుచున్నది. ఇది 'అష్టదిగ్రాయమనోభయంకర' 'మూరురాయరగండ' యను బిరుదులవలె పరంపరగ వచ్చినది కాదు. రాయల పూర్వికులకు గాని, యతనిముందు వజ్రసింహాసనము నధిష్ఠించిన విద్యానగరసార్వభౌములకుగాని లేదు; కావున క్రీ. శ. ౧౫౦౯ వ సంవత్సరమున రాయలు విద్యానగరసింహాసనము నెక్కినతరువాతను, ౧౫౧౪ వ సంవత్సరమున కందుకూరు శాసనమును జెక్కించుటకు ముందును యవనరాజు నెవ్వరినో రాజ్యమున ప్రతిష్ఠించుటవలన గలిగి యుండవలయును. ఈ మధ్యకాలమున స్థానభ్రష్టులయి నిజరాజ్యపీఠము నధిష్ఠించుట కన్యుల సహాయము గావలసిన యవనరాజు లిద్దరుండిరి. ఒకడు ఇస్మాయీలు ఆదిల్‌ఖానుడు. రాజ్యసంరక్షకుడైన కమాలుఖానునిచే బంధీకృతుడాయెనని పూర్వప్రకరణమున జెప్పియున్నది. కాని ఇస్మాయిల్ ఆదిల్‌ఖానుడు రాయసహాయమువలన దన రాజ్యమును మరల సంపా

స్థిరముగ బీదరురాజ్యమున కధిపతి యగునను నభిప్రాయ మతనికి గలిగెను. కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౧౨ వ సంవత్సరమున ఆదిల్‌ఖానుని జయించి రాయచూరు దుర్గమును సాధించినపిమ్మట బరీదు స్వాధీనమందుండిన కలుబరిగె బీదరుదుర్గములను గైవసము జేసికొనియుండుటవలనను క్రీ. శ. ౧౫౧౪ వ సంవత్సరము నుండి 'యవనరాజ్యస్థాపనాచార్య' యను బిరుదతని కుండుటవల్లను, బీదరును జయించినప్పుడిమ్మడి మహమూదుశాహును చెఱనుండి విడిపించి సింహాసనము నెక్కించుటవలననే యా బిరుదాతనికి గలిగెనని మనమూహింపవచ్చును.

బహమనీసుల్తాను విజయనగరరాయలకు ప్రకృతిచే నమిత్రుడు. అతని నాశనము విజయనగరసామ్రాజ్యమునకు శ్రేయస్కరము. విజయనగర బహమనీ సంస్థానముల పరస్పరసంబంధ మిట్లుండ, ఛిలమైపోవుచుండిన బహమనీసంస్థానమును బునరుద్ధరించుటకు గృష్ణరాయ లేల పూనుకొనెనో తెలియదు. రాయలు కేవలయోధుడును, దళ

నాయకుడునుమాత్రము గాదు. రాజ్యతంత్రమును నడుపుటయం దాతని ప్రజ్ఞ యఖండమైనది. కావున యవనరాజ్యస్థాపన సేయుట కెద్దియో ప్రబల కారణ ముండియుండవలయును. స్థానభ్రష్టుడైన సుల్తానును మరల గద్దె నెక్కించిన సతనివలన భావి కాలమున బహమనీసామంతులతో దనకు గలుగ బోవు యుద్ధములందు లాభము గలుగవచ్చు నని యెంచి యట్లు చేసియుండవచ్చును.

ఈ దండయాత్రల మూలమున విజయనగర సామ్రాజ్యపు కీర్తిప్రతిష్ఠలు వాసికెక్కినవి. యుద్ధము నడపుటయందు కృష్ణరాయ లద్వితీయ శక్తిసామర్థ్యములుగల సేనాధిపతి యని యందఱకును విదితమాయెను. సింహాసనము నెక్కిన మూడేండ్లలోపల బహమనీసుల్తాను నోడించెను; యూసపుఆదిల్‌ఖానుని వధించెను; ఇస్మాయిల్ ఆదిల్‌ఖానుని జయించి రాయచూరు ముదుగల్లు దుర్గములను కృష్ణాతుంగభద్రల మధ్య సీమలను స్వాధీనపఱచుకొనెను; కలుబరిగమీద దండువెట్టి నిజామాదిబహమనీసామంతుల నిర్జించి వరాహ ధ్వజము నా కోటయలంగములపై స్థాపించెను. బరీదును పరాజితుని గావించి యతని సప్తాంగములను హరించి, యతనిచే బంధీకృతుడైన యిమ్మడి మహమూదుశాహుబహమనీని చెఱనుండి విముక్తుని జేసి మరల సింహాసనాధిష్ఠితుని జేసి 'యవనరాజ్య స్థాపనాచార్య' డను బిరుదును వహించెను. ఇంతటి యల్పకాలమున నింతలేసి ఘనకార్యముల నొనర్చిన మహారాయల శక్తిసామర్థ్యములను గాంచి విద్యానగరసామ్రాజ్యప్రజ లబ్బురపడుట యందు వింత యేమి కలదు ?

## అనుబంధము ౧

### ఇమ్మడి మహమూదుశాహు కడపటి జీవితము

రాయవాచకమునందు ఉమ్మత్తూరు శివసముద్రములను జయించిన పిమ్మట కృష్ణదేవరాయలు శ్రీరంగపట్టణమునకు బోయి యచటినుండి ఇక్కేరి ఆరంగాలకును దరువాత విజాపురసరదు స్థలాలమీదుగ గోలకొండ సరదు స్థలాలకును జేరగా అచ్చట మూడు తెగల రౌతులున్ను యెదిరించి యేరు దాటి వచ్చి మోర్చావేసి పాళ్యము దిగిరనియు, వారిని రాయలు భీకర సంగరమున నోడించి విజయు డాయెననియు చెప్పియున్నది.[1] కృష్ణరాయవిజయమునందు పేర్కొనబడిన మూడు తెగల రౌతు లెవ్వరై నదియు వివరింపబడియున్నది.

"ఆహా గణుతింపశక్యమె !
యహర్నిశముఁ భయమందియుండి ర
య్యాగరనాముదానగరియందు
విజాపురి గోలకొండలోఁ."

"లక్షగుఱ్ఱంబుతోడను లక్షణంబు
మెఱయబీరాన మూడిండ్ల తురకదొరలు
కృష్ణవేణికి నీవల గృష్ణరాయ
నృపునకెదురుగ జనుదెంచి నిలిచిరపుడు."

కావున గృష్ణరాయలు గోలకొండ సరదుస్థలములయందు యుద్ధము జేసినది అహమదానగర గోలకొండ విజాపురసైన్యములతోనని తెలియుచున్నది.

ఈ యుద్ధము జరిగిన కాలమెప్పుడో మొదట నిశ్చయింపవలసి యున్నది. రాయవాచకమునను గృష్ణరాయ విజయమునను కృష్ణరాయలుమ్మత్తూరు శివసముద్రములను సాధించిన పిమ్మట శ్రీరంగపట్టణమునకును దరువాత ఇక్కేరియారంగలకును నచటినుండి కృష్ణా తుంగభద్రల యంతర్వేదిలోని ముదుగల్లు రాయచూరు దుర్గములమీదుగ గోలకొండ సరదు స్థలములకును బోయి చేరెనని యున్నది. కృష్ణరాయవిజయమున గూడ నిట్లే కలదు. ఉమ్మత్తూరు జైత్రయాత్ర క్రీ. శ. ౧౫౧౨-౧౩ లో ముగిసెనని ఇంతకుముందు దెల్పబడియున్నది. దీనినిబట్టి కృష్ణరాయలు గృష్ణాతీరమున

---

1. *Sources of Vijayanagara History.* pp. 118-119.

గోలకొండ సరదుస్థలములందు మూడు తెగలతురక రౌతులతో యుద్ధము జేసినది క్రీ. శ. ౧౫౧౨-౧౩ నకు తరువాత నని తోచగలదు; కాని ఈ యూహ సరియైనది కాదు. ఏలన, రాయవాచక రచయిత కాని యతని గ్రంథమును బద్యకావ్యముగ వ్రాసిన కుమార ధూర్జటికాని తమ గ్రంథములందు బేర్కొనిన రాయల విజయములన్నిటిని పూర్వాపర కాల క్రమమును దప్పనీయక వర్ణించిరని విశ్వసించుటకు వలనుపడదు. వారు కావ్యసరణి ననుసరించి కృష్ణరాయల దిగ్విజయ వర్ణనను బశ్చిమదిశయం దారంభించి ప్రదక్షిణముగ నుత్తర పూర్వ దక్షిణవిజయములను వర్ణించి యుండవచ్చును. ఈ యనుమానము కేవలము నిరాధారము గాదు. ఉమ్మత్తూరు దండయాత్ర నడచుచుండిన సమయముననే కృష్ణరాయలు 'దక్కనురాజు'తో ననగా బహమనీ సుల్తానుతో బోరుచుండెనని సమకాలిక పోర్చుగీసు రచయితల వ్రాతలవలన దెలియుచున్నది. క్రీ. శ. ౧౫౧౦ జనవరి నెలలో గృష్ణరాయలు దక్కను రాజుతో బోరుచుండెనని యల్బూకెర్కు కామెంటరీసులో వ్రాసియున్నది.[2] క్రీ. శ. ౧౫౧౦ జనవరి తేది ౨౧నాటి కృష్ణదేవరాయల హంపీశాసనమున నతడు సుల్తానును బరాభూతుని గావించినట్లున్నది.[3] ఇదిగాక, క్రీ. శ. ౧౫౫౬ లో రచింపబడిన డి బ్యారా సనునతని 'డికాడా' సను చరిత్రగ్రంథమున, సవాయి యనగా విజాపురసంస్థానస్థాపకుడగు యూసుఫు ఆదిల్ ఖానుడు మృతిచెందిన వెంటనే నరసింగ (విజయనగర) రాజ్యాధిపతి విజాపురముపై దండు వెడలెననియు, నాల్బూకెర్కు అదియె యదనని యెఱిగి గోవాపట్టణముపై నెత్తిపోయి దానిని జయించెననియు వ్రాసియున్నాడు. డి బ్యారాసు కృష్ణరాయల కాలమున విజయనగరమునకు వచ్చియుండిన పోర్చుగీసులు వ్రాసిపంపిన వృత్తాంతముల నాధారపఱచుకొని చరిత్రను రచియించియుండుటవలన నందు వివరింపబడిన విజయనగర దక్కను రాజ్యములకు సంబంధించిన చరిత్రాంశములన్నియు విశ్వాసపాత్రములని పరిశోధక పండితుల యభిప్రాయము. కావున కృష్ణరాయలు రాజ్యాభిషిక్తుడైనవెంటనే బహమనీసుల్తానుతోనొక ప్రక్కను ఉమ్మత్తూరి ప్రభువులతో మఱియొక ప్రక్కను నేకకాలమున యుద్ధము సేయుచుండెనని తెల్లమగుచున్నది. మఱియు క్రీ. శ. ౧౫౦౯-౧౦ వ సంవత్సరమునకు దరువాత బహమనీసామంతులు—వారియందును ముఖ్యముగ నేదులఖాన నిజామనమలక కుతుపనమలకలు—మత్సరగ్రస్తులై పరస్పరము బోట్లాడుచుండిరి. లభించిన మహమ్మదీయ చరిత్రల నన్నిటిని బరిశీలించి చూడగా క్రీ. శ. ౧౫౦౯-౧౦, ౧౫౬౪ వ సంవత్సరముల మధ్య మూడిండ్ల తురకలును ఏకమై విజయనగరముతో యుద్ధము జేసినట్లు కానరాదు. కావున రాయవాచకమున జెప్పినట్లు గోలకొండ సరదుస్థలములలో గృష్ణరాయలు మూడిండ్ల తురకలతో బోరాడి యుండిన, నది క్రీ. శ. ౧౫౦౯-౧౦ న బహమనీ సుల్తానుతో జేసిన యుద్ధమునందై యుండవలయును అగునేని హంపీశాసనమున జెప్పబడిన సుల్తానుపరాజయ మీ యుద్ధముననే సంఘటిల్లెనని యనుకొనవచ్చును. రాయవాచకము బట్టి యా యుద్ధవృత్తాంతమును సంగ్రహముగ నిట్లు చెప్పవచ్చును.

"గోలకొండవారి సరదుస్థలాలకై నడవంగా అక్కడ మూడుతెగల రౌతులున్ను, మోర్చావేసి పాళ్యము దిగినారు. వేగర్లువచ్చి రాయలదేవునితో తురకలు లక్షగుఱ్ఱాలుతోడట్టున్ను వెయ్యియేనుగుల తోడట్టున్ను కృష్ణదాటివచ్చి పాళ్యం దిగినారని విన్నపంసేయంగా రాయలవారు విని 'తురకలు కృష్ణవేణి దాంటివచ్చి డేరిజావేసి దిగేట్టా ?' అని ఆగ్రహించుకొని అమరనాయకంవారలలో పెంమ్మసాని రామలింగమనాయణ్ణి బిలిచి, 'తురకలు కృష్ణవేణి దాంటివచ్చి డేరిజావేసి పాళ్యం దిగినారట. ఇందులకు యేరీతున నడవవలెనో ?' అని అడిగినందులకు, 'తురకల కార్యమనంగా యెంత మాత్రం ? దేవరవారి ప్రతాపంవల్ల డేరిజాతాళ్ళు తెగకోసేను. అప్పుడు భేరి తాడనంసేసి నడిస్తేను తురకలు మూడుతెగలున్నూ విరిగి యథాయథలై

---

2. *Commentaries of Affonso Dalbuquerque. II. pp.* 74-77.

3. *EI. I. p.* 363

తమతమ స్థలాదులకు పొయ్యేటట్టు సేసేను' అని విన్నవంశాయగా రాయలవారు చాల సంతోషపడి రామలింగమనాయనికి పట్టీలు యిచ్చి అంపగా రామలింగమనాయడు వెలువడిని వచ్చెను.

"తురకలు ఈ వార్తలువిని డెరిజావద్ద జీరా సంజ్జోగంత్తో విచ్చుకత్తులరౌతులు అరవైవేలున్ను వారిని చుట్టుకనిండు సంజ్జోకం గుఱ్ఱాలు పది వేలున్న వార్లను అనుసరించ్చుక యుండే మగ హత్తులు, వెయ్యింటికిన్ని యీ రీతిని డెరిజావద్ద ఉంచి మూడు తెగల తురకలున్ను తమతమ పాళ్యములో ఆయత్తపాటుతో జాగ్రత్త గలిగియుండిరి.

"రామలింగమనాయడు తురకల పాళ్యం వారి సమీపానకుపోయి యేనుగుల బారుమీద తొక్కి నడచి మదహత్తీల తొండముల ఖండములుగా నరికి మావటీలను యీటెలతో కుమ్మితోసిరి. గుఱ్ఱాల పక్కెరలెత్తి కురచయీటెలతోనున్ను పిడి యీటెలతోనున్ను పందిబల్లెములతోనున్ను గుచ్చి తోసేదిన్ని దోసకాయల చందాన వేటారుతునకలుగా నరికేదిన్ని యీరీతి నొప్పించగా గుఱ్ఱాలు వెనుకముందై పారసాగెను. అప్పుడు నాలుగువేల గుఱ్ఱం చాపకట్టగా పడగా అటువెనుక విచ్చుకత్తుల రవుతులమీద జగడ మియ్యంగా సరిచావులుగా ఆరువేలకు నాలుగువేల రవుతులు పడిరి. అంతట రామలింగమనాయుడు డేరీజుతాళ్ళు తెగకోయించగా డెరిజా నేలకూలెను. ఆ క్షణాన్నె కృష్ణరాయలవారు, భేరితాడనం సేయించి మదహత్తి నెక్కుకొని ఉభయఛత్రములతోనున్ను, మకలపెక్కెములతో నూట యిరవైఘట్టముల యేనుగలున్ను అరవైవేల గుఱ్ఱాలున్ను అయిదు లక్షల పాయదళమున్ను పొట్లముగ నడచిరి.

"ఆక్షణాన్నె కృష్ణవేణి వుభయతీరాలున్ను ప్రవాహంనిండి రాసాగెను. జగడముఖానకు తురకల యేనుగల మొనచేస్తే గ్రీష్మకాలం యెండ చేతను డస్సిన యేనుగులు గనక దగదప్పిపుట్టి చల్లగాలిచేత కాలుజారి కృష్ణవేణిలో బోయి పడెను. గుఱ్ఱాల రౌతులు "యేరునీళ్లువచ్చెను. యివతలనుండి కార్యంకాదని గుఱ్ఱాలవారు యేనుగలవెంబడినె తిరిగిరి. మొదటి దొరలు ముగ్గురున్ను 'దైవీకంగా పెడతలపోటుగా ప్రవాహం వచ్చెగనక యిక్కడను పాళ్యందిగి జగడమిచ్చే మంటే రస్తుసామగ్రీలును అమరదు. అన్నింటికిన్ని యేఱుదాటి ఆవలనిల్చి సరిపోయినట్లు నడిపించుకొందాము.' అని సీమకు తిరుగగానె యేరునిండారుగా వచ్చెను. రాయలవారున్ను వెంబడించినడచి జగడంసేయగా అందరున్ను విరిగి పారిపోయిరి. మూడుతెగల తురకలున్ను హతశేషులైన వారి గూర్చుక విజయాపురం గోలకొండ, అహముదా నగరం చేరబోయినారు.

"కృష్ణరాయలవారు కృష్ణవేణి వొడ్డుకు వచ్చి మూడుతెగల తురకల యేనుగ గుఱ్ఱాలున్ను నగర కట్టిపెట్టమనిన్ని గుడారులు, నిశానులు, నగరా మొదలైనది మొదట జగడానదొరికిందిగనక అదంతా నగరకట్టమని అప్పాజి మొదలైన నియ్యోగులతో నున్ను చెప్పి ముక్కుతిమ్మన్న మొదలైన కవీశ్వరుల దిక్కు జూచి 'నేటిజయం యేరీతు?' అని అడిగినందులకు ముక్కుతిమ్మన్న చెప్పిన పద్యం :—

నరసింహకృష్ణరాయా
దురమున నీ పేరు లేఱు దురకల ద్రుంచెఁ
కరిరాజవరదుడని యీ
కరిఘటలు న్నినున్నుజూచి గ్రక్కునదిరిగెఁ. "[4]

రాయవాచకమునందలి ఈ యుద్ధవర్ణనను గూర్చి విశేషించి వివరించి చెప్పవలసిన యంశము లెవ్వియు లేవు; కాని యించుకంత పరిశీలింపదగినవి రెండు మూడు విషయములు గలవు.

(౧) డెరిజావేయుట :—ఈ యుద్ధవర్ణన యందు 'డెరిజా' కత్యంత ప్రాముఖ్యతగలదు-ఉ. 'తురకలు కృష్ణవేణిదాంటివచ్చి డెరిజావేసి దిగేట్టం?'; 'డెరిజా తాళ్లు తెగకోసేను'; 'డెరిజా

---

4. సోర్సస్ ఆఫ్ ది విజయనగర హిస్టరీ, పుటలు ౧౧౯-౧.౨౨. రాయవాచక ముద్రిత ప్రతులలో నీకంద పద్యద్వితీయపాదమున 'నీపేరుపేరం' అనియు తృతీయ పాదము 'కరిరాజవరదుడవనీ' అనియు ముద్రితమై యున్నవి.

వద్ద జీరాసంజోకంతో'; ఒకచోట 'డేరీజుతాళ్లు' అనికలదు. ఈ యుద్ధవర్ణనయందే కృష్ణరాయ విజయమున 'దేరిజత్రాళ్లు' 'దేరిజపుత్రాళ్లు' అని యున్నది. కావున డెరిజా, డేరీజు, దేరిజ యనునవి సమానార్థకపదములనుట స్పష్టము. అవి యన్నియు హిందీభాషలోని 'డేరా' యను పదమునకు భ్రష్ట రూపములు. వీనికన్నిటికిని 'గుడారము' లేక 'పట గృహము' అని యర్థము.

డెరిజా యర్థము విశదమైనది. ఇక డెరిజాను వేయుటయందు గల విశేష మేమో కనుగొనవలసి యున్నది. కాని డెరిజా యెవ్వరిదో మొదట తెలిసి కొనినగాని దాని నెత్తుటయందుగల విశేషము దెల్లముకాజాలదు. కృష్ణానదిని దాటివచ్చి పాళ్యముదిగి డెరిజా వేసినవారు మూడుతెగల (అనగా అహమదానగర విజాపురగోలకొండ) తురక రౌతులగుటచేత, డెరిజా వారిదని కాని వారి మొదటి దొరలదనికాని యభిప్రాయము సహజముగ గలుగవచ్చును; కాని ఇది సరికాదు. ఏలన 'డెరిజా వద్ద జీరాసంజోకంతో విచ్చుకత్తులరౌతులు అరవై వేలున్ను వారిని చుట్టుకనిండు సంజోకం గుఱ్ఱాలు పదివేలున్ను వార్లనుఅనుసరించుకయుండె. మద హత్తులు వెయ్యింటికిని యీరీతిని డెరిజా వద్దవుంచి మూడుతెగల తురకలున్ను తమతమపాళ్యములో ఆయత్తపాటుతో జాగ్రత కలిగి యుండగా' నను వాక్యము వలన డెరిజా మూడు తెగల తురకలకు గాని వారి నాయకులకుగాని చెందినది కాదనియు, వారికి వేఱువేఱు పాళ్యములుండెననియు స్పష్ట మగుచున్నది. అట్లయిన డెరిజా మఱియెవ్వఱిది? అను ప్రశ్నకలుగుచున్నది. రాయవాచకమునం దెచ్చటను బేర్కొనబడకపోయినను, ఆ డెరిజా పైమూడు తెగల తురకరౌతులకును యేలికయైన బహమనీ సుల్తానుదనుటకు సంశయింపబనిలేదు. ఇమ్మడిమహామూదుశాహు అందరు బహమనీ సామంతులచే నింకను దమయధిపతిగ నంగీకరింప బడుచుండెను. విజయనగరముపై నతడు చేయు చుండిన జిహాదులన్నిటియందును పై వచింపబడిన మూడు తెగలతురకలును పాల్గొనుచు వచ్చిరి. కావున నీయుద్ధముగూడ సర్వసామంతులతో నెత్తివచ్చిన సుల్తాను నాధిపత్యముక్రిందనే నడచెను.

మహమ్మదీయరాజులు స్వయముగ దండ యాత్రలను నడపునప్పుడు తమ 'తొగటిగుడా రము'ను స్కంధావారమధ్యమున నెత్తించికొనెడి వారు; ఆ గుడారమున కిరువంకలను సేనాధిపతు లును నుమ్రాలును నాయకులును విడియువారు. ఇది సుప్రసిద్ధము. అప్పటి కర్ణాటసామ్రాజ్యజనుల కిది సుపరిచయమే. ఆంధ్రకవు లీ యంశమును దమ గ్రంథములందు బొందుపఱచి యున్నారు. ఒక యుదాహరణము

"చలమొప్పన్ మరుపాదుశాహి
జగముల్ సాధింప దండెత్తి మ
త్తిల బ్రహ్మాండపు గెంపుదళ్కు
బురుసా దేరీజ నెత్తింప నం
గలి యస్తాచల పూర్వశైల
శిఖర స్తంభాగ్ర భాగంబులన్
గల మాణిక్యపు బిళ్లలో యన
దగెన్ గంజాప్త చంద్రాకృతుల్."[5]

ఈ పద్ధతి మొదట ఢిల్లీసుల్తానుల కాలమున వాడుకయందుండినది; వారి ననుసరించి బహమనీ సుల్తానులు గూడ నీ పద్ధతి నవలంబించినట్లు ఫెరిష్తా చరిత్రవలన దెలియుచున్నది. డెరిజా వేయుట యందు విశేషమేమనగా, శత్రులపై జయమో వారిచే బరాజయమో గలుగునంతవఱకు సుల్తా నచ్చట స్థిరుడై నిలచునని సూచన. డెరిజాను శత్రువుల చేబడనీయక గాపాడుచు జయము జేకూర్చుట దండనాయక సామంతాదుల విధి. డెరిజా కూలిన సుల్తాను పరాజయమందె నని యర్థము. విజయనగరమున నిది వెలిగుడారమను పేర బ్రసిద్ధికెక్కినది.

ఇచట పరిశీలనార్హమైన విషయ మింకొకటి కలదు. ఇది కృష్ణరాయలకు మొదటి జగడమట. అనగా రాయ లంతకు పూర్వమే శత్రువుతోడను జగడించలేదని యర్థము. అట్లయిన కృష్ణరాయ లుమ్మత్తూరి దండయాత్రకు ముందే మూడు తెగల తురకలతో గోలకొండ సరదుస్థలమున యుద్ధము

5. భాను. పరి. ౪: ౨౪.

జేసెనని తేలుచున్నది. అనగా క్రీ. శ. ౧౫౦౯-౧౦ సం॥న గృష్ణరాయల రాజ్యాభిషేకమైన క్రొత్తలో నీయుద్ధము జరిగినట్లున్నది.

మహమ్మదీయచరిత్రలయందీ యుద్ధప్రస్తాపము గానరాదు; కాని బహమనీసుల్తాను రెండవ మహమూదొక పర్యాయము విజయనగరముపై జిహాదువెడలి యుద్ధమున బలముగ గాయపడి పరాజితుడై పాఱిపోయెనని కొందఱు మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు. ఈ జిహాదు వృత్తాంతము తారీఖిమహమ్మదు కుతుబుశాహియను చరిత్రయందిట్లు వర్ణింపబడియున్నది.

"మరుసటియేడు, హి. ౯౧౧ (క్రీ. శ. ౧౫౦౬) వ సం॥ న, బీదరు సంధిప్రకారము సుల్తాను ఉమ్రాల నందఱిని వారివారిదళములతో గూడ రాజధానికి రానుత్తరవు లంపెను. అట్లే యుమ్రాలందఱును వచ్చి యతని గూడుకొనినంతట మరల విజయనగరము వైపున నడచెను. సుల్తానుదండు దెబ్బీవచ్చి చేరగనే హిందూదళములు వారి కడ్డపడినవి; ఘోరసంగ్రామము జరిగినది. శత్రుసైన్య వామపక్షమును మల్లిక్ కుత్బుల్ముల్కు భగ్నము గావించెను; కాని మధ్యభాగము నెదిర్చి పోరాడుచుండిన మహమూదుశాహు విఱిగి గుఱ్ఱముమీదినుండి క్రిందికిద్రోయబడి త్రొక్కుడువడి మృత్యువునోటబడ సిద్ధుడాయెను. కాని యతడదృష్టవశమున నిజాశ్వికులు గొందఱిచే గుర్తింపబడి పల్లకియందు శాహు మొహిబుల్లా కుమారుడగు మీరు లుత్ఫుల్లా శిబిరమునకు గొంపోబడెను. అచటినుండి సైన్యము రాజధానికి వెనుదిరిగి పోయెను. ఉమ్రాలందఱు యెవరి సీమలకు వారు పోయి చేరిరి."[6]

సయ్యదు అలీ ఇబన్ అజీజుల్లా తబాతబా కృత బుర్హాన్-ఇ-మఆసీర్ అనుచరిత్రయందీ జిహాదు మఱికొంత విపులముగ వర్ణింపబడియున్నది.

"బహీరుఖుదావిందు ఖానునికి మరణశిక్ష జరుగుటకు పూర్వము (హి. ౯౨౩ = క్రీ. శ. ౧౫౧౭), విప్లవకారుల బాఱదోలుటకొఱకు, గొప్ప సైన్యముతోగూడ నాస్థానమునకు రావలయునని రాజ్యమునందెల్లయెడల నుండు నమీరులకును గొప్పవారికిని [సుల్తాను] ఫర్మానాయొకటి సాదరు చేయబడెను. ఉత్తరువుప్రకారము అమీరులెల్ల యుద్ధసామగ్రులను సేకరించుటయందు నిమగ్నులై తమ సైన్యములను గూర్చుకొనిరి; కాని వారాస్థానమునకు వచ్చిచేరుటకు ముందే సుల్తాను హృదయమున విప్లవకారులమూలమున బొడమిన భయము తీరిపోయినది. అమీరులు సుల్తాను సేవకు రానాజ్ఞాపింపబడినవారగుటచేత, నందఱును అతనికి మ్రొక్కుటకు సత్వరముగవచ్చిరి. అందఱికంటె ముందు సుల్తాన్ అహమదు బహరీ తన సైన్యముతో గూడ వచ్చి రాజదర్శనమును జేసి యతని మన్ననకత్యంతపాత్రుడాయెను; అతని తరువాత పరెండా నుండి నూరీఖానుఖ్వాజా-ఇ-జహాను వచ్చి దర్శన మొనర్చుకొనెను. మజ్లిసి రఫీఅ ఆదిల్ ఖానుడు, మస్నద్-ఇ-అలీ ఇమాదుల్-ముల్కు, దస్తూర్-ఇ-మమాలిక్ మున్నగు తక్కిన అమీరులును దొరలును, వీరుగాక ఇతరులు కొందఅమీరులును మల్లికులును, సుల్తానువచ్చి యాస్థానమును జేరెనని వినినంతటనె, లెక్క కెక్కువయైన దళములతోగూడ బయలుదేరి రాజధానికివచ్చి సుల్తానుకు నమస్కరించి సేవకు దాము సంసిద్ధులమని విన్నవించుకొనిరి.

తనపతాకపు గ్రీనీడ గూడిన యా మహాసైన్యమును జూడగనె, విగ్రహారాధకులపై మతయుద్ధము జేసి పుణ్యమును సంపాదింపవలయునను కోరిక సుల్తానుచిత్తమున గాఢముగ బాదుకొనెను. కావున దుర్జనులగు విగ్రహారాధకులను గూలద్రోయుటకు ధ్వజమెత్తి రాజధానినుండి బయలు వెడలెను. దెబ్బీ కడకు సుల్తాను జేరునప్పటికతని యాగమనము శత్రువు లెఱిగి యుద్ధమునకు సంసిద్ధులై యతని సైన్యముతో బోరాడ సత్వరముగ వచ్చిరి. యుద్ధము సంఘటిల్లినది. కాని యాకస్మికముగ సుల్తానుసేన ఘోరవిపత్తు పాలైనది.

6. *Briggs' Ferishta, III. pp.* 350-51.

సుల్తాను నిలిచి యుద్ధము సేయుచుండిన సేనా మధ్యము తక్కిన భాగములనుంచి వేర్పడెను. అశ్వికులత్రొక్కిందువలనను, ముందు వెనుకలకు బఱచు కాల్బవర సంచలనమువలనను ఇస్లామియాపాదుశాహు గుఱ్ఱముపైనుండి క్రిందబడెను. ఉభయ సైన్యము లొండొంటిని తారసిల్లినపుడు దుమ్ము వెల్లురేగినది. ఇరువాగులవారును కలగా పులగముగ గలియుటవలన మిత్రులనుండి శత్రులను వేర్పఱచుటకు సాధ్యము గాదాయె. కావున పూతశరీరుడైన సుల్తాను నుత్తమాంగము బగిలి పలుతావుల గాయపడువఱకును నత డేమైపోయినదియు నెవ్వరు నెఱుగ జాలరైరి; కాని యాసందడిలో గొందఱు నవుకరులు దమ యేలికను బొడగని, వెంటనె యాతని చెంతకుబోయి, గుఱ్ఱముల మధ్యనుండి వెలుపలకి గొనివచ్చి పల్లకియం దుంచి శాహు మహబ్బుల్లా కుమారుడగు మీర్జా లుత్ఫుల్లా శిబిరమునకు గొంపోయిరి.

"అమీరులును దొరలును సుల్తాను గాయపడుట నెఱిగిన వెంటనె కయ్యము చాలించి యతని దర్శనము జేసికొనబోయిరి. సుల్తానుగాంచి దుఃఖితులై [illegible] నుండి [illegible] నదీ ప్రవాహమువలె నశ్రుప్రవాహములను గార్చిరి. పరువాత యుద్ధమును విరమించుకొని రాజధాని ముఖమై తిరిగిపోయిరి. బీదరుప్రాంతమును [illegible] యమీరులును దొరలును సుల్తానునాజ్ఞచే సత్కారమును బొంది యెవ్వరి [illegible] వారు వెడలిపోయిరి." 7

తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుతుబుశాహంబును, బుర్హాన్-ఇ-మ ఆసీరులోను వర్ణింపబడిన జిహాదొక్కటియే; కాని యది జరిగిన కాలము రెండు చరిత్రములందును రెండువిధములుగ వ్యత్యస్తముగ వర్ణింపబడియున్నది. తారీఖ్-ఇ-ముహమ్మదుకుల్లీ కుతుబుశాహులలో హి. ౯౧౧ (క్రీ. శ. ౧౫౦౬) లో జరిగినట్లును, బుర్హాన్-ఇ-మ ఆసీరునందు హి ౯౨౩ (క్రీ. శ. ౧౫౧౭) సం॥నకు ముందర నడచినట్లును వ్రాసియున్నది కాని ఈ రెంటియందును జెప్పబడినకాలము అంగీకరింపదగినదికాదు ఏలనగా, తారీఖ్-ఇ-కుల్లీ కుతుబుశాహు రచయిత కుల్లీకుతుబుశాహు మొదలయిన బహమనీయుమ్రా లందఱును హి ౯౧౨ (క్రీ. శ. ౧౫౦౭) సం॥న సుల్తాను మహమూదుశాహు మరణాంతరమే స్వతంత్రులైరని ప్రకటించు నుద్దేశము గలవాడగుటచే నీ జిహాదు తత్పూర్వము హి. ౯౧౧ (క్రీ. శ. ౧౫౦౬) లో జరిగెనని వ్రాసెను; కాని మహమూదుశాహు హి ౯౧౨ న మృతినందలేదు; వాస్తవముగ నతడు కాలధర్మమందినది హి. ౯౨౪ (క్రీ. శ. ౧౫౧౮) వ వర్షమున నని ఫెరిష్తా, సయ్యద్ అలీ మున్నగు చరిత్రకారులు వ్రాసియున్నారు. మఱియు హిందూ చరిత్రాధారగ్రంథములం దెచ్చటను క్రీ. శ. ౧౫౦౬ లో బహమనీసుల్తానుపై నింతటి ఘనవిజయమును విజయనగరరాయలు పొందినట్లు చెప్పియుండలేదు; కాని వీరనరసింహరాయల యేలుబడియందు మహమ్మదీయులతో నతడొక పర్యాయము యుద్ధముచేసినట్లు కలదు; కాని యతని ప్రతిపక్షి యేసుబలఖానుడు గాని సుల్తానుఇమ్మడి మహమూదుశాహుబహమనీకాదు.8 ఇక బుర్హాన్-ఇ-మఆసిరులో-హి. ౯౨౩ (క్రీ. శ. ౧౫౧౭) నకు ముందని చెప్పియున్నను ఎంతముందో నిశ్చయించుటకువీలులేదు. కాని యాజిహాదు కాలనిర్ణయమునకు దోడ్పడగల చరిత్రాంశమొకటి యందు గానవచ్చుచున్నది. ఈ జిహాదునందు సుల్తాను మహమూదుశాహుతో గూడ యుద్ధమునకు నడచిన యుమ్రాలలో మల్లిక్ అహ్మదుబహరీ నిజామ్-ఉల్-ముల్కొక్కడని సయ్యద్ అలీ చెప్పియున్నాడు. మల్లిక్ అహ్మద్ బహరీ నిజామ్-ఉల్-ముల్క హి. ౯౧౬ (క్రీ. శ.

---

7. *Burhan-i-Maasir, I. A. XXVIII. P.* 321.

8. క్రీ. శ. ౧౫౦౦ వ సంవత్సరమున వర్థెమా యను పాశ్చాత్య ప్రయాణికుడు గోవాకువచ్చి యుండినపుడు, సవాయి (అనగా, యూసుపు ఆదిల్ ఖానుడు) నరసింగరాజుతో యుద్ధముసేయుచుండె నని వ్రాసియున్నాడు. నరసానాయకుడు క్రీ. శ. ౧౫౦౩ వ సం. న శివసాయుజ్య మందెను. తరువాత ఇమ్మడి నరసింహరాయలు నామకార్థము సింహాసనాధిపతియై యుండినను, రాజ్యకార్యమంతయు నరసానాయకుని జ్యేష్ఠపుత్రుడు వీరనరసింహరాయలు మూలమున నెరవేరుచుండినవి. కావున యొకవేళ హిందూచరిత్రాధారగ్రంథములు వివరించు యుద్ధ మిదియైనను గావచ్చును. (వర్థేమాయొక్క. ఐటి.నరరీ. పుట ౧౨౪.)

౧౫౧౦-౧౧) వఱకు జీవించియుండెను.[9] కావున నీ జగడు పాల్గొనిన జిహాదతని మరణకాలమునకు ముందే నడచియుండవలయును.

పై వివరించిన యంశములను బట్టి చూడగా నీ జిహాదు క్రీ. శ. ౧౫౦౯-౧౦ వ సంవత్సరమున, ననగా మల్లిక్ అహమదు ఖైరీ నిజామ్-ఉల్-ముల్కు మరణమున కించుక పూర్వము నడచినట్లు తోచుచున్నది ఈ యూహ సరియైన పక్షమున అల్బూకెర్క్కు కామెంటరీసులో చెప్పినట్లు కృష్ణరాయలతో దక్కనురాజు క్రి. శ. ౧౫౧౦ వ సంవత్సరమున ప్రారంభమున జేయుచుండిన యుద్ధమీజిహాదే కావలయును. మఱియు రాయవాచకమున గృష్ణరాయలు గోలకొండ సరదుస్థలమునందు కృష్ణాతీరమున మూడు తెగల తురకలతో జేసినట్లు చెప్పియుండు సమరము ఇదియ కావలయును. ఈ యభిప్రాయ మంగీకార్యమేని, రాయవాచక కృష్ణరాయవిజయములలోని ఈ యుద్ధవృత్తాంతము తారీఖ్-ఇ-ముహమ్మదు కుతుబుశాహీ, బుర్హాన్-ఇ-మ ఆసీరులలో బేర్కొనబడిన సుల్తాన్ ఇమ్మడి మహమూదుశాహుయొక్క జిహాదు వర్ణనకు హిందూపాఠాంతరముగ గ్రహింపవలసియున్నది.

హిందూమహమ్మదీయ వృత్తాంతములలో వర్ణింపబడియుండు ముఖ్యాంశముల నొండొంటితో బోల్చిచూచినయెడల నీ యభిప్రాయమందలి లోటుపాటులు జక్కగ విశదముగాగలవు.

హిందూగ్రంథములు :

౧. గోలకొండ సరదుస్థలమున కృష్ణ దక్షిణ తీరమున యుద్ధమునడచినది.

౨. మూడు తెగల తురకలు, అనగా నహమదానగర విజాపుర గోలకొండ దొరలు రాయల నెదిర్చిరి.

౩. యుద్ధరంగమున సేనా మధ్యమున (సుల్తాను ?) డేరాయుండినది. మూడుతెగల తురకలకును వేర్వేరు పాళెము లుండినవి. డేరాచుట్టును అశ్వదళములును యేనుగులును గాల్బలమును గాపుండెను.

మహమ్మదీయ చరిత్రలు :

౧ విజయనగర బహమనీ రాజ్యముల గడి ప్రదేశమున దేప్ని లేక దేప్లీయను స్థలమున యుద్ధము నడచినది.

౨. సుల్తాన్ ఇమ్మడి మహమూదుశాహు బహమనీ నాయకత్వమున బహమనీ సామంతులందఱును ముఖ్యముగ—నహమదానగర మల్లికు అహమదు ఖైరీ, నిజామ్-ఉల్-ముల్కును, విజాపుర ప్రభువు ఏదుల్ ఖానుడును, గోలకొండ పాలకుడు కుతుబ్-ఉల్-ముల్కును—ఏకమై హిందువులతో బోరిరి.

౩. యుద్ధరంగమున సేనామధ్యమున సుల్తాను ఇమ్మడి మహమూదుశాహు బహమనీ నిలిచియుండెను. ఆతని చుట్టును గుఱ్ఱపు ఫౌజు మెండుకొనియుండెను. కుడిప్రక్క కుతుబ్-ఉల్-ముల్కు దళము నడపుచుండెను.

9. సయ్యదు అలీ తన బుర్హాన్-ఇ-మ ఆసీరులో నీ మల్లిక్ అహమ్మదు క్రీ. శ. ౧౫౦౫-౬ న కించుక ముందు మృతి నందినట్లు వ్రాసియున్నాడు; ఫెరిష్తా ప్రకారమతని మరణము క్రీ. శ. ౧౫౦౭ లోనో, మఱి కొంచెము దరువాతనో సంభవించినది. ఆతడు క్రీ. శ. ౧౫౧౦ వ సంవత్సరమున జీవించియుండెననుటకు గొంత సాక్ష్యము గలదు. అత డా వర్షమున దస్తూర్-ఇ-మమాలికునకు ఇస్మాయిలు ఆదిల్ ఖానునితో యుద్ధము సేయుటకు సాయమొనర్చెను. (*Burhan-i-Maasir*, *I. A. XVIII. p.* 318). గుజరాతు దేశపు (అరబీ) చరిత్రయందు మల్లిక్ అహ్మదుల్బహరీ హి. ౯౧౬ (౧౦ ఏప్రిలు ౧౫౧౦ మొదలు ౩౧ మార్చి, ౧౫౧౧, వఱకు) లో కాలగతి నందెనని వ్రాసియున్నది. (*Arabic History of Gujerat III. Index. p.* 84)

| | |
|---|---|
| ౪. రాయల కమ్మ ఫౌజు తురక సేనపైబడి వారి యశ్వసేనను జిందరవందర గావించి, యేనుగుల దళమి కాళ్ళలముల నేలపాలు గావించి, డేరాత్రాళ్ళను గోసి డేరాను గూల ద్రోసిరి. అంతట మూడు తెగల తురకలును నోడి రణరంగమును విడిచి పాఱిపోయిరి. హిందువులు విజయులైరి. | ౪. కుతుబ్-ఉల్-ముల్కు శత్రుసైన్య దక్షిణ పక్షమును భగ్నము గావించెను. కాని మధ్యమున సుల్తానాశ్వికుల క్రందువలన గ్రింపడి యశ్వము లచే ద్రొక్కుడు వడెను. బలమైన గాయములు దగిలినవి అతని యుద్ధరంగమునుండి వెలుపలికి గొనిపోయిరి. బహమనీ సేనలు విరిగి యుద్ధమును త్యజించి వెడలిపోయెను. హిందువులు విజయులైరి. |

ఈపట్టికలు రెంటి నొండొంటితో బోల్చి చూడగా వానియందు భేదములకంటె బోలికలె యధికముగ గానవచ్చుచున్నవి ; కావున రాయవాచక కృష్ణరాయవిజయములును దారీఖ్-ఇ-ముహమ్మదుకుల్లీకుతుబుశాహ, బుర్హాన్-ఇ-మ ఆసీరులు వర్ణించు యుద్ధమొక్కటియే యని మనము నిశ్చయము సేయవచ్చును

## అనుబంధము ౨

## యూసుఫు ఆదిల్ ఖానుని మరణకాలము

క్రీ. శ. ౧౫౦౯-౧౦ వ సంవత్సరమున బహమనీసుల్తానుతో నైనయుద్ధమున కృష్ణరాయలు యూసుపుఆదిల్ ఖానుని వధించెనని చెప్పితిని. ఈ యభిప్రాయ మాముక్తమాల్యదలోని 'అలుకన్ఘోటక ఘట్టికా ఖురపుటీ' యనుపద్యముపై నాధారపడి యున్నదని తెల్పితిని. ఈ విషయమున జక్కగ కీ. శే శ్రీ కొమర్రాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సప్తమ సంపుటమున కృష్ణరాయలకొన్ని 'దిగ్విజయయాత్ర' లను వ్యాసమున జర్చించియున్నారు. ఈ వ్యాసమును లక్ష్మణరావుగా రొకముఖ్యాంశమును జర్చింపక విడిచిపెట్టిరి. అందువల్ల నీ విషయమును మరల పరిశోధింపవలసివచ్చినది.

యూసుపు ఆదిల్ ఖానుని మరణమునుగూర్చి ముహమ్మదు కాసిమ్ ఫెరిష్తా తన చరిత్రయం దిట్లు వ్రాసియున్నాడు.

"హజరీ ౯౧౫ వ సంవత్సరమున క్రైస్తవులు (పోర్చుగీసులు) ఏమఱుపాటున గోవాపైబడి పురపాలకుని, పెక్కు మహమ్మదీయులను వధించి దానిని స్వాధీనము జేసికొనిరి ఈ విషయము దెలియవచ్చి నంతటనె యూసుపు ఆదిల్ శాహు మూడువేల దిట్టల దక్కనీలను లాతివారిని గూర్చుకొని కడువేగముతో గూచిచేసిపోయి యైరోపీయు లాదమరచి యుండ పెక్కుమందిని చంపి యాకోటను దిరుగ పశపఱచుకొనెను ; కొందఱు ఓడలనెక్కి సముద్రముపై దప్పించుకొనిపోయిరి. గోవాసంరక్షణకు దగిన యేర్పాటులను గావించి యూసుపుఆదిల్ శాహు బిజాపూరునకు మరలివచ్చి తన డెబ్బదియైదవయేట మహావైభవముతో నిరువదియొక సంవత్సరములు రాజ్యపాలనము జేసిన పిమ్మట వాపుచే నగరులో మృతినందెను. "[1]

కృష్ణరాయ లేదులఖానుని దన యుత్తర దిగ్జయ యాత్రయందు వధించితినని చెప్పుచుండ, దీనికి విరోధముగ ఫెరిష్తా యతడు విజాపురమున శోఫజాడ్య పీడితుడై మృతినొందెనని వక్కాణించుచున్నాడు. వీరిలో నెవ్వరు నిజమాడుచున్నారో విచారించవలసియున్నది. ఫెరిష్తా చెప్పునట్లు యూసుపు ఆదిల్ ఖానుడు విజాపురమున మృతి నందలేదని రుజువు సేయగల సాక్ష్యము గొంత కలదు. తారీఖ్-ఇ-ముహమ్మదుకుల్లీకుతుబుశాహు నందు 'యూసుపు ఆదిల్ ఖానుడు కోవెలకొండ యందు మృతినందె' నని వ్రాసియున్నది.[2] అట్లే బుర్హాన్-ఇ-మఆసీరునందుగూడ 'మజ్లిస్-ఇ-రఫిఅ ఆదిల్ ఖానుడు కోవెలకొండ కనుచూపుమేరలో నుండగ మరణించె'నని యున్నది. పై బేర్కొ

1. *Briggs' Ferishta, III. pp.* 29-30.
2. ,, ,, *III. p.* 350.

నిన మహమ్మదీయచరిత్రకారు లిరువురును ఫెరిస్తాకు సమకాలికులే. వారిద్దరును యూసుఫు ఆదిల్ ఖానుడు కోవెల కొండలోనో దాని పరిసరములందో జచ్చెనని చెప్పుచుండగ, ఫెరిస్తాయొక్కనిమాటపై నాధారపడి యతడు విజాపురమున కాలధర్మము నందెనని నమ్ముట యెట్లు? కృష్ణరాయలు యూసఫుఆదిల్ ఖానునికి సమకాలికుడును బ్రతిపక్షియు. అతడు తా నాదిలు ఖానుని యుద్ధమున జంపితినని ఘంటాపథముగ జెప్పుచుండగ దరువాత డెబ్బది యెనుబది సంవత్సరములకు చరిత్రరచనకు గడంగిన ఫెరిస్తావ్రాతను నమ్మి యతడు రోగ పీడితుడై నిజరాజధానియందు దేహము చాలించెనని యొప్పుకొనుట యెట్లు?

మహమ్మదీయచరిత్రకారుల వ్రాతలను బట్టి యూసుఫు ఆదిల్ ఖానుని మరణకాలమును నిర్ణయించుటకు సాధ్యముగాదు. అతని మరణకాలము నొక్కొక్కరొక్క విధముగ జెప్పియున్నారు. వీరిచ్చు భిన్నకాలములను జబీరీ యిట్లు సంగ్రహముగ బొందుపఱచియున్నాడు. 'యూసుఫు ఆదిల్ ఖానుని మరణము తబకాత్-ఇ-యక్బరీ రచయిత ప్రకారము, హి. ౯౧౩ నను, ముహమ్మదుకాసిమ్ ఫెరిస్తాప్రకారము, హి. ౯౧౬ నను, రఫీఉ-ద్దీన్ షీరాజీ, మీర్ ఇబ్రాహిమ్ అసద్ ఖానీలప్రకారము, హి-౯౨౫ నను సంభవించెను.''[3] మఱియు సయ్యద్ ఆలీ బిన్ అజీజుల్లా తబా తబా యాదిల్ ఖానుడు మృతినందినది హి. ౯౧౨ నకు దరువాతయనియు, తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుతుబుశాహు రచయిత హి. ౯౧౦ లో ననియు[4], కాఫీఖా నొకచోట హి. ౯౧౬ లో ననియు, మఱియొకచోట హి. ౯౧౪ లో ననియు వ్రాసియున్నారు.[5]

మహమ్మదీయ చరిత్రకారు లిట్లు యూసుఫు ఆదిల్ ఖానుడు భిన్నకాలమున మృతినందెనని తెలుపుచున్నను, సమకాలిక పోర్చుగీసు రచయితల వ్రాతలవలన స్పష్టముగ నిర్ణయింపవచ్చును. పోర్చుగీసు గవర్నరు అల్బూకెర్కు గోవాను బట్టుకొనుటకొఱకు కొచ్చినుండి క్రీ. శ. ౧౫౧౦ సం జనవరి ౧౦ తేదినాడు బయలుదేరెను. కొన్నిదినములు సముద్రప్రయాణము చేసి యతడు అంజదీవా ద్వీపమును జేరెను; అచట నతడు విజయనగర నావికదళాధిపతియగు తిమ్మోజును గాంచెను. తిమ్మోజువలన గోవాపట్టణాధిపతి సబైయో మృతినందెనని తెలిసికొనెను. అంతట నాల్బూకెర్కు గోవామీది కార్యము నడపుటకు నిశ్చయించి, క్రీ శ ౧౫౧౦ ఫిబ్రవరి ౨౫ తేది వఱకు జరిగిన చర్చలో దన గళనాయకుల సహకారమునుబడసి, గోవావైపు నావల నెక్కిపోయెను శింతకోర దుర్గసమీపమున లంగరు వేసియుండగా దిమ్మోజు మరల నతనియొద్దకువచ్చి, 'గోవాపట్టణమందలి హిందువులు సందేశములవల్లను, ఉత్తరములవల్లను సబైయో మరణించెననియు, మల్లిక్ సూఫర్ గూగి యను నగాహాయి గోవాయందున్నాడనియు, నతడు సబైయోమరణానంతర మెవ్వరిని లక్ష్యపెట్టుటలేదనియు దనకు దెలియజేసిరనియు జెప్పెను[7] అతనిని ఏల గోవాను బట్టుకొనవలయునని యాల్బూకెర్కును ద్వరపెట్టుచున్నావని యడుగగా 'సబైయో మరణము వాస్తవమనియు నతనిచే దోపుడువడిహింసితులైనగోవాప్రజ లందురుమిక్కిలి సంతసించి తిరుగుబాటు చేసి'రనియు జవాబు చెప్పెను.[8] సింతకోరదుర్గమును బట్టుకొనిన పిమ్మట తిమ్మోజుచే బట్టుబడిన ఫకీరొక్కడు సబైయో మృతినందెననియు నతని పుత్రుడు రాజ్యమధ్య భాగమునకు బోయి యున్నాడనియు గోవా వార్తలని వచించెను.[9] ఈ విధముగ నిశ్చయమును దెలిసికొని అల్బూకెర్కు క్రీ.శ. ౧౫౧౦ మార్చి ౧ తేది నాడు గోవాపై బడెను; యుద్ధముగూడ జేయనవసరము లేకయే యతని కది హస్తగత మాయెను కావున నాల్బూకెర్కు కామెంటరీసు వలన నతడు క్రీ. శ. ౧౫౧౦ ఫిబ్రవరి ౨౦ తేది నాడు గోవాకు రాకపూర్వమే సబైయో, లేక

---

3. *Busatin-us-Salatin p.* 22.

4. *Burhan-i-Maasir, 2A‌XXVIII p.* 319.

5. *Muntakhab-ul-lubab, III (Biblio indnofo) pp.* 128, 280

7. *Commentaries of Affonso D. Albuquerque.* 1. *pp.* 81-82.

8. " " *p.* 85.

9. " " "

యూసుపు ఆదిల్ ఖానుడు చనిపోయెనని తెల్లము సేయుచున్నవి.

ఇంకొకసంగతి ఆల్బూకెర్కు గోవాపట్టణమును జయించినది యూసుపు ఆదిల్ ఖానునుండి కాదనియు నతని కుమారుడగు నిస్మాయిల్ ఆదిల్ ఖాను దగ్గరనుండియనియు పై నుదాహరింపబడిన కామెంటరీసు సాక్ష్యమునలన రుజుపగుచున్నది.[10]

పై చర్చవలన ఆల్బూకెర్కు క్రీ శ ౧౫౧౦ ఫిబ్రవరి ౨౦ తేది నాడు గోవామీద నెత్తివచ్చుటకు ముందు యూసుపుఆదిల్ ఖానుడు మృతినందెనని తేలుచున్నది. అంతకుముందెన్నడాతడు మృతినందెనో ఖచ్చితముగ నిశ్చయించి చెప్పుటకు వీలులేదు ; కాని యాతనిమరణము సంభవించి యప్పటికింకను జాలకాలముగాలేదని గట్టిగ జెప్పవచ్చును. ఆల్బూకెర్కు మొదటితడవ గోవామీద యుద్ధము సేయప్రారంభించినపుడు, తిమ్మోజతనితో 'నిరుడు రెండువందల కధికసంఖ్యాకులైన గోవా వర్తకుల విత్తమును హరించి సబైయోవారిని వధించె'నని చెప్పెను.[11] అంతకు గొంతముందు, అల్మైడాచే నోడిపోయిన ఈజిప్టు సుల్తాను, నౌకానాయకులందొక్కడు నిజపరాజయానంతరము గోవాయందు తలదాచుకొనెననియు, దానినే దన ముఖ్యస్థాన

---

10. ఆల్బూకెర్కు కామెంటరీసు సం. ౩ పు. ౧౮౭ నందు గానవచ్చు నీ వాక్యము గొంత సంశయమున కెడ మిచ్చుచున్నది. "అప్ఫానోన్సడాల్బూకెర్కు (గోవానదిలో నతడు లంగరు వేసినిలిచి యుండినపుడు) గోవాపట్టణము క్రైస్తవులకు వశము గాగలదనియు దానిని మిల్హార్ రావు అనుహిందువు పాలింపగిలడనియు దానాడిన మాట ఇంకను నిక్కము కాగలదని' దన తండ్రితో నాడిన వాక్యములను హిదల్కాను స్మరణకు దెచ్చుకొనెను." ఎప్పుడు ఆల్బూకెర్కిట్లు శపథము చేసెనో తెలియదు. కాని యాల్బూకెర్కునకు(గోవాను గూర్చి) హిదల్కానుని యనుచరుడగు ముస్తఫాఖానునితో జరిగిన సంవాదము తుదిని తను కొన్ని బెడసు మాటల నాడెను; కాని వాని సరణి వేరు. "ఆ వేసగి కాలము గడచిపోవుటకుముందే తాను గోవాయందలి ప్రాసాదమున మరల విశ్రాంతినందెదననియు, దక్కను రాజ్యమున దిమ్మోజు నొకగొప్ప ప్రభువును జేయుదుననియు ప్రతిజ్ఞ జేసెను." (ఆల్బూకెర్కు కామెంటరీసు సం. ౨. పుట. ౧౮౭). కావున నాల్బూకెర్కు యూసపు ఆదిల్ ఖానునితో జేసిన శపథమునకంటె నిది భిన్నమైనది. ఆల్బూకెర్కి శపథమును గోవాపై దానింక నెత్తిరాక పూర్వ మొకవేళ జేసియుండినయుండవచ్చును. ఈ సందర్భమున జ్ఞప్తియందుంచుకొన దగిన విషయ మొకటి కలదు. సబైయో మలబారు ప్రజలకు మిత్రుడు; వారు పోర్చుగీసులమీద యుద్ధము సేయుటకు కావలసిన ధనమును బలమును సరఫరా జేసి సకలవిధములదోడ్పడుచు నతనిదమకుసర్వసేనాధిపతిగ నెన్నుకొనిరి. పోర్చుగీసులను హిందూమహాసముద్రమునుండి పాఱదోలు నుద్దేశముతో యూసుపు ఆదిల్ ఖానుడు గోవానదియందు పెద్దవియు జిన్నవియు బలువిధముల యోడలుగల గొప్ప నావికాదళమును దయారుచేసెను. (ఆల్బూకెర్కు కామెంటరీసు. సం. ౨. అ. ౨౦. పుట ౯౭), అచటినుండి బయలువెడలి పోర్చుగీసుల యోడలమీదను మలబారులోని వారి మిత్రుల కరపట్టణముల మీదను బడి పోట్లాడువాడు. తానెందుకు యూసుపు ఆదిల్ ఖానుని పెంకి యగు గోవాపై యెత్తిరావలసివచ్చెనో ఆల్బూకెర్కు హిదల్కానుకంపిన సందేశములోని ఈ క్రిందివాక్యమున విశదపరచియున్నాడు. "మీతండ్రి సబైయో యెట్లు మా రాజుగారిమలబారు రేవుపట్టణములందలి యోడలను బట్టుకొని పోవుచుండువాడో మీకు జక్కగ దెలిసియుండవలయును; కావున నేను గోవాపై నెత్తిపోయి దాని నైగవసము జేసికొనవలసి వచ్చినది; ... మీ తండ్రి నేటివఱకును బ్రతికియుండకపోయెనే యని నేను వాస్తవముగ వగచుచున్నాడను; బ్రదికియుండిన చెప్పినంత సేయువాడనని నన్నత డెరిగియుండును." (ఆల్బూకెర్కు కామెంటరీసు. సం. ౩. పుటలు ౨౦—౨౧). కావున ఆల్బూకెర్కు యూసుపు ఆదిల్ ఖాను మరణానంతరము జయించెననియు, పై జెప్పిన ప్రతిజ్ఞ నతడు మలబారుతీరమందుండిన పోర్చుగీసు రేవుపట్టణములమీద యూసపు ఆదిల్ ఖాను దాడినడపుచుండిన కాలమున జేసియుండవలయుననియు దృఢముగ జెప్పవచ్చును.

11. ఆల్బూకెర్కు కామెంటరీసు సం. ౨. పుట ౮౫.

ముగ జేసికొమ్మని సఖైరెూ యతని వేడుకొనె ననియు దెల్పెను.[12]

ఆల్మెడా క్రీ. శ. ౧౫౧౫ ఫిబ్రవరి ౩ వ తారీఖున నీజిప్టు నౌకాదళము నోడించెను. అతనిచే నిర్జితుడైన ఐగుప్తు నౌకాదళపతి యొక్కని గోవా యందే నిలుకడగనుండవలయునని సఖైరెూ ప్రార్థించియుండిన నతడప్పటికింకను సజీవుడై యుండెననుట నిశ్చయము. కావున సఖైరెూ లేక యూసుపు ఆదిల్ ఖానుడు క్రీ. శ. ౧౫౧౫ ఫిబ్రవరి ౩ వ తారీఖునకును క్రీ. శ. ౧౫౧౦ ఫిబ్రవరి ౨౦ వ తారీఖునకును మధ్య, అనగా క్రీ.శ. ౧౫౧౫-౧౦ వ సంవత్సరమున మృతినందెనని నిస్సంశయముగ జెప్పవచ్చును.

ఇంతవఱకు జేసిన చర్చవలన తేలిన సారాంశమిది :—

౧. ఫెరిష్తాచెప్పినట్లు యూసుపు ఆదిల్ ఖానుడు హిజరి ౯౧౬ అనగా క్రీ.శ. ౧౫౧౫-౧౦ వ సంవత్సరమున మృతినందెను ; కాని,

౨. అతడు ఫెరిష్తాచెప్పినట్లు విజాపురమున కాలగతి నందనేలేదు.

౩. గోల్కొండ సరదుస్థలముననుండు కోవెల కొండయందో, లేక యీదుర్గము కనుచూపు మేరనునందుండగనో యసువులు విడిచెను.

౪. మఱియు క్రైస్తవులు అనగా పోర్చుగీసు వారు యూసుపు ఆదిల్ ఖానుని జయించలేదు ; వారినోడించి యూత డారేవు పట్టణమును మరల స్వాధీనపఱచుకొనను లేదు.

౫. పోర్చుగీసువారు ప్రప్రథమమున గోవా పట్టణమునాక్రమించుకొనినది యూసుపు ఆదిల్ ఖానుడు గతించినపిమ్మట నతని కుమారుడు ఇస్మాయిల్ ఆదిల్ ఖానుని రాజ్యారంభకాలమునందు ; వారిదగ్గరనుండి దాని మరల జయించి స్వాధీన పఱచుకొనినదియు నిస్మాయిలాదిల్ ఖానుడే.

ఇందువలన ఫెరిష్తాచరిత్ర యబద్ధకల్పనయని విదితమగుచున్నది. ఫెరిష్తా బుద్ధిపూర్వకముగా నబద్ధములు వ్రాయలేదనియు, నత డాధారములుగ గ్రహించిన గ్రంథములలోని విషయముల నెట్లుండిన వానినట్లే పరిశీలింపక తనగ్రంథములోని కెక్కించుకొనెననియు గొందఱు చెప్పుదురు. మఱికొందఱు దీని నంగీకరింపక నతడు బుద్ధిపూర్వకముగ నబద్ధ పురాణమును గల్పించెనందురు. ఇందేది సత్యమైనను ఫెరిష్తాచరిత్ర విజయనగరమునకు సంబంధించినంతవఱకు లప్పులకుప్ప. విశ్వాసార్హముగాదు.

## ౬. కృష్ణదేవరాయల దేవేరులు

గోలకొండ సరదుస్థలమందు తురకలపై విజయమును బొందిన పిమ్మట కృష్ణదేవరాయలు కళింగదేశముపై దండయాత్ర బయలువెడలినట్లు రాయవాచకమునను, కృష్ణరాయవిజయమందును జెప్పియున్నది. గజపతి తన కుమార్తెను దనకిచ్చి పరిణయము సేయ నిరాకరించుటవలన గోపించి కళింగముపై గృష్ణరాయలు దండువెడలెనని కొన్ని యైతిహ్యములవలన దెలియుచున్నది ; కావున నీ యైతిహ్యముల నిచట సంగ్రహముగ బొందుపఱచి వాని సత్యాసత్యములను బరిశీలించి తెలిసికొని యవ్వల కృష్ణరాయల కళింగ జైత్ర యాత్రా చరిత్రను వివరించుట యుక్తము.

(౧) కృష్ణరాయలు దాసీపుత్రుడను నపవాదము గల్గినది ; క్షత్రియు లెవ్వరును దమ కూతు నాతనికిచ్చి వివాహముసేయ నొల్లరైరి. తిమ్మరు సెట్లైన సత్కులజాతయగు క్షత్రియకన్యను దెచ్చి రాయలకు వివాహముసేయ నిశ్చయించి సేనాపరివృతుడై వినుకొండకు బోయి యచ్చట దమ కరిగాపై రాజ్యము సేయుచుండిన గజపతిని గలిసికొని, తన యుద్దేశ్యము నతని కెఱుకపఱచక, నత

12. ఆల్బూకెర్కు కామెంటరీసు. సం. ౨. పుట. ౮౨.

నిచే దాను చెప్పినట్లు చేసెదనని మాటగొని, యటు పిమ్మట గృష్ణరాయల కాతని కూతునిచ్చి యుద్వాహము సేయవలయునని యానతిచ్చెను. ఆడినమాట తప్పజాలక యత డందుల కంగీకరించి గృహమునకు వచ్చెను ; సమాచారమంతయు విని రాణి కోపించి తక్కువజాతివానికి గూతు నిచ్చుట తగదని పల్కెను ; కాని గజపతి దన మాటచొప్పున నడపెదనని పట్టుబట్టెను ; రాణివాస స్త్రీ లందుల కీయకొనక కృష్ణరాయలను జంపియైన పెండ్లిని జరుగనీయక నిలిపివేయుటకు నిశ్చయించిరి.

ప్రధానతాంబూలము గొనుటకు తిమ్మరుసు పరివారముతోగూడ పెనుగొండనుండి తరలివచ్చి వినుకొండను జేరెను , అడపగానివలె గృష్ణరాయలతనితో గూడ మారువేషముతో కోటను బ్రవేశించెను ; తిమ్మరుసు దమకు రాణిగాబోవు నా కన్యను జూపు గోరెను ; గజపతియాజ్ఞపై సర్వాలంకార భూషితయై యామె యచటికి వచ్చినది ; చూచినది ; అడపగాడే కృష్ణరాయలని గ్రహించినది. వెంటనే లోపలికి బోయి యా వృత్తాంతము నంతఃపురమందు ప్రకటించినది. కృష్ణ రా య ల ను కోటవెలుపలికి బోనీయక వధించుటకు అంతఃపురస్త్రీజనము బ్రయత్నము సేయసాగిరి ; కాని తిమ్మరుసుచే సంరక్షితుడైన కృష్ణరాయలు వారిచేజిక్కునా ? గ జ ప తి కుమార్తె యంతఃపురములోనికి బోవ నెప్పుడు వెనుదిరిగెనో యప్పుడే తిమ్మరు సామెచిత్తవృత్తిని గ్రహించి రాయలకు గనుసన్న జేసె. యడపమువాడు తాంబూలమున సున్న మెక్కువ వేసినాడను మిష నెగ వానిపై నాగ్రహించి తలుముకొనుచు నంతఃపుర స్త్రీల యాజ్ఞచొప్పున గోట దర్వాజా మూయబడుటకు ముందే వెలుపలికి బోయెను. కృష్ణరాయల కపాయ మిట్లు తప్పిపోయినది.

లగ్నము నిశ్చయమైనది ; కృ ష్ణ రా య లుద్వాహమునకు రాజధానికి బోయి తిమ్మరుసు సలహాప్రకారము దన బాకును పెండ్లాడబంపెను ; సుముహూర్తమున బాకునకు బాపికము గట్టించిరి. పెండ్లి ముగిసినది గజపతికూతు రత్తవారింటికి కాపురము సేయవచ్చినది. పునస్సంధానమునాటి రాత్రి రాయలను గడతేర్చుటకు నిశ్చయించి కత్తుల మొలనూలు ధరించి పడకటింట ప్రవేశించినది ; కృష్ణరాయ లాకాంత కట్టుకొని యుండిన పావడను దన కాలివ్రేళ్లతో నొడిసిపట్టి చెంతకు జేరదీసెను. కత్తులమొలనూ లూడి క్రిందబడినది. ఆశ్చర్యముతో గృష్ణరాయలు 'అప్పాయేమి చిత్రము' అని యడుచెను. చెంతనే డాగియుండిన తిమ్మరుసు 'జాగ్రతో భయం నాస్తి' యని ధైర్యముజెప్పెను.

అంతట గృష్ణరాయలు దన్ను జంప నుద్యుక్తురాలైన భార్యను విసర్జించి సైన్యముతోగూడ నామెను తండ్రియింటి కంపెను ; కాని యామె పుట్టింటికి బోలేదు. తన దుష్కృత్యమునకు బశ్చాత్తాపమంది భర్తయనుమతి వడసి మార్గమధ్యమునందొక వనమున నివసించుచు భగవద్ధ్యానపరాయణురాలై కాలము గడపుచుండెను. ఆమె పేరు వరదరాజమ్మ ; విశేషధనము వెచ్చపెట్టి కర్నూలు జిల్లాలో కంభముకడ నొక చెఱువును గట్టించెను. ఆమెకే తుక్కాజీ యను నామాంతరము గలదు. ఆమె తుక్కాపంచక మను నైదుశ్లోకములను రచించి కృష్ణరాయల కంపెనట ; రాయలందులకు సంతసించి యామెను దన యనుగ్రహమునకు బాత్రురాలిని గావించెనట

ఇట్టిదే మఱియొక కథ కలదు :—

(౨) కృష్ణరాయ లుత్కళ దేశముపై దండెత్తిపోయి యా దేశాధిపతిని జయించెను ; ఉత్కళరాజు సంధిని గోరెను ; కూతు నిచ్చి తన కుద్వాహము గావించిన సంధి కొడబడెదనని కృష్ణరాయలు వర్తమానమంపెను; అతడందుకంగీకరించి వివాహప్రయత్నములు జేయగడగెను ; కాని కులహీనుని బెండ్లాడ నొల్లక యా రాజకుమార్తె యతనిని వధించి తానును జచ్చుటకు నిశ్చయించెను. ఆమె మనోనిశ్చయము క్రమక్రమముగ దిమ్మరుసు కెఱుకపడినది. అతడు కృష్ణరాయలకు దెల్పి రాయల సమ్మతిమీద పునస్సంధాన గృహము మంచముపై దేనెతోనింపినకృష్ణరాయలవిగ్రహమును బండబెట్టి, యుత్తరీయమును గప్పి 'రాయలు డస్సి నిద్రించుచున్నాడు. అతని నిదురలేప వల'దని దాసీజనములతో జెప్పెను. అది విని వారెవరి దారిని వారు

పోయిరి. అంతట దిమ్మరుసు మంచము క్రింద దాగి యుండెను. ఉత్కలేశ్వరుని పుత్రిక పడుకటింట ప్రవేశించినది ; మంచముమీఁద పండబెట్టియుండిన విగ్రహమే కృష్ణరాయలని భ్రమించి, చేనున్నచిక్కటూరితో నొకపోటు పొడిచినది. ఆ పోటుగంటునుండి తేనె పైకెగజిమ్మి యామె నోట కొన్ని బిందువులు పడెను ; తేనెను రక్తమని యెంచి, 'ఈరాజురక్త మెంత తియ్యగ నున్నది ! ఇట్టి వాని ననుభవింప జాలక చంపితినికదా' యని చింతించెనట! అప్పుడు మంచముక్రిందనుండి తిమ్మరుసు వెలువడివచ్చి యామెకు ధైర్యముజెప్పి, ప్రక్కగదిలో రహస్యముగ బరుండియుండిన కృష్ణరాయలను దోడ్కొని వచ్చి వారికి మైత్రి గల్గించెను. ఆ యుత్కళ రాజు కుమార్తె పేరు తిరుమలదేవి. [1]

పైగాథలకంటె భిన్నమైనది ఇంకొక కథ కలదు: —

"రాయ లొకనాడు యేనుగుపై నెక్కి నగరమున విహారము సేయుచు నొక భోగకత్తియ (గాండ్లసంగ) ను జూచి మోహించి దానిని తన యంతఃపురమునకు రప్పించి భోగించుచుండెను. ఇట్లుండ నొకతరి రాయలు పట్టపుదేవితో సంభాషింపుచు దన భోగకాంత నామెతో సరిగాబోల్చి యేదో ప్రశంసించెను. అందుల కాయమ రోషమూని, 'తెచ్చినది గజపతివారి కుమార్తె కాదు. భోగకాంతయెకదా' అని నిరసనభావము సూచించెను. అది రాజు గ్రహించి పౌరుషావేశమునొంది 'గజపతి పుత్రికను దేజాలనా ? తెచ్చెదనుగాక' యని ప్రతిజ్ఞ బలికి మంత్రియగు సాళువతిమ్మరసును బిలిపించి 'పూర్వ దిగ్విజయయాత్రకుం బోదలంచితిమి. ముహూరము నిశ్చయించి సేనల రావింపు' మనెను...సుముహూర్తమని రాజున కెఱిగించి సేనల గూర్చి, తాను సేనానియై దండు వెడలించెను." [2]

పై నుదాహరింపబడిన కథలు మూటిలో మొదటిది ఎంతమాత్రము విశ్వాసపాత్రము గాదు. ఈ కథ ననుసరించి కృష్ణదేవరాయల రాజధాని పెనుగొండ, గజపతిరాజధాని వినుకొండ; మఱియు నతడు కృష్ణదేవరాయలకు గప్పముగట్టు సామంత రాజు ; అతని కుమార్తె పేరు వరదరాజమ్మ; ఆమె కంఠము చెఱువు ద్రవ్వించినది ; తుఖ్ఖా యని యామెకు మాఱుపేరు. తుఖ్ఖాపంచక మను శ్లోకపంచకమువ్రాసి కృష్ణరాయల కంపినది. ఇందొక్కటియు నిజముగాదు. కృష్ణదేవరాయల రాజధాని విజయనగరముగాని పెనుగొండకాదు ; వినుకొండ గజపతి సామ్రాజ్యములోని దుర్గమేయైనను అది అతని రాజధాని కాదు ; మఱియు కృష్ణరాయలకు గజపతి యరిగాపు కాడు ; గజపతి కుమార్తె పేరు వరదరాజమ్మకాదు ; వరదరాజమ్మ యను పేరుగల రాణి కృష్ణరాయలకు లేదు; వరదరాజమ్మ యచ్యుతదేవరాయల పట్టమహిషి ఆమెకుగాని, యప్పటి విజయనగరాంతఃపురస్త్రీలయం దెవ్వరికిగాని తుఖ్ఖా యను మాఱుపేరుండెనని తలంచుటకెట్టి యాధారమును గానరాదు. తుఖ్ఖాపంచక శ్లోకములు తుఖ్ఖా వ్రాసినవికావు ; ప్రాచీన అలంకార గ్రంథములనుండి కూర్చిన శ్లోకములు. కావున నీ కథ సత్యమైనది కాదు ; కల్పన. చరిత్ర రచనకిది యుపయోగించదు.

రెండవకథ చాలవఱకు సత్యమైనదే. కృష్ణదేవరాయలచే బరాభూతుడైన యుత్కళభూపాలుడు ప్రతాపరుద్రగజపతి. పరాజయమందినపిమ్మట నతడు సంధి గోరినది వాస్తవమే. ఈ యంశములు సమకాలికాంధ్రగ్రంథములందును, న్యూనిజుచరిత్రయందును బేర్కొనబడియున్నవి. [3] గజపతికుమార్తె వివాహవిషయమునుగూర్చి న్యూనిజిట్లు వ్రాసియున్నాడు :

"అతని (వీరభద్రుని) తండ్రి (ప్రతాపరుద్ర గజపతి) తన కుమారుని మరణవార్తనువిని, యతని మరణానంతరము కృష్ణరాయల చెఱయందింకను

1. చూ. గురుజాడ శ్రీరామమూర్తి 'కవి జీవితములు' పుటలు ౫౪౬—౫౫౩.

2. కొండవీటి దండకవిలె. చూ. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మ: కొండవీటి సామ్రాజ్యము, పుటలు: ౪౨—౪౩.

3. *Sources*. *p*. 145.

బంధీకృతురాలైన దన భార్యను వదలించుటకు 'దా నేమి చేయవలయునో తెల్పవలయు'నని సాళ్వ తిమ్మయ కుత్తరము వ్రాసెను ; దానికతడు 'మీ పుత్రికను మా రాజుగారికిచ్చి యుద్వాహము సేయునట్లేర్పాటు జేసితిరేని, తరువాత మీ సతిని విడిచిపెట్టి మీ రాష్ట్రమును మీకు మరల నిచ్చివేయుదుము' అని జవాబు వ్రాసెను. ఈ సలహానతడు (గజపతి) అంగీకరించి, రాయలకు తన కూతునిచ్చి వివాహము సేయుటకు దగిన యేర్పాటులను గావించుటకు దన రాయబారులను విజయనగరమున కంపెను. కృష్ణరాయలకీ వివాహమువలన సంతుష్టి కలిగినది. ఉత్కళేశ్వరునికి కృష్ణరాయలయభిప్రాయము దెలియవచ్చినంతటనే యతడు దన కుమార్తెను రాయలకడ కంపెను. ఆమెరాకతో వారిరువురికి మైత్రి గల్గినది... అంతట కృష్ణరాయలుత్కళరాజుతో సంధి జేసికొని యాతని కుమార్తెను బెండ్లాడెను.''[4]

ఈ వివాహప్రస్తావన యల్లసాని పెద్దనామాత్యుని చాటువులందు గలదు :—

'ఘనతరనిర్భరగండపెండెర మిచ్చి కూతు రాయల కొడగూర్చునాడు' అను సీస పాద మీ వివాహము నుద్దేశించి చెప్పినదే. మఱియు నాదిండ్ల గోపమంత్రి తన ప్రబోధచంద్రోదయవ్యాఖ్యయందిట్టి వివాహవిషయమును బ్రస్తావించియున్నాడు :

'ప్రతాపరుద్రస్య గజేశ్వరస్య
పుత్రీం పవిత్రీకృతగోత్రధాత్రీం,
ప్రత్యాగ్రహీ ద్యః ప్రకటప్రతాపో
భద్రాం సుభద్రామివ పాండవేయః'[5]

అర్వాచీనగ్రంథములగు విజయనగర సామ్రాజ్య రాయవాచక కృష్ణరాయవిజయములలో గూడ నీ పెండ్లి విషయము గలదు.[6] కావున పూర్వోక్తకథయందలి వృత్తాంత మింతవఱకు సత్యమనుటకు సందేహము లేదు ; కాని పునస్సంధానము నాటి రాత్రి కృష్ణరాయల నామె పొడిచి చంప బ్రయత్న పడినట్లుగాని, కృత్రిమ ప్రతిమమూలమున దిమ్మరు సాతనికి జావు తప్పించి యవ్వల నా సతీపతులకు సఖ్యము గల్పించినట్లుగాని తెలుపు సాధనాంతరము లెవ్వియు గానరావు ; న్యూనిజుగాని, రాయవాచకకృష్ణరాయవిజయ రచయితలుగాని ఈ విషయము నెఱుగరు. కావున నిదియంతయు దర్వాతివారి కల్పన యని తోచుచున్నది. మఱియు నీకథయందు గజపతికుమార్తె పేరు తిరుమలాంబ యని కలదు. ఇదితప్పు కృష్ణదేవరాయల పెద్దభార్య పేరు తిరుమలాంబయె ; కాని ఆమె గజపతికుమార్తె కాదు 'భద్రాం సుభద్రామివ పాండవేయః' అను నాదిండ్ల గోపమంత్రి మాటల నాధారముజేసికొని కొందఱామె పేరు 'భద్ర'యని యభిప్రాయపడుచున్నారు. బలరామకృష్ణులతో పాటు సుభద్రయు గజపతుల కిష్టదైవమే యగుట వలన నొకవేళ నామె కాపేరు తలిదండ్రులు పెట్టియుండవచ్చును ; కాని నిశ్చయమని తలచుటకు వీలులేదు. ఏలనగా నిచట 'భద్రాం' అను మాటను వ్యక్త్యాత్మకనామధేయముగ గాక 'సుభద్రాం' అను మాటకు విశేషణముగ నన్వయము చేసికొనవచ్చును.

రాయవాచకమునందు గజపతికుమార్తె పేరు 'జగన్మోహిని' యని చెప్పియున్నది. 'గనక గజపతివారు తమ కుమార్తెఅయిన జగన్మోహిని అనే కన్యకను ధారవోశి యిచ్చే సమయాన,' అని.[7] కుమార ధూర్జటి తన కృష్ణరాయవిజయమును రాయవాచకము ననుసరించి రచియించినను, గజపతి కుమార్తె పేరు జగన్మోహినియని చెప్పలేదు ; తుక్కాయని వక్కాణించినాడు.

"అమ్మ కర్ణాటసింహాసనాధ్యుడగుచు
వెలగు శ్రీకృష్ణరాయల వెట్టవట్టి
మాదృశాశ్రితజనులు నీ మహిమ నుతులు
సేయ వర్ధిల్లుమని పల్కె వెలువుమిగుల.

---

4. *Nuniz* (*Sewell : Forgotten Empire.*) *p.* 320
5. *Sources p.* 145.
6. కాని, న్యూనిజు చెప్పునట్లు విజయనగరమందు కాక గజపతి రాజధానియగు కటకమునందే వివాహమునడచిన ట్లీ గ్రంథములందు కలదు. సమకాలికుడగు న్యూనిజువార్తయే విశ్వాసపాత్ర మని తలచెదను.
7. రాయవాచకము, పుట. ౧౧౯.

అల తుఖ్ఖారమణిమణి
జలజాస్యలు వెంటగొల్వ జనకుని యాజ్ఞ౯
వెలయగ నంతఃపురికి౯
విలసితగతి సరిగె నపుడు వేడుక మీఱ౯."[8]

క్రీ.శ ౧౫౨౫వ సంవత్సరముననో, యించుక తరువాతనో రచియింపబడిన విజయనగరసామ్రాజ్యమున గృష్ణదేవరాయలు 'గజపతిమీదికి దండు యెత్తి తర్లిపోయి గజపతికుమార్తె లక్ష్మిదేవమ్మవారిని హవాలా చేసుకొని, విజయనగరమునకు మరలివచ్చినట్లు చెప్పియున్నది.[9] ఈ గ్రంథముల సాక్ష్యమునుబట్టి గజపతి కుమార్తె వాస్తవనామమెద్దియో తెలియరాకపోయినను తిరుమలాంబ మాత్రము గాదని విస్పష్టమగుచున్నది. కృష్ణరాయలు బెండ్లాడిన గజపతి కుమార్తెయొక్క వాస్తవనామధేయము లక్ష్మి దేవి యనునేమో యను సంశయము గల్గుచున్నది. ఆముక్తమాల్యద పీఠిక యంగలి,

"కూరిమి కృష్ణరాయనృప
కుంజరు జేరె గళింగరాజ్య ల
క్ష్మీరమణీలలామ నిను
మిన్నులుముట్టిన మోహనాలతో
గారణమట్ల లక్ష్మి గను
గందని వేడుక గృష్ణరాయనిం
జేరునకాక, వావిసెడ
జెందునె సోదరుడైన రుద్రున్."

అను పద్యములోని 'లక్ష్మికనుగందని వేడుక గృష్ణరాయనిం జేరునకాక' అను వాక్యము న రాయలు బెండ్లాడిన గజపతికుమార్తె పేరు లక్ష్మిదేవి యని సూచన కలగనితలచెదను. కాని ఈ యూహ నిర్బాధకముగాదు. 'వావిసెడ సోదరుడైన రుద్రునిన్' అను మాటలవలన లక్ష్మికి సోదరుడు రుద్రుడని విదితమగుచున్నది. వాస్తవముగ కృష్ణరాయలుద్వాహము జేసికొన్న గజపతికూతురి పేరు లక్ష్మియేయైనచో 'రుద్రు'డనుమాటకు వ్యాఖ్యాతలందరివలె 'ప్రతాపరుద్రు' డని యర్థము జెప్పక 'వీరభద్రు' డని చెప్పవలెను. ఈ సందర్భమున గమనింపవలసిన ముఖ్యవిషయమొకటి కలదు. కృష్ణరాయల దండయాత్రకు బూర్వమే 'కళింగరాజ్యలక్ష్మీరమణీలలామ' ప్రతాపరుద్రగజపతిని **గూడి** యుండెను. వ్యాఖ్యాతలు జెప్పునట్లు 'రుద్రుడు' ప్రతాపరుద్రుడగునేని యామె యప్పటికె వావిసెడ నాతనిగూడి చిరకాలము భోగించుచుండెను. ఇక నప్పుడు వావి సెడనీయక గృష్ణరాయనిగూడెనను టయందేమి స్వారస్యముగలదు ; వీరభద్రుడప్పటికింకను రాజు గాలేదు? ప్రతాపరుద్రుని యనంతరము రాజ్యమతనికి జెందవలసియుండెను ; కాని రాజ్యము నతనికి జెందనీయక గృష్ణరాయలు జయించెను. తత్కారణమున లక్ష్మి వావిసెడనీక గృష్ణరాయని గూడినది. కావున పద్యములోని 'రుద్ర' శబ్దమునకు 'వీరభద్ర' అని యర్థము జెప్పుకొనుట యుక్తమని తలచెదను.

ఇక మిగిలియుండునది గాండ్లసంగకథ. సంగ పేరు వినుకొండ వండకవిలె యందు తప్ప మఱి యెచ్చటను గానరాదు ; కాని కృష్ణరాయలకు ప్రియురాలు భోగకాంత యొక్కటె యుండెనని రుజువుసేయు ప్రబలమైనవి సమకాలికాధారములు గలవు. ఆకాలమున విజయనగరమునకు వచ్చియుండిన పోర్చుగీసువర్తకుడగు దోమింగో పయసు రాయల భార్యల వృత్తాంతము నిట్లు వర్ణించియున్నాడు :—

"ఈ రాజునకు ధర్మపత్నులు పన్నిద్దఱు గలరు ; అందు ముఖ్యులు ముగ్గురు......ముఖ్య భార్యలయందొక్కతె యుత్కలరాజపుత్రిక ; మఱియొక్కతె యీరాజుసామంతులలో నొక్కడగు శ్రీరంగపట్టణ ప్రభువుకుమారిత ; ఇంకొక భార్య్య వేశ్య ; రాజ్యమునకు రాకముందాతని కామె యుంపుడుగత్తెగ నుండినది ; రాజైనపిమ్మట నన్ను భార్యగ జేకొందునని యతనిచే వాగ్దానము గొన్నది ; ఈరీతిగ వేశ్యయొక్కతె రాజమహిషి యగుట సంభవించినది. ఆమెయందు గల యనురాగాతిశయముచే నత డామె పేర నొక పట్టణము గట్టించెను."[10]

8. కృ. రా. విజయము. ౪: ౨౪-౫.

9. *Further Sources, II. No.* 123.

10. *Sewell : Forgotten Empire. pp.* 247-8.

న్యూనిజుచరిత్రయందీ భోగ కాంతవిషయ
మింకను విపులముగ వర్ణింపబడియున్నది:

"ఈ కృష్ణరాయలు పసివాడుగ విజయ
నగరమున బెరుగుచుండిన కాలమున జిన్నాదేవి
యను వేశ్యతో నతనికిదగులాటము గలిగి యామె
యందత్యంతానురక్తుడై యుండెను; ఆమెయెడ
నతనికి గల ప్రేమాతిశయముచే దానే రాజగు
పక్షమున నామెను దప్పక బెండ్లిచేసికొందునని
పెక్కుమారులు వాగ్దానము జేసెను. పరియాచక
మున కట్లితడు జెప్పినను దరువాత నది నిజమాయె
నని చరిత్రవలన దెలియవచ్చుచున్నది. ఎట్లన,
సింహాసనము నధిష్ఠించినపిమ్మట పసితనమం దాసక్తి
గొనియుండిన వ్యాపారములన్నిటిని నతడు విడ
నాడినను, ఆమెమీదివలపును మఱవజాలడాయెను;
కావున రహస్యముగ రాజమందిరమును విడిచి
యామెయింటికి బోవువాడు. ఒకరాత్రి యా
రహస్యమును అతని మంత్రియగు సాలువతిమ్మయ
కనుగొనెను; ఆ భోగకాంత యిలు సేరువఱకును
నతని వెంబడించి పోయి, యతని కిది తగదని బుద్ధి
చెప్పి మరల రాజమందిరమునకు గొనిపోయెను.
అపుడు రాజు దానా కాంతపై నెంత గాఢముగ
మరులుగొనియున్నదియు నతనికి దెలిపి, తా
నామెను వివాహముజేసికొందునని వాగ్దానము
జేసితి ననియు, దానిచ్చిన మాట నెఱవేర్ప
నిశ్చయించితిననియు జెప్పెను. అంతట మంత్రి
రాజుయొక్క పట్టుదలను గాంచి యతని యిష్ట
ప్రకారము నడచుకొన నీయకొని యేలినవారి
కపనింద రానీయక దానాకార్యమును నిర్వ
హింతునని పల్కెను. అట్లు చేయుట కతడు
రాయలకొఱకు, నరసింగదేశరాజకుటుంబమునకు
జెందిన సౌందర్యవతియగు కన్య నొక్కతెను వెదకి
తెచ్చి పెండ్లిచేసి, వివాహకార్యములన్నియు
ముగిసినపిమ్మట, భోగకాంతను దోడ్కొనివచ్చి
యామెతోగూడ నొక్క సౌధమునందే కాపురము
సేర్చి, యా సౌధముపై నున్నతమైన గోపురమును
గట్టించి యందా భోగకాంతకు నివాస మేర్పఱ
చెను. తరువాత......కృష్ణరాయలు నలుగురు
భార్యలను బెండ్లాడెను; కాని వారందఱికంటెను
నతని కీమెపై మక్కువ యెక్కువ."[11]

సమకాలిక పోర్చుగీసురచనలవలని గాండ్ల
సంగకథ చాలవరకు సత్యమైనదని తెలుచున్నది.
రాయలు భోగకాంతను మోహించుట వాస్త
వము; రాజమందిరమునకు దెచ్చి యామె కచట
నివాసమేర్పఱచుట వాస్తవము. అటు తరువాతి
విషయము సత్యమని వేఱుగ జెప్పవలసిన యావశ్య
కత లేదుకదా. కాని యొక భేదము గలదు.
కథయందలి భోగకాంత పేరు సంగ; పోర్చుగీసు
రచనలలోని భోగకాంత పేరు చిన్నాదేవి. ఈ
భేదమునకు సమన్వయ మెట్లు? రాయలను బెండ్లా
డుటకు పూర్వము ఆమెపేరు సంగయై యుండ
వచ్చును; రాజమహిషియైన పిమ్మట చిన్నాదేవి
యని పేరును మార్చుకొనియుండవచ్చును. ఇట్టి
మార్పు లింకను జరుగుచున్నవి; కావున సంగయే
చిన్నాదేవి కావచ్చును.

సంగకథయందు గమనింపదగిన విశేష
మొకటి కలదు కృష్ణరాయలు సంగను ప్రశంసిం
చినందులకు గినిసి పట్టమహిషి, 'తెచ్చినది గజపతి
వారి కుమార్తె కాదు. భోగకాంతయే కదా' యని
యెత్తిపొడిచినదట. గజపతికుమార్తె యననేల?
మఱియొక రాజపుత్రికను పేర్కొనరాదా? గజపతి
కూతును పేర్కొనుటకు గారణము లేకపోలేదు.
గజపతి విజయనగరరాయలకు బద్ధశత్రువు; బల
సంపదలయందు సమానుడు; రాయరాజ్యములోని
భాగములను జయించి స్వాధీనపఱచుకొన్నవాడు;
నాలైదుతరముల విజయనగరప్రభువు లాతనితో
బోటియు విజయులు కాజాలరైరి. ఇంతకు మించిన
విశేష మింకొకటి కలదు. ఆ పట్టమహిషి నరసింగ
దేశాధీశ్వరుల యింటి యాడబడుచు; పూర్వము
గజపతిపురుషోత్తముడు దక్షిణదిగ్విజయార్థము
వచ్చియుండినప్పుడు వారి యింటి యాడబడుచు
నొక్కతెను—సాళువనరసింగరాయల కుమార్తె నే
ఏమొ—బలాత్కారముగ గొనిపోయి వివాహ
మాడియుండెను. తనపుట్టింటివారి దగు వజ్రసిం
హాసనముపై గూర్చునియుండు కృష్ణరాయలు

11. *Nuniz, See Sewell Forgotten Empire, pp*. 362-3.

గజపతికుమార్తైను బలాత్కారముగ దెచ్చి పెండ్లాడి పాతసూడును దీర్చుకొన్న మరియు వచ్చును ; కాని భోగకాంతను—వెల కమ్ముడు బోవుదానిని—దెచ్చినందున కింతగ నుప్పొంగవల యునా ? యని యామె భావము. ఆ మాటలకు నొచ్చి కృష్ణరాయలు కళింగదిగ్విజయార్థము వెడలుట సంగతమే.

పైనుదాహరించిన కథలవల్లను, సమకాలిక పోర్చుగీసు రచనలవల్లను కృష్ణరాయలకు దిరుమల దేవీ, చిన్నాదేవు లనుభార్య లిరువు రుండిరని తెల్ల మగుచున్నది. మఱియు గళింగ దిగ్విజయయాత్ర ప్రారంభమగుసప్పటికి కృష్ణరాయలు గృతిగొన్న యాంధ్రప్రబందము లీ యంశమును స్థిరపఱచు చున్నవి :

మనుచరిత్రయందు—

" తిరుమలదేవీచరణో
పరలాక్షాకల్పకల్పితస్థలకమల
స్ఫురదిందీవరబంధుర
హరిహయమణిమలయకూటహర్మ్యవిహారీ. "12

పారిజాతాపహరణమునందు—

" శ్రీ వేంకటగిరివల్లభ
సేవాపరతంత్రహృదయ చిన్నమదేవీ
జీవితనాయకకవితా
ప్రావీణ్యఫణీశ కృష్ణరాయమహీశా. "13

అని తిరుమలదేవీ చిన్నాదేవులు పేర్కొన బడియున్నారు. కృష్ణరాయల కపఖ్యాతి రానీయక సాళువతిమ్మయ నరసింగనృపాలుర యింట బుట్టిన కన్యకను—తిరుమలదేవిని—దెచ్చి యతని కుద్వాహము గావించినను 'నతడు చిన్నాదేవినే తన పట్టమహిషిగ గ్రహించినట్లున్నది. ఈ విషయ మీక్రింది మనుచరిత్రయందలి పద్యమువల్లను, శాసనముల వల్లను దెల్లమగుచున్నది.

" ఆవిభు ననంతరంబ ధ
రావలయము దాల్చె గృష్ణరాయడు చిన్నా
దేవియు శుభమతి తిరుమల
దేవియునుࣤ దనకు గూర్చు దేవేరులుగాన్. "14

ఇందు పెద్దన మొదట చిన్నాదేవిని, యటు వెనుక తిరుమలదేవిని బేర్కొనియున్నాడు ; ఇందు వలన జిన్నాదేవియే పట్టమహిషి యని యూహ పొడముచున్నది. శాసనములందుకూడ నిట్లే మొదట చిన్నాదేవియు గరువాత తిరుమలదేవియు, బేర్కొనబడియున్నారు.

" శ్రీకృష్ణరాయమహారాయలు విజయ నగరాన నుండి పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి.....కృష్ణవేణ్యాతీరమందు అమరేశ్వరదేవుని సన్నిధిని తులా పురుషమహాదానమును శాయ నవధరించి తమ దేవుళ్లు చిన్నాజిదేవమ్మ తిరుమల దేవమ్మగారిచేతను మహాదానాలు సేయించ నవధరించి........ "15

" శ్రీకృష్ణదేవమహారాయలు విజయ నగరాన నుండి పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి.....కృష్ణవేణ్యాతీరమందు అమరేశ్వరదేవుని సన్నిధిని తులా పురుషమహాదానంశేయ నవధరించి తమదేవులు చిన్నాదేవమ్మచేతను రత్నధేను మహాదానమున్ను తిరుమలదేవి అమ్మవారిచేతను సప్తసాగర మహాదానమున్ను సేయించ నవధరించి.... "16

ఈ శాసనవాక్యములవల్ల చిన్నాదేవియే కృష్ణదేవరాయల పట్టపురాణి యను నూహ బల పడుచున్నది ; కాని కాలక్రమమున చిన్నాదేవి గతించినది. మనుచరిత్ర పారిజాతాపహరణములు

12. మను. ౩ : ౧౪౩. వావిళ్లవారి ముద్రిత ప్రతియందు 'వలయకూట'యని యున్నది. వ్యాఖ్యాత "వలయ=గుండ్రని, కూటహర్మ్య=యంత్రాల మేడ యందు, విహారీ=విహరించువాడా" యని యర్థము వ్రాసి యున్నాడు. 'మలయకూట'మని యుండవలయును. ఆ హర్మ్యముపేరు 'మలయకూటము.' నందితిమ్మన గూడ ఈ సౌధమును బేర్కొనియున్నాడు. 'మలయ కూట ప్రాసాదనివేశ' పారి. ౨ : ౧.

13. పారి : ౪ : ౧.

14. మను. ౧ : ౩౩.

15. *Tirupati Devasthanam Inscriptions. Vol. III., No. 76.*

16. *South Indian Inscriptions, Vol. VI. No. 248*

రెంటియందు నామె పేర్కొనబడియున్నను, ఆముక్తమాల్యదయం దామె ప్రస్తావము గాన రాదు. అప్పటి కామె స్వర్గవాసినియైనది. ఆవల తిరుమలదేవి పట్టపురాణి యాయె. ఆముక్త మాల్యదయందలి—

"ఆవిభునసంతరంబ ధ
రావలయము బూని తీవు రహిమై దిరుమ
ల్దేవియును నన్నపూర్ణా
దేవియు గమలాబ్జముఖులు దేవేరులుగాన్." "17

అను పద్యమువలన విదితమగుచున్నది. ఇది మనుచరిత్రనుండి గైకొన్న పద్యమే. రచయిత పెద్దనయే; సందర్భము ననుసరించి మార్చి వ్రాసి నాడు. చిన్నాదేవి గతించిపోయినది. అందుచే నామెమాట యెత్తలేదు. ఇందు తిరుమలదేవిని మొగట పేర్కొనియుండుటవలన నామె యప్పుడు పట్టపురాణి యాయెనని యూహకలుగుచున్నది. తిరుమలదేవితోగూడ పేర్కొనబడియుండు నన్న పూర్ణాదేవికమలాబ్జముఖుల వృత్తాంతము దెలి యదు. న్యూనిజు చెప్పిన రాయల నలుగురు ధర్మ పత్నులలో వీరిద్దఱనుటకు సంశయ మంద బనిలేదు. వీరిద్దఱిలో గజపతి కుమార్తె యెక్కర్తుక. ఆమె యెవ్వరు? అన్నపూర్ణాదేవియా, లేక కమలాబ్జ ముఖియా? నిర్ధారించి చెప్పుటకు వీలులేదు; కాని విజయనగరసామ్రాజ్యమున నామెపేరు లక్ష్మీదేవి యని యుండుటచే గమలాబ్జముఖియే గజపతికుమార్తె కావలయును. కృష్ణరాయవిజయ మందలి 'తుఖ్ఖా' వ్రాయసగాండ్రు ప్రసాదించిన పేరని తలచెదను. 'లఖ్ఖా' (లక్ష్మి) యనునది సరి యైన రూపమైయుండవచ్చును. అగునేని కృష్ణ రాయలు బెండ్లాడిన గజపతికుమార్తె పేరు 'లక్ష్మీ దేవి' యని యంగీకరింపవచ్చును.

## రాయల కళింగ జైత్రయాత్ర

### ౧

గజపతి సామాన్యశత్రువు గాడు. రాష్ట్రకోశబల సంపదలం దతని కధికులగు రాజు లప్పటి భరత ఖండమున నెందరో లేరు. తనతోపాటు దక్షిణభార తావని బాలించుచుండిన యశ్వపతినరపతులకు అతడుసమాసస్కంధుడు. రాష్ట్రవైశాల్యమునసేమి, కలిమి బలములలోనేమి, శక్తిసామర్థ్యములందేమి వారి కెంతమాత్రమును దీసిపోయెడివాడు కాడు. ఈ యంశము ఆముక్తమాల్యదలోని ఈక్రింది పద్యమునందు సూచింపబడియున్నది:

"రయమున వృష్టికై యెదిగి
రచ్చలపై విధియింతు రుగ్రతన్
హయపతిమీప దంతిపతి
నాతనిపై నృపతిన్ గజాదిని
ర్ణయముల మొత్తులాడుదురు
ద్రబ్బొకయించుక విప్పు విచ్చు మొ
గ్గయి మఱిపాసిపోదురు స
మస్తదిశాగతులైన యధ్వగుల్." (౪-౧౩)

ఈపద్యముపై వ్యాఖ్యాన మనదగిన చర్చ యొకటి రాయవాచకమున గలదు. ఇందు విజా పుర రాజసౌధమున కృష్ణరాయలు విజాపురముపై నెత్తిరాబోవుచున్నాడను వర్తమానము తెలియ వచ్చినంతటనె యచట గూడియుండిన నానా సం స్థానముల స్థానాపతుల మధ్యజరిగిన చర్చ వర్ణింప బడియున్నది.

"దాదిమహలుముందు ముందరదివాణంలో ముందర అయావజీర్లు దొండోపండితులు మొదల యినవారు నియ్యోగులు వారివద్ద కుతపనమలక వారి హేజీబులు ముకుందపండితులు మొదలైనవారు కూర్చుండి ఆలోచన జేసినది:—

'అశ్వపతి గజపతినరపతులలో నరపతిసింహా సనమే అధికము. కడమ రెండుసింహాసనములున్న

---

17. ఆముక్త. ౧: ౩౩.

వారి వెనుకను' అని పిన్న పెద్దలు ఆలోచనగా చెప్పినందులకు గోలకొండవారి ముద్దాపండితులు, సింహాసనాలంటె మూడున్ను సరి. ఇందులో సింహాసనాధిక్యములు కలవా ?' అని ఆగ్రహపడగా, 'నిజాంరవుతులు మా వుత్తులు లశికిరీతనాన సరికదా; ద్రవ్యసామాగ్రియందు దుర్గములయందు కొదవ; అట్టిపట్ల అధికమని జెప్పవలసిన కారణమెంద్ది? అన్నందులకు గోలకొందవారి ముద్దాపండితులు వ్యంగ్యోక్తిముగా, 'కాకయేమి? మరేమి? యిందులో న్యూనాధిక్యములు యెంచ అవకాశమేమి వున్నది? వారిరువురు ఏకవాక్యముగా ఆడుకొన్నందులకు, బాహుబలేంద్రునివారి బ్రంహ్మపంతులు వారలతోను, యీ మూడు సింహాసనములనగా బ్రంహ్మవిష్ణుమహేశ్వరుల అంశలుగా వుండును. అందున తారతమ్యములు యేరీతో ఆ రీతు వలెనే అశ్వపతి గుర్రాలకున్ను, గజపతియేనుగులకున్ను నరపతికర్నాటకసింహాసనానకున్ను ; గనక నరపతియే హెచ్చు. అది యేలాగంటేను—భగవద్వాక్యం, 'నరాణాంచ నరాధిపం'అనే వచనము వల్లనున్ను : ఆ రాజ్యములోను దేవాదాయం బ్రంహ్మాదాయం పుణ్యతీర్థములు నదులు పుష్కరుణులు గల్గివున్నది. ఇదిగాక విష్ణువు ప్రత్యక్షమై వెంకటాచలానవున్నారు ; ఆ రాజ్యములో వుండే స్వామికి కడమ రాజ్యములో పెద్దలు బుద్ధిశాలులు బ్రాంహ్మలు యతీశ్వరులు మఠాధిపతులు రాజులు మొదలైనవార లందరున్ను కానుక కప్పములు కొంచుపోయి స్వామికి సమర్పించి వస్తావున్నారు ; గనక కర్నాటకసింహాసనాధిపతులు పుణ్యశ్లోకులు. ఆ పిమ్మట గజపతిసింహాసనమంద్దు జగన్నాయకులు వేంచేసియున్నారు ; గనక రెండోపర్యాయం. అశ్వపతివారున్ను గంగాతీరాన విశ్వనాథులరాజ్యములో వున్నారు ; వారి తెగలవారి యెమిలసాహు, కుత పసమలక, నిజాంశాహుయీమూడుతెగలవారున్ను కర్నాటకం సరుదున వున్నారు. మీరు కర్నాటకాధిపతులతో సరియన నగునె ? అని మధ్యస్థభావముగా అన్నందులకు దొండ్డోపండితులు ముద్దోపండితులు దాదోపండితులున్ను దొడ్డనియోగులుగనక తెలుసుకొని తమ దొరలు మద్యపానులు ; దేవబ్రాహ్మణ విశ్వాసములు లేవు, మ్లేచ్ఛులు, గోహింసకులు, వారిని గొలిచినవారము ; గనక దూరదృష్టి విచారించ అవకాశమంత లేక అహంకారగుణమువల్ల ఆనవలసిన దంటిమి. బ్రంహ్మపంతులువారు పలకరించినది యథార్థమని యెంచినవారై ఆ తర్వాత మంత్రాలోచనగా వార్తలాడినవి."[1]

పైనుదాహరింపబడిన యాముక్తమాల్యద మున్నగు గ్రంథముల సాక్ష్యములవలన కృష్ణరాయల కాలమున గజపతికలిమిబలమును గూర్చి జనసామాన్య మెట్టి యభిప్రాయమును గలిగియుండెనో తెలియవచ్చుచున్నది. అంతటి ప్రబలునితో బోరు నిశ్చయించినపు డతని నోడించి జయమును బొందుటకు వలసిన ప్రయత్నము సేయుట యుక్తము విజయనగరసంస్థానము సేనాబలమున తక్కువ యైనదికాదు. 'గజపతిపై దండువెడల నిశ్చయించి యతడు (కృష్ణదేవరాయలు) ముప్పదినాలుగువేల కాల్బలమును, ఎనిమిదివందల యేనుగులును గల సైన్యమును సమకూర్చి, యాసేనతో గూడ ఉదయగిరిని జేరె'నని న్యూనిజు వ్రాసియున్నాడు.[2] కాని యర్వాచీనగ్రంథములగు రాయవాచకమునందు రాయరాణువసంఖ్య యెనిమిదిలక్షలను మించిపోయినది. గణుతిప్రకారము రాయరాణువయందు 'కైజీతంగుఱ్ఱాలు పంద్రెండువేలున్ను', అమరనాయకంగుఱ్ఱాలుయిరువైనాలుగువేలున్ను, కైజీతం యేనుగులు య్యాభైఘట్టాలును అమరపు యేనుగులు నూటయిరువైఘట్టాలును (౧౨౦౦,

1. రాయ. పుటలు ౬౭–౬౯.

2. *Sewell, F.E. p.* 316.

ఘట్ట మసగా ౧౦); కైజీతం రాణువనూతనం సహాగా మూడులక్షలున్ను, అమరంవగను అయిదు లక్షలబలమున్ను' ఉండెనని కలదు. ఈ మహాసైన్య మును వీరితోగూడ ఆరగపదునెనిమిదికంపణాల బోయదొరలను గదల్చుకొని యుమ్మత్తూరిపై నడచి యా రాజ్యమును జయించి తురకలమీదను గజపతి మీదను నెత్తిపోయెనని చెప్పియున్నది.3

సైన్యమంతయు రాజధానియందు గూడిన పిమ్మట దండువెడలుటకొఱకు మంచి ముహూర్త మును నిశ్చయించుటకు జోస్యులను రప్పించెనట; వారు నిశ్చయించిన లగ్నమున వెలిగుడారము వేయించి సకల సైన్యములతోగూడ బయలువెడ లెనట.

"దండుయాత్రలకు లగ్నం వుంచేటందుకు జోస్యులను పిలిపించ్చి ముహూర్తం వుంచమని ఆనతియ్యగా ఆతీరుననే అప్పాజిగారు జోస్యుల రప్పించ్చి సుదినం సుముహూర్తం సులగ్నం కూడిన వేళ వెలిగుడారం వేశేటట్టుగానున్ను పాళ్యంకదలి పొయ్యేటందులకున్ను ప్రవేశానకున్ను లగ్నం నిశ్చ యించ్చుక రాయలవారికి యెరుకశేయగా, ఆతీరు ననే వెలిగుడారం వేయించ్చమని ఆనతిచ్చినారు... సకల సన్నాహముతోడట్టు బయలుమెరశి వెలిగుడా రమునకు వచ్చినిలిచి దొరమన్నీలనున్ను, రవుతుల మావతులనున్ను, నియోగం పైకంవార్లనున్ను, మునుపటివారు, వెనుకటివారు, యెడవంక్కంవార లనున్ను, అందరినిన్ని రప్పించుక వారివార్లతో

3. రాయ. పుట ౫౩, ౮౪, ౮౬. కాని రాయ వాచకమునందే మఱియొకచోట రాయరాణువసంఖ్య కొంచెము వ్యత్యాసముగ గానవచ్చుచున్నది. ౩౪ వ పుటయందు గుఱ్ఱములు ౨౪౦౦౦, ఏనుగులు ౧౫౦౦౦, బంట్లు ౨,౦౦,౦౦౦, అమరనాయకంగుఱ్ఱాలు యేనుగు లును పంౘ్రెండువేలున్ను, కాల్బలములు ౨౦౦౦౦౦, (పుట. ౫౦) అని లెక్కింపబడియున్నది. కాని ఇది విశ్వాస్యము గాదని తోచుచున్నది. ఏలనగా, రాయ వాచకమర్వాచీనగ్రంథము; మఱియు రాయవాచక మున కృష్ణరాయలతోగూడ 'అయ్యనమలక, అంకుశ ఖానుండ్లు, రాణాజగదేవు, గని తిమ్మప్పనాయడు, రాచూరిరామనాయడు, పెమసాని రామలింగమ నాయడు, హండేమల్లరావు,బోయిరామప్ప,హరివాణం కొమాళ్ళయిన పదునెనిమిది కప్పణాలవారున్ను, దళ నాయకులు అప్పరపిళ్ల, కుప్పరపిళ్ల, సాళువనాయడు, కొమారతిమ్మప్ప, సంగ్గరాజు, చేర్వప్రధాని, తిప్ప రసు, అయ్యప్పనాయడు, కొటికవిశ్వనాథనాయడు, చెవ్వప్పనాయడు, అక్కప్పనాయడు, కృష్ణప్ప నాయడు, వెలిగోటి యాచమనాయడు, కన్నడ బసవ ప్పనాయడు, సాళువ మేకరాజు, మట్ల అనంతరాజు, తిరుమరాజు, వీరమరాజు మొదలయినవారున్ను' దండయాత్రకు బయలువెడలినట్లు చెప్పియున్నది. కాని పై బేర్కొన్న దొరలలో అయ్యనమలక, అంకుశ ఖానుడు వీరిరువురు సదాశివరాయలకాలమున నుండిరి. చెవ్వప్పనాయడచ్యుతరాయల కాలమువాడు; వీ రెవ్వరును కృష్ణరాయలకాలమునం దుండి రని నిరూ పించుట కెట్టియాధారమును లేదు. కొటికమువిశ్వ నాథనాయకుడు కృష్ణదేవరాయల కడపటిరాజ్యవర్ష మున నుండినట్లు శాసనాధారము గలదు; కాని తత్పూర్వ మతడు రాయల కొలువున నుండె ననుట సంశయాస్పదము, క్రీ. శ. ౧౫౬౩—౬౪ వఱకు నతడు జీవించియుండుటవలన, కృష్ణరాయలకళింగ జైత్ర యాత్రయందు అతడు పాల్గొనెనని నమ్ముటకు వీలు లేదు. రాణాజగదేవుడు కృష్ణరాయల కాలమున రాయలకొలువునలేడు, గోలకొండసుల్తాను కుల్లీకుతుబు శాహుకొలువున నుండెను. జమ్షీదుకుతుబుశాహు మరణమువఱకును నతడు కుతుబుశాహుల నాశ్రయించి యుండెను, ఇబ్రాహింకుతుబుశాహు గోలకొండసింహాస నము నధిష్ఠించినపిమ్మటగాని విజయనగరరాజ్యమును జేరలేదు. సాళువ మేకరాజును, మట్ల అనంతరాజును ఇమ్మడి వేంకటపతిరాయల కాలమున నుండిరి. ఇందు వలన రాయవాచకరచయిత చెప్పిన సైన్యసంఖ్య సమకాలికుడగు న్యూనిజు చెప్పినదానికంటె విశ్వాస్య మని దోచకపోవచ్చును; కాని గజపతివంటి బలాఢ్యుని జయించి యతని యేలుబడిక్రింద నుండిన దుస్సాధ్యస్థల జలగిరిదుర్గములను స్వైవసము గావించుకొనుటకు న్యూనిజు చెప్పిన బలసంఖ్య చాలదు; మఱియు గజపతి కంటె బలాధికుడుగాని విజాపురసుల్తాను నోడించి రాయచూరు మున్నగు దుర్గములతోగూడ కృష్ణాతుంగ భద్రల మధ్యదేశమును స్వాధీనపఱచుకొనుటకై కృష్ణ దేవరాయలు ౫౫౧ ఏనుగులును ౩౨౬౦౦ గుఱ్ఱములును ౭౦౩౦౦౦ కాల్బలమును సమకూర్చె నని న్యూనిజు చెప్పియున్నాడు. (*Sewell, F. E. p.* 147,326-328); కావున గజపతిని జయించుటకు కృష్ణరాయలు రాయ వాచకమున వర్ణించినంతటి బహుళసంఖ్యాకమైన సైన్యమును సిద్ధముజేయుట యసంభవము గాదు.

మాటపలుకులు ఆడి మీమీస్తోమములతో ఆయత్త పాటుతో రమ్మని బలవంక్కాం అమరనాయకం వార్లతోనున్ను నగరిసంప్రతులవారితోనున్ను నగరి లెఖ్ఖప్రకారనకు యేనుగ, గుర్రాలు, రౌతు రాణువ, గలట్టుపైదళంవారినిన్ని గణితితీసుకొని కర్ణాటకారి గలస్వతంత్రస్వామ్యంకావలిగట్లుగుంపులవారినిన్ని, పాళ్యగాళ్లనున్ను నగరిలెక్కప్రకారానకు అందరి నిన్ని రప్పించి పయనంతర్లడా అని కరణికులతో నున్ను రాయసం, కటికం, దినసరి, అవసరం, విని యోగపైకం వార్లతోనున్ను ఆనతిచ్చి......కొండ యాత్రకు జయధ్వనిగా దిక్కులు పిక్కటిల్లేటంద్దుకు భేరితాడసము శేశి డమామిటోకించ్చమని ఉత్తరవు శేశి రౌతులకు మావుత్తులకు అమరనాయకంవార్లను అళ్లుండ్లు, కొమార్లకు, రాజులకు, జట్లకు, కమ్మనా యకులకు అందరినిని పయనంజెప్పి రమ్మని కటికాల వారికి వుత్తరువుయిచ్చి తాముంన్ను భోజనంజేసు కొని మూడోనగారా టోకించమని ఆనతిచ్చి గుర్రం యెక్కుకొని బయలు వెడలిరి.''[4]

కృష్ణదేవరాయలు దన రాజ్యముపై నెత్తి వచ్చుటకు ఘనప్రయత్నను సేయుచున్న సంగతి గజపతి కెఱుకపడకపోలేదు తనరాష్ట్రమును సంర క్షించు కొనుటకతడు దగునేర్పాటులను గావించెను. రాయవాచకమునం దీయేర్పాటులు సంగ్రహముగ వివరింపబడియున్నవి. కృష్ణరాయలు రాజ్యాబ ష్టిక్తుడైన పిమ్మట దమ రాజ్యములపై నెత్తిరాపు పెట్టుచున్నాడనియు, దమకందఱికతడు సామాన్య శత్రువగుటవలన దామందఱు నేకమై యతని నెదు ర్చుట యుక్తమనియు మూడింండ్ల దక్కనుసుల్తాను లును దమస్థానాపతులమూలముగ సందేశమంపిరట! గజపతివారు విందుల కంగీకరించి తదనుగుణముగ నిజరాజ్యసంరక్షణకు దగు నేర్పాటులను గావించి రట

''గజపతివారు...షోడశపాత్రులతో నున్ను పరస్థలనియ్యోగులతోనున్ను సంభాషణ శేయగా నిజాంశాహువారి నీలాద్రిపంత్తులు వారున్ను యెదులశాహుకుతపనమలకవారి స్థానాపతులు అంప్పించ్చిన కాకితములు :

'' 'కర్నాటకాధీశ్వరులు కార్యముఖానకు నడిచేవారై చతురంగబలమున్ను జతశేసుక బయలు మెరసి సరుదులకు వచ్చి కనుపించ్చుకొనేవారై వున్నారు; యీావరకు ఉత్తరం గజపతులందో కార్యాలకు హానివృద్ధులకు సహాయంసంపత్తి నడ పుదురు. ప్రబలమైన కార్యాలయితే అంద్దరున్ను ఏక గ్రీవమై ఉత్తరం అఘపుతంవారి కార్యాలకున్ను నిర్వహింత్తురుగా. యిప్పుడు అంతేశి కార్యాలు యేమి వున్నది ? సరదున వుండ్డేవారు,గనుకయితరం గాదుకదా ? యెదులశాహున్ను నిజాంశాహున్ను

4. రాయ. పుటలు ౮౨-౮౪. కృష్ణరాయలనాటి యాంధ్రవాఙ్మయమును పాశ్చాత్యపోర్చుగీసుప్రయాణీ కుల వృత్తాంతములను బరిశీలించిచూడగా రాయ వాచకమున వర్ణింపబడిన ప్రయాణారంభసన్నాహము సరియైన దని తెలియుచున్నది.

యుద్ధయాత్ర బయలుదేరుటకు ముందు కృష్ణ రాయలు ఉపశ్రుతిని విని యది విజయసూచక మగు టకు సంతసించి ప్రయాణోన్ముఖు డాయె నని కొండ వీటి కైఫీయతునందు గలదు.

''అంతఃపురము వదలి ఆస్థానప్రవేశమై మహా ప్రధానులైన సాళ్వతిమ్మప్పగారిని పిలిపించి పూర్వ దిగ్విజయయాత్ర వెళ్లవలసినది; గనుక యేతత్ప్రియత్న ములు చేయమని సెలవుయిచ్చి శుభసూచనార్థమై ఆ రాత్రి రజకగృహముమీద నక్షతలు చల్లినంతలో ఆ రజకుడు అన్నం తిని తన యింటిపందిటిలో పండుకొని కుపామతిచేతను,

'కొండవీడు మనదేరా కొండపల్లె మనదేరా
కాదని యెవ్వడు వాదుకువచ్చిన కటకముదాకా
మనదేరా'

అని అన్నాడు; గనుక ఆమాట విని రాయల వారితో చెప్పినంతలో అదే శుభసూచన చేసుకొని ప్రధానసేనాపతి సైన్యసమేతముగా పూర్వదిగ్విజయ యాత్ర విచ్చేసిరి.

(*Kaifiyat of Kondavidu Mac. Mss.* 15-4-40 *pp.* 18 *f.*)

రానున్న శుభాశుభముల నుపశ్రుతుల మూల మున నూహించి కనుగొనుట రాయలకాలపు ప్రజలకు గరము ప్రియమైన కార్యము. కావున సమకాలిక సాంఘికమర్యాద ననుసరించి కృష్ణదేవరాయలు పై జెప్పినట్లుపశ్రుతిని విని యది శుభసూచక మని గ్రహించి కళింగజైత్రయాత్రకు బయలు వెడలియుండవచ్చును. సంగతముకాని దిం దేమియు లేదు; కాని ఈకథయం దెంత సత్యము గలదో నిశ్చయించిచెప్పుటకు వీలులేదు.

కుతుపనమలిక వారున్ను సరదుస్థలాలు స్తోమశుద్ధిగా యోచనశాయగా పనిలేదు. అందుకు మించ్చిన కార్యాలఖైతె అహముదునగిరం పర్యంత్తం వత్తురు' అని ఘనంగా వ్రాశి అంప్పినారు.

"'మనుష్య ప్రయత్నమున అపజయమని యెంచ్చ రాదు. కర్నాటకంవారికి జయం నిశ్చయం అఇనప్పటికిన్ని సాడుల మూడు తెగలవారున్న విరిగినట్టైతే మీసీమలన్నిన్ని కోలుబోయి మీకున్ను అవధివచ్చును; కాబట్టిదీర్ఘ యోచనవిచారించుకొని యాదిహెచ్చరికలు గలిగి నడిపించ్చుకోవలెను' అని మంత్రాలోచనగా అప్పించ్చిలకు, గజపతివారు—

"'అంన్నింటికంన్ని మనపాలిటి ఖాన్నాయకులు వున్నారు' అని మంగలించ్చినందులకు మూడు తెగలవారి నియోగ్యులున్ను, 'మీకు ఖాన్నాయకులున్న తమ దళాలకు కర్తరున్ను వున్నారు కార్నాటకంవారు యేరుదాటి రాకుండా తమ మూడుతెగలకలిసిబలములున్ను కృష్ణదాటి రాకుండా పాళ్యం దిగివుండేటట్టు అంపుతున్నారు. మీ తరఫు నామజాగులున్ను సరిహద్దులాల బలవంత్తులైయుండేటట్టు కట్టడశేయండా' అని తెలుపగా గజపతి వారున్ను 'అరేతి అమంక శేశే' మని కొండవీడు, ఉదయగిరి, బెల్లంకొండ, నాగార్జునకొండ, కందుకూరు మొదలైన స్థలాములకు యాదిహెచ్చరికలు కలిగివుండ్డ నడ్డ నేటట్టుగా నామజాదులు పంపినవారై షోడశపాత్రులతోనున్ను వారి దుర్గాలున్న శీమభూములయుండిన్ను యాదిహెచ్చరికలు గలిగివుండ్డమని మంగ్గలించ్చగా ఖా దువా ల్లు గనుదులకున్ను దుర్గాలకున్ను వస్తుసామగ్రీలు అంప్పినారు."[5]

మూడింల్ల సుల్తానుల పక్షమున వారి స్థానాపతులు గజపతివారికి నివేదించిన 'కాకితము'లను బట్టి చూడగా గృష్ణరాయలను గృష్ణానదిని దాటి రానీయక యడ్డుపెట్టుటయే వారి ప్రధానోద్దేశమని విశదపడుచున్నది. కావున మూడింల్లవారేకమై కృష్ణాతీరమున రాయల మార్గము నరికట్ట దమలో దాము నిశ్చయించుకొన్నను గజపతితో నేకీభవింప నలపెట్టలేదు! కాని యతని సహాయము లేక వారి మనోరథము సిద్ధింపదు. ఏలన వారియెడనంకనున్న తెలింగాణతీరాంధ్రరాష్ట్రముల కాతడధిపతి; కావున నతని యౌదాసీన్యము వల్లగాని యజాగ్రతవల్లగాని యాప్రాంతములను సంరక్షింపగల గళములు లేనిచో కృష్ణరాయ లచటి దుర్గముల నాక్రమించుకొని ముంగలనుండియు వామ పార్శ్వమునుండియు నేకకాలమున బైగొన వచ్చును. అప్పుడు తమకు జయము గలుగుట సందేహాస్పదము తత్కారణమున వారికి గజపతి సహాయసానుభూతు లావశ్యకములాయె. ఒక వేళ గజపతి తాము కోరినట్లు సేయడేమొయను సంశయ మొకప్రక్క వారిని బాధింపగడగెను. కావున వారు గజపతి కిట్లు రాయబారము నంపిరి.

కర్ణాటను లెత్తివచ్చుచున్నారు. వారు మీకును మాకును సామాన్యశత్రులు. మనమందఱ మేకమై వారితో బ్రతిఘటించుట యుక్తమని మీ రెంచవచ్చును. మీయభిప్రాయము సరియైనదే; కాని మనమందఱ మేకీభవింపవలసినంత యావశ్యకత లేదు. ఆవశ్యకత గలిగిన మీర లహమదానగర పర్యంతము రావచ్చును; అంతటి యాపద ఇప్పుడు కలుగలేదు. మా మూడింల్ల ఫౌజులును రాయలను గృష్ణను దాటి రానీయక మరల గొట్టుటకు చాలును. మీరు మమ్ముబోలి కర్ణాటకమున నుండు వారు గావున నేమే మొకవేళ పరాజితులమైనచో వారు మీరాజ్యముపై దండయాత్ర చేయవచ్చును; తత్కారణమున మీకు రాజ్యనష్టము గలుగ వచ్చును; కావున మీరు సరదుస్థలసంరక్షణకై తగు ఏర్పాటులను గావించుట యుక్తమని హెచ్చరించుచున్నారము.

### ౩

కృష్ణదేవరాయల కళింగదండయాత్రవలె నంత విపులముగ వర్ణింపబడిన చరిత్రాంశము మఱియొకటి మధ్యయుగ దక్షిణభారతచరిత్రయందు గానరాదు. ఇది పెక్కండ్రచే బలుతావుల వర్ణింపబడియున్నది ప్రప్రథమమున బేర్కొనదగినవి కృష్ణరాయల శాసనములు. ఇవి రాయల దండయాత్ర సాగుచున్నపుడు చెక్కించినవి. ఇందు రాయల విజయములు సంగ్రహముగ బేర్కొనబడియున్నవి.

5. రాయ. పుటలు ౨౩–౨౪.

ఒక్కొక్క ముఖ్యస్థలమును సాధించినపిమ్మట నా విజయములను బ్రసాదించినందుకు భగవంతునికి దన కృతజ్ఞతను జూపుటకు ఆ యాస్థలములందో, లేక సుప్రసిద్ధపుణ్యక్షేత్రములందో వెలసిన దేవతల పూజాపురస్కారములను నడపుటకు జేసిన దానాదుల వివరమిం దుల్లేఖింపబడియున్నది. దండయాత్ర నడచిన మార్గము పొడవునను ఎప్పుడెచ్చట గలిగిన విజయమును దెలుపుట కప్పుడే యవి యచట నిలుపబడిన వసుటచేత చిట్టచివరను వ్రాయించిన శాసనమునందుగాని దండయాత్రవృత్తాంతము సమగ్రము గానరాదు; కాని అన్నిటిని మొత్తముగ జేర్చి చూచిన దండయాత్ర నడచిన మార్గమును సాధించిన దుర్గములును వశపఱచుకొన్న రాష్ట్రములును జక్కగ దెలియరాగలవు. శాసనములందేకాక సమకాలికసంస్కృతాంధ్రగ్రంధ కర్తల రచనల లోను, పాశ్చాత్యపోర్చుగీసై తిహాసికుల చరిత్రల లోను, ప్రయాణీకుల వృత్తాంతములందును కృష్ణరాయల కళింగజైత్రయాత్రప్రస్తావము గలదు; మఱియు నర్వాచీనరచనలగు రాయవాచక కృష్ణరాయ విజయములందును నీ కళింగవిజయము విపులముగ వివరింపబడియున్నది. వీని నన్నిటిని సమకూర్చి చక్కగ బరిశీలించి చూచిన నీదండయాత్రయొక్క చరిత్ర విశదము కాగలదు.

కృష్ణదేవరాయల కళింగజైత్రయాత్ర యేకధాటిగ సాగలేదు. క్రీ. శ. ౧౫౧౩ మొదలు ౧౫౧౮ వ సంవత్సరమువఱకును విడుమర లేక సంగ్రామము నడచినను నందైదాఱు ప్రత్యేకఘట్టము లుండినట్లు శాసనములందును, సమకాలికాంధ్రగ్రంథములందును సూచింపబడియున్నది. ఒక్కొక్కముఖ్యదుర్గమును సాధించిన పిమ్మట కృష్ణరాయ లంతవఱకును జరిగిన యుద్ధాంశములను సంగ్రహముగ శాసనమందు ప్రకటించి విజయనగరమునకు మరలిపోవువాడు. సింహాచలపర్యంతము గల రాజ్యమును జయించునప్పటి కిట్టి ఘట్టములు నాలుగు వ్యక్తపడుచున్నవి.

ఈక్రింది శాసనములవలన నీవిషయము దెల్లము కాగలదు.

(౧) ఉదయగిరిశాసనము: (నెల్లూరుశాసనములు-సం. ౩. ఉద. నెం. ౪౦.):

"శ్రీ వీరకృష్ణరాయలు వుదయగిరిదుర్గం మీద విడిసి ప్రతాపరుద్రగజపతిని కొండవీడు పర్యంతం విరుగంబొడిచి వుదయగిరిదుర్గానకు మేనతవేయించి దుర్గం పుచ్చుకొని ప్రతాపరుద్రగజపతివారి పినతండ్రి తిరుమలకాంతరాయనిని పట్టుకొని తిరిగివిచ్చేసి...."

(౨) తిరుపతిశాసనము. (తిరుపతిదేవస్థానశాసనములు. సం. ౩. నెం. ౬౮, ౭౧ ర్లు).

"శ్రీ వీరప్రతాప శ్రీ వీరకృష్ణదేవమహారాయలు ప్రతాపరుద్రగజపతిని కొండవీటిదనకాను విరుగంబొడిచి ఉదయగిరిదుర్గమున్ను కైకొని తిరిగి విజయనగరంరాజధానికి విచ్చేస్తున్న .."

(౩) అమరావతిశాసనము: (*S. I. I. Vol. VI No. 248*).

"శ్రీకృష్ణదేవమహారాయలు విజయనగరానుండి పూర్వదిగ్విజయయాత్రకు విచ్చేసి వుదయగిరిదుర్గం సాధించి తిరుమల రౌతరాయ మహాపాత్రునిం బట్టుకొని అద్దంకి వినికొండ బెల్లంకొండ నాగార్జునుని కొండ తంగేడ కేతవరం మొదలైన గిరిదుర్గస్థలదుర్గాలన్ని న్ని యేకదాడిం గైకొని కొండవీటిదుర్గం లగ్గలంబుచ్చుకొని ప్రతాపరుద్రగజపతికొమారుండు వీరభద్రరాయనిన్ని కొమారహంవీరమహాపాత్రుని కొడుకు నరహరిపాత్రుండు రాచూరిమల్లవఖానుండు వుద్దండఖానుండు పూసపాటి రాచిరాజు శ్రీనాథరాజు లక్ష్మీపతిరాజు జన్యాలకసవాపాత్రుండు పశ్చిమబాలచంద్రమహాపాత్రుండు మొదలుగాను పాత్రసామంతులాను మన్నెవారిన్ని జీవగ్రాహంగాను పట్టుకొని వారికి అభయదానం ఇచ్చి ధరణికోట అమరేశ్వరానకు విచ్చేసి"

(౪) అహోబలశాసనము. (*L. R.* 15. *pp.* 314-33) దిగువ అహోబలంమంటపంలో శాసనము.

"......పాత్రసామంతులను మన్నెవారిని జీవగ్రాహంగా పట్టుకొని వారికి అభయదానం ఇచ్చి

ధరణికోటకు విచ్చేసి అమరేశ్వరమహాదేవుని సన్నిధిని తులాపురుషదానము సేయ నవధరించి...తిరిగి విజయనగరానకు విచ్చేసి రత్నసింహాసనారూఢులై సామ్రాజ్యము సేయుచును మఱిన్ని కళింగదేశానకు దిగ్విజయార్థమై యిచ్చటికి విచ్చేసి......''

(౫) తిరుపతిశాసనము. (తిరుపతి దేవస్థాన శాసనములు. సం. ౩. నెం. ౮౦).

"ధరణికోట అమరేశ్వరానను తులాపురుష మహాదానమునను శాయనవధరించి తిరిగి విజయ నగరానకు విచ్చేసి సామ్రాజ్యంచేస్తున్ను మరిన్ని కళింగదేశదిగ్విజయార్థమై బెజవాడకు విచ్చేసి కొండపల్లి దుర్గమున్ను సాధించి ఆదుర్గంమీద నున్న ప్రహరరాజు శిరశ్చంద్రమహాపాత్రుండు బోడజనమహాపాత్రుండు బిజిలిఖానుండు పెగు మొదలైనవారినిని జీవగ్రాహంగాను పట్టుకొని వారికి అభయదానంఇచ్చి అనంతగిరి ఉండ్రకొండ ఉర్లకొండ అరువపల్లి జల్లిపల్లి కందికొండ కప్పలు వాయి నల్లగొండ కంభంమెట్టు కనకగిరి శంకరగిరి ఇవి మొదలయిన తెలుంగాణ్యపుదుర్గాలు ఏక ధాటిని కైకొని సింహాద్రి పొట్నూరికివిచ్చేసి అక్కడను జయస్తంభం వేశి రాజమహేంద్రివరా నకు విచ్చేసి తమదేవులు చింనాదేవంమ తిరుమల దేవంమగారిచాతను మహాదానాలు శేయించ నవధ రించి విజయనగరానకు విచ్చేసి''

పై శాసనగ్రంథములవల్ల కృష్ణదేవరాయలు కళింగదిగ్విజయము ప్రారంభించినతరువాత మూడు పర్యాయములు విజయనగరమునకు యుద్ధరంగము నుండి మరలిపోయినట్లు తెలియవచ్చుచున్నది. ఉదయగిరి కైవసమైనపిమ్మట నొకమారు, కొండ వీడును సాధించిన తరువాత నొకసారి, సింహాద్రి పొట్నూరికడ జయస్తంభమును బ్రతిష్ఠించినవెనుక నొక్కతడవ, మొత్తము మూడుమార్లు యుద్ధ రంగమునుండి రాజధాని విజయనగరమునకు బోయి యచట రాజకార్యమును విచారించుచు గొంత కాలముండి మరల బయలువెడలిపోయి సైన్య మును గలిసికొనెనని విస్పష్టమగుచున్నది. ఇందు వలన రాయల కళింగదండయాత్రయందు మూడు ముఖ్యఘట్టములు గలవను తలంపు గలుగవచ్చును; కాని మనకు లభించిన శాసనాదిచరిత్రసాధన సామగ్రిని బరిశీలించిచూచితిమేని దండయాత్రలోని ఘట్టములు మూటికంటె నెక్కువగలవని తేలగలదు.

(౬) సింహాద్రిశాసనము (*S. I. I. Vol. V. No.* 694)నందు కళింగదండయాత్రలో గృష్ణరాయలు సింహాద్రిని జేరకమునుపు ఉద్దగిరి, కొండవీడు, కొండ పల్లి, రాజమహేంద్రవరము మున్నగు నాలుగు దుర్గములను సాధించినట్లు చెప్పియున్నది.

"శ్రీ వీరప్రతాప కృష్ణదేవమహారాయలు విజయనగరసింహాసనారూఢులంటై పూర్వదిగ్విజయ యాత్రకు విచ్చేసి ఉద్దగిరి కొండవీడు కొండపల్లి రాజమహేంద్రావరం మొదలైన దుర్గాలు సాధించి సింహాద్రికివిచ్చేసి.''

ఒక్కొక్క ముఖ్యదుర్గమును నొక్కొక్క ధాటి కిసాధియగుటవలన సింహాచలపర్యంతము సాగిన దండయాత్రయందైదు ముఖ్యఘట్టము లుండెనను నూహ కెడము గలుగుచున్నది. దీని కనుగుణముగ, నాముక్తమాల్యదయందు ప్రథమాశ్వాసాంతమున నుదయగిరివిజయమును, ద్వితీయాశ్వాసముచివర కొండవీటివిజయమును, తృతీయాశ్వాసముతుద కొండపల్లివిజయమును, చతుర్థాశ్వాసముకడపట పొట్నూరుసింహాచలమునందు విజయస్తంభ ప్రతి ష్ఠయు వరుసగ వర్ణింపబడియున్నవి.[8] ఇట్లే పోర్చు గీసై తిహాసికుడు న్యూనిజు ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి సింహాద్రివిజయములను వరుసగా వర్ణించి యున్నాడు.[7] కృష్ణరాయల ఆస్థానసంగీతవిద్వాం సుడు బండారులక్ష్మీనారాయణుడు నైతము మొదట ఉదయగిరి యటుపిమ్మట కొండవీడు కొండపల్లెల విజయమును కడపట పొట్టనూరికడ విజయస్తంభస్థాపనను వర్ణించియున్నాడు.[8] కాని కృష్ణదేవరాయల తిరుపతి సింహాచలశాసనములందు

6. *Sources of Vijayanagara History, pp.* 137-8.

7. *Swell, F. E. pp.* 147, 316,-319.

8. *Further Sources of Vijayanagara History. I. No.* 166-(*a*).

చెప్ప మఱియెచ్చటను రాజమహేంద్రవరవిజయ ప్రస్తావన గానరాదు. ఈశాసనములైనను రాయ లెప్పుడు రాజమహేంద్రవరమును జయించినదియు నిర్ణయించుటకు దోడ్పడవు. ఏలన సింహాచల శాసనమున గృష్ణరాయలు రాజమహేంద్రవరమును సాధించినపిమ్మట సింహాద్రికి బోయినట్లు చెప్పి యున్నది; కాని తిరుపతిశాసనమున దీనికి విరుద్ధ ముగ నతడు సింహాద్రియందు విజయస్తంభమును స్థాపించినపిమ్మట నచటినుండి విజయనగరమునకు మరలిపోవుచు రాజమహేంద్రవరమునకు వచ్చినట్లు కలదు. ఆముక్తమాల్యదయందుగాని, మఱి యేసమకాలికగ్రంథమునందుగాని చరిత్రయందు గాని రాజమహేంద్రవరవిజయప్రస్తావన గానరాక పోయినను దత్పరిసరరాష్ట్రము నతడు జయించి నట్లు అల్లసానిపెద్దనగారు మనుచరిత్రయందు చెప్పి యున్నారు.

'అట సాగి జమ్మిలోయబడి వేగి దహించె
కోన ఖిల్లేర్చె కొట్టాన దవిలె'[9]

అని మనుచరిత్రపీఠికయందు గలదు. కృష్ణా గోదావరుల మధ్య నుండు తీరాంధ్రభూమి వేగి యనుట నంద ఱెఱిగిన విషయమే. కోనకొట్టాములు రెండును గోదావరికి తూర్పున నున్నవి. కృష్ణ రాయల వేంగి విజయప్రస్తావన మనుచరిత్ర తృతీయాశ్వాసాంతమునందును గలదు.

'సైన్యస్తోమోత్థరజో వ్రజస్థగితకృ
ష్ణాగౌతమీమధ్యభూ
మ్యస్తోకోత్కళరాట్పురీహరణలీ
లావార్యశౌర్యోదయా'[10] అని.

కావున కృష్ణరాయలు గోదావరిఉభయ తటములందలి రాష్ట్రమును జయించెననుట తెల్లము. ఇట్లుభయతటములను జయించిన రాయలు గోదావరి తూర్పుగట్టున వేంగికి రాజధానియైన రాజ మహేంద్రవరమువంటి ముఖ్యదుర్గమును శాసనము లందు చెప్పినట్లు జయించినాడనుట నిస్సంశయము;

కాని దానిని జయించినదెప్పుడో నిశ్చయింపవలసి యున్నది. సింహాద్రిశాసనమున జెప్పినట్లు సింహాచలాగమనమునకు పూర్వమా? లేక తిరుపతి శాసనమున నుడివినట్లు పిమ్మటనా? సూక్ష్మముగ విచారించిచూడగా కృష్ణరాయలు సింహాచలమును జేరకపూర్వమే రాజమహేంద్రవరమును సాధించి యుండునని తోచుచున్నది. రాయలవంటి యుద్ధ కలామర్మజ్ఞుడైన దళనాయకుడు రాజమహేంద్ర వరమును బోలిన ప్రబలస్థలదుర్గమును, సారవంత మైన బంగారుపండు గౌతమీతీరదేశమును జయింపక శత్రుని యధీనమున విడిచిపెట్టి యంత కంకను దూర్పుననుండు సింహాచలప్రాంతమున కుండు నడుపుకొనిపోయియుండడు. కావున నతడు గోదావరీఉభయతటదేశమును రాజమహేంద్రవర దుర్గమును సాధించిన తరువాతనే సింహాచలమునకు బోయెనని యెంచుట యుక్తము అగునేని, సింహాచలమునుండి రాయలు రాజమహేంద్ర వరమునకువచ్చినట్లు తిరుపతిశాసనమున జెప్పి యుండుటకు గారణమేమను ప్రశ్నకు సమాధాన మేమి? వాస్తవస్థితిని తెలుపు చరిత్రాధార మింకను లభ్యపడలేదు; కాని కారణము దురూ హ్యాము గాదు. కృష్ణరాయలు కృష్ణాగౌతమీ మధ్యస్థతీరాంధ్రమును స్వయముగ జయించలేదు. కొండపల్లికి లగ్గలువట్టినపిమ్మట రాయసైన్యము రెండువాహినులుగ చీలినది. ఒకవాహిని రాయ నాయకత్వముక్రింద తెలిగాంణరాజ్యమును బ్రవే శించినది; మఱియొకటి తూర్పుగ బయలుదేరి కృష్ణాగౌతమీమధ్యదేశమును జొచ్చినది. రెండును సింహాద్రిచెంతనో, తత్పూర్వమో కలిసికొని యేకమైనవి. కృష్ణాగౌతమీమధ్యదేశమును కోన కొట్టాము ప్రాంతములను జయించిన సైన్యము రాజమహేంద్రవరదుర్గమును సాధించినది ఈ కారణమువలన నేమొ న్యూనిజుమున్నగు సమకాల చరిత్రకారులును, గ్రంథకర్తలును రాయలు సాధించిన దుర్గములలో రాజమహేంద్రవరమును జేర్పకపోయిరి. కృష్ణరాయలంతకుమున్ను దెప్పుడును రాజమహేంద్రవరమును జూచియుండకపోవుట వలన పోట్నూరుసింహాచలమందు విజయస్తంభ మును స్థాపించినపిమ్మట విజయనగరమునకు మరలి

9. మను. ౧-౩౭.

10. మను. ౩-౭౯.

పోవునపు డామార్గమున బోయియుండును. ఇది కేవల మూహాయే ; కాని యన్యథా తిరుపతి సింహాచల శాసనములందు గానవచ్చు విపర్యాసము నకు సమన్వయము కుదురదు.

ఇంతవఱకు వివరింపబడిన శాసనాదిసాక్ష్యమును బరిశీలించిచూడగా గృష్ణరాయల పూర్వ దిగ్విజయ మేకధాటి కాదనియు నంచెలమీద సాగిన దీర్ఘదండయాత్ర యనియు దేలుచున్నది. ఇందు ముఖ్యఘట్టములు నాలుగు గానవచ్చెడిని :— (౧) ఉదయగిరి, (౨) కొండవీడు, (౩) కొండపల్లి, (౪) సింహాచలము.

సింహాచలమున జయస్తంభస్థాపనతో గళింగ జైత్రయాత్ర ముగిసెననియు, నంతట గజపతి దన కుమార్తె నిచ్చి రాయల కుద్వాహమొసర్చి సంధి జేసికొనెననియు కీర్తిశేషులైన డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారు రభిప్రాయపడి యున్నారు తమ యభిప్రాయమును దృఢపఱచుట కొఱకు క్రిందికారణములను జూపియున్నారు : (౧) రాయవాచకమునను గృష్ణరాయవిజయ మందును సింహాద్రికడ జయస్తంభప్రతిష్ఠతో కళింగ దండయాత్ర ముగిసినట్లు చెప్పియున్నది. (౨) రాయలవంటి యుద్ధమర్మజ్ఞుడగు దండనాయకుడు దన వెలకన నుండు ప్రబలశత్రులను సరకు సేయక ఉత్తరదిక్కునకు సాగిపోయియుండడు. (౩) కాని యల్లసాని పెద్దన మనుచరిత్రయందు కృష్ణరాయల ప్రతాప ముదయగిరి దయమువలన ప్రజ్వలించి క్రమక్రమముగ వృద్ధినంది పొట్నూరి కడ పెనుమంటయై మండి యొడ్డాదిని మసిచేసెను ; అశోకచుక్క యొక్క వేడికి గజపతి కటకమున నిలువజాలక వింధ్యాద్రికి పాఱిపోయి యంగలి గుహలయందు దలదాచుకొనెనని వ్రాసియున్నాడు. మనుచరిత్ర కావ్యము ; కావ్యపద్ధతి ననుసరించి యాహావర్ణన హృదయంగమముగ నెయున్నది. కావ్యమునకు జరిత్ర యెంత చేరువగ నుండవలయునో పై వర్ణనయు జరిత్రాంశముల కంత చేరువయందే యున్నది. కాని యది చరిత్రకాదు. గజపతి రాజధానికి జిచ్చంటించుట యతని కుమార్తెను బెండ్లాడుట కనుకూలమార్గము గాదు. కావున కృష్ణరాయల కళింగ దండయాత్ర సింహాద్రిని దాటి యుత్తరముగ సాగియుండుట యసంభవము.[10a]

కాని కృష్ణస్వామిఅయ్యంగారు చూపిన కారణములు ప్రబలమైనవి కావు. రాయవాచకమునగాని, కృష్ణరాయవిజయమునగాని సింహాద్రితో రాయల కళింగదండయాత్ర ముగిసినట్లు చెప్పియుండలేదు పొట్నూరిసింహాద్రియొద్ద పాళ్యము దిగినపిమ్మట కొంత యుద్ధము నడచినట్లు కలదు. "కర్ణాటకంవారు కనమలదాటి అహానుదానగరానకు వచ్చి నిపాతంశేశి పొట్నూరిసింహాద్రివద్ద శిబిరం దిగినారు. యిక్కడికి నాలుగుక్రోశముల మేర వచ్చివున్నారు రేపటి మర్నాటి ధాటిమార్గంగా సురంరాణువ వచ్చును." అని కృష్ణరాయలు సింహాద్రికడ విడిసినపిమ్మట నా వృత్తాంతమును విన్నపుడు గజపతి యనుచరులతో జెప్పినమాటలివి. ఇందువల్ల గృష్ణరాయలు సింహాద్రిని దాటి గజపతివారు నివసించుచుండిన పట్నమునకు నాలుగుక్రోశములదూరమువఱకు దూచిచేసి పోయినట్లు తెలియవచ్చుచున్నది. ఇచటనే రాయల విడిది యందు సాళువతిమ్మరసయ్య భేదోపాయమవలంబించి షోడశమహాపాత్రులపై గజపతి హృదయమున సంశయమును గల్పించి యతనిని 'పట్ణంవిడిచి యేక దేశాన...యేడెనిమిది ఆమడ పొడవు ఉత్తరంగా పారిపోవు'నట్లు యుక్తిపన్నినది[11] కావున డాక్టరు కృష్ణస్వామి అయ్యంగారనుకొన్నట్లు రాయవాచక కృష్ణరాయవిజయములు కృష్ణరాయల కళింగదండయాత్రను సింహాచలమున సమాప్తముసేయలేదు. మఱియు గృష్ణరాయల ప్రతాపపువేడికి దాళక గజపతి నిజరాజధానినుండి వింధ్యాద్రిగుహలలోనికి బాఱిపోయినట్లు చెప్పినాతడు పెద్దనగాదు, నందితిమ్మన. 'కటకమును గాల్చె గజరాజు గలగి పఱవ' యని యతడు కటకమును దగులబెట్టినట్లు స్పష్టముగ పెద్దన నుడివి

10*a*. *Yet-remembered ruler of a Long-forgotten Empire p.* 17.

11. రాయ. పుట ౧౦౭; *cf* కృ. రా. వి. ౩ : ౭౬-౧౧౩.

యున్నాడు.[12] గజపతి రాజధానిని తగులబెట్టుట యతని దుహితాకరగ్రహణముసేయు నుత్తమ పద్ధతి కాకపోవచ్చును; కాని గజపతిని యుద్ధమున నోడించి యతని రాష్ట్రమును దుర్గములను హరించుట యంతకంటె నెక్కుడు హృదయరంజకము గాదు. ఇటువంటి వివాహము లెన్నియో జరిగినట్లు చరిత్ర తెల్పుచున్నది. రాయల దండు మార్గమునకు వామపార్శ్వమున దురకరాజ్యము లుండుట వాస్తవమే. కాని యప్పటికే కృష్ణరాయలు మూడిండ్ల తురకరాజుల నోడించినట్లు రాయవాచకమునందే చెప్పియున్నది. 'ఈ వర్తమానం గజపతివారు విని యేదులసాహు, కుతపనమలక, నిజాంశాహువారు ముగ్గురున్ను నిలువలేక తిరిగి స్థలాలు వచ్చిరి. గనుక ముగ్గురుదు నేదార్లనున్ను వీగతోలిన బలవంతులతో తాము ఏకదేశాన పోరాడేది యేరీతు?' అని గజపతివారు అప్తులనడిగినట్లు కలదు. ఇందువలన రాయరాణువకు పార్శ్వమునుండి శత్రుల యుపద్రవము కలుగునని యాశంకించుట కవకాశము లేదు. మఱియు నుదయాద్రినుండి సింహాద్రివఱకు గల రాష్ట్రములును దుర్గములును రాయలకు హస్తగతములై యతని యనుచరులపాలనక్రింద నుండుటవల్ల గర్ణాటము నుండి వస్తుసామగ్రులు రాకపోవు నను భయమును లేదు. కావున డాక్టరు కృష్ణస్వామిఅయ్యంగారి యొక్క యభిప్రాయము పాటింపదగనిది వీరెట్లభిప్రాయపడినను, కృష్ణరాయలు సింహాచలమునుండి దండునడుపుకొనిపోయి కటకమును పరశురామప్రీతి గావించె నని నిశ్చయముగ జెప్పవచ్చును. కృష్ణరాయల యాస్థానసంగీతవిద్వాంసుడు సింహాద్రికడ జయస్తంభమును నిలిపినపిమ్మట గృష్ణరాయలు గజపతితో మరల యుద్ధముజేసి యతని నోడించి యతనిరాజ్యమును కుమార్తెకరముతో గూడ గ్రహించె నని చెప్పియున్నాడు. అతడు వర్ణించిన కళింగదండయాత్రక్రమమును దిలకింపుడు:

> దుర్గం జిత్వాఽథ సోసా వుదయ గిరివరం
> తత్ర రాహుత్తరాయం
> బన్దీకృత్యాశు హృత్వా యుధినగరవరే
> కొణ్డవీట్యాం కొణ్డపల్ల్యాం
> జీవాగ్రాహం గృహీత్వా గజపతి తనయం
> పొట్టనూర్పట్టణాగ్రే
> 'విశ్వశ్లాఘ్యప్రతాపో బిరుదయుతి జయ
> స్తంభ ముచ్చైర్నిఖానీత్.
> సోఽయం కృష్ణనరేశ్వరో గజపతిం
> జిత్వా తదీయశ్రియా
> సాకం తస్య సుతాముదూహ్య......''[13]

మఱియు—రాయలు, పెద్దనగారు చెప్పినట్లు 'మాడెములు వ్రేల్చి యొడ్డాది మసియొనర్చి కటకమును గాల్చి'నదియు పొట్నూరు రపులుకొన్నపిమ్మటనే, మఱియు పెద్దనగారు గజపతికి వ్రాసి యంపిన లేఖయందును రాయల కటకవిజయము వర్ణింపబడియున్నది.

> " సంపెటనరపాలసార్వభౌముడు వచ్చి
> సింహాద్రిజయశిల జేర్చునాడు
> సెలగోలు సింహంబు చేరి ధిక్కృతిగంచు
> తల్పుల గరుల డీకొల్పునాడు,
> ఘనసరనిర్భరగండపెండెర మిచ్చి
> కూతు రాయలకును గూర్చునాడు
> ఒడ తెలుంగవో చచ్చితో యుర్విలేవో ''[14]

ఇత్యాది—

కటకముపర్యంతము విజయనగరసైన్యములు దండయాత్ర జేసెనని ఈపద్యమువలన దెలియుచున్నది. కంచుతల్పుల గృష్ణరాయలు దన కరుల డీకొల్పినాడట. ఈకంచుతల్పు లెచటివో ? గజపతి రాజధానియగు కటకముయొక్క కంచుతల్పులే కాని యన్యస్థలములవి కావు. ఈయూహ సరియైనదని యెంచుటకు శాసనాధారము కొంతకలదు. అనంతపురంజిల్లా హిందూపూరుతాలూకా చోళసముద్రగ్రామమున క్రి. శ. ౧౫౧౭వ సంవత్సరము కడపట కృష్ణరాయల సేనాధిపతులలో నొక్కడగు

12. మను. ౧-౩౨

13. *Further Sources of Vijayanagara History. B. No.* 116-(*a*)

14. *Sources of Vijayanagara History p.* 154.

రాయసం కొండమరసయ్యగారు వ్రాయించిన శిలాశాసనమున దన యాధిక్యత నిట్లు చెప్పుకొని యున్నారు.

'స్వామికార్య్య హేమవంతం ఘనగిరిఉద యాద్రి ప్రముఖాది అనేక దుర్గప్రజా రక్షకం, సింహాద్రి శ్రీకూర్మ జయస్తంభకార్య్య నివ్వా హకం' 14a ఇత్యాది. ఇందువలన కృష్ణరాయల దండయాత్ర సింహాద్రినిదాటి ప్రాచీన గంజాం మండలములోని శ్రీకూర్మముపర్యంతము సాగెనని నిశ్చయమగుచున్నది. మఱియు క్రి. శ. ౧౫౧౭ వ సంవత్సరమున కృష్ణరాయల భృత్యులలో నొక్క డగు తిప్పరసయ్యకుమారుడగు లక్ష్మీకాంతరసు గుంటూరుమండలములోని కొమ్మూరుగ్రామమున వ్రాయించిన శాసనమువల్ల పై దండయాత్ర కటకముదాక నడచెనని రూఢియగుచున్నది.[15] ఇందు 'కటకముపర్యంతమును' కృష్ణరాయలు పొందిన విజయము లెన్నబడియున్నవి. కావున కృష్ణరాయల పూర్వదిగ్విజయము గజపతి రాజధాని యగు కటకమువఱకు సాగెనని మనము దృఢముగ జెప్పవచ్చును. అగునేని, యంతకు పూర్వము చేర్కొనిన, (౧) ఉదయగిరి (౨) కొండవీడు (౩) కొండపల్లి (౪) సింహాచలము మున్నగు నాలుగుఘట్టములకు (౫) కటక మను నైదవఘట్ట మును జేర్పవలసియున్నది

కర్ణాటకులతోడి పూర్వవైరమునుస్మరించి మూడిండ్లసుల్తానుల సలహా ననుసరించి గజపతి తన గడిప్రదేశములను గాపాడుటకు వలసిన యేర్పా టుల గావించుటసహజమే. కాని రాయవాచకమున వర్ణింపబడిన రాయబారవృత్తాంతము వాస్తవమని నిరూపించుటకు దగిన సాధనాంతరము లెవ్వియు లేవు ; అయినను ఇందు సంభవింపదగని విషయ మెద్దియు లేదు ; కావున సాధనాంతరములవల్ల నిది యసత్యమని రుజువగునంతవఱకును నిదియు వాస్తవ మైన చరిత్రాంశమని మనము గ్రహింపవచ్చును.

## అనుబంధము

శాసనములందు కొండపల్లిని సాధించిన పిమ్మట కృష్ణదేవరాయలు అనంతగిరి, ఉండ్రకొండ, ఉర్ల కొండ, ఆరువపల్లి, జల్లిపల్లి, కందికొండ, కప్పలు వాయి, నల్లగొండ, కంభంమెట్టు, కనకగిరి, శంకర గిరి ఇవి మొదలైన తెలుంగాణ్యపు దుర్గముల నేక ధాటిని కొన్నట్లు చెప్పియున్నది. ఏకధాటిప్రస్తా వము లేకపోయినను పైచేర్కొన్న తెలింగాణదుర్గ ములందు కొన్నింటిని రాయలు సాధించినట్లు సమ కాలికవాఙ్మయమువలన దెలియుచున్నది.

" వేలుపుగొండ యుద్వృత్తిభంగము జేసె
జల్లిపల్లి సమగ్రశక్తి గూల్చె
గినుకమీఱ ననంతగిరి క్రిందుపడజేసె
గంబంబుమెట్లు గ్రక్కనగదల్చె "[1]

అనిపారిజాతాపహరణమునందును, 'కనకగిరి స్ఫూర్తి గరచె'నని మనుచరిత్రయందును గలదు.[2] కాని రాయవాచకమునగాని కృష్ణరాయవిజయ మునగాని తెలింగాణధాటిప్రస్తావములేదు. ఉదయ గిరి, కందుకూరు, కొండవీడు, కొండపల్లె, వినుకొండ, నాగార్జునకొండ మొదలైన దుర్గములను జయించిన తరువాత కృష్ణరాయలు అహమదానగరముపై నడచినట్లు రాయవాచకమునం దున్నది[3] కృష్ణ రాయవిజయమునగూడ నిట్లే యుదయగిరి, కందు కూరు, కొండవీడు, కొండపల్లి,వినుకొండలను సాధిం చినపిమ్మట నముదానగరముపై నెత్తిపోయినట్లు చెప్పియున్నది.[4] ఈ అహమదనగరం గజపతివారి రాజ్యములోనిది కాదు ఏలనగా, కృష్ణరాయ లా దుర్గమును జయించినపిమ్మట 'నందుండి గజపతిరాజ్యా నకు నడచి' నట్లు రాయవాచకమున వక్కాణింప బడియున్నది.[5] కృష్ణరాయవిజయమునంచా దుర్గ సంరక్షకులగు 'పారశీకులనేకులు' గాందిశీకులైరని చెప్పియుండుటవలననది మూడిండ్ల తురకరాజులలో

14 *a*. *ARE* 87 *of* 1912, *SII. IX. Pt.* 2 *No.* 507.

15. *ARE*. 824 *of* 1922.

1. పారి. ౧.

2. మను ౧-౩౨.

3. రాయ. పుటలు ౯౧-౯౩.

4. కృ. రా. వి. ౩ : ౫౩-౬౫

5. రాయ. పుట. ౯౩.

నొక్కరికి జెందినదై యుండవలెనను నూహాపోదము
చున్నది. సకలభారతావనియందును సుప్రసిద్ధమైనది
యహమదునగరునామపుర మొక్కటియే కలదు.
ఇది నిజాంశాహివంశజులకు రాజధాని ; కాని కృష్ణ
దేవరాయలహమదునగరమునుసాధించెనని చెప్పుటకు
సాధనాంతరము గానరాదు. కావున 'సోర్సస్ ఆఫ్ ది
విజయనగర హిస్టరీ' అనుగ్రంథముగ ద్రచయిత
కీ. శే. శ్రీ ఆసూరి రంగస్వామిసరస్వతిగారు ఇది
యహమదాబాదు-బీదరని సూచించిరి.[6] ఇది యంగీ
కార్యము గాదు. అహమదాబా దను మహమ్మదీయ
నామము బీదరుకున్నను సర్వసామాన్యముగ నప్పటి
మహమ్మదీయులందఱును వానిని బీదరనియే
పేర్కొనువారు. రాయరాజ్యనివాసులు బెడదకోట
యనెడివారు. మఱియు నహమదాబా దహమదు
నగరము కాజాలదు. కావున శ్రీ రంగస్వామిసరస్వతి
గారి స్థలనిర్దేశ్యము సరియైనది కాదు. రాయవాచక
కృష్ణరాయవిజయములర్వాచీన గ్రంథము లగుట
చేతను, కృష్ణరాయ లహమదునగరమును జయించె
నని తెల్పు సాధనాంతరములు లేకపోవుటచేతను
పైగ్రంథములందలి యహమదునగరవిజయకథనము
విశ్వాసపాత్రము గాదని త్రోసిపుచ్చుట యుక్తమను
తలంపు గలుగవచ్చును ; కాని యాముక్తమాల్యద
యందు పంచమషష్ఠాశ్వాసాంత పద్యములను
జూడగా పై జెప్పబడిన యహమదనగరపతనవృత్తాం
మునందేదో కొంత సత్యమున్నట్లు తోచుచున్నది.

"ఇది యంధ్రోక్తి యథార్థనామ యవనా
సృక్పూర్ణకెంబావి వా
రిదపద్ధత్యవరోధివప్రవిలయ
శ్రేణీవిఘాతక్రియా
స్పదసేనాగ్రగకృష్ణరాయమహిభృ
త్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యద నాశ్వాసము పంచమం బమరు హృ
ద్యంబైన పద్యంబులన్."[7]

"ఇది నైజామన యావనావనిధవా
హీనాభ్రచుంబిస్ఫుర
ద్విదితాఖిలమణీగృహోళిదళనో
ద్వేలోగ్రహాస్త్రివ్రజో

ద్యదనీకాగ్రగకృష్ణరాయమహిభృ
త్సంజ్ఞాస్మదాముక్తమా
ల్యదని నాశ్వాసవరేణ్య మాఱవది
హృద్యంబైన పద్యంబులన్."[8]

తాళపత్రప్రతులందును ముద్రితగ్రంథముల
లోను 'ఇది నైరామనయావనావనిధవ' అనియే
సర్వత్ర కానవచ్చుచున్నది. నైరామనాఖ్యనగరము
గాని యా పేరిటి సుల్తానుగాని యన్యత్ర యెచ్చటను
బేర్కొనబడియుండలేదు. అట్టిపురము దక్కనులో
గాని మఱి రాయల కంటుబాటుగల దేశములందు
గాని కానరాదు. కావున 'నైజామన' యని సవరించి
తిని. మఱియు నీ పద్యము వ్రాత ప్రతు ల న్ని టి
యందును గాన్పింపదు శ్రీనివాసవ్యాఖ్యతోగూడిన
ప్రతులయందే కానవచ్చుచున్నది. ఆముక్తమాల్యద
యేడాశ్వాసముల గ్రంథమని పెక్కు వ్రాతప్రతుల
యందు జెప్పియున్నది. ఈ పద్యమును ద్రోసిపుచ్చిన
ఆఱాశ్వాసాంతములే మిగులును ; యేడవ యాశ్వాస
మున కాశ్వాసాంతపద్యముండదు. కావుననే శ్రీని
వాసాదిప్రాచీన వ్యాఖ్యాతలును బ్ర. శ్రీ కళాప్రపూర్ణ
వేదము వేంకటరాయశాస్త్రిగారివంటి యాధునిక
వ్యాఖ్యాతలును నీపద్యమును ద్రోసిపుచ్చక గ్రహిం
చిరి మఱియు నీయాశ్వాసాంత పద్యములు—
ముఖ్యముగ నాలుగైదాఱేడాశ్వాసముల తుద
నుండునవి—ముద్రితగ్రంథమందలి క్రమముచొప్పున
కాక వ్రాతప్రతులందు తారుమారుగా గానవచ్చు
చున్నవి. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగార
మునందలి వ్రాతప్రతులలో—

డి. నెం ౩౯౫—'ఇది సింహాచల దంభకేసరి...
శ్వాసము సప్తమంబలరు' అని
యున్నది. ఆఱేడాశ్వాసములు
వేర్వేఱుగ విభజింపబడియుండలేదు.

6. *Sources of the Vijayanagara History* p. 114
7. ఆముక్త. ౫-౧౬౧.
8. ఆముక్త. ౬-౬౯.

గూడ పట్టుకొని పెట్టెలను దెరిపించి యందుండిన నగలను రాయలపేరట తిమ్మరసయ్యవారికి వ్రాసిన లేఖలను గాంచి వారు తనయెడ ద్రోహము దలపెట్టినారని యెంచి 'పదారు నియ్యోగులనున్న పట్టం విడిచి యేకదేశాన అవ్వలవీడతోలి గజపతివారు యేడెనిమిది ఆమడపొడవు ఉత్తరంగా పాఱిపోయిరి. మరుసటి ఉదయము షోడశ మహాపాత్రులు యుద్ధమునకు సంసిద్ధులై గజపతినగళ్ళకు వచ్చిరి. గజపతివారి పలాయనమును విని వారు తమ స్వస్థలములకు బోయి చేరిరి ఈ వృత్తాంతము రాయలవారికి తెలియకపడగనె జయభేరి వేయించి కటకమును బ్రవేశించిరి.[46]

ఇది రాయవాచకమున వర్ణింపబడిన రాయల కటక దండయాత్ర వృత్తాంతముయొక్క సారాంశము. ఇందు అసంగత మేమియు లేదు. రాజపుత్రులతోగూడి తనపై తిరుగుబాటు గావించిన యక్బరు రాకుమారుని వారినుండి వేర్పఱచుటకు మొగలాయి చక్రవర్తి యౌరంగజేబు యిట్టి యుక్తినే అవలంబించినాడు; కాని రాయవాచక వృత్తాంతమును రుజువు సేయగల యన్యసాక్ష్య మెద్దియు గానరాదు; కావున దాని నుపయోగించుకొనునప్పు డీ యంశమును స్మరణయందుంచుకొనుట మేలు. రాయవాచకమందు కృష్ణరాయలు పై జెప్పినట్లు కటకమును బ్రవేశించినపిమ్మట ప్రతాపరుద్రగజపతి యతనితో సంధి గావించుకొని తన కూతు నతనికిచ్చి యుద్వాహము గావించెనని చెప్పియున్నను పోర్చుగీసు చరిత్రకారుడగు న్యూనిజ్ ఈ విషయము నింకొకవిధముగ వినరించియున్నాడు.

కృష్ణరాయలు సింహాద్రినుండి విజయనగరమునకు విచ్చేసిన తరువాత 'మొదటిదుర్గమున దనచే బట్టువడి (గజపతి) రాజకుమారుని[47] తన సముఖమునకు రప్పించి, యతడు లగువుగల పోటరి యనియు, గత్తికటారుల సామున గడు నేర్పరి యనియు, జనశ్రుతిచే దెలియవచ్చుచున్నందున నతని ఖడ్గవిద్యానైపుణ్యమునుజూడ వేడుకపడుచుంటిననియు' జెప్పెను. 'పలినవారు నన్ను రప్పించితిరి. కావున నాశక్త్యనుసారము (నా నేర్పును) జూపెదను' అని యా యువకుడు బదులు చెప్పెను మరుసటిదినము రాగనే రాయలు అతనిని మరల పిలిపించి, యప్పుడు ఖడ్గవిద్యావిశారదు డని పేరందిన తన యనుచరులలో నొక్కనితో గూడ పోట్లాడమని కోరెను. తన యంతస్తుకు దగినట్లొక రాజకుమారునితో గాక యొక యధమపురుషుని దనతో పోట్లాడ నియోగించినందులకు గినిసి, 'దైవనిరోధము, రాజపుట్టువుగాని వాని స్పృశించి నా చేతులను మలినపఱచుకొనజాలను' అని రాయలతో నాక్రోశించి చెప్పి యాత్మహత్య గావించుకొనెను తన కుమారు డెట్లు మృతినందినదియు దెలియగనె యతని తండ్రి సాల్వతినియ (సాళువ తిమ్మయ)కు—కుమారుడు గతించిపోయెగనుక—యేమి ప్రత్యామ్నాయము గొని రాయల చెఱయందుండు తన రాణివాసమును బంధవిముక్తను గావింతురో తెలుపవలయునని లేఖ వ్రాసెను. అందుకతడు రాయల కతని (గజపతి యొక్క) కుమార్తెనిచ్చి వివాహముసేయుట కేర్పాటుగావించిన యెడల రాయ లతని రాణిని చెఱనుండి వదలిపెట్టుటయే గాక యతని రాజ్యమును సైతము ఆతనికే ఇచ్చివేయగల'డని బదులు వ్రాసెను. అతడు (గజపతి) ఈ సలహా నంగీకరించి తన కుమార్తె వివాహవిషయమును సంప్రతించుటకు రాయబారులను విజయనగరమున కంపెను. కృష్ణరాయలు సంతృప్తి నందెను. ఈవిషయమై యతని అభిప్రాయము దెలియగనె ఉరియ నరపాలుడు తన

46. రాయ. 95–109.

47. ఇందు 'మొదటి దుర్గమున' అను మాట ప్రమాదజనితము. న్యూనిజు చరిత్రప్రకారము ప్రతాపరుద్ర గజపతి పుత్రుని కృష్ణరాయలు చెఱగొన్నది కొండపల్లె దుర్గమునందు. అతని లెక్కననుసరించి యది మూడవదుర్గమగునుగాని మొదటిది కాజాలదు. రాయలు సాధించిన మొదటిదుర్గము ఉదయగిరి. అచట బందీగావింపబడినది గజపతి 'ఆంటా' లేక ఆన్‌కులో' (పినతల్లిగాని మేనత్తగాని లేక పినతండ్రిగాని మేనమామగాని) కృష్ణరాయల శాసనములును అప్పటి యాంధ్రవాఙ్మయమును ప్రతాపరుద్ర గజపతి కుమారుడు రాయలచే బట్టువడినది కొండవీటి దుర్గమందని తెల్పుచున్నవి.

పుత్రిక నతనికడకంపెను. ఆమెరాకతో వారిరువురికి (గజపతికిని రాయలకును) సఖ్యము కుదిరినది. కృష్ణ రాయలు నది (కృష్ణ) కవ్వలివైపు రాష్ట్రము నాతని కిచ్చివేసి యీవలివైపు భూములను దానుంచు కొనెను.[48]

న్యూనిజుగాథ యథార్థమైనదని పయసు సాక్ష్యమువలన రుజువగుచున్నది. కృష్ణరాయలు తఱచుగ నురియాదేశపు రాజుతో గయ్యముసేయు చుండెననియు, నతని రాజ్యమును జొచ్చి పెక్కు పట్టణములను నాశమొనర్చి సాధించి యతని భటుల ననేకులను వారణములను నిర్జించెననియు, నతని పుత్రుని చెఱవట్టి చిరకాలము విజయనగర మున కారాగారమందుంచగా నతడచటనె మృతి నందెననియు, నతనితో సంధిచేసికొని దేశమున శాంతిని నెలకొల్పుటకొఱకు ఉరియారాజు తన కొమార్తె నొక్కతె నతని కిచ్చెననియు నాత డామెను విజయనగరమున బెండ్లాడి తన ధర్మపత్నిగ గైకొని యున్నాడనియు పయసు వ్రాసియున్నాడు.[49]

కృష్ణరాయలచే బట్టువడిన యురియరాజ కుమారుడు వీరభద్ర గజపతియని యింతకుముందే చెప్పియున్నాడను. ఇతని మరణమునుగూర్చి న్యూనిజు ప్రభృతులగు సమకాలిక పోర్చుగీసు చరిత్రరచయితలు వచించుగాథ విశ్వాసపాత్రము గాదని యాధునిక పరిశోధకులు కొందఱు నిరసించు చున్నారు. వారి యభిప్రాయమునకు గారణము లేకపోలేదు విజయనగర చక్రవర్తి యేలుబడి క్రింద నుండిన రాష్ట్రమున వీరభద్రగజపతి శాసనములు మూడు గలవు. వీని మూలమున నతడు కృష్ణరాయలపక్షమున కొన్ని సీమలను బరిపాలించుచున్నట్లు తెలియవచ్చుచున్నది; ఇట్లు తనక్రింద మాండలికుని గావించి గౌరవించిన కృష్ణ రాయలు వీరభద్రగజపతి నవమానపఱచి యతని యాత్మహత్య కెంతమాత్రమును గారణభూతుడు గాజాలడని వీరి వాదమందలి సారాంశము.[50]

చక్కగ విచారించి చూచిన వీరి యాక్షేపణ సదాధారమైనదికాదు. వీరభద్ర గజపతిశాసనము లన్నియు శా. శ. 1437 యువసంవత్సర కార్తిక మాస శుక్లపక్షమున వ్రాయించినవి. ఒకటి ద్వాదసి నాడును తక్కినవి రెండును పౌర్ణమాస్యనాడును జెక్కించినవి.[51] అప్పుడు వీరభద్రగజపతి కృష్ణ రాయలక్రింది మాండలికుడై సీమల నేలుచుండినది వాస్తవమే; కాని న్యూనిజు జెప్పునది యవ్వలి చరిత్ర—శా.శ. 1438 ధాతు చైత్ర బ. 12 నాడు రాయలు సింహాద్రియందుండెను[52] శా.శ 1438 ధాతు ఆషాఢ బ. 15 నాడు తిరిగివచ్చుచు బెజవాడలో మకాముజేసెను.[53] అచటినుండి బయలుదేరి విజయనగరమునకు వచ్చి శా. శ. 1438 ధాతు పుష్య శుద్ధ 10 నాడు తిరుమలకు విచ్చే సెను.[54] కావున శా. శ. 1438 ధాతు ఆషాఢ బ. 15 కును పుష్యశుద్ధ 10 కిని నడుమ నేదో యొకదినమున నతడు విజయనగరమును జేరి యుండవలయును. న్యూనిజుచెప్పు వృత్తాంత మనంతర మెప్పుడో జరిగియుండవలయును. కాబట్టి శా. శ. 1438 యువ సంవత్సర కార్తిక మాస శుక్లపక్షమున వ్రాయించి నిల్పిన వీరభద్ర గజపతిశాసనములు న్యూనిజు గాథయందలి నిజా నిజములను నిశ్చయించుటకు ఆధారము గాజాలవు.

మఱియు వీరభద్రగజపతిని బుద్ధిపూర్వకముగ కృష్ణరాయ లవమానపఱచెనని తలంచ నావశ్యము లేదు. ఖడ్గవిద్యానైపుణ్యము ప్రదర్శనమునందే దృష్టియుంచి యేకాంగిపోరు మర్యాదలను మనసు నకు దెచ్చుకొనక విస్మరించి వీరభద్రునికి పుట్టుక యందు గాకున్నను విద్యావిశారదతయందు సరి యుద్దియైన శూరునితో బోర గోరియుండవచ్చును. శూర మర్యాదలను జక్కగ నెఱిగిన వీరభద్రుడు కాపలెనని దన్నవమానపఱచుటకొఱకు కృష్ణ

48. *Nuniz, Forgotten Empire, pp.* 319-320.

49. *Paes : Forgotten Empire p.* 247.

50. *ASIR.* 1908-19, *P.* 178, *The Yet remembered Ruler of a Long Forgotten Empire, p.* 11.

51. *EC XI. Dg.* 107, *XII Pg.* 62 *ARE* 744 *of* 1917

52. *SII. VI.* 694 *and* 696.

53. *EC. V. Hn.* 13.

54. *TTDI III.* 80.

రాయలు ఒక యధమ పురుషునితో బోర నాజ్ఞాపించెనని యెంచి యా యవమానమున కోర్వజాలక ఆత్మహత్య గావించుకొని యుండవచ్చును. ఇందలి నిజానిజము లెట్లున్నను వీరభద్రగజపతి యంతటితో పొడగానరాకపోయెను ' శాసనములం దెచ్చటను నతనిజాడ గానరాదు. తండ్రికి వారసుడైనను, రాయలతో సంధిగావించుకొన్న పిమ్మట గజపతి రాజ్యపాలన కార్యముల నన్యులు దక్షులైరి; శా. శ. 1447 ప్రాంతమున గజపతి రాజ్యముపై నెత్తివచ్చిన సుల్తాన్ కుల్లీ కుతుబు శాహును ప్రతిఘటించినవాడు ప్రతాపరుద్రుని పుత్రుడు రామచంద్రగజపతిగాని వీరభద్రుడు గాడు. ప్రతాపరుద్రుని యనంతరము గజపతి పట్టమున నభిషిక్తుడైన వా డతని కుమారులలో మఱియొకడగు కులుఅదేవుడుగాని వీరభద్రుడు గాడు. కావున న్యూనిజు పయసులు వ్రాసినట్లు వీరభద్రగజపతి శా. శ 1439 ఈశ్వర సంవత్సర ప్రాంతమున విజయనగరమున మృతిసందెనని యెంచుట యుక్తము.

కృష్ణరాయల రెండవ కటకదండయాత్రతో కళింగయుద్ధము సమాప్తమైనది. రాయవాచకమున జెప్పినరీతిని సర్వస్వమును గోలుపోయి శరణాగతుడైన నేమి న్యూనిజు వక్కాణించినట్లు పుత్రమరణమువలన జడిసి భార్యయొక్క క్షేమము నపేక్షించిననేమి ఎట్లైననేమి గజపతి సంధిని కోరెను. అతడు రెండు షరత్తుల కొడబడిన రాయలు సమాధానపడుట కొప్పుకొనెను. గజపతి తన కూతును రాయల కిచ్చి వివాహము సేయవలయును. మఱియు గృష్ణానదికి దక్షిణమున పూర్వము విజయనగర రాయలకడనుండి గజపతులు జయించి కైకొన్న రాష్ట్రమునంతటిని మరల నిచ్చివేయవలసినది. ఇందులకు ప్రతాపరుద్రగజపతి సమ్మతించినయెడల కృష్ణ కుత్తరమున కృష్ణరాయలు జయించిన యావద్రాష్ట్రము నతనికి మరల నిచ్చివేయుట కొప్పుకొనెను. ప్రతాపరుద్రగజపతి యా షరతుల నంగీకరించెను. అంతట సంధి కుదిరినది. ఇరుపక్షములవారును సమాధానపడిరి. ఇందుకు దార్ఖాణముగ గృష్ణదేవరాయలు శా. శ 1441 ప్రమాది సంవత్సర శ్రావణశుద్ధ 13 సోమవారమునాడు 'విజయనగరం సింహాసనారూఢులై సింహాద్రినాథునికి తమ పేరింటిభోగము నడచేఅందుకు ప్రతాపరుద్ర గజపతిమహారాయల చాతను పుచ్చుకొన్న గ్రామాలు కళింగదండపాట లోని గ్రామాలు' రెంటిని దానముజేసెను.[55]

## గజపతియోటమికి గారణములు

ఈ యుద్ధమున ప్రతిరణక్షేత్రముననను, ప్రతి ముట్టడియందును, గజపతియు నతని బలములును బరాజయమునందుటకు గారణమెద్దియో విచారింతము. సుప్రసిద్ధపరిశోధకులైన రఖల్ దాసు బెనర్జీ గారా సమయమున నోరిస్సా సత్త్వము క్షీణించుటకును, ప్రతాపరుద్ర గజపతి మరణానంతరమిరువ దెనిమిదేండ్లకు దాని స్వతంత్ర వినాశమునకు మూలకారణము శ్రీకృష్ణచైతన్యులని చెప్పి యున్నాడు. ప్రతాపరుద్రగజపతియు నాతని యధికారవర్గమున బెక్కండ్రును చైతన్యుని శిష్యులు మతదృష్టిని జూచిన చైతన్యు లుపదేశించిన భక్తిమార్గము మహనీయమైనదే; కాని దాని నవలంబించుటవలన ఒరిస్సా సామ్రాజ్యము పాడగుటయేగాక రాజకీయముగ దాని ప్రతిష్ఠ యంతయు రూపుమాసిపోయినది. సర్వసమత్వమును ప్రేమను ఉపదేశించుమతము మనుజులహృదయములందు క్షాత్రవాదర్శములను సమ్మకసులను నుప్పతిలజేసి సంఘబంధములను నిర్మూలము గావించును; వాస్తవముగ సర్వవిషయములందును సమానులగు మనుష్యులిరువురెందును గానరారు; రాజ్యతంత్రము సర్వత్ర బలముమీదనే యాధారపడియున్నది. చైతన్యమతము నవలంబించుటవలన ప్రతాపరుద్రుడును నతని యధికారవర్గమునం దనేకులు యుద్ధమునందభిరుచిని గోల్పోయిరి. ఇదియే ఒరిస్సా వినాశమునకు గారణభూతమైనది.[56]

ఇది యపోహము. ప్రతాపరుద్రగజపతియు నతని యధికారు లొక్క కొందఱును వైష్ణవ మతమును స్వీకరించినది వాస్తవమే. చైతన్యస్వామి

55. 599. *VI.* 695.
56. *Indian Antiquary*, 1929 (*April*) p. 67.

సర్వసమత్వమును ప్రేమను ఉపదేశించుటయు నిజమే. అందువలన ప్రతాపరుద్రగజపతి యుద్ధాభిరతికి వీడికోలిచ్చెననుట కల్ల. అతడుత్తమ క్షత్రియ ధర్మము నొకప్పుడును త్యజించలేదు. కళింగయుద్ధము శా. శ 1434 ప్రజోత్పత్తి సంవత్సరమునుండి శా. శ 1441 ప్రమాదివఱకును దాదాపు యేడేండ్లకాలము నడచినది. ఈ యేడేండ్లును ప్రతాపరుద్రుడు కృష్ణరాయలతో నెడతెగక పోరాడెను సమయము వచ్చినప్పుడు శత్రుని మార్కొనుటకు జంకి వెనుదీయలేదు. యావచ్ఛక్తిని వినియోగించి తుదవఱకును పోరాడక విడిచిన దుర్గము లేదు. అతని కుటుంబమున పిరికికండ లేదు; అతని పినతండ్రి తిరుమల రాహుత్తరాయడును, కుమారుడు వీరభద్రుడును శూరాగ్రేసరులు; అధికారులలో గసవాపాత్రుడు, ప్రహరేశ్వరపాత్రుడు, చిత్తాపఖానుడు మున్నగువారు పేరెక్కిన యోధులు కావున వైష్ణవమతావలంబనముచేగాని మఱియే కారణముచే గాని ప్రతాపరుద్రుడును నతని సేనాధిపతులును యుద్ధమునందు విరక్తులని యెంచుట కవకాశము లేదు ప్రతాపరుద్రుని పరాజయమునకు నిజమైన కారణ మతని ప్రతిపక్షియొక్క యద్వితీయ సమర నిర్వహణశక్తియే. కృష్ణరాయలు సామాన్య సేనాధిపతిగాడు. అతనికి సరియుద్ధియని పేర్కొనదగిన దండనాయకు డెవ్వడును భరతఖండమునం దప్పుడు గానరాడు కృష్ణరాయల నెదుర్కొని యోడినవాడు గజపతి యొక్కడేకాదు. ఏదులఖాను లిద్దఱును, బరీదుకుతపనమల్కులును అతని కత్తిపోటు రుచిజూచి పాఱినవారే; వారు శౌర్యహీను లగుటవలనగాదు, అత డసాధారణ ప్రజ్ఞావంతుడగు సేనానాయకు డగుటవలన. ఈ యంశమును దృష్టియందుంచుకొనినగాని ప్రతాపరుద్ర గజపతి యోటమికి వాస్తవమైన కారణమును గ్రహింప జాలము.

## కళింగయుద్ధ ఫలితార్థము

కళింగయుద్ధమువల్ల గృష్ణరాయల కీర్తి భారతావనియంతటను బర్వినది; అతని శౌర్య ప్రతాపములు ప్రకటితమైనవి; అత డసాధారణ ప్రతిభాసంపన్నుడైన దండనాయకాగ్రేసరు డని తెల్లమైనది. రాయరాణువ ప్రతిష్ఠ యతిశయించినది. లుప్తమైన రాయసామ్రాజ్యభాగములు మరల స్వాధీనపడినవి. ఇవి తాత్కాలికఫలములు. దీర్ఘదృష్టి దిలకించిన గళింగయుద్ధము దక్షిణభారత భూమికి అనర్థకరమని చెప్పవలసి యున్నది. చిరకాలమునుండియు దక్షిణహిందూదేశమును యవనాక్రాంతము గానీయక హిందూస్వాతంత్ర్య ధర్మముల సంరక్షించుచుండిన హిందూసామ్రాజ్యములలో నొక్కటియగు గజపతి సామ్రాజ్యపతనమునకీ యుద్ధము మూలకారణమాయెను విజయనగర చక్రవర్తులును గజపతులును సుహృద్భావముతో నేకీభవించి పూనుకొనియుండిన మహమ్మదీయుల యధికారమును సమూలముగ బెకలించి యుండ వచ్చును. వారి పరస్పర వైషమ్యము మహమ్మదీయులకు లాభకారియైనది. మొదట బహమనీ సుల్తానులును వారి యసంతరము గోలకొండ కుతుబుశాహులును తీరాంధ్రమున ప్రవేశించుటకీ వైరము జాల యనుకూలపడెను ప్రకృతము గజపతికి సంధిషరతుల ప్రకారము కృష్ణకవ్వలి భూముల నన్నిటిని కృష్ణరాయ లిచ్చివేసినను నది యిడియబడిన యింటిదానమువలె ప్రతిగృహీత కుపభోగ్యము గాదాయె. ఈ యుద్ధానంతరము ప్రతాపరుద్ర గజపతి తన స్థితిగతుల నిట్లు చెప్పుకొని యున్నాడు.

'నష్టంకులం భిన్నతటాక కూపాన్
విభ్రష్టరాజ్యం శరణాగతంచ' అని.

కావున సంధిమూలమున లభ్యమైన రాజ్యమును సంరక్షించుకొనుటకు గజపతికి తగిన బలము లేదు; బలమును గూర్చుటకు ధనములేదు; దీర్ఘయుద్ధముచే నవసిన ప్రజలను, పాడువడి బీడువడిన దేశమును పోషించి సంరక్షించు శక్తి యతనికి లేదాయె. ఈ కష్టములను గడకొత్తి రాజ్యమును బునరుద్ధరింప జాలు నాథుడును గానరాడాయె. కావున ప్రతాపరుద్ర గజపతిరాజ్యకాలముననే గోలకొండ కుతుబుశాహు తెలింగాణ

దుర్గములను శ్రమ లేక సాధింపగల్గెను; అతని మరణానంతర మచిరకాలమునకె కుతపనమల్కా పుత్రుడు మల్కిభరాము గజపతి రాజ్యమును గూలద్రోసి తీరాంధ్రకళింగప్రాంతములను స్వాధీన పఱచుకొనగల్గెను; కావున కృష్ణరాయల కళింగ జైత్రయాత్ర గజపతిసామ్రాజ్యనిర్మూలనకును దేశ పారతంత్ర్యమునకును హేతుభూతమాయెనని చెప్ప వలసియున్నది.

## ౬. కాటూరు—కుతపనమలక

గజపతితో సంధిగావించుకొనిన పిమ్మట తత్పూర్వ మేబదియేండ్లనుండియు గప్పమీయక తిరుగబడియుండిన కాటూరు ప్రభువుమీద రాయలు దండెత్తి చనెనని న్యూనిజు చెప్పుచున్నాడు. ఈ కాటూరురాజ్య మెచ్చటనుండెనో నిశ్చయించి చెప్పుటకు దగిన సాధనములు లేవు; విజయనగర చరిత్రకారు లీ యంశమునుగూర్చి భిన్నాభిప్రాయములను వెలిబుచ్చియున్నారు; కాని న్యూని జీ సందర్భమున జెప్పియుండు నంశములన్నిటిని దృష్టియందుంచుకొని నిష్పక్షపాతబుద్ధితో బరిశీలించి చూచితిమేని యది దక్షిణదేశమున తామ్రపర్ణీ ముఖద్వార ప్రాంతమున నుండెనని తోచకపోదు.[1]

ఈ దండయాత్రయందు నడచిన యుద్ధప్రకారము మనకు జక్కగ దెలియదు. ముఖ్యాంశము నొక్కదానిని మాత్రము న్యూనిజు పేర్కొని యున్నాడు. కృష్ణరాయలు కాటూరు ప్రభువుపై నెత్తిపోయి యతడు నివసించుచుండిన ముఖ్య పట్టణమును ముట్టడింప దలపెట్టెను; కాని యాపట్టణము నావరించి ప్రవహించుచుండిన నదియొక్కటి వెల్లువ నీటిచే నుప్పొంగి దరులు దాటి ప్రవహించుచుండుట వలన దాని ముట్టడివేయుటకు సాధ్యపడదాయె; కృష్ణరాయ లంతట నా యుద్యమమును మానుకొనలేదు. నదియొక్క ప్రధానశాఖనుండి పెక్కు కాలువల ద్రవ్వించి వానిమూలమున ప్రవాహ జలము నన్యమార్గముల ద్రిప్పి వెల్లువను శోషిలజేసి కోటనుముట్టడించి స్వాధీనపఱచుకొనెను. అందు విస్తారమైన ధనమును హస్త్యశ్వాదివాహన చయమును లభించినవి. కాటూరు ప్రభువు బందీకృతుడై విజయనగరమునకు గొంపోబడెను. అతని రాష్ట్రము రాయసామ్రాజ్యమున గలసిపోయినది.

కాటూరు వృత్తాంతము న్యూనిజు చరిత్ర యందు దప్ప మఱియెందును గానరాదు. సమకాలిక ప్రబంధములుగాని యన్యరచనలుగాని ఈ దండయాత్రను బేర్కొనవు. రాయవాచక కృష్ణరాయ విజయాదియర్వాచీన గ్రంథములందు సైతము దీని ప్రస్తావము గానరాదు. కాటూరుప్రభువు కృష్ణరాయలకు మాఱొడ్డిన క్షుద్రశత్రువులందొక్కడనియు, దత్కారణమున భారతీయగ్రంథకర్తలతని మీది దండయాత్రను గృష్ణరాయల సుప్రసిద్ధ విజయములలో జేర్చిలెక్కపెట్టక వదలిపెట్టియుండు రనియు మనమూహింపవలసియున్నది.

### కుతుబ్శాహుతో యుద్ధము

ఇతడు గోల్కొండ కుతుబ్శాహీ రాజ్యస్థాపకుడగు సుల్తాన్ కుల్లీ కుతుబ్శాహు. ఇతనిని సమకాలికాంధ్రులు కుతుపనమలక యని పిలిచెడివారు. జన్మముచే నితడు తురుష్కుడు. ఇమ్మడి ముహమ్మదుశాహు కడపటిదినములలో దక్కనుకువచ్చి సుల్తాను అంగరక్షక బలమును బ్రవేశించెను. ఇతడు మొదట బహమనీసుల్తానుయొక్క వేటకుక్కలను గాపాడు చేర్వగాడుగ నియమింపబడినట్లు రాయవాచకము నందు కలదు.[2] ఇది యెంతసత్యమో తెలియదు. ఇతడు నెఱజోదు; నేర్పరియైన గళవాయి; సుల్తాన్ ఇమ్మడిమహమ్మదుశాహు రాజ్యప్రారంభదశయందు తెలంగాణమునకు పాలకుడాయెను. సుల్తాను దౌర్బల్యమును సంతర్పపఱచుకొని, చిక్కిన బహమనీ సామంతు లందరివలెను, స్వతంత్రుడాయెను. కృష్ణరాయలు సింహాసనము నధిష్ఠించిన క్రొత్తలో నితడు దనపేర నాణెములను ముద్రించుకొని ఖుద్బానుజది

1. చూ: అనుబంధము, 'కాటూరు'.

2. రాయవాచకము ఆం. సా. పరి, పత్రిక, సం. 3. పుట 61.

వించుకొని నిజస్వాతంత్ర్యమును ప్రకటించుకొనెను ఇతడు ఆసవోతు, ఇతని రాజ్యకాంతకు మేరలేదు; తెలుగుభూమి కంతటికిని తానె యొడయుడను గావలయునని ఇతని కోరిక. కావున, గజపతుల తోడను విజయనగర రాయలతోడను పోరితని కని వార్యమాయెను

కృష్ణరాయల ప్రథమ తురుష్కయుద్ధముననె కుల్లీ కుద్బుశాహాతని కత్తిపోటు రుచిజూచియుండెను. రాయలు సింహాసనము నెక్కియు నెక్కక ముందె జిహాదును ప్రకటించి విజయనగర సామ్రాజ్యముపై నెత్తివచ్చిన బహ్మనీసుల్తాను రెండవ మహమ్మదుశాహునకు దోడునడచి కృష్ణాతటమున ఘోరసంగ్రామమున నిర్జితులై పాఱిపోయిన ముగ్గురు దునేదారులలో కుత్బుశాహొక్కడు. ఈ పరాజయ మతని హృదయమునకు శల్యప్రాయమై రాయలతో పదింబదిగ బోరాడ బురికొల్పినది. ప్రతి సంవత్సరమును అతడు విజయనగర సామ్రాజ్యముపై దండయాత్ర వెడలువాడట! క్రీ శ. 17 వ శతాబ్ద ప్రారంభదశయందు విరచితమైన 'తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీ కుద్బుశాహీ' యను గోల్కొండ సుల్తానుల చరిత్రయందు సుల్తాన్ కుల్లీకుత్బుశాహుకు గృష్ణరాయలతోనైన యుద్ధములు కొన్ని విపులముగ వర్ణింపబడియున్నవి. ఈ చరిత్రప్రకారము ఆయుద్ధమంతయు రెండురాజ్యముల గడిప్రదేశములందుండిన గిరిదుర్గములైదింటి చుట్టు నడచినవి. దేవరకొండ ముట్టడితో యుద్ధము ప్రారంభమైనది; కుల్లీకుత్బుశాహు తన సైన్యముల నంపి కోటను ముట్టడించి స్వాధీనపఱచుకొనుటయే కాక యచ్చట హిందూ దేవాలయములను కట్టడములను నిడియగొట్టించి వాని స్థానమున మసీదులను గట్టించెను. ఈ వార్త విన్నంతటనె కృష్ణరాయలొక గొప్ప సైన్యముతోగూడ కుత్బుశాహీ రాజ్యముపై నెత్తివచ్చి గడిప్రదేశమున జాలభాగము ద్రొక్కిచూచి పాడుగావించెను; సుల్తాన్ కుల్లీ యంతట నొక చిన్న సైన్యముతో నతని దఱుముటకు వచ్చెను. ఉభయ సైన్యములును పానుగల్లు దుర్గము కడ దారసిల్లినవి; యుద్ధమున గృష్ణరాయలోడి పాఱిపోయెను; తరువాత కొంతకాలము ముట్టడి నడచిన పిమ్మట రాయల బంధువైన దుర్గాధ్యక్షుడు పానగల్లు కోటను సుల్తాన్ కుల్లీవశము గావించి శాణ్యముతో గూడ నచటు వాసిపోయెను; అచటి నుండి కుల్లీకుత్బుశాహు ఆ దుర్గమునకును గోయిల్ కొండకును మధ్యనుండు గన్పురమును ముట్టడించెను. రెండు నెలల పర్యంతము ముమ్మరముగ ముట్టడి సాగినది. దుర్గపాలకులు మొండిధైర్యముతో దుర్గ సంరక్షణకార్యమును నిర్వహించినను తుదకు కోటను శత్రువులపాలు గావించి బయలువెడలవలసినవారైరి. గన్పురము స్వాధీనమైనపిమ్మట కుల్లీ కుత్బుశాహు కోవెలకొండ (కొయ్యలకొండ) ను ముట్టడించెను; కొన్నినాళ్లైన పిమ్మట తురకలు కోటగోడలలో గండ్లు పొడిచి లోపల బ్రవేశింప బ్రయత్నించిరి; అటుపిమ్మట శత్రులనిల్వరించుటకు సాధ్యము గాకపోయినందువల్ల దుర్గసంరక్షకులు కోటను శత్రువులకు సైవసము జేయవలసి వచ్చెను.

కోవిలకొండను సాధించిన తరువాత కొన్ని యేండ్లు గడచినవి. కుల్లీకుత్బుశాహు ప్రతాపరుద్ర గజపతి నోడించి కృష్ణాగోదావరుల మధ్యనుండు తీరాంధ్రభూమిని స్వాధీనము జేసికొనెను. సుల్తాన్ కుల్లీ యుద్ధప్రయత్నములు పూర్తి జేసికొని కొండవీటికివచ్చి యాదుర్గమును ముట్టడించెను; కాని యది నిరభ్యంతరముగసాగలేదు బెల్లంకొండ వినుకొండ దుర్గములందు కాపుండిన రాయరాణువ పలుమారు రాత్రులందు ముట్టడికారులపైబడి వారి కపార నష్టము గలిగించెను; కావున కుల్లీ కుత్బుశాహు కొంత దండుతో దన కుమారుని హైదరుఖానుని కొండవీటి చుట్టును గాపుంచి స్వయముగ బెల్లంకొండపై నడచి యా దుర్గమును ముట్టడించెను అచ్చటి రాయశాణ్యము నిర్వక్ర పరాక్రమముతో బోరినను కోటను తుదకు కుత్బుశాహున కొప్ప జెప్పవలసినవారైరి. ఇంతలోపలనె కొండవీటిని ముట్టడించుచుండిన కుత్బుశాహీ దండు హైదరుఖానుని యాధిపత్యము నంగీకరింపక తిరుగుబాటుచేసెను; వెంటనె కుల్లీకుత్బుశాహు కొండవీటికి బోవలసివచ్చెను; బెల్లంకొండ మహమ్మదీయులకు వశమైనదని తెలియవచ్చినంతటనె, కృష్ణరాయలొక గొప్పసైన్యమును, కొండవీటి రాజ్యమునుండి తురకలను బాఱదోలి వారాక్రమించుకొన్న దుర్గ

ములను రాష్ట్రము మరల స్వాధీనము జేసికొనుట కొఱకంపెను ; కాని యా సైన్యమును బెల్లంకొండ జేరగనే వారి రాక నెఱింగి కుల్లీకుత్బుశాహు కొండవీటినుండి వేగిరమె తిరిగివచ్చి యాకస్మికముగ పైబడి యుద్ధమున వారి నోడించి పాఱదోలెను; పిమ్మట నతడు కొండవీటికి మరలివచ్చి యా కోటను గూడ సాధించెను. కొండవీడు శత్రువశమాయెనని విన్నంతనె, కృష్ణరాయలు దన యల్లుడును సేనాధిపతియునైన శివరాయల యాధిపత్యము క్రింద నొక లక్షదళము నా దుర్గమును మరల జయించి వశపఱచుకొనుటకొఱకంపెను. రాయ సైన్యము వచ్చుటనుగని కుల్లీకుత్బుశాహు కొండవీటిని విసర్జించి కొండపల్లివైపు తరలిపోయెను. హిందువులు వెన్నంటి తఱుముచు బోయిరి. వారు సమీపించు నందాక ఊరకయుండి కుత్బుశాహు గటాలున వారిపై నురికి పంచ బంగాళము గావించెను. ఇట్లు నిర్జితులైన హిందువులు వెనుదిరిగి కొండవీటికి బోయి యా దుర్గమున జొరబడి ద్వారములను మూసికొనిరి. కుల్లీకుత్బుశాహు వారిని వెంబడించి వచ్చి కొండవీటిని మరల ముట్టడించెను. కుత్బుశాహుదాటి కాగజాలక హిందువులు, సంవత్సరమునకు మూడు లక్షల హొన్నులను గప్పముగట్ట నొప్పుకొని, యతని కరిగాపులైరి.[3]

తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహీ యందు వర్ణింపబడిన యుద్ధవృత్తాంతము సంగ్రహముగ నిది యుద్ధవృత్తాంతము నింత విపులముగ విరచించిన చరిత్రకారుడు యది యెప్పుడు జరిగెనో తెల్పియుండిన విషయ గ్రహణమునకు జాలగ ననుకూలపడి యుండెడిది అట్లాతడు తెల్పియుండక పోవుటచే నీ యుద్ధచరిత్రము దురవగాహమై తప్పు తలంపులకు దానకమైయున్నది. కొందఱు సుప్రసిద్ధ పరిశోధకులీ మహమ్మదీయ చరిత్రగ్రంధమున వివరించియుండు యుద్ధవృత్తాంతమంతయు గల్పనాపథయని ద్రోసిపుచ్చియున్నారు.[4] కావున మొట్టమొదట నీ యుద్ధకాలమును నిర్ణయించుట కర్తవ్యము. కుల్లీకుత్బుశాహు యొక్క దేవరకొండ ముట్టడితోగదా ఈ యుద్ధము ప్రారంభమైనది. మొదట నీ దుర్గము గజపతులకు జెల్లుచుండినది. క్రీ. శ. 1460 వ సం॥మున కపిలేశ్వర గజపతి యాజ్ఞ చొప్పున నతని పుత్రు డంబీరదేవుడు దేవరకొండ వెలమలకు దోడు చనినప్పటినుండి క్రీ. శ. 1515 సంవత్సరమున కృష్ణరాయలు గజపతి సామ్రాజ్యముపై దండెత్తిపోవుచు దేవరకొండతో గూడ తెలింగాణ దుర్గముల నన్నిటిని సాధించువఱకును నది గజపతుల యాధీనమందే యుండినది ; కావున కుత్బుశాహు దాని ముట్టడించినది క్రీ. శ. 1515 నకు దరువాతనై యుండవలయును. తరువాత పానుగల్లు గన్పుర కోవెలకొండదుర్గము లన్నియు నొకదాని వెనుక నొకటిగ గుత్బుశాహుచే నైదాఱు నెలల కాలమున జయింపబడినట్లు చెప్పియుండుటచే నవి కుత్బుశాహునకు క్రీ. శ. 1516 వ సంవత్సరమునకు దరువాతెప్పుడో వశమైనట్లు మనము నిశ్చయింపవచ్చును. కీర్తిశేషులైన శ్రీ కొమఱ్ఱాజు వెంకటలక్ష్మణరావు పంతులుగారు అద్దంకి గంగాధర కృత తపతీసంవరణ పీఠికలోని కుల్లీకుత్బుశాహు ప్రశంసాత్మకములైన—

"పడమట సవాయి బసవనిగా జేసి
యచట గొయ్యలకొండ యావరించె
ఇబ్రమది(రి) మి(మ)ల్లా ఖాను గతిణంబున గొట్టి
హరియించె పానుగల్లాదిగిరుల."

అను సీసపద్య చరణముల నాధారపఱచుకొని 'ఇబ్రమదిమిల్లాఖాను' యెవ్వడో తెలియదు. కాని యతడు తురుష్కుడనుటకు సందేహము లేదు. అదిల్ షాహ యొక్క సేనానియైయుండనోపు. కావున గుతుబ్ షాహ పానుగల్లును రాయలయొద్దినుండి లీసికొనియెనన్న 'వార్తకల్ల' యని వ్రాసినారు.[5] కుత్బుశాహు ఇబ్రమదిమిల్లాఖానుని గఱిమిపానుగల్లాదిదుర్గములను గొనియెనని గంగాధరకవియన్నంతమాత్రమున, కృష్ణరాయల నాతఁ డోడించి యా దుర్గము స్వాధీనపఱచుకొనెనని తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహీయందు చెప్పబడిన వృత్తాంతమును.

---

3. *Briggs, Ferishta* III *pp.* 355-57, 365-67.

4. కె. వి. లక్ష్మణరావుగారు—మహమ్మదీయ మహాయుగము, పుటలు 368—69.

5. డిటో.

'కల్ల'యని త్రోసిపుచ్చవలసిన యావశ్యకతలేదు. ఏలన, రెండును సత్యమే కావచ్చును. పానుగల్లు మొదలగు దుర్గములను కుల్లీకుత్బుశాహొకసారి కృష్ణరాయలను జయించియు మఱియొకసారి సమదిమిల్లాఖానుని బాఱదోలియును స్వాధీనము జేసికొనియుండవచ్చును.[6]

ఇకకొండపీటి యుద్ధవిషయమును విచారింతము తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహి లోజెప్పినట్లు సుల్తాన్ కుల్లీ కొండవీటిపై నెత్తివచ్చినది వాస్తవమని పరిశోధకు లొప్పుకొనుచున్నను, అందు వక్కాణించినట్లు విజయుడుగాక రాయలచే పరాభూతుడై పాఱిపోయెనని నిశ్చయించియున్నారు. వీరు తమ యభిప్రాయము సత్యమైనదని నిరూపించుటకు న్యూనిజుమున్నగు సమకాలిక రచయితల వ్రాతల నుదాహరింతురు; కాని న్యూనిజు సాక్ష్యము నాధారపఱచుకొని తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహీయందలి యుద్ధవృత్తాంతము సత్యాత్మకముగాదని వాదించుట తగవుగాదు. ఏలనగా, న్యూనిజు, పేర్కొను దండయాత్ర తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహియందు వర్ణింపబడిన దండయాత్ర కంటె భిన్నమైనది. న్యూనిజు చెప్పు దండయాత్ర, క్రీ. శ. 1519 సంవత్సరమునకో యంతకు కొంచెము ముందో జరిగినది. కృష్ణరాయలు కళింగవిజయము సంపూర్ణమైనపిమ్మట విజయనగరమునకువచ్చి తిమ్మరసయ్యను అతనికి నాయంకరమున కిచ్చియుండిన కొండవీటికి ప్రయాణము జేసియంపెను. అత డచటికి బోయి చేరకముందే కుత్బుశాహు దళవాయి, మదార్ మలుక్ యను మహమ్మదీయుడు అఱువదివేల సైన్యముతో నతని నెదిరించెను. రెండులక్షలఫౌజును వెంటబెట్టుకొని పోవుచుండిన తిమ్మరసు వానిని సులభముగ

6. జరిగినవాస్తవముగూడ నింతియయని తోచుచున్నది. ఇందు పేర్కొనబడిన దుర్గములన్నియు నిప్పటి హైదరాబాదు రాజ్యమునందలి మహబూబ్నగరమండలము నందున్నవి. దేవరకొండ నల్లగొండ జిల్లాసరిహద్దునను పానుగలు గద్వాల కోవిలకొండలు మహబూబునగర పశ్చిమప్రాంతమునం దొండొంటికి చేరువయందున్నవి. క్రీ. శ. 16 వ శతాబ్దప్రారంభమున విజయనగర విజాపుర గోల్కొండరాజ్యముల పొలిమేరలును ఇచ్చటనె సంధించుచుండినవి. ఈప్రదేశమప్పుడు ముయ్యేలగుట్ట; కావున పైబేర్కొనిన దుర్గములన్నియు దఱచుగ జేతులుమారుచుండుట యందు వింతయేమియు లేదు. కోవెలకుంట వీనియందు ప్రధానదుర్గము; దాని చరిత్రననుసరించియె తక్కినవాని కథయు నడచెను. 16 వ శతాబ్దప్రారంభముననది విజాపురరాజ్యస్థాపకుడగు యూసఫ్ ఆదిల్ ఖానుని యధీనమందుండెను. క్రీ. శ. 1511 వ సంవత్సరమున గృష్ణరాయలీతని వధించి కోవెలకొండను దత్సమీపదుర్గములను రాష్ట్రములను వశపఱచుకొనెను. క్రీ. శ. 1534 వ సంవత్సరమున కోవెలకొండ కుల్లీకుత్బుశాహునకు జెల్లుచుండినది. విజాపుర ప్రభువగు ఇస్మాయీల్ ఆదిల్ శాహీదుర్గమును గైకొనుటకు వచ్చి ముట్టడివేసి యచటనె కోటను సాధింపకముందె వ్యాధిగ్రస్తుడై మృతినందెను.(*Briggs Ferishta III p.* 71) కావున కుత్బుశాహునవాయిని బసవనిగావించె కోవెలకొండ నావరించినదియు దమదమిల్లాఖానుని గొట్టి పానుగలు మొదలగు దుర్గములను హరించినదియు దత్పూర్వము జరిగియుండవలెను. ఎప్పుడోనిశ్చయించి చెప్పుటకు దగిన సాక్ష్యములేదు, కాని యది 1530-34 ల మధ్య జరిగియుండవచ్చును. ఏలనగా క్రీ. శ. 1529-30 సంవత్సరమున బీదరు ప్రభువైన బరీదునకును ఆదిల్ శాహునకును యుద్ధము సంఘటిలెను. ఆదిల్శాహునకు బీరారు పాలకుడైన ఇమాదు శాహును, బరీదునకు కుత్బుశాహును తోడు వచ్చిరి; కాని బరీదుపక్షమునకు ఓటమిగల్గెను. ఆదిల్శాహు బీదరును స్వాధీనము జేసికొనెను. ఈ సందర్భమున ఆదిల్శాహు కోవెలకొండ గద్వాల పానుగలు దుర్గములను స్వాధీనపఱచుకొనియుండవచ్చును; ఏలనగా నతని పుత్రుడగు మల్లూఖానుడీ యుద్ధమున దండ్రికి బాసటయై నిలిచి శత్రులతో బోరాడెను. (*Ibid p.* 64). ఇతడు గింగాధర కవి పేర్కొన్న దమది లేక దమరి మల్లాఖానుడు. దమది లేక దమరియనునవి రెండును అపపాఠములు. 'తమిమి' మల్లూఖాను అని యుండవలెను. తరువాత కుత్బుశాహోదిలుశాహీయుల నోడించి యీ దుర్గములనన్నిటిని కైవసము జేసికొని యుండవలయును. కావున నీదుర్గములను కుత్బుశాహు కృష్ణరాయల నోడించి కైకొన్నది, క్రీ. శ. 1516 నందగుటవలన గంగాధరకవి వాక్యముల నాధారపఱచుకొని తారీఖ్ - ఇ - ముహమ్మదుకుల్లీ కుత్బుశాహీ సాక్ష్యమును నిరసించి త్రోసిపుచ్చుట సమంజసముగాదు.

నోడించి భార్యాపుత్రులతోగూడ చెఱబట్టి విజయ నగరమున కంపెను. వారందఱు నచట చెఱసాల యందు మృతులైరి.[7]

తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహీ యందు వర్ణింపబడిన దండయాత్ర క్రి. శ. 1526 న తరువాత నడచెను. ఏలన నతడు గజపతిని జయించి కృష్ణాగోదావరుల నడిమి తీరాంధ్రదేశమును జయించి స్వాధీనము జేసికొనిన పిమ్మట కొండవీటిని ముట్టడించినట్లు చెప్పియున్నది. కుల్లీకుత్బుశాహు విజయముల కప్పుడు కొండవీటిరాజ్యమున రేగిన యల్లరియే ముఖ్యకారణము క్రీ శ 1515 మొదలు కొండవీడు రాజ్యము కృష్ణరాయల సర్వశిరఃప్రధాని యైన తిమ్మరసయ్యకు జెల్లుచుండెను ; అతని పక్షమునం దతని యల్లుడైన నాదెండ్ల గోపమంత్రి యా రాష్ట్రముయొక్క పాలనకార్యమును గొండవీటి నుండి జరుపుచువచ్చెను. ఆ సంవత్సరమున గృష్ణరాయలు దన కుమారుడైన తిరుమలదేవ మహారాయలను నాదెండ్ల బాలుని తిమ్మరసయ్య కుమారుడగు తిమ్మదండనాయకుడు విషప్రయోగముచే జంపినాడని విశ్వసించి తిమ్మరసయ్యను నతని పుత్రులను సోదరులను బందిచేసి చెఱబెట్టించెను ; కాని తిమ్మదండనాయకుడు చెఱనుండి తప్పించుకొని సాంద్రారణ్యమునకు బారిపోయి బందిపోటు దొంగలకును దారి దోపిడిగాండ్రకును ఇరవైన యొక దుర్గమును జోయిచేరెను. ఆ దుర్గాధ్యక్షుడతనికి బంధువగుట చేత నతని జేరదీసి యతనికి వలసినట్లెల్ల సాయ మొనర్చెను. ఆ దుర్గమును బ్రధాన స్థానముగ జేసికొని కృష్ణరాయలతో యుద్ధము సేయగడగెను ; రాయ లాతని యల్లరి నణచివేయుట కయ్యపరసయ్య నాయకత్వముక్రింద నొక గొప్పసైన్యము నంపవలసివచ్చెను. అయ్యపరసు తిమ్మదండనాయకునికి మనికిపట్టైన దుర్గమును జుట్టుముట్టి సాధించి యతనిబట్టి విజయనగరమునకు గొంపోయి రాయల ముందుంచెను. కోపోద్రిక్తుడై రాయలాతని సోదరుని, తండ్రియైన తిమ్మరుసును జెఱసాలనుండిరప్పించి కన్నులు బొడిపించి మరల కారాగారమున బంధించెను. తిమ్మదండనాయకుడు చెఱసాలయందె మృతి నందెను [8]

తిమ్మదండనాయకుని తిరుగుబాటువలన కొండవీటి రాజ్యమున శాంతి చెడి సంక్షోభము గలిగినది తిమ్మదండనాయకుడు పాఱిపోయిన సాంద్రారణ్య పర్వతప్రదేశము శ్రీశైలభూమి అతని కాశ్రయమొసగిన చుట్టమతని బావ నాదెండ్ల గోప మంత్రి తిమ్మదండనాయకుని తిరుగుబాటునకును కుల్లీకుత్బుశాహు కొండవీటిదండయాత్రకును పరస్పర సంబంధ మెద్దియేనియు గలదో తెలియదు కాని యించుమించుగనవి యేకకాలమునందె సంభవించినవి అన్యోన్యసంబంధ ముండినను లేకపోయినను తిమ్మదండనాయకుని యల్లరిమూలమున గలిగిన సంక్షోభము కుత్బుశాహు దండయాత్రకు జాలననుకూలించెననుటకు సంశయములేదు.

తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహీలో జెప్పినట్లు ఈ దండయాత్రయందు జయము కుల్లీకుత్బుశాహుకు జేకూరెననుట సంశయాస్పదమైన విషయము. హిందువు లోడి దుర్గము సంరక్షించుకొననేరక కప్పము కట్టెదమని యొడబడినంత మాత్రమున కుల్లీకుత్బు కొండవీటిని హిందువులకే విడిచిపెట్టి పోయెనన్నది నమ్మదగిన సంగతికాదు ఇది సుల్తాన్ కుల్లీపద్ధతికి వ్యతిరేకమైనది అతనికి గలిగిన యపజయమును గప్పిపెట్టుటకు తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుత్బుశాహీ రచయిత యవలంబించిన కుయుక్తి ఇదియని తోచుచున్నది. ఈ తలంపు కళాపూర్ణోదయ పీఠికయందలి,

"వదలక యుక్కళేంద్రుని నవాయి
బరీదు నడంచు దుర్జయుం
గుదుపనమల్కు దల్లడిల గొట్టె
మహాద్భుత సంగరంబులో
నెదిరిచి కొండవీటికడ నెవ్వరు
సాటి విచిత్ర శౌర్య సం
పదపస నారసింహ విభుపట్టికి నార
నృపాల మౌళికిన్."

7. *Nuniz. See. Forgotten Empire p.* 322.
8. *Ibid pp* 360-61.

అను పద్యమువలన దృఢమగుచున్నది. ఇందు వలన కుతుపనమల్కను నందెలనారపరాజు కొండ వీటి దగ్గర యుద్ధమునం దోడించినట్లు తెలియవచ్చు చున్నది. ఈ నందెలనారపరాజు ఆరెవీటి బుక్క రాజునకు ముమ్మనుమడు ; మఱియొక ముమ్మనుమ డైన అళియరామరాజు కృష్ణదేవరాయల యల్లుడు; ఇతనినే తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీకుతుబ్శాహీ రచయిత శివరాయలని పేర్కొనియున్నాడు ఇతని యాధిపత్యము క్రిందనే కృష్ణరాయ లోక ప్రచండసైన్యమును కుల్లీకుతుబ్శాహును కొండవీటి నుండి తఱిమివేయమని పంచియుండెను. కావున లక్ష్మణరావుగారు వచించినట్లు 'కొండవీటికడ నోడి పోయినది కుతుబ్షాహయేగాని హిందువులుగా'రని స్పష్టముగ జెప్పవచ్చును.

కృష్ణరాయలకు గుతుపనమల్కతో జరిగిన యుద్ధములలోనాన్యమున జయము గుతుపనమల్కకే గలిగెను ; కళింగ దిగ్విజయమున నిమగ్నుడైయున్న తరి యాదిల్శాహు కుతుబ్శాహు లిర్వురును గలిసియో ప్రత్యేకముగనో విజయనగర సామ్రాజ్య గడిదుర్గములను గొన్నింటినాక్రమించిరి. కృష్ణరాయ లవ్వల ఆదిల్శాహు నోడించి రాయచూరు ముద్గలు దుర్గముల మరల స్వాధీనపఱచుకొన్నను కుతుబ్శాహా క్రమించిన కోవెల కొండగన్నురపాసుగలు దేవర కొండ దుర్గములు నాల్గును అతని యధీనముననె నిలిచిపోయినవి ; కొండవీటి రాజ్యమున తిమ్మదండ నాయకుని హావళి మూలమున సుల్తాన్ కుతుబ్శాహు నకు మొగిట జయము చేకూరినను చివరకు నిర్జితుడై నిజరాజ్యమును బోయిచేరెను.

## అనుబంధము

### కాటూరు

కళింగ విజయానంతరము కృష్ణదేవరాయలు కాటూరు రాజ్యముపై దండు వెడలెనని న్యూనిజు వ్రాసియున్నాడు. కాటూరు దండయాత్ర ప్రశంస మఱియెచ్చటను గానరాదు, కావున దీని చరిత్రను గనుగొనుటకు న్యూనిజు గ్రంథమునకంటె సాధనాంత రములేదు. అతడు వివరించిన కాటూరు వృత్తాంత మిది :—

"కృష్ణరాయలు ఒరియూరాజుతో సంధి కొడబడి యతని పుత్రికను పెండ్లియాడి యతని రాణివాసము చెఱవదల్చి (కృష్ణా) నది కవ్వలి రాష్ట్రముతో గూడ నతనికి మరల నొసగిన పిమ్మట గొప్పసైన్యమును సమకూర్చి కాటూరుపై దండు వెడల సంసిద్ధుడాయెను. కాటూరనునది—ఏబది ఏండ్లనుండి (రాయల యధికారము నంగీకరింపక) తిరుగుబాటు చేసియుండిన యొక ప్రభువు యేలుబడిక్రిందనుండిన యొక రాజ్యము. చోళమండల తీరమందున్నది. (కృష్ణరాయలు) దానిమీదదండు వెడలి తత్ప్రభువు వసించుచుండిన ముఖ్యపట్టణములయం దొకదానిని ముట్టడించెను. దానిపేరు...[1] అది జలపరివృతము.

కృష్ణరాయలీ పట్టణమును ముట్టడివేయగడగి నపుడు వానకాలమగుటచే దానిచుట్టును నావరించి యుండిన నది వెల్లువచే నుప్పొంగి జలభరితమై ప్రవహించుచుండెను. తత్కారణమున ఆతనివలన నాపట్టణమున కెట్టిముప్పును గలుగదాయెను. ఆలస్యమును సహింపక కృష్ణరాయలు తన యుద్యమమును కొనసాగనీయక యడ్డపడుచుండిన యానది ముఖ్యశాఖను దాటి దాని (యా పట్టణమును) దాకుటకు వీలు కలుగునట్లు దానినుండి పెక్కు కాలువలను ద్రవ్వుదన పరివారమున కాజ్ఞాపించెను. (అతనికడ) జనస్తోమ మధికముగనుండుటచే నా కార్యమచిరకాలముననె ముగిసెను. క్రొత్తకాలువ లన్నియు ద్రవ్వియైన పిమ్మట నదీప్రవాహమును వానివైపు త్రిప్పించెను. నదిలోని నీరంతయు నల్పకాలముననె కాలువల మూలమున జాఱిపోవుటచే నది యడుగంటి లోతు లేక వట్టిపోయినది. అంతట నా పట్టణప్రాకారమును డాయుటకు వలనుబడెను. ఏబదిపాయలగుండ వేఱు మార్గముల నదీజలమంతయు జాఱిపోయినది.

పట్టణములో గాపుండిన లక్షకాల్బలమును మూడువేల గుఱ్ఱపురౌతులును ధైర్యసాహసముల బ్రకటించుచు హోరాహోరిగ బోరిరి ; కాని వారి

1. న్యూనిజు గ్రంథములో ఆ పట్టణము పేరుండవలసిన తావు శూన్యముగ వదలివేబడి యున్నది.

పరాక్రమము వానికెక్కక వమ్మయిపోయినది; వారు కృష్ణరాయలను పట్టణమును జొరనీయక యడ్డపెట్టజాలరైరి. ఒక కొన్నినాళ్లు పోరాటజరిగిన వెనుక, రాయలాపట్టణమును ప్రవేశించి యందుండినవారినందరిని సంహరించెను. అందు విస్తారము ధనముండినది. భూషణములును బహుసంఖ్యాకాశ్వచయమును మరహస్తివర్గముగాక యొక కోటి యఋవదిలక్షల బంగారు పర్దావులతనికి హస్తగత మాయెను. ఆ రాష్ట్రము స్వైవసమైనపిమ్మట కృష్ణరాయలు దన నాయకులలో నెవ్వరెవ్వరి కెంత మాత్ర మీదగునో యంతమాత్రము బంచియిచ్చెను. ఆ పట్టణమున నివసించుచు నా రాజ్యము నేలుచుండిన ప్రభువును బంధీకృతుని గావించి విజయనగరమునకు గొనివచ్చెను. అతడచట రాయల చెఱయందు మృతుడాయెను."[2]

న్యూనిజు చెప్పిన కాటూరు వృత్తాంతమున సందేహాస్పదములైన యంశములు కొన్ని కలవు. కాటూరెచ్చటిదో రాయలకోపమునకు గుఱియైన తద్రాజ్యాధిపతి యెవ్వడో తెలియరాదు. ఈ యంశములను స్పష్టముగ దెలియజేయగల సాక్ష్యము న్యూనిజు చరిత్రయందుగాని యన్యత్ర మఱియెందుగాని లభ్యపడదు. కావున నీ దండయాత్ర చరిత్రను వివరింపబూనిన యాధునిక పరిశోధక పండితులు ఒకఱు చెప్పినట్లు మరియొకరు చెప్పక తలకొకదారి ద్రొక్కి యభిప్రాయభేదమును వెలిపుచ్చియున్నారు. గజపతుల రాజధానియగు కటకమే కాటూరన్నారు హోసకోట కృష్ణశాస్త్రిగారు.[3] సాధు సుబ్రహ్మణ్యశాస్త్రిగారు 'తథాస్తు' అని కృష్ణశాస్త్రిగారి యభిప్రాయమును శిరసావహించినారు.[4] వీరి యభిప్రాయము సరికాదని నిరసించి కాటూరనగా కాడవ రాజ్యమనియు నదియే యుమ్మత్తూరనియును, న్యూనిజు భ్రమజెందే కృష్ణరాయల యుమ్మత్తూరు కళింగగండయాత్రల కాలక్రమమును దాగుమారు చేసినాడనియు వాదించినారు డాక్టరు యస్. కృష్ణస్వామి అయ్యంగారు.[5] తొలుత రాయ వేలూరే కాటూరని యూహచేసిన సూయలు[6] తరువాత కృష్ణస్వామి అయ్యంగారి యభిప్రాయము నంగీకరించినారు.[7] ఇది సమంజసము కాదని త్రోసిపుచ్చి ఆచార్య కె. ఎ. నీలకంఠశాస్త్రిగారును డాక్టరు టి. వి. మహాలింగముగారును, కాటూరనునది చెంగల్పట్టుజిల్లా పొన్నేరితాలూకాలోని తూర్పుసముద్ర తీరమున నుండు కాటూరను కుగ్రామమే యని నిర్ధారించినారు.[8]

ఈ యభిప్రాయము లెంతవఱ కంగీకార్యములో విచారించుట యుక్తము—కాని మున్ముందు న్యూనిజు కాటూరు వృత్తాంతమున దత్ప్రదేశ నిర్దేశమునకు సాధకములగు నంశములను వివరించుట మిక్కిలియు నావశ్యకము.

1. కాటూరనునది యొక రాజ్యముపేరు; అది చోళమండలతీరమున నుండెను.

2. కృష్ణరాయలా రాజ్యములో నొకముఖ్య పట్టణమును నదిచే పరివృతమైనదానినిముట్టడించెను.

3. ఆ రాజ్యమును పాలించుచుండిన రాజు కృష్ణరాయల దండయాత్రకు పూర్వ మేబదిసంవత్సరములనుండియు దిరుగుబాటుచేసియుండెను. ఈ మూడంశములును ఏ ప్రదేశమున కనువర్తించునో యా ప్రదేశమున కాటూరు రాజ్యముండెననుట సమంజసము; ఇందే యంశమునకు విరోధించినను అట్టిచోట కాటూరు రాజ్యముండెనని తలంచుట యుక్తముగాదు.

ఇక కాటూరురాజ్య మెచట నుండెనో కనుగొందము. కటకమే కాటూరగునా? తూర్పుసముద్ర తీరము నంతటిని పాశ్చాత్యులు చోళమండలతీరమని చెప్పువారు. కటకము తూర్పు సముద్రదేశమునందున్నది. అంతమాత్రమున నదియె కాటూరనుటతగదు. ఏలన కృష్ణరాయల కాటూరు దండయాత్రకుపూర్వ

2. *Nuniz. See the Forgotten Empire, pp* 320-22.
3. *ASIAR*. 1908-9 *p*. 180.
4. *TDER. pp* 181-2.
5. *The vet-remembered Ruler & pp* 9-11.
6. *Forgotten Empire, p*. 321, *n*. 1.
7. *Historical Inscriptions. li*. 228.
8. *Ep. Ind.*

మేబది సంవత్సరముల (క్రీ. శ. 1519-20—50 = 1469-70) నుండి తత్పాలకుడు తిరుగుబాటుచేసి యుండెనని న్యూనిజు చెప్పుచున్నాడు తిరుగుబాటు నకు పూర్వ మతడు రాయసామంత మండలాధిపతి యని తెల్లమగుచున్నది. అగునేని యతనిరాష్ట్రము విజయనగర సామ్రాజ్యాంతర్గతమై యుండవలెను విజయనగర రాయల యధికారము కృష్ణరాయల కళింగ దిగ్విజయమునకు పూర్వమెన్నడును సింహా చలమున కవ్వలి దేశముపై సాగియుండ లేదు. మఱియు గటకము గజపతుల రాజధాని. అచట మొదట పూర్వ గాంగ వంశజులును నటువెనుక సూర్యవంశజులునగు గజపతులు రాజ్యమొనర్చిరి. వీరెన్నడును విజయనగర చక్రవర్తుల కరిగాపులై యుండిరనుటకు లేశమాత్రమైన నాధారము లేదు ; కావున కటకమే కాటూరను సిద్ధాంత మంగీకరింప దగినది కాదు.

ఉమ్మత్తూరు కాటూరా ? ఇది కృష్ణరాయల కాలమునగాని యంతకు ముందుగాని కాడవుల యధి కారముక్రింద నుండెనా ? కృష్ణరాయలోడించి బంధీకృతుని గావించి విజయనగరమునకు గొని పోయిన కాటూరు ప్రభువు కాడవ వంశజుడా ? అను ప్రశ్నలకు సమాధానము చెప్పవలసియున్నది. క్రీ. శ. 1323 వ సంవత్సరమున మహమ్మదీయులు ద్రావిడదేశమును జయించిన తరువాత కాడవ వంశజు లడపొడ గానరాకపోయిరి. విజయనగర యుగశాసనములలో గాని మఱి యన్యచరిత్రాధార ములందుగాని కాడవుల ప్రస్తావ మెందును గాన రాదు. కాడవులనగా పల్లవులు. క్రీ. శ. 10 వ శతా బ్దారంభమువఱకును పల్లవుల యధికారము పశ్చి మాంధ్ర దక్షిణకర్ణాటక భూములపై సాగినది. తరు వాత వీరి యధికారము క్షీణించి వారి రాష్ట్రము చోళసామ్రాజ్యమున గలసిపోయినది. క్రీ. శ. 13 వ శతాబ్దమధ్యమున కొప్పెరుంజింగడను కాడవప్రభువు ప్రసిద్ధికెక్కి తొండమండలమున జాలభాగమునేలెను. అతని యధికారమెన్నడును ఉమ్మత్తూరుపై సాగ లేదు. మఱియు విజయనగర [illegible]మునందు ఉమ్మత్తూరునేలిన రాజవంశము కేవలము కర్ణాటక వంశము ; మఱియు, దాము పాశ్చాత్యగాంగ రాజుల యొక్కయు హొయసలుల యొక్కయు సంతతివారమని వారు చెప్పుకొనిరి. కాడవులకును వారికిని సంబంధమున్నట్లగపడదు. ఇంతకంటెబలవ మైన యాక్షేపణ యొకటికలదు. కాటూరుప్రభువు ముఖ్యపట్టణమువలె కృష్ణరాయలచే సాధింపబడిన యుమ్మత్తూరులోని శివనసముద్రముభయ కావేరి మధ్యస్థమైనను, నది మైసూరు పీఠభూమిపై నున్నది కాని చోళమండల తీరదేశమున లేదు. ఈ రెండు కారణములవల్లను కాటూరనునది కాడవ రాజ్యమనియు దాని కుమ్మత్తూరు రాజధాని యనియు దలంచుటకు వీలులేదు.

ఇక న్యూనిజువచించిన కాటూరు పొన్నేరి తాలూకాలోని ఆ పేరిటి గ్రామమా ? ఇది పైనుడివి నట్లు చోళమండల తీరదేశమునందున్నది. మఱియు దత్పరిసరముల నొక యేఱు ప్రవహించుచున్నది. కాని యా ప్రాంతము నేలుచుండిన ప్రభువు కృష్ణ రాయల దండయాత్రకుమును పేబది సంవత్సరముల నుండి తిరుగుబాటుచేసియుండెననుట విశ్వసింపదగ నిది. ఏలన నీ ప్రాంతభూమియంతయు క్రీ. శ. 1491 పర్యంతము సాళువనరసింగరాయల యేలు బడిక్రిందనుండినది. తరువాత ఇమ్మడి నరసింహదమ్మ రాయల కాలమున రాజ్యసంరక్షకుడైన నరసా నాయకు డుదయగిరికడ గజపతి నోడించి సముద్ర తీరముననె సైన్యమును నడిపించుకొనిపోయి ద్రావిడ దేశమును బ్రవేశించి యచటినుండి దక్షిణ దిగ్విజయ యాత్ర సాగించినట్లు వరదాంబికాపరిణయమునందు చెప్పియున్నది.[9] తుండీరమండలమును బ్రవేశించుటకు ముందుగాని తరువాతగాని సముద్రతీర దేశమున నత డెవ్వరితోడను యుద్ధముజేసినట్లు చెప్పియుండ లేదు. ఈ దండయాత్ర క్రీ. శ. 1496 వ సంవత్సర మున నడచెను. నరసానాయకు డీ సందర్భమున రామేశ్వర పర్యంతము రాజ్యము సల్పుచుండిన దాక్షిణాత్యభూపాలురనెల్ల జయించెను.[10] వీరనర సింహరాయల కాలమునగాని కృష్ణరాయల రాజ్యా రంభకాలమునగాని పొన్నేరి ప్రాంతభూమిని

---

9 *Sources of Vijayanagara History. pp.* 172-3

10 *Further sources I. pp* 168. *f*

రాయల కనతుడై యుండిన మాండలికు డొక్క-డేలుచుండినట్లూహించుటకు దగిన సాక్ష్యములేదు కావున పొన్నేరి ప్రాంతమున చోళమండల తీర ప్రదేశమున నదీతటమున కాటూరను పేరుగల గ్రామమొకటి యున్నను నదియే న్యూనిజు వర్ణించిన కాటూరని తలచుట పొరపాటు

మఱి యా కాటూ రెచ్చట నున్నదనుట విచారణీయాంశము. కాటూ రనునది కాయత్తారు కావచ్చును ఇది మధురకు దక్షిణదిగ్భాగమున తిరునేల్వేలిప్రాంతభూముల నేలుచుండిన పాండ్యవంశజులలో నొకశాఖవారికి రాజధానియై యుండెను అప్పటి పోర్చుగీసు ప్రయాణికులును గ్రంథకర్తలును దీనిని బేర్కొనియున్నారు. 'ఆ తీరదేశమునకు రాజధానియైన సూత్తుకుడి ప్రభువును 'కయితగ్రోరాజని' పిలుతురు. అతడు 'శూరుడు', అని పెడ్రోడి బస్తో యను నతడు చెప్పియున్నాడు.[11] సింహళవిజయ చరిత్రను రచించిన కైరాసుపాదిరి కూడ 'కేతగ్రో నేలు చిన్నరాజు'లను పేర్కొనియున్నాడు. ఇట్లు పోర్చుగీసు రచయితలచే కెయతగ్రో యని పేర్కొనబడినది కాయత్తారు పాండ్యరాజ్యము. న్యూనిజు కాటూరునుగూర్చి చెప్పిన ముఖ్యాంశములు గాయత్తారునకు సరిపోవుచున్నవి. కావున కృష్ణరాయలు క్రీ. శ 1519-20 వ సంవత్సరమున జయించిన కాటూరి కాయత్తారు రాజ్యము గావచ్చును; ఇట్లని దృఢముగ జెప్పుటకు వలనుపడదు ; ఈ యంశమును రుజువుసేయగల సాక్ష్యమింకను లభ్యపడలేదు.

## ౮. కెంబావి—అహమదునగరము
## (క్రీ. శ. ౧౫౧౬—౧౭)

ఇస్మాయీలు ఆదిలుఖానునికి బ్రాపై యతనిపేర రాజకార్యములను నడపుచు కమాలుఖానుడు విజాపుర రాజ్యభార ధురంధరుడై యున్నప్పుడు, క్రీ. శ. ౧౫౧౨-వ సంవత్సరమున, గృష్ణరాయలు రాయచూరు దుర్గమును స్వాధీనపఱచుకొనెనని పూర్వప్రకరణమున దెల్పియున్నది. ఈ దుర్గ మిట్లు రాయలకు హస్తగతమగుటయు సమ్మాలమున గృష్ణా తుంగభద్రల నడిమియంతర్వేది తనచేతినుండి దునికిలిపోవుటయు నాదిల్ఖానునికి హృదయ శల్యములై యతని బాధింపగడగినవి. కావున నతడాదుర్గమును దత్సంబంధిరాష్ట్రమును నెట్లయిన మరల స్వాధీనపఱచుకొన నిశ్చయించి, కమాలు ఖానుని పారుపత్యమును దొలగద్రోసి స్వయముగ రాజ్యమును బరిపాలింపగడగిన పిమ్మట దండయాత్ర వెడలి రాయచూరునుసాధించినట్లున్నది. కాని ఇస్మాయీలు ఆదిల్ ఖాను ఇట్లు దండయాత్ర వెడలెననిగాని రాయచూరుదుర్గమును మరల కైవసము గావించుకొనెననిగాని తెల్పెడి ఆధారమెద్దియులేదు ఇది వ్యక్తిచరిత్రాంశములందు నిగూఢమైయున్నవిషయము. క్రీ. శ. ౧౫౧౨ లో గృష్ణరాయ లీదుర్గమును జయించి కైవసము గావించుకొనెగదా ; 1520 నందు ఆదిలుఖానుపై నతడు దాడి వెట్టినప్పుడది యతని యాధీనమందుండినది [1] ఇందువలన క్రీ శ. ౧౫౧౨, ౧౫౨౦ ల

11. *Queyros, The Conquest Ceylon, p. 394. n. 1.*

1. ఫెరిష్తాచరిత్రయందు (*Briggs' Ferishta III, PP48 f*) రాయచూరుదుర్గము హిజిరీ ౯౨౭ అనగా క్రీ. శ. ౧౫౧౯-౨౦ వఱకును రాయలస్వాధీనమందెయుండెననియు, నప్పు డిస్మాయీ లాదిలుఖాను దానిని వశపఱచుకొనుటకుదండెత్తిరాగా రాయలాతని నోడించి తఱుమగొట్టెననియు జెప్పియున్నది. కాని ఇది వాస్తవము గాదు. ఏలనగా, సమకాలికుడును ప్రాయశః ప్రత్యక్షద్రష్టయు నగు న్యూనిజు రాయల దండయాత్రసమయమునందు రాయచూరు ఆదిలుఖానుని యధీనమున నుండెనని వ్రాసియున్నాడు. (*Nuniz, F. E. PP.* 334 *f*). ఫెరిష్తా యర్వాచీనుడు ; అతని వ్రాతకంటె సమకాలికుడును రాయలవెంట దండయాత్రను జూచుటకు బోయియుండిన న్యూనిజువాక్యములు విశ్వాసపాత్రములు గదా. కావున, సూయలు మున్నగు నాధునిక విజయనగర చరిత్రకారుల మార్గము ననుసరించి న్యూనిజు వివరించిన వృత్తాంతమే సత్యాత్మకమైన దని విశ్వసించుచున్నాను.

మధ్య నెప్పుడో యొకప్పుడు ఇస్మాయీలు ఆదిలుఖానుఁడు రాయ సామ్రాజ్యముపై దండెత్తివచ్చి రాయచూరుదుర్గమును మరల జయించి స్వాధీనము జేసికొనెనని మన మూహించవచ్చును. ఈ మధ్య కాలమున గృష్ణరాయలు కళింగకాటూరు విజయ యాత్రలయందు నిమగ్నుఁడై యుండెను; అది యాదిలుఖానుని కడక నెఱవేర్చుకొనుట కనుకూలమైన సమయమే. రాయరాణువ యంతయు గలింగాది యుద్ధయాత్రలయందు పనివడియుండుట వలన, గడిదుర్గములను సంరక్షించుటకు దగిన బలములం దధివసితములై యున్నను, ప్రబలుఁడగు శత్రువెత్తివచ్చిన నతని మార్కొని పాఱదోల జాలిన దళము లందుబడి దూరమున లేవు ఈ సంగతిని గుర్తించి యాదిలుఖాను రాయసామ్రాజ్యముపై నెత్తివచ్చి రాయచూరు మున్నగు నంతర్వేది దుర్గములను వశపఱచుకొని యుండవచ్చును.

ఆత డెత్తివచ్చిన సమయ మిది యని నిర్ధారించి చెప్పుటకు వలను పడదు; కాని ఊహించుటకు గొంత యవకాశము గలదు. ఆముక్తమాల్యదయాశ్వాసాంతసులలో మొదటి నాల్గింటియందును ఉదయగిరి కొండవీడు కొండపల్లి సింహాచల విజయములను దరువాతి రెంటియందును కెంబావి నైజామను 'యావనానవిధవు' లపైని విజయములును కడపటిదానియందు కటకవిజయమును వరుసగ జేర్కొనబడియున్నవి దీనినిబట్టి చూడఁగా గృష్ణరాయలు క్రీ. శ. ౧౫౧౬-౧౭ వ సంవత్సరమున సింహాచలమున విజయస్తంభమును నిల్పినపిమ్మటను గటకదహనమునకు బూర్వమును మహమ్మదీయులతో గెంబావికడను నైజామన యావనావని ధవుని మణిగృహోళిచెంతను యుద్ధము జేసినట్లు తెలియుచున్నది. ఆశ్వాసాంతోక్తవిజయము లవి చేకూడిన కాలక్రమమునననుసరించి పేర్కొనబడియుండిన, కెంబావి యవనులతోడను నైజామనయావ నావనిధవునితోడను గృష్ణరాయలు యుద్ధము జేసినది క్రీ. శ. ౧౫౧౬ నకు దరువాతను ౧౫౧౮ ముందునై యుండవలయును; అనగా నీ యుద్ధములు రెండును ౧౫౧౭-వ సంవత్సరమున జరిగెనని స్థూలముగ జెప్పవచ్చును.

ఈ సందర్భమున రాయలు మహమ్మదీయులతో జేసిన యుద్ధము రాయవాచకము నందును ప్రస్తాపింపఁబడియున్నది కాని యందు కెంబావి మాట లేదు; నైజామనయావనావనిధవుని రాజధానియగు నహమదునగరమును రాయలు నాశనము గావించినట్లు వచించియున్నది; మఱియు నది గ్రీ. శ. ౧౫౧౪-వ సంవత్సరమున నాగార్జున కొండను సాధించిన పిమ్మటను ౧౫౧౬-౧౭ న పొట్నూరు సింహాచలముకడ జయస్తంభమును ప్రతిష్ఠించుటకు ముందును నడచినట్లు చెప్పియున్నది. కృష్ణరాయ విజయమునందుగూడ అహమదునగరమున రాయలు మిరకలను జయించినట్లు కలదు. యుద్ధకాలనిర్ణయవిషయమై పై గ్రంథముల సాక్ష్యమించుక భిన్నముగ గన్పడుచున్నను, కళింగజైత్రయాత్రమధ్య రాయ లొక పర్యాయము మహమ్మదీయులపై జయవంతముగ దాడినడచెనని యవి యేకగ్రీవముగ బల్కుచున్నవి.

ఇట్లు రాయలచేబరాజితులైన తురకలెవ్వరో కనుగొందము ఈ యుద్ధమునుండి మరలివచ్చిన పిమ్మట గజపతి రాజ్యముపై మరల గూచి సేయ నుంకించుచున్న రాయలనువారించు తిమ్మరసయ్య వాక్యములవలన వా రెవ్వరైనదియు దెలియ వచ్చుచున్నది.

'అప్పాజీ రాయలవారితో నూాడు తెగల తురకలరాజ్యమంత్తా కంపోలం శేశి(=కంపింపజేసి!) వారి దుర్గాలున్ను స్థలాలున్ను కట్టుకొని అహముదానగరం అమిద్యాలు విత్తించి గజపతి వారి గిరిదుర్గం స్థలదుర్గం యివి అన్నియు ఆక్రమించినట్టాయను. ముంద్దర కదలిపొయ్యేది కార్యంకాదు.'[2]

ఇంతకంటె స్పష్టతరముగ గృష్ణరాయ విజయమునందు,[3]—

2. రాయవాచకము (కాకినాడ, 1933) పుటలు 93–94.

3. కృష్ణరా. విజ. ౪ : 66

'ఇతరులు శక్తులే తలప నేదుల
శాహు నిజాము శాహులన్
గుతపనమల్కనున్ గెలిచి
గొబ్బున సర్వగిరీంద్ర దుర్గముల్
జతురత గైకొనన్ ధర
నసాధ్యము నీకిక గల్గదైన నం
చిత యశ మొక్క విన్నపము
జేసెద వేమరం జిత్తగింపుమా,'

ఇందువలన కృష్ణ రాయలు కెంబావి యహమదునగరములకడ నోడించిన తురకలు ఆదిలుఖాన నిజాముల్ముల్కు కుత్బుల్ ముల్కులను, విజాపురాహమదనగర గోల్కొండ నేలు ప్రభువులని తెలియవచ్చుచున్నది.

ఇక రాయలు కళింగదైత్రయాత్రను నడుమ నాపి పైఁ బేర్కొన్న తురకరాజులపై నేల యెత్తిపోయెనో కనుగొనవలసి యున్నది. విచారించఁగా దీనికి ముఖ్యకారణము రాయ సామ్రాజ్యముపై దురకరాజులందఱు నేకముగనో, ప్రత్యేక ప్రత్యేకముగనో నడపిన దండయాత్రలని తోఁచుచున్నది. క్రి. శ. ౧౫౧౬ ప్రాంతమున కుల్లీకుత్బుల్ ముల్కు విజయనగర గడి ప్రదేశమందలి దేవరకొండ పానుగలు గన్పుర కోవిలకొండలను నాలుగు దుర్గములను రాయల సైన్యముల నోడించి కైకొన్నట్లు ఇంతకుముందరి ప్రకరణమున విదితము సేయబడి యున్నది. ఇస్మాయీ లాదిల్ఖాను రాయచూరునుగూడ అప్పుడె స్వాధీనపఱచుకొని యుండవలయునని ముందె యూహించితిమి. అహమదునగర నిజాముల్ ముల్కు వీరికి దోడునడచి యుండవలయును ఇట్టి సంఘటన నూతనమైనది కాదు. తత్పూర్వము పలుమార్లు నడచినదే. ఈ మూఁడింట్ల తురకరాజులును రెండు ఉద్దేశములతో నీ యుద్ధకార్యమును దలపెట్టినట్లున్నది. గజపతికి దోడ్పడవలయునను ఇచ్చయొకటి: గజపతివారికిని తురకరాజులకును రాజకీయమైన మైత్రి గలదు. ఇప్పటివలె నప్పుడును రాజు లొండొరుల సంస్థానములలో దమ ప్రతినిధులను నిలుపువారు; ఈ ప్రతినిధులు తాత్కాలికముగ నేదైన యొక కార్యార్థము వచ్చి పోవు రాయబారులును దూతలును గారు. స్థిరముగ నొకరాజుపక్షమున మరియొకరాజు నాస్థానమున నుండు నియోగులు. అప్పటి రాజకీయ పరిభాషయందు వీరికి స్థానాపతులని పేరు. ఈ స్థానాపతు లిప్పటి రాయబారులవలె నన్యరాజ్యములందు దమ రాజ్యమునకు సంబంధించిన యావద్విషయములను జేజారనీయక జూచుటయె కాక అన్యరాజ్యముల మర్మములను గనుగొనుటకొఱకు నిరంతరము మాఱువేసముల సంచరించుచుండు వేగిరులకు బ్రాపైయుండిరి. తఱచుగ పెక్కురాజ్యముల స్థానాపతులు సమావేశమై తమ రాజ్యముల కన్నిటికిని సామాన్యములయిన రాజకీయసమస్యలను జర్చించి వానిని దీర్మానము సేయు మార్గముల నన్వేషించువారు. కృష్ణదేవరాయలు మహమ్మదీయరాజ్యములపై నండు వెడలబోవుచున్నాడనువార్త ప్రచురమయినంతటనె ఇట్టి స్థానపతుల సమావేశ మొక్కటి విజాపురమున గూడెను.

'దాదిమహలు ముందుగా మునుపు దివాణంలో ముందర ఆయావజీర్లు దొండోపండితులు మొదలయినవారు నియోగులువారివద్ద కుతపనమల్కు వారి హేజీబులు ముకుందపండితులు మొదలయినవారు కూర్చుండి ఆలోచనచేసినది:— కర్నాటకం సింహాసనానికు సచివంగా కృష్ణరాయల వారిని అధిష్ఠాన కర్తలను చేసిన దారభ్యం తురకల మీద కార్యం శాయ ఆలోచనచేశి అందుకై యత్నములు శేస్తావున్నారు. అన్ని వివరాలకు విజయనగరమునుండి కాకితములు వ్రాశివచ్చెను. ...మంత్రాలోచనగా వార్తలాడినవి: కర్నాటకం వారు సరచు బలమించివస్తే గజపతివారికిన్ని మన కున్ను మున్నెరికం గాకుండగా వుండును. ఆరీతు గాకుండ అందునకైన యత్నంగని సరుసు దుర్గాలను రస్తుసామగ్రీలు వేయించి బలవంతంగా యేనుగలు గుఱ్ఱాలు కాల్బలములు పుంచవలెను. అని ఆలోచనచేసినవారై యేదుల శాహువారి తోను...నిజాంశాహువారున్ను కుతుపనమలక వారున్ను విజయనగరానినుండి కాకితములు వ్రాశి

వచ్చినది విని ఆలోచనపరులై యిక్కడికి కాకితములు అంపి తమ తమ సరుదు స్థలములు పదిలపరచుకొని యాది హెచ్చరికలతో నున్నారు...

'గజపతివారు......పరస్థలపు నియ్యోగులతో నున్ను సంభాషణ శేయిగా నిజాంశాహావారి నీలాద్రిపంతులువారున్ను యెదుల శాహు కుతపనమలక వారి స్థానాపతులున్ను......... కర్ణాటకాధీశ్వరులు కార్యముఖానకు నడిచేవారై చతురంగబలమున్ను జతచేసుక బైలు మెరసి సరుదులకువచ్చి కనుపించుకొనేవారై యున్నారు. యీవరకు ఉత్తరం దక్షిణం దొరలకార్యాలకు హాని వృష్ఠులకు సహాయసంపత్తి పడుపుదురు. ప్రబలమైన కార్యాలఇతే అందరున్ను ఏకగ్రీవమై ఉత్తరం అఘుపురం వారి కార్యాలకున్నూ నిర్వహింతురుగా. ఇప్పుడు అంతేశి కార్యాలు యేమి వున్నది? సనుదున వుండేవారు గనుక—యితరం గాదుకదా యెదుల శాహువారున్ను నిజాంశాహున్ను, కుతపనమలకవారున్ను సరుదులు స్తోమ శుద్ధిగా యోచనశాయగాపనిలేదు. అందుకు మించ్చిన కార్యాలఇతే అహుముదు నగరపర్యంత్తం వత్తురు—అని ఘనంగా వ్రాశిఅంప్పినారు.'[4]

రాయవాచకమునందు పై వివరింపబడిన స్థానాపతుల వృత్తాంతము విశ్వాసపాత్రమేని—కాదనుటకు గారణము గానరాదు—దక్కను మహమ్మదీయ ప్రభువులకును గజపతి వారికిని రాజకీయములందు మైత్రి కలదనియు, నుత్తరమున అఘుపురము (ఆగ్రా) వారితోను దక్షిణమున కర్నాటకంవారితోను యుద్ధము పొసగినప్పుడు వారంద రేకీభవించి శత్రువును దార్కొనువారనియు దెల్లమగుచున్నది. క్రీ. శ. ౧౫౦౯-౧౦ యందు కృష్ణరాయలు మహమ్మదీయ రాజ్యములపై దండు వెడలబోవుచున్నాడను వదంతి పుట్టినప్పటి నుండియు నతని వారంద రేకమై ప్రతిఘటించుటకు ఒండొరులతో సంప్రతింపులు సాగించుచు, బూర్వ మర్యాదప్రకారము గజపతినిగూడ తమ కొత్తాసిగనుండుమనియు దమతో నేకీభవించుట మేలనియు నతనికి దెలియబరచిరి. గజపతులకును గర్ణాటక చక్రవర్తులకును శత్రుత్వము తరతరములుగ బెరిగివచ్చుచుండెను; కర్ణాటక చక్రవర్తులతో యుద్ధము సంభవించినపుడు దురకల సహాయమును బొందుట కపిలేశ్వరుని కాలము నుండియు నాచరణయందుండిన పాతమర్యాదయె కాని క్రొత్తది కాదు. కావున గజపతి ప్రతాపరుద్రుడు కృష్ణరాయల బ్రతిఘటించుటకొఱకు దక్కను మహమ్మదీయ ప్రభువులతో నేకీభవించెనని నిస్సంశయముగ నంగీకరింపవచ్చును.

ఇట్లు మున్నెఱుకగలిగి కర్ణాటకులను గడి దాటి రానీయక వెనుకకు ద్రోయుటకొఱకు మహమ్మదీయప్రభువులును గజపతివారును జేసిన ప్రయత్నములన్నియు గృష్ణరాయల రణ కౌశల్యమువలన వితథములై పోయెను. ప్రారంభము నందె మహమ్మదీయుల కశని సంకాశమైన దెబ్బ తగిలెను. క్రీ. శ. ౧౫౧౧-౧౨ ప్రాంతమున కృష్ణరాయలు గృష్ణాతీరమున మూడిండ్ల తురకరాజుల దళములను విఱుగబొడిచి చెల్లాచెదరు గావించుటయే కాక కృష్ణకుదక్షిణమందుండిన వారిదుర్గములను రాష్ట్రమును నాక్రమించుకొనెను తరువాత గజపతి సామ్రాజ్యముపై నెత్తిపోయి యుదయగిరి కొండవీడు కొండపల్లి మున్నగు తీరాంధ్ర సుప్రసిద్ధ దుర్గములను తత్సంబంధిరాష్ట్రములను జయించి స్వాధీనము జేసికొని తెలింగాణము బ్రవేశించి యచటి కోటలను సీమలను ఆక్రమించి, కళింగ మధ్యమందలి సింహాచలముచెంతకు బోయి విడిసెను. అప్పాజీ తిమ్మరసయ్యవలె దక్కను మహమ్మదీయ ప్రభువులును గృష్ణరాయలు గజపతిరాజ్యములోనికి చాలదూరము జొచ్చుకొని పోయెనని తలచిరి. రాయరాణువధాటి కాగజాలక పాఱుగజపతికి దోడ్పడుటకు అదియె యదననియెంచిరి. అప్పుడు తాము విజయనగరసామ్రాజ్యముపై నెత్తిపోయి తాకిన దమ దండయాత్ర నడ్డగించుటకొఱకు గృష్ణరాయలు గళింగమున యుద్ధము సల్పుచుండిన సైన్యమునంతటిని గాకపోయినను జాలభాగమును మరల్చుకొని రావలసివచ్చుననియు నందు

4. రాయవాచకం (కాకినాడ. 1933); పుటలు 46,47,49,73.

మూలమున గజపతి మీది రాయ సైన్యముల యొత్తిడి తగ్గిపోవుననియు దలచి ఫౌజుల ముస్తీదు చేసికొని బయలు వెడలిరి. కేవలము గజపతికి సాయము సేయు నపేక్ష యొక్కటియె వారి నీ దండయాత్రకు పురికొల్పలేదు. ౧౫౧౧-౧౨ వ సంవత్సరమున రాయలచే దమకుగల్గిన పరాభవమును ప్రతీకారము సేయు దలంపును నప్పు డతడు మచేతినుండి నాచికొన్న దుర్గములను రాష్ట్రమును మరల సంపాదింపవలయునను గోరికయు వారిని ప్రోత్సాహపెట్టెను.

ఈ దండయాత్ర నెదుర్కొనుటకె కృష్ణ రాయలు కళింగ క్షేత్రయాత్రను మధ్యయం దాపి దక్కను తురకరాజులపై నడచినది. ఈ యుద్ధమున నడచిన ముఖ్యాంశములను రెంటినిమాత్రము రాయలు పేర్కొనియున్నాడు (1) కెంబావి కయ్యము :— కెంబావి ప్రాచీన బహమనీ రాజధానియగు గుల్బర్గకు నైరృతి దిగ్భాగమున నేబది మైళ్ళదూరమునను, ఆదిలుశాహుల రాజధాని యగు విజాపురమునకు పూర్వున గొంచె మించుగ నంతియదూరమున నున్న గ్రామము. బీదరు అహమదానగర రాజ్యముల సరిహద్దులు సమీపమందె యుండినవి. ఇచట నొక బలిష్ఠమైనకోట యుండెను అది యప్పు డెవ్వరి యేలుబడిక్రింద నుండెనో చెప్పుటకు వీలులేదు. మహమ్మదీయ రాజ్యములోని కంతదూరము గృష్ణరాయలు చొచ్చుకొనిపోవుటను జూడ తత్పూర్వము మహమ్మదీయ ప్రభువులనోడించి వారిని వెన్నంటి తఱుముచుబోయినట్లున్నది. ఆముక్తమాల్యదలోని వర్ణననుబట్టి చూడగా గెంబావియుద్ధము భయంకరమై యవనజనమారణ కారణమైనట్లు తోచెడిని. (2) నైజామనయావనావనిధవుని మణిప్రాసాద నిర్మూలనము :—రాయ వాచకమునందును గృష్ణరాయ విజయమునను రాయలు అహమదునగరముపై నడచి యచట తురకల నోడించి యాపట్టణమును నేలమట్టము గావించినట్లు చెప్పియున్నది. రాయవాచకమున జరిగిన యుద్ధాంశములు వర్ణనాడంబరము లేక సంగ్రహముగ నిట్లు వివరింపఁబడినవి :—

'అహమదునగరమున కు నడవగా కొనమూకలవారు వెళిపాళ్యాలు చొరబడి చెరజొరాపట్టి చాలా కంపోలంశేయంగా కోటలోని గుర్రాలు వారు వెళ్ళివచ్చి యెదుట నిలిచి జగడమియ్యంగా మూడుంముక్కాలు ఘడియలలోగా రెండువేలుంన్నెనమంన్నూరు గుర్రాలున్ను అన్నియు రౌతులున్ను చాపకట్టుగా మృతిబొంద్దిరి గనక యీ సమాచారం కోటలోవున్న మొదటి దొరలఇనవారు విని ఇఖను మనం కోటలో నిలిచి వున్నట్టఇతే చేపట్టుగా పట్టుకబోదురు అంద్దునుంచ్చి చాలా అవమర్యాద అని యెంచ్చి యేమిబోయినా బోని అని కోటనువిడిచి పారిపోఇరి. గనక రాయల వారు ఆకోట యిడియగొట్టించి అపట్నం యెంత్త మేరో అంతమేరానున్ను వెలిపాళ్యాలున్ను దున్నించి ఆమిదాలు జిల్లేళ్ళు విత్తించె'ను.[5] కుమారధూర్జటి పై యంశములనే ప్రబంధ ఫక్కిని ఇట్లు వర్ణించినాడు :—

'దర్పంబున నముదానగరంబుపయి గరంబు దురంబు సేయందలంచి యప్పురంబు నలు దెసలం జుట్టు ముట్టినంబెట్టదరియు బెగడియుఁ జెదరియుఁ దజ్జానపదవర్గంబు పలుదెసలం జాఱ మీఱిన రాగంబున నచ్చటి యవనబలంబు లెసంగచలంబునన్ గోటవెడలివడిం దలపడినం బోరు ఘోరంబై కౌరవ పాండవ రణంబునుంబోలి గాంగేయ కుంభజాత దుశ్శాసన వీరలక్ష్మణ కర్ణ శల్య హరణ కారణంబై ... మెఱయు నయ్యుద్ధవిడికి నోహటించి చలించి పలాయమానులగు పారసీకుల ననేకుల గాందిశీకులని యెంచి బ్రదుకుదురుగాక యని యుపేక్షించి తదీయస్థలంబున జయధ్వజంబెత్తించి' అని.[6]

పై నుదాహరించిన రెండు వర్ణనల యందును గొంతభేద మగపడుచున్నది. రాయ వాచకమునందు గృష్ణరాయ లహమదునగరపుగోట నిడియగొట్టించెనని యున్నది. కృష్ణరాయ విజయమునం దాప్రస్తాపము గానరాము. కుమార

5 రాయవాచకం (కాకినాడ. 1933 పుట 93.)

6. కృష్ణరా విజ 3 : 65.

ధూర్జటి యీయంశము నెందుకు పేర్కొనలేదో కాని కోటను ఇడియగొట్టినదిమాత్రము వాస్తవము. కృష్ణరాయల సాత్యమే రాయవాచకవర్ణన యథార్థమని రుజువుసేయుచున్నది. ఆముక్తమాల్యదషష్ఠాశ్వాసాంతమున,

> 'ఇది నైజామన ఘూవనావనిధ
> వాహీనాభ్రచుంబి స్ఫుర
> ద్విదితాఖిలమణీగృహాళిదళనో
> ద్వేలోగ్రహస్తి వ్రజో
> ద్యదనీకాగ్రగ కృష్ణరాయ,'

అని చెప్పుకొనియున్నాడు. ఈ మణిగృహాళి యహమదనగరపు గోటలో నుండినవి. వీని పరిసరముల యందే యహమదునగరము నిర్మింపఁబడెను ఈ మందిర పట్టణ నిర్మాణములనుగూర్చి ఫెరిష్తా యిట్లు వ్రాసియున్నాఁడు. బహమనీసుల్తాను సైన్యముతో నహమదు నిజాముల్ ముల్కుకు జరిగిన యుద్ధమునందు నిజాముల్ముల్కునకు జయము గలిగెను. ఈ రణక్షేత్రమున క్రీ. శ. ౧౪౯౦ సం॥న అహమదు నిజాముల్ముల్కొక చక్కని ప్రాసాదమును నిర్మించి దాని చుట్టును కనులపండువు సేయు నుపవనమును వేయుటచే నా విజయమున కుపవన విజయమని పేరు వచ్చినది; అనని తరువాతివా రాతోటను మరింత మనోజ్ఞము గావించిరి. మఱియు దానిచుట్టును కోట కొత్తళము లెత్తించి దానికి నిజాము ఉపవనమని నామకరణము గావించిరి. ౧౪౯౪ సం॥న దనరాజ్యమున కొక రాజధానిని నిర్మింప నిశ్చయించుకొనెను. ఈ యుద్దేశముతో నతఁడు నిజాము ఉపవన పరిసరముల సేనానదీతటమునను నహమదునగరమను నూతన పట్టణమునకు బునాది వేసెను తరువాత క్రీ. శ. ౧౫౦౦ ప్రాంతమున దౌలతాబాదు ముట్టడినుండి మరలివచ్చిన వెంట నిజాము ఉపవనము చుట్టు కోటనుగట్టి యందెజ్జ జాతితో నొక మందిరమును గట్టించెను.'7 ఈ నిజాము ఉపవనములోని ప్రాసాదములె కృష్ణరాయ లియడియగొట్టిన గృహాళి. అవి యహమదునగరపు గోటలోనివగుటచే గోట నిడియగొట్టక వానినిడియగొట్టుట సాధ్యమైన కార్యము గాదు; కావున రాయవాచకమున జెప్పినట్లు కృష్ణరాయ లహమదు నగరపు గోట నిడియగొట్టుట నిక్కువము. కాని యీ విజయముమూలమున గృష్ణరాయలు విశేషము లాభమును బొందినట్లగపడదు. రాయవాచకమున మూడు తెగల తురకలరాజ్యమంత్రా గంపోలంజేసి వారి దుర్గములను స్థలములను గట్టుకొన్నట్లు వ్రాసియున్నది. తురకల రాజ్యములను గంపోలము జేసినమాట వాస్తవమే; కాని యీ యుద్ధానంతరము దురకల రాజ్యమందలి దుర్గములును స్థలములును వారి యధీనమందే యుండుటచే గృష్ణరాయలు వానిని గట్టుకొనెననుట యతిశయోక్తి. ఇంతియకాదు రాయచూరు మున్నగు నంతర్వేదిదుర్గము లింకను ఆదిలుఖానుని యాధీనమునందే యుండినవి. కోవెలకొండ మున్నగునవి కుతుబుల్ ముల్కు క్రిందనె యుండినవి. తురకలను పరాభూతులను గావించియు గృష్ణరాయ లీ దుర్గగ్రహణమున కేల పూనుకొనలేదు? అను ప్రశ్న యొకటి సమాధానమును గోరుచున్నది. ఏల పూనుకొనలేదో కనుగొనుటకు దగిన సాధనములు లేవు, కాని యూహసేయవచ్చును.

రామాయణములో బిడుకలవేట్లాట యన్నట్లు కళింగ జైత్రయాత్రమధ్యమం దావిర్భవించిన దీ కెంబావి యహమదునగరముల యుద్ధప్రసక్తి. తత్కారణమున నడచుచుండిన కళింగ దండయాత్రనాపి మహమ్మదీయ ప్రభువులతో గృష్ణరాయలు గయ్యమునకు రావలసి వచ్చెను. వారిని పరిభవించి తఱుమగొట్టినపిమ్మట వారాక్రమించుకొనియుండిన దుర్గములను గైకొనుట వ్యవధి లేకపోవుటచే వానిని దరువాత జయించవచ్చునని తలఁచి కళింగమునకు మరలిపోయియుండును. బహిరంగస్థలయుద్ధముకంటె గోటల ముట్టడించి సాధించుటకు దీర్ఘకాలము పట్టును. రాయలు మహమ్మదీయు లాక్రమించుకొనియుండిన గడికోటలను సాధించుటకు గడగిన, గజపతిపైని దండయాత్రను దదేకనిష్ఠతో సాగించుటకు వీలుండదు. అవకాశముగలిగిన నతఁడు రెక్కొని క్రొత్తగ దళములను గూర్చుకొని ప్రబలుడై

7. *Briggs' Ferishta III pp*. 197, 200-01, 204.

తారొక్కనవచ్చును. కావున గజపతి కట్టియవకాశము సీయక నతని సంపూర్ణముగ నోడించి సంధికొడబఱచి యావల మహమ్మదీయుల పని బట్టింపవచ్చునని నిశ్చయించి సింహాద్రికి గ ర లి పో యియుండును.

౯

## రాయచూరు
(క్రీ. శ. 1520)

కళింగ దండయాత్ర జయవంతముగ ముగిసినది: కూతునిచ్చి రాయలకుద్వాహమొనర్చి గజపతి రాయలతో సంధిజేసికొనెను; అనతుఁడై యుండిన కాటూరు ప్రభువు నిహతుఁడాయెను; అతని ధనసంచయము రాయ భండారమును జేరెను; రాష్ట్రము రాయ సామ్రాజ్యమున గలసిపోయెను. ఇఁక తురక లాక్రమించుకొని యుండిన దుర్గములను జయించి కైకొనుటకు ప్రయత్నపడవలసియుండెను. అందు ముఖ్యమైనది కృష్ణాతుంగభద్రల యంతర్వేదియంగలి రాయచూరు. మొట్టమొదట నాదుర్గమును సాధించి యంతర్వేదిసంతటిని తన యధికారము క్రిందికిదెచ్చుకొని దక్కిన చిల్లరకోటల నటుపిమ్మట సులభముగ స్వాధీనపఱచుకొనవచ్చునని నిశ్చయించి యాకార్యమును నెఱవేర్చుటకు దగిన ప్రయత్నములు సేయగడగెను.

రాయచూరు దండయాత్ర ప్రకటన సందర్భము న్యూని జొక కథను చెప్పుచున్నాడు:—

సయ్యిదు మర్కారు కథ: ఒకనాడు కృష్ణదేవరాయలు సాళువతిమ్మయతో సాళువ నరసింగ రాయల మరణపత్రమందలి యాదేశముచొప్పున నందు బేర్కొనియుండిన దుర్గములలో నొక్కటియైన రాయచూరును ఆదిలుఖానుని జయించి స్వాధీనము జేసికొనుటకు నిశ్చయించితిననియు, నంతకు ముందు నలువదేండ్లనుండియు నాటివఱకును వర్ధిల్లుచు వచ్చిన దమ రెండురాజ్యములయొక్క మైత్రి భంగపఱచుటకు వెరవెఱుగక నున్నాడనినియు జెప్పెను. అందుకు సాళువ తిమ్మయ ఇట్లు జవాబుచెప్పెను. రెండురాజ్యములకును మైత్రి కొన్ని నిబంధనల ననుసరించి నడువవలసియున్నది:— ఇరుపక్షములవారియందెవ్వరి రాజ్యమునుండియేనియు జమీందారులు, ఋణగ్రస్తులు, ద్రోహి దళపతులు మున్నగువారు పాఱిపోయి రెండవవారి యండ జేరిన, నట్టివారిని దమకు బట్టియీయవలయునని మొదటివారు కోరినయెడల రెండవవారు వారి నప్పగింపవలయును. ఏలినవారిక్రింది భూస్వాములును, అప్పుపడి ధనము నీయవలసిన ఋణగ్రస్తు లనేకులు ఆదిలుఖానుని రాజ్యమున డాగియున్నారు. కావున ఆ నెపము వెంట దండు వెడలవచ్చునని యత డుపాయము జెప్పెను; కాని ఇతరమంత్రు లందు కొప్పుకొనలేదు.

కృష్ణరాయల కొలువున సయ్యిదుమర్కారను మహమ్మదీయు డొక డుండెను. వానిచే నలువదివేల పర్దావుల పైకమిచ్చి గుఱ్ఱములను గొనుటకు గోవాపట్టణమున కంపియుండెను; గోవాకు రెండు లీగుల దూరమున పోండాయను స్థలము గలదు. అది మహమ్మదీయుల కునికిపట్టు. మర్కారాస్థలమును జేరి యచటినుండి యాదిలు ఖానుని రాజ్యములోని కాధనమునంతటిని వెంటగొనిపరారి చిత్తగించెను. పోండాయందాతడుండగ నాదిలుఖా నాతనిపేర నొక యుత్తరము వ్రాసిపంపెననియు, దత్కారణమున నాత డాదిలుఖానుని రాజ్యమునకు బాఱిపోయెననియు గొందఱు చెప్పుదురు. సయ్యిదు మర్కారు పలాయనము రాయల కెఱుకపడినంతటనె, యతడు పెక్కు సంవత్సరములుగ రెండురాజ్యములకును వర్ధిల్లుచున్న మైత్రి యాద్రోహ కారణముగ శిథిలముసేయుట యుక్తముగాదనియు, వానిని బట్టి తనకడ కంపవలసినదనియు గోరుచు నొక కమ్మ నాదిలుఖానునిపేర వ్రాయించి పంపెను. ఆ కమ్మ యందగనె యాదిల్ఖానుఁడు ఖాజీలను మంత్రులను రప్పించి వారి కాలేఖార్థము జదివి వినిపించి వారిని సలహా యడిగెను. మర్కారు సయ్యిదు, అనగా మహమ్మదుప్రవక్తవంశసంజనితుడగుటచేతను, ముల్లాశాస్త్రవిశారదుడు

నగుటచేతను నాతని రాయలకుబట్టి యీరాదనిరి. అంతట నాదిల్షా నొకయుక్తి నవలంబించెను; మర్కారుకు దాబు లను రేవుపట్టణమును జాగీ రొసగి యతనినచటి కంపి, యతఁడు దన యాస్థాన మున లేడనియు, నతనిసంగతి తనకేమియుఁ దెలియదనియు బదులు వ్రాసియంపెను. దాబులు నుండి యా సయ్యిదెచ్చటికో పాఱిపోయెను.

ఈ విషయ మెఱుకపడగనె రాయలు తక్షణమె దాబులుపై దండువెడలిపోయి సూడు దీర్చుకొన నిశ్చయించెను. మంత్రు లల్పధనము కొఱకు సయ్యిదుపై యుద్ధమునకు వెడలుట పాటి గాదని వారించిరి. కాని రాయల దృఢసంకల్పమును గుర్తెఱిగి, 'దేవా! దాబులుమార్గమున బోవలదు; ఇప్పు డాదిలుఖానుని యధీనమున నుండు రాయ చూరుపై దండువెట్టుఁడు; అది పూర్వము మన రాజ్యమునకు జెల్లుచుండిన'దని విన్నవించిరి. మంచిదని వారి సలహా నంగీకరించి, సయ్యిదు మర్కారు వృత్తాంతమును దెల్పుచు మద్రె మల్కొ, దెమెల్లెనో, దెస్తూర్, విరిదో అనువార లకు ఉత్తరములు వ్రాయించెను.[8]

క్రీ. శ. ౧౫౫౦ ప్రాంతమున దా ఏషియా యను చరిత్ర గ్రంథమున ప్రథమదశకమును బ్రక టించిన బ్యారాసు ఈకథను గించి ద్వ్యత్యాసముతో నిట్లు చెప్పుచున్నాడు :—

'ఆదిలుఖానుని తంత్రము చేసి బోను కెక్కింప వచ్చునని యెఱిగి కృష్ణరాయలు పెక్కేండ్లుగ దన కొలువునందుండిన సయ్యిదుమెర్కారను మహమ్మ దీయుని బిల్పించి, నలువదివేల పర్దావుల నెత్తికొని గోవాకుబోయి యచట పారశీక దేశమునుండివచ్చు గుఱ్ఱములను గొనుమని యాజ్ఞాపించెను. మన కష్టానుసకు గూడ న్వాయర్థమును సాధించు నుద్దేశముతో, నాయంశమెల్లరకు దెలిసియుండుట మేలని యెంచి జాబులను వ్రాసెను. సయ్యిదు మర్కారు తనవశమున నున్న ధనముమీది వ్యామోహముచేతనో, యా దిల్షా నంపిన యుత్తరమునకులోఁగియో, గోవాకు మూడులీగుల దూరమునందుండు పోండ యను ఠాణాదరియకు వచ్చి చేరినపిమ్మట ఆదిలుఖానుని రాజ్యమునకు బాఱిపోయెను. అతఁడు తన చెంతకురాగానే యాదిల్ఖాను, అతడు ప్రవక్తమహమ్మదుయొక్క మహోన్నత కుటుంబమునకు జెందినవాడగుటచే నతనికి దావులు ఠాణాదారి యను జాగీరుగ నొసగి యచటి కంపెను..., కాని తరువాత కొన్ని దినములలోనే యత డచట గానరాక మాయమై పోయెను అతనిచెంత నున్న నలువదివేల పర్దావులను హరించిపిమ్మట ఆదిల్షా నాతని జంపించెనని చెప్పుదురు.[9]

ఇట్లు కృష్ణరాయలకు సమకాలికులును నించుక తరువాతివారునైన పోర్చుగీసు చరిత్ర కారులును జెప్పు సయ్యిదు మర్కారుకథయందు సత్య ముండకపోదు; కాని వారి యాదార్థమును సంశయగ్రస్తముసేయు నట్టియంశములు వారి కథయందు లేకపోలేదు. ఇందు ముఖ్యమైనది విద్యానగర విజాపురరాజ్యముల మైత్రి. క్రీ. శ. ౧౫౨౦-వ సం॥న కృష్ణరాయలు రాయచూరుపై దండు వెడలుటకు పూర్వము నలువది సంవత్సరము లనగా ౧౪౮౦ నుండియు పై రాజ్యముల రెంటిమధ్య మైత్రి వర్థిల్లుచుండినట్లు న్యూనిజు చెప్పియున్నాడు. ఇది యబద్ధమని నోరువిచ్చి చెప్పనవసరము లేదు. విజాపురరాజ్యము స్థాపింపబడినది క్రీ. శ. ౧౪౮౯ వ సం॥ నందని మహమ్మదీయ చరిత్రలవల్ల దెలియు చున్నది. అదిమొదలు రాయచూరు యుద్ధపర్యం తము గడచినయేండ్లు ముప్పదియొక్కటి. ఈ ముప్పదియొక యేండ్లకాలములోపల విద్యానగర విజాపురములకు పెక్కుమార్లు యుద్ధము నడచినట్లు మహమ్మదీయ చరిత్రలవల్లను, హిందూ వాఙ్మయమువల్లను, విజయనగర చక్రవర్తుల శాసనములవల్లను దెలియవచ్చుచున్నది. కావున ఈపట్టున న్యూనిజుమాట సత్యాత్మకము గాదని వేఱుగ జెప్పవలయునా? దీనివలెనే మర్కారు కథయు నసత్యమైయుండరాదాయను సంశయము గలుగవచ్చును. వీటిరెంటికిని గల తారతమ్యమును గ్రహించితిమేని యట్టి యనుమానమున కవకాశ

8. *Nuniz F.E. pp.* 323-25
9. *Ibid, p.* 325, *W.* 2.

ముండదు. విద్యానగర విజాపురముల మైత్రి న్యూని జన్యులనుండి కర్ణాకర్ణిగ విన్న గత చరిత్రాంశము. సయ్యిదు మర్కారుకథ ప్రాయశః అతడు విజయనగరముననో, గోవాయందో, లేక తత్సమీపస్థమగు మఱియొక తావుననో నివసించుచుండినప్పుడు జరిగినది. ప్రత్యక్షముగ కంటితో జూచినది కాకపోయినను నట్లు చూచినవారివల్ల నెఱిగినది, స్వానుభవముక్రిందికి వచ్చును; కావున నది యసత్యమని యనుకొనుట కవకాశము లేదు.

ఇఁక కృష్ణరాయలు సయ్యిదు మర్కారు వృత్తాంతమును దెలియజేయుచు లేఖలు వ్రాసినవారెవ్వరో, వారి కట్లు ఏల వ్రాయవలసివచ్చెనో విచారించవలసి యున్నది. వీరిలో 'మాద్రెమలుకో' యను దానియందలి 'మాద్రె' యను పేరు 'ఇమా' దనియు నతడు బీరారు సుల్తాననియు, 'విరిదో' బీదరు సుల్తానగు బరీదనియు, దెమెల్లినో దెస్తూరుల యానవాలు చక్కగ దెలియరాదనియు నొకవేళ నది 'జెమెల్లుకో' యనగా నిజాముల్ ముల్కను దానికి వ్రాయసకాని పొరపాటు కావచ్చుననియు, దెస్తూరనునది న్యూనిజు గ్రంథమున మఱికొన్ని యెడల దెసూయీ, లేక దెస్కారను దాని రూపాంతరమనియు నది గోల్కొండసుల్తానగు కుల్లీకుత్బుషాయనియు సూయెలుగారు వ్రాసి యున్నారు.[10] కాని సూయెలుగారి వ్యక్తినిర్ణయమును పూర్తిగ నంగీకరించుటకు వీలుగాదు. 'మాద్రె' యను నామమును ఇమాదుతో సరిపెట్టుటకంటె 'మదార్' యొక్క యాభాస రూపమని యూహించుట యుక్తమని తోచుచున్నది. 'మాద్రెమలుకో,' మదారుల్ ముల్క కావచ్చును అట్లయిన నతని గుర్తించుటకు దగు సాధనము లింకను లభ్యపడలేదు. 'విరిదో' బీదరు సుల్తానగు బరీదనుటకు సంశయము లేదు. 'దెమెల్లినో' సూయె లూహించునట్లు జెమెల్లుకో కావచ్చును. అగునేని యతఁడహమదునగర ప్రభువని నిజాముల్ ముల్కనుట సరియే.[11] దెసూరు కుత్బుల్ ముల్కని సూయెలు చేసిన వ్యక్తినిర్ణయము సరియైనది కాదు. ఇది దస్తూరి మమాలిక్, దస్తూర్ దీనా రనువారిలో నొక్కరిపేరై యుండవలయును. వీరిరువురికి పితాపుత్రబాంధవ్యము గలదు. ఇరువురును గృష్ణరాయలకాలమున గుల్బర్గ నేలిరి. ఈ మహమ్మదీయ ప్రభువులందఱును బహమనీ సంస్థానము నాశ్రయించియుండిన సామంతులు. క్రీ. శ. ౧౪౮౧ మొదలు ౧౫౧౮ వఱకును బహమనీరాజ్యమును బాలించిన రెండవ మహమ్మదుశాహు కేవలము సత్వహీనుఁడగుటచే సామంతులపై దన యధికారమును జెల్లించుకొనజాలకపోయెను. కావున వారు తామేలుచుండిన సీమలయందు స్వతంత్రులుగ వర్తిలుటయేకాక, చుట్టుప్రక్కలనున్న తోడి సామంతులను గొట్టి వారి సీమలను జయించి నూతన రాజ్యనిర్మాణమునకు గడగిరి. తత్కారణమున వారికి పరస్పరము వైరము గలిగి యుద్ధము సామాన్యమాయెను. వీరికి సయ్యిదుమర్కారు కథను దెల్పుచు కృష్ణరాయ లుత్తరము లేల వ్రాయించె ననునది ప్రస్తుతము విచారణీయాంశము. న్యూని జీ విషయమును జక్కగ వివరించి యున్నాడు :— 'కృష్ణరాయలు మంచి నయశాలి. వారికి లేఖలంపినది వారిని దనకు సుముఖులను జేసికొనుటకొఱకే. వారి దళముల సహాయమాతని కావశ్యము గాకపోయినను, సౌహార్దమభిలషింపవలసియుండెను. వారంత ఆదిల్ఖా

---

10. *F. E. p.* 325, *N.* 3

11. 'జెమెల్లుకో' యనునది నిజాముల్ ముల్కను కాభా సరూపమని యా మాటలకు గల పోలికయే విదితము సేయుచున్నది. ఇంతేకాక జెమెల్లుకో సోదరి నాదిలుఖానుడు పెండ్లాడినట్లు న్యూనిజు వక్కాణించి యున్నాఁడు. (*F. E. p.* 326); దీనిని రుజువుసేయు సాక్ష్యము లభ్యపడలేదు; కాని ఫెరిష్తా గ్రంథమునందు క్రీ. శ. 1508 మొదలు 1553 వఱకు రాజ్యముచేసిన మొదటి బుర్హాన్ నిజాం శాహు ఇస్మాయీలు ఆదిల్ ఖానుని తోబుట్టువగు మరియం బేగమును ద్వాహము జేసికొనెనట్లు వ్రాసియున్నాడు. మఱియు నీ వివాహము జరిగినది క్రీ. శ. 1524 వ సంవత్సరమునననియు దెల్పియున్నాడు. (*Briggs-Ferishta III pp* 51-2) దక్కను మహమ్మదీయ ప్రభువుల కుటుంబములలో గుండమార్పు పెండ్లిండ్లు పెక్కు జరగినట్లు చరిత్రగ్రంథములవల్ల దెలియవచ్చుచున్నది. కావున న్యూనిజు చెప్పునట్లు ఆదిల్ఖానుండు జెమెల్లుకొ (నిజాముల్ ముల్క)సి తోబుట్టువును బెండ్లియాడి యుండినను నుండవచ్చును.

నునితో నేకమైన రాయలాతని నారీతి జయించి యుండజాలడు. ఆదిల్ఖానుఁడు దమకంటె బలాధికు డగుటచే నతనియెడ వారు ద్వేషము వహించిరి. తురకలలో విశ్వాస మల్పము; కుక్కలవలె నౌకరిపై నౌకరుబడి పెఱుకులాడుదురు; ఒండొరుల నాశమును జూడ నపేక్షింతురు.[12] కృష్ణరాయలు దలచినట్లైపై బేర్కొనిన తురకదొర లెవ్వరును ఆదిలుఖానునకు దోడ్పడరైరి. కాని నిజాముల్ ముల్కుమాత్ర మాతఁడు నిజసోదరీ భర్త యగుటచే గొంత దండంపక తప్పినదికాదు.[13]

దళనాయకులు, దళసంఖ్య :—రాయల వెంట రాయచూరుపై నడచిన ముఖ్యదళనాయకుల నామములను, వారినాయకత్వముక్రింద నుండిన గజతురగ పదాతిసంఖ్యను న్యూనిజు వివరించి యున్నాడు :—

(1) కామానాయకుఁడు. ఇతఁడు రాయల కొలువునందుండిన మహమ్మదీయ సైనికుల కధిపతి. విలుకాండ్రేమి, ఖేటకధారులేమి, గడలవారేమి, తుపాకిబంట్లేమి—ముప్పదివేల కాల్బలమును, వేయి గుఱ్ఱములును, నాఱుగజనులును, నతని యాధిపత్యముక్రింద నడచినవి. (2) త్రియంబకరావు, ముప్పదివేలు కాల్బలము, రెండువేల గుఱ్ఱములు, ఇరువది యేనుగలతోడను; (3) తిమ్మప్పనాయకుఁడు, అఱువదివేల కాల్బలము, మూడువేల గుఱ్ఱములు ముప్పదియేనుగలతోడను; (4) ఆదెప్పనాయకుఁడు లక్షకాల్బలము, ఐదువేల గుఱ్ఱములు, యేబదియేనుగులతోడను; (5) కొండమరసు లక్ష యిరువదివేల కాల్బలము, ఆఱువేల గుఱ్ఱములు, అఱువది యేనుగులతోడను; (6) కొండమర ఎనుబదివేలకాల్బలము, రెండువేల యేనూఱు గుఱ్ఱములు, నలువదియేనుగులతోడను; (7) విజయనగరపాలకు డగు సాళువగోవిందరాజును అతనిదళవాయియు ముప్పది[14] వేల కాల్బలము వేయిగుఱ్ఱములు బది యేనుగులతోడను; (8) రాయల యనుగు కొజ్జాలు మువ్వురు నలువది వేల కాల్బలము వేయిగుఱ్ఱములు పదునైదేనుగుల తోడను; (9) రాయల యడపము[15] పదునైదువేల కాల్బలము, రెండువందల గుఱ్ఱములతోడను; [16] (10) కొమారవీరయ యెనిమిదివేల కాల్బలము, నాలుగువందల గుఱ్ఱములు, నిరువది యేనుగుల తోడను, యుద్ధమునకు నడచిరి. (11) బంకాపురాధిపతిదళములును బహుసంఖ్యాకులైన దొమరు పుర ప్రజలును మఱియొకమార్గమున బోయిరి.[17] వీరుగాక మఱికొంద ఱీయుద్ధమున బాల్గొనినవారు శాసనములందు బేర్కొనబడి యున్నారు.

---

12. *F. E. p.* 326.

13. *Nuniz, F. E. p.* 326

14. న్యూని జీతని పేరును ఒగెంద్రహో. (*Ogemdraho*) అని వ్రాసియున్నాడు; కాని పయసు ఇతనిపేరు గండరాజోయనియు నితడు సాళువ తిమ్మయ సోదరుడనియు జెప్పియున్నాడు (*F. E. p.* 284). సాళువ తిమ్మయ సోదరుని సరియైన నామధేయము సాళువ గోవిందరాజని శాసనములవల్ల దెలియుచున్నది.

15. న్యూని జీతని పేరు చెప్పలేదు. సూయెలిట్లు వ్రాసియున్నాడు. 'రాయరాజ్యము విచ్ఛిన్నమైన పిదప, మధురయందు స్వతంత్రులై పాలించిన యచటి మహా సామంత ప్రభువులు రాయల యడపము వాని వంశజులని బర్రాడాసు చెప్పియున్నాడు.' (*F. E. p.* 227, *N* 3). ఇందువలన మధురనాయకుల పూర్వికుడే ఇచట పేర్కొనబడిన యడపమని సూయె లభిప్రాయపడినట్లున్నది. అడపము డెబ్బదిరెండు నియోగములలో నొక్కటి ఈ పదమునం దేకకాలమున బెక్కండ్రు నియుక్తులై యుండవచ్చును. మఱియు బర్రాడాసే రాయలకడ మధురనాయక రాజుల మూలపురుషు డడపగాడై యుండెనో చెప్పలేదు. మధురనాయకరాజ వంశస్థాపకుండైన విశ్వనాథ నాయకుండు కృష్ణరాయల కడపటిరాజ్యవర్షములందు బళ్లారి మండలములోని పాలకల్లు గ్రామము సమరముగ ననుభవించుచుండెను. ఇతడు అడపముచిననాగినాయని కొడుకు (*Further Sources I. p.* 175). ఇందువల్ల చిననాగినాయడు కృష్ణరాయల యడపగాండ్రలలో నొక్కడని నిశ్చయమగుచున్నను, నతడె న్యూని జీట బేర్కొన్న యడపగాడని చెప్పుటకు వీలులేదు.

16. ఇతని కేనుగులు లేవు.

17. *Nuniz F. E. pp* 326-27.

మాధవవర్మ వంశజుడు ంతమరాజు సింగరా జొక్కఁడు.[18] అపత్సహాయాభిధానుఁడు చోళ మండల బ్రాహ్మణుఁడు మఱియొక్కఁడు.[19] దీనివల్ల రాయలదళనాయకులును సామంతులు మాత్రమె కాక సామ్రాజ్యమునందు పేరెన్నిక కెక్కిన యోధులనేకు లీ దండయాత్రయందు పాల్గొనినట్లున్నది. మఱియు పోర్చుగీసులు పెక్కండ్రుభయపార్శ్వములవారికిని తోడ్పడిరి వీరియందు క్రిస్తోవాన్ డి ఫిగైరెడో యను నశ్వ వ్యాపారి ప్రముఖుఁడు. ఇతనిక్రింద తుపాకులవా రిరువదిమంది రాయలతోగూడ దండయాత్రకు నడచిరి. ఫిగైరిడో రాయచూరు దుర్గమును సాధించునప్పుడు రాయల మూల్యమైన సేవ యొనర్చెను. ఇట్లు రాయచూరుపై నడచిన రాయ సైన్యమునందు యేడులక్షల ముప్పదివేల పదాతు లును, ముప్పదిరెండు వేల యాఱువందల గుఱ్ఱములును, నైదువందలయేబదియొక్కగజములు నుండెనని న్యూనిజు లెక్కనుబట్టి తేలుచున్నది. దండయాత్ర నడచునప్పుడు వలసిన వస్తుసామగ్రు లను నితరపదార్థములను సరఫరా సేయు వర్తకులును, సేవజేయు రజక క్షురకాది పరిచారకులును, విలాసినీబృందమును లెక్కకు మిక్కుటమై యుండెనట. ఇట్టి ప్రచండసైన్యముతో గూచిచేసిపోయి కృష్ణరాయలు రాయచూరు దుర్గముచుట్టును ముట్టడి దిగెను.

## ౯. రాయచూరు ముట్టడి

కృష్ణదేవరాయలు ముట్టడి వేసినప్పుడు రాయ చూరు దుర్గ మేస్థితియందుండెనో న్యూనిజు వివ రించియున్నాడు. గార నుపయోగింపక గండశిల లతో గట్టబడిన ప్రాకారములవరుసలు మూఁడు పట్టణము చుట్టు నావరించుకొనియుండినవి. ప్రాకా రపుగోడల యంతర్భాగము మట్టితో గట్టనసేయ బడి యుండినది.[1] వీనిలోపల మిక్కిలి యున్నత స్థానమున గోపురమువంటిది పొడవైన బలిష్ఠదుర్గము గలదు; దుర్గముచెంత సంవత్సరముపొడుగునను శుష్కించని ప్రాద మొక్కటి యున్నది. అంతటి యున్నతప్రదేశమున నెన్నడును దఱుగని జలసమృద్ధి గలదగుటచే నది దివ్యతీర్థమని యెన్నబడుచున్నది; ఇదిగాక నచట చెఱువులు, బావులు మున్నగు జలా ధారము లనేకములు కలవు; కావున అచటివారికి నీటికఅవ్వవలన శత్రువులచేజిక్కుదుమను భయను లేదు. మఱియు నచటనాహారపదార్థముల కేమియు కొదవలేదు. ఐదేండ్లకు వలయు వస్తుసామగ్రియందు సమకూర్పబడి యుండినది. కోట కాపుదల యేర్పా టులయం గలసపా లెందును గానరాదు. ఎనిమిది వేల కాల్బురును, నన్నూఱు గుఱ్ఱములును, నిరువ దేనుగులును, గొప్పబండలను విసరి యపారనష్టము గల్గింపజాలిన పంచసములు ముప్పదియు నందుం డెను. మఱియు గోటగోడలపై బురుజులనేకము— లొండొంటికి మాట వినవచ్చుసంతటి సమీపమున— లుండినవి. వాని మధ్యస్థలములందు ఫిరంగులు పెద్ద- వియే రెండువందలట, చిన్నవానిగూర్చి వేఱుగచెప్ప నేల? —బారులు తీర్చి యుండినవి. ఆపురజనులు రాయరాణువరాక తెలియవచ్చినంతటనె, యాదిలు

18. *S. I. I. IV.* 789.

19. *ARE.* 47 *of* 1906. తిరుక్కడవూరు అమృత ఘటేశ్వరాలయమును అపత్సహాయుఁ డను బ్రాహ్మణుడు కృష్ణరాయల కాలమున విషైయ (వృష) సంవత్సరమున ననగా శకాబ్దము 1444 (క్రీ. శ. 1521–22) న బాగుచేయించెను. అతడు ఇరాచూరు. 'విజైయా నగరములకడ నిజపరాక్రమ ప్రదర్శనమువలన గృష్ణరాయలను మెప్పించితి' నని చెప్పుకొనియున్నాడు.'

1. ప్రాచీన దుర్గ సాలనిర్మాణపద్ధతి ఇది: పెద్ద గండశిలల యుపరితలములను మలిచి రెండు వరుసల గోడల నొండొంటికి మధ్య గొన్ని యడుగుల యెడము విడిచి కట్టి యా రెండుగోడలనడుమ నుండు స్థలమును గోడలపై మట్టము వఱకును మట్టిపోసి నింపి గట్టించెడి వారు. అప్పుడు రెండువరుసలగోడ లేకమై ఘనమైన కోటగోడ యొక్కటి ఏర్పడును. ఇట్టి కోటగోడ వరు సలు మూడొకదానిలోపల నొక్కటి రాయ చూరు నావరించి యుండెనని న్యూనిజు చెప్పు చున్నాడు.

ఖానుఁడు గొంత సిబ్బందితో నంపిన ఢాళవాయి నొక్కని బ్రవేశింపనిచ్చి, గచ్చుతోడను జాలతోడను వాకిళ్ళకన్నింటికిని అడ్డగోడలను గట్టి మూసివేసిరి. యుద్ధము జాలవఱకును కోటకు పూర్వదిశయందె నడచెను; ఉత్తర దక్షిణదిక్కులందు కోటయున్నతమైన గండశిలలపై నిర్మితమైయుండుటవలన, నా ప్రక్కలం దది బహుబలిష్ఠమై దుస్సాధ్యమై యుండెను పట్టణముచుట్టును రాయరాణువ ముట్టడిదిగినను రాయలవారి శిబిరము కోటకు పూర్వుననె యుండెను. తత్కారణమున యుద్ధకార్యమచ్చటనె ముమ్మరముగ నడచినది.

## గొబ్బూరు యుద్ధము

యవనస్థాపం సపాగంతతః
గొబ్బూరు స్థలవాసినం
సగఘసం జిత్వాను విద్రాప్యతం
హస్తశ్వాక్షసలదీయదుర్గమతులం
రాచూరు మాదత్తవాణ.

అని కృష్ణరాయల గొబ్బూరు రాయచూరు విజయములను బండారు లక్ష్మీనారాయణ వర్ణించినాడు. కాని న్యూనిజు పైయుద్ధమును కన్నుల ముందు పొడకట్టునట్టుగ విపులముగ వివరించియున్నాడు. కృష్ణరాయ లెత్తివచ్చి రాయచూరుదుర్గమును ముట్టడించియున్నాడన్న వర్తమానము దెలియవచ్చినంతటనె, ఇస్మాయీలు ఆదిల్ ఖానుఁడు సైన్యమును బ్రోగుచేసికొనివచ్చి కృష్ణానదీయుత్తర తటమున విడిసెను ; తనరాక విననె కృష్ణరాయలు వచ్చుననంతటిని గడల్చుకొని తడవుసేయక దన్ను మార్కొనవచ్చుననియు, నట్లు వచ్చినయెడల నాతని నోడించుటకు దానుపాళెముడిగియున్న చోటెయన్య స్థలములకంటె ననుకూలతరమైనదనియు నెంచెను. ఏలననగా, నది నుత్తరించి యవ్వలిదరి సేరుటకు దగినరేవు తన శిబిరముకడనెయున్నది ; దానికంటె భిన్నమైనది యా ప్రాంతమున మఱియొకటి నెచ్చటను లేనికారణమున, నా రేవును జక్కఁగ గాపు చేసియుండిన నదినిదాటి వచ్చుటకు యెవ్వరికి శక్యముగాదు ; ఇఁక నానల్లమూక యేడనదిదాటుఁడేడయని తలపోసెను. కాని అతఁడనుకొనినట్లు కృష్ణరాయలు తారసిల్లలేదు; మఱియు దనస్కంధావారమునందు నిశ్చలుఁడై యతని మార్కొనసెట్టి ప్రయత్నమును జేయక మిన్నకుండెను ; వేగరులను బిలిచి శత్రువునడవడికను నెత్తుగడలను నతని దగ సంచరణను జక్కఁగ బరిశీలించి తన కనుతుణమును నెఱుకచేయవలయునని యాజ్ఞాపించి యంపెను.

ఇస్మాయీలు ఆదిలుఖాను కనుమానము గల్గినది. తా ననుకొనినట్లు కృష్ణరాయలు దన్ను మార్కొన రాకుండుటకు గారణమేమి? మర్మమెద్దియో నిగూఢమై యుండవలయును ; దానిని గనిపెట్టి తగినశాస్తి సేయుట యుక్తమనియెంచి హితులను దండనాయకులను బిల్పించి సభగూర్చి వారిని సలహా యడిగెను. వారియం దొక్కొక్కరును గృష్ణరాయల నిరాగమనమునకు గారణము నొక్కొక్కవిధమున నూహించుటచే, వారి యభిప్రాయములు భిన్నములై యుండెను అంకుశఖాను ప్రభృతులు కొందఱు, కృష్ణరాయ లాదిల్ఖానుని సరకుగొనక నిజబలాధిక్యమును నతనియెడ దన నిర్లక్ష్యభావమును వెల్లడిసేయుటకొఱ కచలుడై, స్కంధావారమందె సుస్థిరుఁడై యున్నాడనియును, దాము నదిని దాటినంతటనె వచ్చి తమపై బడుననియు జెప్పిరి. మఱికొంద అది సరికాదనిరి. పూర్వము మహమ్మదీయులచే హిందువులకు గల్గిన పరాజయములను స్మరించిభీతిచేతస్కుడై గృష్ణరాయలున్నాడనియు, దాము జంకక ముందునకు నడచి నదిని దాటుట మంచిదనియు, నాదిల్ఖానుఁడు సత్వహీనత జూపుట యుక్తముగాదనియు, నతఁడవు దున్నచోట నెంతకాల మాగియుండిన నతనికి కీడును శత్రువుకు మేలునునంతగ హెచ్చుచుండుననియు, దమకు హిందువులంతటి గొప్ప సేన లేకపోయినను బూర్వవిజయములవలన గలిగిన ప్రతిష్ఠయె తమ కిప్పట్టునను జయము చేకూర్చుననియు విన్నవించిరి.

అందుమీదట నాదిల్ఖానుఁడు తన సైన్యములకు గణుతి పెట్టించెను. విలుకాండ్రుగాని బందూకులవారుగాని ఖేటకధరులుగాని గడలవారుగాని మొత్తము కాల్బల మొకలక్ష యిరువదివేలును, పదునెనిమిదివేల గుఱ్ఱపు రౌతులును, నూటయేబది యేనుగులును సైన్యమందున్నట్లు తేలినది ; దీనికి

దోడు ప్రబలమైన ఫిరంగుల బారాగని కడనుండెను తత్సహాయమున శత్రువును సులభముగ సాధింప వచ్చునని నిశ్చయించి సేనల కేఱుదాటుట కనుజ్ఞ యొసఁగెను.

శత్రువు నేఱుదాటనీయకమార్గము నరికట్ట వలయునను నుద్దేశము కృష్ణరాయలకులేదు; కావున ఆదిల్ఖాను నిర్బాధముగ గృష్ణనుదాటి రాయచూరు కించుక వాయవ్యమున బదునెనిమిదిమైళ్ళ దూరమున నుండు గొబ్బూరుగ్రామముకడ విడిసెను[1]. అచటినుండి రాయచూరు ముందుండు కృష్ణరాయల స్కంధావారముపై దళములనంపి తనకపజయము, గలుగదనియు నా దుర్గము తనచేతినుండి జాఱిపోదనియు నతఁడు తలంచెను. మొట్టమొదట తనశిబిరమును సురక్షితము జేసికొనుట మేలనియెంచి దాని చుట్టును కందకము ద్రవ్వించి కరగోడ నెత్తించి ఫిరంగులనన్నిటిని ముంగలిభాగమున బారుదీర్పించి, దళములను చిత్తచర్యస్థానముల నెలకొల్పి, శత్రువు లైకొనినపుడు కార్యము నడపవలసిన తెఱగును బోధించెను. మఱియు గృష్ణరాయ లొకవేళ తన యావత్ సైన్యముతో గదలివచ్చి యొక్క హుమ్మత్తున దన శిబిరముపై బడవచ్చునని యెంచి యట్టి సందర్భమున శత్రుసంహారమునకు దగిన యేర్పాటులను గావించెను; శత్రువులపై బేల్చుటకు ఫిరంగులను బాణసంచును సిద్ధము జేసియుంచెను. సాహసముజూపి హిందువుల దండు పైకొన్నప్పుడు, తనయోధులు వారిని గనిమసగుట తప్పదనియు. నంతవఱకు వేచియుండి యప్పుడు ఫిరంగుల నన్నిటి నొక్కుమ్మడి పేల్చిన వారిని రూపుమాపవచ్చుననియు దీర్మానించుకొనెను

కాని గృష్ణరాయలు యుద్ధమునకు ఆదిల్ఖాను తలచినవిధమున దారసిల్లలేదు. అతఁడసామాన్య ప్రతిభ గల దళనాయకుఁడు; తుపాకులతో బోరాటములం దారితేరిన యోధుఁడు; యుద్ధకార్యములందు చక్కని యనుభవముగలవాఁడు; ప్రణిధిబలము గల ప్రభువు. ఆదిల్ఖానుని యేర్పాటులన్నియు వేగరుల మూలమున నతనికి దెలిసియుండిన నుండ వచ్చును. ఎట్లయిన నేమి? అతఁడదిల్ఖాను దూహించినట్లు కాక వేఱువిధమున వ్యూహమును రచించి కయ్యము సేయ బయలువెడలెను.

కృష్ణరాయలు తన సైన్యమునంతటినియేడు వాహినులుగ విభజించి, యందు రెంటిని యెలుగోలు బలముగ నేర్పాటుజేసి, వాని యాధిపత్యమును దనకు పిల్లనిచ్చిన మామయు, శ్రీరంగపట్టణరాజ్య పాలకుఁడును నైనకుమారవీరయకిచ్చి, సైన్యముతో గదలిపోయిన యాదిల్ఖాను స్కంధావారమున కొక పరుగుదూరమున విడిసియుండ నట్లాజ్ఞాపించెను. తరువాత కృష్ణరాయలు చిక్కిన యైదువాహినులు వెంటరాఁగలని పిరుదఁగూచిచేసి పోయెను. అరుణోదయసమయమున నాయుధములను ధరించి యుద్ధమునకు సంసిద్ధముగ నుండవలసినదని, సైనికుల కంతరికాజ్ఞఁ చేసెను. వెంటనే కోళ్లలు సేయవలయునని రాయల యుద్దేశమైనను శుక్రవారమగుటవలన నాదినము కయ్యమారంభించిన మేలొడగూడదని యాంతరంగికులు విన్నవించుటచేత వారి వేడికోలంగికరించి యుద్ధోద్యోగమును నాడుమానుకొనెను. ఉభయసైన్యములొండొంటికి గడు సమీపమందు విడిసియుండుటవలన ఇరువాగులందును సైనికులెల్ల నాపగలును రాత్రియంతయు నాయుధముల నూడ్వక జాగరూకతతో గాఁచియుండిరి

శనివారమునాఁడు ఉషఃకాలముననే కృష్ణరాయల విడిదియందు రణభేరిపటహాది వాద్యములు నెలగినవి; సైనికుల కలకలము ప్రబలినది; ఆయా రవములసంకులితమై మిన్నువిఱిగి నెత్తిపై బడునట్లు తోచినది; వీనికిదోడు హయహేషలును గజఘీంకారములును దిక్కుల బిక్కటిల్లినవి. ఆ మహాసంకులారావమును వర్ణించుట కలవిగాదు. విన్నవారికే కాదు, తత్కర్తలకు సయితమది యెంతటి భయోత్పాదకముగనుండెనో యథాతథముగ జెప్పినను నమ్ముటకు సాధ్యమనిపించదు. శత్రులును వీరికి తీసిపోలేదు; భూనభోంతరాళములునిండినయా పెను ఘోషయం దెవ్వరికిని వారి నోటినుండి వెలువడు మాటలుసయితము వినరావాయెను; సంజ్ఞలమూలమునదప్ప నొండొరులతో మాటలాడు మార్గము వేఱెద్దియు గానరాదాయెను.

1. *Further Sources. I.* 116 (*a*).

రణరంగమున కందకమునుబోయి చేరునప్పటి కుదయమై జాము ప్రొద్దెక్కినది అప్పుడు కృష్ణ రాయలు దన యెలగోలు బలము రెండువాహాను లను శత్రువులపై గవిసి వారియం దొక్కని సైన జీవముతో నుండనీయక సంహారించవలసినదని యాజ్ఞాపించెను. రాయల యుత్తరువుప్రకారము కుమార వీరయ ఫౌజులతో శత్రుసైన్యముపై నుఱికి తఱిమి నుఱుమాడుచు ముందునకు సాగి, వారి స్కంధావారము చుట్టునుండు కందకపు కర గోడపై కెక్కెను. అప్పుడు తెలియవచ్చినది ఆది ల్ఖానునకు గృష్ణరాయలు దాననుకొనినట్లు గాక వేఱు రణవిధానము నవలంబించినాడని; కావున నతడు తన మొదటియేర్పాటులను త్యజించి, రాయల సైన్యములపై దనభటు లుఱికి యుద్ధము సేయుతరి మీద బ్రయోగింప నుద్యమించి యుండిన ఫిరంగు లను, దన స్కంధావారమును జొచ్చుట కుంకించు చున్న ఎలగోలుఫౌజులపై ద్రిప్పి కాల్పించెను: పిడుగుల వర్షమువలె నా ఫిరంగుల యగాదు రాయల యెలగోలు మూకను నిర్మూలముసేయ గడగినది; పెక్కేనుగులును గుఱ్ఱములును రణ క్షేత్రమున బడెను; పదాతివర్గము బహుళముగ నశించెను; హతశేషులు నిలువజాలక తిరుగుడువడిరి. విఱిగి పఱచు రాయలఫౌజును జూచి, సమయము చిక్కెనని విజృంభించి తురకలు యమదూతలవలె వెన్నంటి తఱుముచు ఖండతుండెములుగ నఱక గడగిరి. పరుగుదూకము దారి పొడుగునను శవగుట్టలు వెంటయాయెను.




కృష్ణరాయలు పాఱివచ్చుచున్న తన సైని కులను గని క్రోధదందహ్యమానచిత్తుడై 'స్వామి ద్రోహులార! ఏలపఱతెంచెదరు? పఱతెంచి వచ్చిన చోట లేదా మృత్యువు? పుట్టినవారు గిట్టక తప్పదు. అపకీర్తిపాలై పేరుప్రఖ్యాతులను దగుల బెట్టి మను అధమజీవనముకంటె వీరోచితమైనరణ శయ్యయే మేలుగాదో? నాకు బాసటయై నిలువ జాలిన యోధులెవ్వరును లేరా?' యని యుద్ఘో షించెను. రాయలవారి నోటినుండి యామాటలు వెలువడెనో లేదో, తత్క్షణమే దొరలును దళనాయ కులును శూరులును పెక్కండ్రాతనిచుట్టునుమూగి 'మహాప్రభో! మా యొడలు యేలినవారివి? పని గొనుడు, అని విన్నపము జేసిరి. రాయలవారు మరల నిట్లు పల్కిరి: 'లోకములోని భూపాలుర కెల్ల నధికుడగు మేటిని జంపితినని యాదిలానుడు

జ్జులాడు కాలమాసన్నమైనప్పుడుగాక ! అతని పరాభూతుని గావించితినని చెప్పుటకెన్నడును అవకాశము కలుగబోదు. అని తన వ్రేలినుండి ముద్దుటుంగరమును దీసి యొక యాడిగీని చేతికిచ్చి తనకు వీరస్వర్గప్రాప్తి కలిగిన దానిని రాణివాసములకు జూపవలయుననియు, సంతట వారు కులాచారము ప్రకారము సహగమన కార్యము నడుపుదురనియు నానతిచ్చి, గుఱ్ఱమునెక్కి, శత్రువుల నెదుర్కొనజాలక పఱతెంచివచ్చు వారియందు దొక్కనినైన విడువక దయాదాక్షిణ్యములను మఱచి సంహరింపవలసినదని యుత్తరవిచ్చి, తక్కిన యైదువాహనులు వెంటరా రణభూమికి చరలెను. పలాయితులైవచ్చుచుండినవారు తమవారిచే దమ కెట్టి మర్యాద జరుగునో గ్రహించి వెనుదిరిగి దుస్సహ పరాక్రమముతో శత్రువులను మార్కొని చించి చెండాడ నడగిరి. వారి ప్రతాపమునకోర్చి యభిముఖులై నిల్చి యుద్ధము సేయగల తురక యొక్కడేనియు గానరాడాయె. ఏలనగా దురకలు జయము తమకే కూడెనని యెంచి యుద్ధక్రమము ననుసరింపక బారులువీడి యెవ్వరి కనుకూలపడినట్లు వారు శత్రుల దఱుముకొని వచ్చుచుండిరి హఠాత్తుగ హిందువు లెదురుతిరిగి వ్యూహక్రమముననుసరించి పోటుచూపగా వారియెదుట నిలిచి సరిపోరుటకు తురకలకు శక్తిలేకపోయెను. ఇందువలనే మహమ్మదీయ సైన్యము కలగుండువడినది. వారి ఫౌజసంఖ్యాకముగ మడిసినది. మిక్కిలి శ్రమపడి బలపఱచిన నిజస్కంధావారమును సయితము సంరక్షించుకొనవలయునను బుద్ధికూడ వారికి పుట్టదాయెను.

ఈ సందర్భమున సలాబత్ఖానుని వృత్తాంతము జెప్పక తప్పదు. ఇతడు ఇస్మాయీలు ఆదిల్ ఖానుని యొక్క సర్వసేనాధిపతి; విజాపురసుల్తాను కొలువు నందుండిన పోర్చుగీసుభటులలో నైదువందమంది నేర్చి తనకంగరక్షకుల జేసికొనియుండెను. గొబ్బూరు రణక్షేత్రమున దురకసైన్య మోడి బీభత్సమగుటను గని మరల దాని నేకముఖమునకు దెచ్చి శత్రులపైగ గవియింపదలపెట్టెను ; కాని యదినికడక నిష్ఫలమాయెను. మహమ్మదీయ సైనికుల కెవ్వరికిని నిజప్రాణ సంరక్షణ యొక్కటి తప్ప యన్యచింత లేకపోవుటచే నాతనిమాటల నెవ్వరును చెవిబెట్టరైరి. శత్రువులచే బట్టువడుటకంటె మరణమే మేలనియెంచి తన పోర్చుగీసంగరక్షకబలములోగూడ రాయరాణువపైబడి, తన్ను దన యంగరక్షకులను శత్రులు జిరకాలము స్మరించి భయముజెందున ట్లద్భుతఫణితి వీరవిహారము సల్పెను. అతని పరాక్రమమున కోర్వజాలక యాతని నెదుర్కొన సయితము మెల్లవారును వెఱచి దారి విడిచిరి మొగ్గరము జీల్చుకొని లోన ప్రవేశించి రాయల యంగరక్షక బల సమీపమునకు పోయి చేరెను; అతడెక్కిపోవుచున్న గుఱ్ఱము నిగనప్రాణమై నేలకూల నతడు పాదచారియాయెను; శత్రువులచే బడనీయక యతని సంరక్షించుటకొఱకతని పోర్చుగీసుభటులు రాయరాణువను పాయవడనఱకుచుబోయి యాతని వేఱొకగుఱ్ఱముపై నెక్కించిరి. వారు పోయినమార్గమును గ్రమ్ముకొనగూడ నెవ్వరికిని ధైర్యము చాలదాయె. సలాబత్ఖాను డంతట గొత్తలమందగ జొచ్చిన తోడేలువలె మఱల విజృంభించెను; కాని యెంతకాలమట్లు పోరగలుగు? శత్రు సమాక్రాంతుడై, కాయమెల్ల గాయమయమై గాసిలియుండ నిలుపోవ నెట్లు సాధ్యమగును ? తుదకు సలాబత్ఖానుడు వాహనముతో నూశ కుప్పగూలెను. అతని నుఱల సంరక్షించుటకు పోర్చుగీసులు ప్రయత్నము చేసిరి ; కాని యొక్కరైన నతనిచెంత జేరజాలక నఱకబడుచుపడి నిశ్శేషముగ నందఱు సమసిపోయిరి. హతగాత్రుడై సలాబత్ఖానుడు శత్రులకు బట్టువడెను.

సలాబత్ఖానుడొక్కడు దక్క శత్రుసంరంభమును నివారించుటకు దొరకరిన సర్దారు నేఱొకడు డాదిల్ఖానుని సైన్యమున లేడు. తక్కిన దొరలును తురకలును ప్రాణభీతిచే యథాయథలై పాఱ జొచ్చిరి ; కృష్ణాస్రవంతి యందుఱికి యవ్వలిదరి నెట్లయిన జేర సమకట్టిరి; కాని వారిని వెన్నంటి తఱుముచు వచ్చిన రాయదళము వారిని బోనీక పొడుపుకొని చంపగడగెను. అందు ముఖ్యముగ నేనుగులు నదిలోనికి దిగి నీట నీదుచుండిన వారిని తొండములగ గబళించి తునిమి తూటాడ దొడగి

నవి. చౌడోలు లందుండు యోధులు నిజహేతి ప్రహారములచే ననేకులఁ దుసుముట్టించుచుండిరి కృష్ణరాయలప్పుడు నదియొద్దు జేరి తేఱిచూచెను ; దృశ్యము మహాఘోరమై కన్పట్టినది ఎటుచూచినను మృత్యువుతాండవమాడుచుండెను; స్కంధావారము నుండి బిడ్డలతోఁ బరారియగుచుండిన యువతీజన మొకప్రక్కను, నదీ ప్రవాహ మగాధ మగుటచే తప్పించుకొని పోఁజాలక వాహములే శరణ్యములుగ దేలియాడు నాశ్విక సందోహ మొక ప్రక్కను, గట్టెక్క గమకించి పట్టుదప్పి రాహుత్తులతో గూడ బిళ్లపాటుగ నీటఁగూలి మఱియు గుఱ్ఱము లొక ప్రక్కను, శ్రమపడి పై కెగప్రాకి తలచూపిన శత్రుల నచటనె రూపుమాపు రాయ సైనికులును, నీట నుండు వారిని గీటడగించు గజఘటలును నెల్లయెడల బొడకట్టెను ఈ దృశ్యమును గాంచినంతటనె రాయలవారి హృదయమున జాలిపుట్టినది 'నిరపరాధులగు వీరెట్లు వధార్హులగుదురు? వీరి తప్పేమి?' యని చింతించి ధర్మదారబట్టుట కాజ్ఞాపించెను; ధర్మదార బట్టినంతటనె దళనాయకులెల్ల యుద్ధకర్మను చాలించి గళములను మరల్చిరి

ఈ మహాసంగ్రామమునందు ఇస్మాయీలు ఆదిల్ఖానుఁ డేమిచేసెనో విచారింతము ఆతఁడు యుద్ధభూమిని ప్రవేశించనేలేదని చెప్పుచున్నాఁడు న్యూనిజు. యుద్ధసమయమున నతఁడుఁ దరువాత అసాద్ ఖానుడనుబిరుదువహించిన—సుఖోలారిజ్ చే సంరక్షితుఁడై యుండెను. ఈ సుఖోలారిజ్ కుట్ర సేయుటయందు సాటిలేని ప్రజ్ఞావంతుఁడు; తన్నును దన పరివారమును ఆదిల్ఖానుఁడు దన కంగరక్షకులుగ నియమించునట్లు పన్నుగడ పన్నెను. యుద్ధమునందు ఆదిల్ఖానుని ఫౌజు సంపూర్ణ పరాజయమును బొంది విఱిగిపాఱుచెంచు విధముగనుఁగొనియతఁడు, 'మహాప్రభో ! అవధారు ! తమకు జీవముపై నాశయుండిన నా వెంట విజయము సేయుఁడు' అని యాదిల్ఖానునితో విన్నపము జేసెను అంతట నాదిల్ఖానుఁడేనుగునెక్కి శిబిరమును నందలి సర్వమును త్యజించి, సుఖోలారిజ్ సలహాప్రకారము నదిని దాటక దాని దక్షిణ తటమందుండు కొండలవరుసనుజుట్టి నిజ రాజ్యమునకుఁబోయి చేరెను.

కృష్ణరాయలు యవన స్కంధావారమును ప్రవేశించి యాదిల్ఖానుని శిబిరమందు విశ్రమించెను [1] దండనాయకుల రాయలవారట్లు విశ్రమించుట సరియని తోచలేదు. కావున, వారు 'ఏలికవా రిట విశ్రమించుట యుక్తముగాదు; శత్రుశేష ముంచరాదు. దేవరవారు స్వయముగ శత్రుసంహారకార్యమునకు బూనుకొనవలసిన యావశ్యకతలేదు. ఆజ్ఞయైన మేమా కార్యము నస్తమయమునకు ముందె ముగించి రాగల'మని విన్నవించిరి రాయల వారందుకు సమ్మతింపడాయె 'నిరపరాధు లనేకులు సమసిరి; ఆదిల్ఖానుఁడు నాయెడ చేసిన తప్పునకు దగిన శాస్తియైనది. మఱియు, మన పింగల రాయచూరు మనకింకను స్వాధీనము కాలేదు; కావున కూచిజేసి ముందుకు నడచుటకు పూర్వము దానిని సాధించుట యవసర' మని చెప్పి యాదిల్ఖానుని స్కంధావారమున నుండు చూఱనంతటిని బరిశీలించుట కాజ్ఞయొసఁగెను. మృతినొందినవారిలో నాదిల్ఖాను సంస్థానపు మొదటి వరుస దొరలు పెక్కండ్రుండిరి; యేవురు మహాదండనాయకులు జీవగ్రాహముగ బట్టువడిరి. పై పేర్కొనిన సలాబత్ఖానుడు వారియందు ప్రముఖుఁడు ; నాలుగువేలు పులురుమంజి గుఱ్ఱములును, నూఱు మదహస్తులును, నన్నూఱు గొప్ప ఫిరంగులును, పెక్కు చిన్న ఫిరంగులును, తొమ్మిదివందల ఫిరంగిబండ్లును, బహువిధముల గుడారములును హస్తగతము లాయెను ; ఇవిగాక

1. కృష్ణానదిని దాటి కృష్ణరాయ లాదిల్ఖానుని పాళెమును బ్రవేశించెనని సూయెలు వ్రాసినాడు. '*The Raya then crossed the river and seized the Shah's camp.*' (*Forgotten Empire. p.* 139.) ఇది ప్రమాదజనితము. న్యూనిజు చరిత్రయందు దీని కాధారమేమియులేదు. ఆదిల్ ఖానుడు కృష్ణ కవ్వలి యొడ్డున తొలుదొల్త పాళెముడిగినది వాస్తవమే ; కాని దానిద్యజించి కృష్ణను దాటివచ్చి గొబ్బూరు కడ శిబిరము నెత్తించి వానిచుట్టును కందకమును గరగోడను నిర్మించుకొని యుండెను. ఈ శిబిరముకడనె యుద్ధకార్యమంతయు నడచినది. కావున కృష్ణరాయ లాదిల్ఖానుని శిబిరమునకు బోవుటకు గృష్ణను దాటవలసిన యావశ్యకతలేదు.

యసంఖ్యాత భారవాహాశ్వవృషభాది జంతువర్గ మును, పరిచార పరిచారికాసమూహమును పట్టు వడెను. రాయలవారి యాజ్ఞచే స్త్రీ లనేకులు బంధ విముక్తలై తమ నెలవులకుబోయి చేరిరి రణస్థలి బడిన స్వపక్షమువారు పదునాఱువేల కధిక సంఖ్య గల యోధుల కెల్ల దహనాది క్రియలు ముగియు వఱకును నచ్చటనెయుండి, వారికి బుణ్యలోకా వాప్తికొఱకు దాన ధర్మముల గావించి, యటు పిమ్మట రాయచూరికి మరలిపోయి యథాపూర్వము ముట్టడివేసెను.[1]

ఇది న్యూనిజు చేసిన గొబ్బూరు యుద్ధవర్ణన క్రమము.

ఫెరిష్తా ఈ యుద్ధము నింకొకతీరున వర్ణించి యున్నాడు. హిజిరీ ౯౨౭ (క్రీ. శ. ౧౫౨౦)వ సం॥న ఇస్మాయీలు ఆదిల్ శాహు విజయనగర రాయలకడనుండి ముద్గలు రాయచూరు దుర్గము లను మరల స్వాధీనపఱచుకొన నెంచి దండయాత్ర సన్నాహముల గావించెను. ఆ సడి నెఱిగి యతఁడు ప్రచండ సైన్యముతో వచ్చి కృష్ణానదీతీరమున విడిసెను; సామంతు లనేకు లచటికివచ్చి యతని గూడిరి; అందువలన నతని క్రిందనే బదివేల గుఱ్ఱములును గొప్ప కాల్బలమును యుద్ధమునకు సిద్ధముగ నుండెను. మఱియు నతడు కృష్ణానదిని దాటు రేవుల నన్నిటిని స్వాధీనపఱచుకొని వాని గాపుదల సేయుటకు బలిష్ఠమగు దళముల నియ మించెను ఆదిల్ శాహు అంతట దన యుద్యమ మును విరమించుకొనిన బాగుగ నుండెడిది; కాని యప్పటికె వెలి గుడారములను వేయించి యుండుట వలన వెనుదీయుట నిజప్రతిష్ఠకు భంగకరమని యెంచి యేడువేల గరీబు గుఱ్ఱపుదళముతో బయలు దేరిపోయి హిందువుల పాళెమున కెదుట కృష్ణ యవ్వలిగట్టున డేరా లెత్తించి నదిని దాటుటకు దోనెలను జేసి ముగియువఱకు నచట వేచియుండెను. పాళెముడిగిన తరువాత నొకరోజున ఆదిల్ శాహు శిబిరమున విశ్రమించియుండగా దెఱకు వెలుపల నతని సహచరులలో నొక్కఁడు,

'సంతసపు మధువుతో నింపు బంగరుగిన్నె
మధు పిపాసితుఁ గుర్విమంట గలయది మున్నె'

యను గీతమును బాడుటను వినెను. అతని కంతటమధు పిపాస హెచ్చఁగా ననుగులను బిలువ నంపి వారితో గూడ భోగాస్తరణముపై నాసీనుఁడై మధుపానుచు నాటపాటలయందు నిమగ్నుఁడై యుండెను. ఈ మధుపానక్రీడ మితి మీఱగా నాదిల్ శాహునకు వైగ పెక్కి యప్పుడే నదిని దాటిపోయి శత్రుసైన్యముపై బడవలయు నను యిచ్ఛ ప్రబలెను. తక్షణమె దళనాయకులను బిలువనంపి దోనెలను తయ్యారుసేయుట కింతటి యాలస్యమేల కల్గెనో విచారించెను. నూఱుదోనె లప్పటికి సిద్ధమాయెననియు, దక్కినవి కొద్ది రోజులలోనే తయ్యారుకాగలవనియు వారు జవాబు చెప్పిరి. పానాపానమదోద్రిక్తుఁడై యాదిల్ శాహు వెంటనె నది నుత్తరించుటకు నిశ్చయించి, తన యుద్దేశము నెవ్వరికిం జెప్పక యేనుఁగునెక్కి శత్రుస్థితిని పరికించుటకొఱకు బోవునట్లు బయలు వెడలెను; ఉన్నట్లుండి సిద్ధమైయుండు పడవలు పట్టు నంతఱు సైనికులు పడవలపై దాటవలసిన దనియు, దక్కినవారు నేనుగులనెక్కి రావలయు ననియు ఆజ్ఞాపించెను; తొందరపడి సాహసముజేసిన కార్యము చెడునని దళనాయకులు విన్నవించిరి, కాని యాదిల్ శాహు మారువల్కక తన యేనుగును నదిలోనికి దోలెను; చేయునది లేక దళముతో గూడ దళపతులు రెండువందల యేబది యేనుగులపై దాటి యవ్వలి యొడ్డును జేరిరి. అదృష్టవశమున పడవలన్నియు రెండు పర్యాయములు సైనికుల నెక్కించుకొని దాటించుపఱకును హిందువులు వారిని దారసిల్లలేదు. కాని వారి సేన యత్యంతము బలిష్ఠమైనది; సుల్తానునకు జయము చేకుఱునను నాశకుగూడ నవకాశములేదు. అతని రెండువేల భటులును వారు ముప్పదివేలలో ఢీకొనిరి మహమ్మదీయ వీరు లేక చిత్తముచే నుద్బోధితు లైనట్లు అత్యంతాటోపముతో వారి పైబడి, విజయనగర సర్వసేనాధిపతి సంగతరాయలు మున్నగు సహస్రాధిక సంఖ్యాతులను రూపుమాపిరి; కాని ఫిరంగులు తుపాకులు బాణసంచు మున్నగు

1. *Forgotten Empire. pp.* 334-343.

నాగ్నేయాయుధ ప్రయోగమువలన మహమ్మదీయ బలమునం దర్ధభాగమును విద్వేషులు హతము గావించిరి. హతశేషులు బ్రదుకు జీవుఁడా యని నదీప్రవాహమున నుఱికి తప్పించుకొనజూచిరి. సుల్తానుతో గూడనదేయంబారిలో గూర్చుని యుండిన తర్క్యాస్ బహదూరును ఇబ్రహీమ్ బేగును ఏనుగును నది కడ్డముగ దోలాడి యవ్వలి గట్టువైపు పఱచిరి ; ఆ యేనుగయు మఱి యేడును దప్ప తక్కిన వన్నియు బ్రవాహవేగమునకు నిలుపోపక నీటబడి నశించినవి. వేగిరపాటునకు సుల్తానుకు దగిన శిక్షయాయెను ; పరాజయమువలన దన కాపాదించిన యపయశమును బోగొట్టుకొను నంతవఱకును మరల మద్యసేవ జేయనని యత పొట్టువెట్టుకొనెను ; ఆ యవమానము బాపుకొని తనకీర్తిని నిష్కళంకము జేసికొనుట కతఁడు యావచ్ఛక్తిని వినియోగింప సాగెను.

ఈ యుద్ధరంగమున మీర్జా జహాంగీరు నిహతుఁడైన కారణమున, ఆదిల్ శాహుకు కలిగిన పరాజయమునకు బ్రతిహతముగ సేయదగిన కార్య మెద్దియో తెలుపవలయునని యసాద్ఖాను నడిగెను. తమకు గలిగిన నష్టమపారమనియు సైన్య ముత్సాహరహితమై యున్నదనియు, దత్కారణ మున విజాపురమున కప్పుడు మరలిపోవుటయె యుక్తమనియు నతఁడు విన్నవించెను. ఆతని సలహా సమంజసమని యంగీకరించి సుల్తాను కృష్ణాతటము నుండి మరలిపోయెను [1]

న్యూనిజు ఫెరిష్తాల వృత్తాంతములు రెండును నొక్క యుద్ధముయొక్క వర్ణనలే. కాని వాని నొండొంటితో బోల్చిచూడగా ముఖ్యాంశ ములు మూటియందు దప్ప వాని కైకాత్మ్యము గానరాదు ; ఈ ముఖ్యాంశములు మూడును ఇవి : (1) ఆదిల్ ఖాను విజయనగర రాయలతో యుద్ధము సల్పుటకొఱకు సైన్యముతో గూడ కృష్ణానదిని దాటివచ్చెను (2) అతడు యుద్ధమునందు పరాజితుడై కృష్ణను మరలదాటి తన దేశమునకు బాఱిపోయెను ; అట్లు వెనుదిరిగి పోవునపు డతని సైనికు లనేకులు కృష్ణా ప్రవాహమున బడి మునిగి చచ్చిరి. మఱియు (3) యుద్ధానంతరము సుల్తాను అసాదుఖానుని సలహాప్రకారము ప్రవర్తించెనని ఇరు వురును వ్రాసియున్నారు. కావున వారు వర్ణించిన యుద్ధ మొక్కటియే యని మనము తీర్మానింప వచ్చును ఈ మూడంశములు విడిచిన తక్కిన యుద్ధవృత్తాంతము నంతటిని న్యూనిజు ఫెరిష్తాలు చెఱియొక విధమున వర్ణించియున్నారు.

యుద్ధము జరిగినది క్రీ. శ. ౧౫౨౨ మే నెలలో నమావాశ్యా శనివారమునాడని న్యూనిజు వక్కా ణించినాడు ;[2] హిజిరీ ౯౨౭ (డిసెంబరు ౧౨ క్రీ. శ ౧౫౨౦ మొదలు డిసెంబరు ౧ క్రీ శ. ౧౫౨౧ వఱకు) అని ఫెరిష్తా చరిత్రయందున్నది [3] వీ రిద్దఱును జెప్పిన కాలము తప్పనియు, న్యూనిజు ప్రమాదవశమున '౧౫౨౦'కి బదులు '౧౫౨౨' అని వ్రాసెననియు, ఫెరిష్తా పొరపాటున నొక యేడధిక ముగ వేసెననియు, వాస్తవముగ యుద్ధము జరిగినది క్రీ. శ. ౧౫౨౦ మే నెల ౧౯ వ తేది యమావాస్య శనివారమునాడని సూయలు నిర్ణయించి యున్నాడు.[4] సూయలుచేసిన కాలనిర్ణయమే సరియైనదని రుజువుసేయగల శాసన సాక్ష్యము కొంతకలదు. మాధవవర్మ వంశజుఁడు క్రీ. శ. 1522 వ సంవత్సరముననో యించుక తరువాతనో బెజవాడ కనక దుర్గాలయమున వ్రాయించిన శాసనములో 'అధి వృషవర్ష మధిశ్రావణ మధి రాచూరు జగదేక నాథస్య వరాలయేస సహ వాటికా' యని యున్నది.[5] ఇందువలన పై సింగరాజు వృషవర్ష శ్రావణమాసము నందనఁగా క్రీ. శ. ౧౫౨౧ జూలై మాసమున రాయచూరు నందు రంగనాథస్వామికి దేవాలయమును గట్టించి దానికొక వాటికను దానము చేసినట్లు తెల్లమగు చున్నది. తత్పూర్వమే రాయచూరు కృష్ణరాయలకు వైవసముగాకయుండిన, నతని సామంతులయం దొక్కని కప్పు డచట దేవాలయమును నిర్మించుటకు

1. *Briggs Ferishta, III pp*. 48-51.
2. *Nuniz, Forgotten Empire, pp*. 326, 337
3. *Briggs Ferishta, III. p*. 48.
4. *Forgotten Empire, pp*. 140-147.
5. *SII. IV*. 789. *ll*. 110-13.

సాధ్యమైయుండదు వృషసంవత్సరమునం దాపళ్ళ హోయుడు వ్రాయించిన శాసనమునగూడ రాయచూరు విజయము తత్పూర్వమే చేకుటినట్లు తెలియవచ్చుచున్నది.[6] కావున న్యూనిజు ఫెరిస్తా లిద్దరును చెప్పిన యుద్ధకాలములు విశ్వాసపాత్రములు గావని స్పష్టమగుచున్నది.

కృష్ణరాయల దండయాత్ర కాలమునందు రాయచూరాదిల్ ఖానుని స్వాధీనమున నుండెననియు దానికి కృష్ణరాయలు ముట్టడివేసిజయించి కైవసము జేసికొనెననియు న్యూనిజు చరిత్రవలన దెలియుచున్నది. దీనికి విరుద్ధముగ ఫెరిస్తా యప్పుడు రాయచూరెముద్గలు దుర్గములు రెండును నప్పుడు రాయలకు జెల్లుచుండెననియు, వాని జయించి స్వాధీనము జేసికొనవలయునని యాదిల్ శాహు దండెత్తిరాగా రాయ లాతని గృష్ణ యొడ్డున యుద్ధమున నోడించి తఱుమగొట్టెననియు ఫెరిస్తా పల్కుచున్నాడు. వీరియం దెవ్వరు చెప్పునది సత్యమో కనుగొనవలసియున్నది.

క్రీ. శ. ౧౫౧౨ లో విజయనగరరాయలు ఆదిల్ఖానుని జయించి రాయచూరును స్వాధీనపఱచుకొనెనని ఫెరిస్తా చెప్పియున్నాడు. సమకాలికుడును కృష్ణదేవరాయల రాయచూరు దండయాత్రయందు రాయల శిబిరమున వసింపుచు యుద్ధమును బ్రత్యక్షముగ జూచిన న్యూనిజు అప్పుడు రాయచూరు ఆదిల్ ఖానునికి జెల్లుచుండెననియు నాతని నోడించి యా దుర్గమును గృష్ణరాయలు సాధించెననియు జెప్పియుండుటచేత క్రీ. శ. ౧౫౧౨-౧౫౨౦ ల మధ్య ప్రాయశః ౧౫౧౬-౧౭ ప్రాంతమున నాదిల్ఖానుడు కృష్ణరాయల కడనుండి రాయచూరును మరల స్వాధీనపఱచుకొని యుండునని పూర్వప్రకరణమునం దొకచోట నూహ చేసియున్నాడను. ఈ యూహ తప్పుకాదని శాసనసాక్ష్యమువలన నిశ్చయమగుచున్నది. సర్-ఇ-షుహూరు ౯౧౬ (= హిజిరి ౯౨౧ = క్రీ. శ. ౧౫౧౫-౧౬) సం॥ న వ్రాయించినవి ఇస్మాయీలు ఆదిల్ఖానునివి రెండు అరబీ శాసనములు హైదరాబాదు మ్యూసియములో నున్నవి. ఇవి మొదట రాయచూరుదుర్గము నందుండినవి; హైదరాబాదు మ్యూసియమును నిర్మించినపుడు గులాం యాజ్దానీగారు వాని నచ్చటికి దెప్పించి భద్రపఱచిరి. బహమనీ సుల్తాను ముహమ్మదు షాహ కుమారుడు మహమూదు షాహ రాజ్యము సేయుచుండగా, ఖాన్-అల్-అక్రమ్ మజ్లిస్-అర్-రఫీ ఆదిల్ ఖాన్ అల్-ఘాజీ కుమారుడు ఆదిల్ఖానుడు ముఖ్య ప్రధానిగనుండ, షైఖ్ బుర్హానద్దీన్-అల్-కిర్మాని పుత్రుడు మల్లిక్-అల్-ముఖట్టమ్ షైఖ్ నిజాముద్దీన్ అహమదు రాయచూరుదుర్గమును బాలించుచుండ, హుసేన్ ఇబ్రాహామ్ షుస్త్రీ తనయుడు అల్-అమీర్ రమజాన్ను నతడు మసీదును కట్టించి నట్లొక దానియందును, నా సంవత్సరమునందె పై పేర్కొనిన బహమనీ సుల్తాను ముహమ్మదు షాహ కుమారుడు మహమూదు షాహయు, ఆదిల్ ఖానుని కుమారుడు ఆదిల్ ఖానును, మల్లిక్-అల్-ముకట్టమ్ నిజాముద్దీన్ అహమద్-అల్-కిర్మానియును మీది శాసనమున జెప్పినరీతిని అధికారము నిర్వహించుచుండ నున్నతమగు బుర్జ్-అల్-ఫతహ (అనగా విజయబురుజు) కట్టబడెనని మఱియొక దానియందును వ్రాసియున్నది.[7] ఈ రెండు శాసనములును క్రీ. శ. ౧౫౧౫-౧౬ వ సంవత్సరమున రాయచూరుదుర్గము ఇస్మాయీలు ఆదిల్ఖానుని యేలుబడిక్రింద నుండెననియు నిజాముద్దీన్ అహమద్-అల్-కిర్మాని యతని పక్షమున దుర్గాధ్యక్షుడై యుండెననియు దెల్లము సేయుచున్నవి. మసీదును, విజయనామాంకితమగు బురుజును ఏకకాలమున నిర్మించుటను జూడ రాయచూరు నా సంవత్సరమందె యాదిల్ఖానుడు సాధించి యుండునని తోచుచున్నది. కావున కృష్ణరాయల దండయాత్రకాలమున రాయచూరు రాయల యధీనమున నుండెనని ఫెరిస్తా చెప్పునది యబద్ధమనియు, న్యూనిజు వచించి నట్లది యాదిల్ఖానుని వశముననె యుండెననుట వాస్తవమనియు దేలుచున్నది.

ఇట్లే యుభయపక్ష బలముల సంఖ్యను గూర్చియు న్యూనిజు ఫెరిస్తాల వృత్తాంతములందు

6. *ARE.* 47 *of* 1906.

7. *Khwaja Muhammad Ahmad. Inscriptions of Raichur in the Hyderabad Museum, pp* 14-16.

భేదము గానవచ్చుచున్నది. న్యూనిజు లెక్కప్రకారము రాయలు ఏడులక్షల ముప్పదివేల పదాతులును, ముప్పది రెండువేల యాఱువందల గుఱ్ఱములును, నైదువందల యేబది గజములును గల మహా సైన్యముతో రాయచూరును సాధించుటకు బయలుదేరినట్లు తెలియుచున్నది. ఇదంతయు గాకపోయిన జాలభాగమేనియు గొబ్బూరు యుద్ధమున బాల్గొని యుండు ననుటకు సందియములేదు. ఈ మహా సైన్యమునెదుర్కొనుట కాదిల్ఖానుఁడు లక్షయిఱువది వేల పదాతులును, పదునెనిమిదివేల గుఱ్ఱములను, నూటయేబది యేనుగులును, రెండువందలకుమించిన ఫిరంగులను వెంటగొని యుద్ధరంగమునకు వచ్చెను. ఫెరిష్టా లెక్కప్రకారము రాయల సైన్యమునం దేబదివేల గుఱ్ఱములును, విస్తారమైన కాల్బలమును, ఫిరంగి తుపాకి బాణసంచు మొదలగు నాగ్నేయాయుధములును నుండినవి; ఈ సైన్యము నెదుర్కొనుట కాదిల్ శాహు యేడువేల గరీబు గుఱ్ఱముతో గదలివచ్చెను; కాని రెండువేలతోడనె కృష్ణానదిని దాటి రాయరాణువతో డీకొనెను.

వీరిరువురిలో నెవ్వరి లెక్క సరియైనదో నిర్ధారించి చెప్పుటకు వలనుపడదు. కాని రాయరాణువసంఖ్యాబలము రాయవాచకమందు వివరింపబడియున్నది. రాయరాణువయందు కైజీతంవారనియు నమరనాయక బలమనియు రెండు వగల దళము లుండెను : కైజీతపు ఫౌజులో లక్ష కాల్బలమును పంద్రెండువేల గుఱ్ఱమును, నైదువందల యేనుగులు నుండినవి ; అమరనాయక బలమునందు రెండులక్షల పదాతులును, నిరువదినాల్గువేల గుఱ్ఱములును, పంద్రెండువందల యేనుగులును నుండినవి. కైజీత దళముగాని యమరనాయక దళముగాని మొత్తముమీద రాయరాణువయందు మూడులక్షల కాల్బలమును, ముప్పది యాఱువేల గుఱ్ఱములును, వేయియేడునూఱు లేనుగులును నుండెను ఇది నగరిలెక్క. దీనితో బోల్చిచూచిన న్యూనిజు లెక్కయందు నాలుగులక్షల కాల్బల మధికముగను, పదునొకండువందల యేబదియేనుగులును, బదునాల్గువందల గుఱ్ఱములును దక్కువగనున్నవి. వాస్తవ సంఖ్యను నిర్ణయించుటకు వీలులేకున్నను రాయలు రాయచూరు దండయాత్రకు కొన్ని లక్షల సైన్యముతో బయలువెడలెనని యనుకొనవచ్చును.



ఆదిల్ఖాను బలము ఫెరిష్టా చెప్పునంతటి స్వల్పమైనదికాదు ఏబదివేల గుఱ్ఱమును విస్తారమైన కాల్బలమునుగొని రాయలు యుద్ధమునకు బయలు వెడలి వచ్చినాడని వినియు నాదిల్ శాహు యేడు వేలతో నాతని నెదుర్కొనవచ్చినాడనియు, నందు చాలభాగమును కృష్ణకవ్వలి యొడ్డుననె నిల్పి రెండువేలతో నదినిదాటి యుద్ధమునకు గడగెననియు జెప్పు ఫెరిష్టా వాక్యములు నమ్మదగినవి కావు. ఈ రెండువేలును యుద్ధమునను కృష్ణాప్రవాహమునను సంపూర్ణముగ నమసిపోయెనని యొప్పుకొనినను, మిగిలిన యైదువేలును యుద్ధమున బాల్గొనక, వచ్చినవారు వచ్చినట్లు చెక్కు చెమర్పక యుండిరికదా. ఇంతబలము యుద్ధమునకు సిద్ధమై యుండ నసాదుఖానుఁడు తమకు గలిగిన నష్టమపారమైనదనియు, దత్కారణమున సైనికులుత్సాహరహితులై యుండిరనియు నప్పటికి వెనుదిరిగి విజాపురమునకు బోవుటయె శ్రేయస్కరమనియు, నహమదునగరపాలకుఁడైన బూర్హాను నిజాముశాహుతో సఖ్యము గావించుకొని యవ్వల రాయలపై గసితీర్చుకొనవచ్చుననియు జెప్పుట వింత. అతని సలహా చక్కనిదని యంగీకరించి యాదిల్ శాహు నిజరాజధానికి దిరిగిపోవుట యంతకంటె వింత.

చక్కఁగ విచారించి చూడఁగ న్యూనిజు ఫెరిష్టాలకు గల భేదములకు ముఖ్యకారణములు రెండు గానవచ్చుచున్నవి. న్యూనిజు కృష్ణరాయల కాలమున వచ్చుచు బోవుచుండిన సమకాల రచయిత ; రాయచూరు దండయాత్రయందు రాయల శిబిరమునుండి యుద్ధకార్యమును గన్నులార జూచిన ప్రత్యక్షద్రష్ట. ఫెరిష్టాతరువాత ఎనుబది తొంబదియేండ్లు గడచినవెనుక విజాపురమునందు చరిత్ర రచన గావించిన యర్వాచీనుఁడు. ఫెరిష్టాకు విజయనగర చరిత్ర తెలియదు; తెలిసికొనవలయునని యతఁడు ప్రయత్నము సల్పినట్లగపడదు; కావున నతఁడు బహమనీసుల్తానుల చరిత్రయు వారి యధికారమునకు వారసులైన దక్కను పంచసామ

శాహుల వృత్తాంతమును వివరించునపుడు విజయనగరవిషయములను బ్రస్తావింపవలసి వచ్చినప్పుడు కుంతీ పుత్రో వినాయకః యను న్యాయమువననుసరించి తన ప్రతిభకొలది గాథలననేకములను గల్పించినాడు.[1]

విజయనగర చరిత్రాధ్యాపకుల కిదియంతయు నాకాశపురాణమని వివరించి చెప్పవలసిన యావశ్యకత లేదు

అజ్ఞానముతోపాటు జాతిమతాభిమానము లతని దప్పనదారుల కీడ్చినవి. మహమ్మదీయుల పగవు ప్రతిష్ఠలను గాపాడవలయుననియు, దనకాశ్రయమొసగిన యాదిల్‌శాహు పూర్వీకుల కీర్తి ప్రతాపములు నిష్కళంకమైనవని నిరూపింపవలయునని నాతనికడక. కావున మహమ్మదీయులకును నందు ముఖ్యముగ నాదిల్‌శాహు రాజులకును దుర్యశమును దెచ్చు చరిత్రాంశములను సాధ్యమైనంతవఱకును సంపూర్ణముగ గప్పి పుచ్చుటయో, విధిలేక చెప్పవలసివచ్చినప్పుడు మసిబూసి మారేడు కాయ యనిపించుటయో యతనికి గర్తవ్యమాయెను. ఈ కారణములచే నతడెన్నియో యబద్ధములను గల్పించెను. రాయలచే సంపూర్ణ పరాజయమునుబొంది రాయచూరువంటి ప్రధానదుర్గమును గోల్పోవుట ఇస్మాయీలాదిల్ఖానుని యశక్తతను వెల్లడిపఱచునని యెంచి కల్పనాకథను గట్టెను. రాయచూరు రాయల యాధీనమందే యుండెననియు దానిని జయించుటకొఱకు ఇస్మాయీలాదిల్‌శాహు దండయాత్ర సన్నాహముల జేయుచుండగా నా సంగతి దెలిసి రాయలు ప్రచండ సైన్యముతో దానిని సంరక్షించుటకు వచ్చెననియు ప్రారంభించినాడు; తన కాతనిసైన్యోన్నతబలము చాలదని యెఱిగియు వెలిగుడారము వేసినపిమ్మట వెనుదీయుట పగవునకు లోటని యల్పబలముతోడను యాదిల్‌శాహు యుద్ధమునకు బయలుదేరెనని రచింపబూనిన కథకు పీఠిక వ్రాసినాడు; మధుపాన గోష్ఠిని సృజించినాడు; ఆదిల్‌శాహు వెంటనున్న యల్పబలమును అల్పతరముగ జేసినాడు. ఏమనగా నాదిల్ఖానుడు పరువుమీఱ దృష్టినిల్పి శత్రుబలమును సరకుసేయక తొందరపడి యల్ప సైన్యముతో యుద్ధమునకు వెడలి మధుపానమత్తుడై యొడలెఱుగక కూడవచ్చిన చిన్నదండునకుగూడ సంపూర్ణముగ నదినిదాటుట కవకాశమీయక శత్రువునుదాకుటవలన నోడిపోయెనేకాని లేనియెడల నతడు పరాజయమును బొందియుండడని బోధించుటకొఱకింత కల్పన గావలసి వచ్చినది. గావున ఫెరిస్తా వృత్తాంతము విశ్వాసపాత్రము గాదు. యుద్ధమును కన్నులారగాంచి వర్ణించిన న్యూనిజు కథ సత్యాత్మకమైననగుటచే ఫెరిస్తావ్రాతకంటె సర్వోత్కృష్టమైనది. ఈ యంశమును స్మరణయందుంచుకొని చరిత్రకారులు పరిశోధనసేయుట యుక్తము.

1. ఒక యుదాహరణముఁజాలును అతని యజ్ఞానమును గల్పనానైపుణ్యమును వెల్లడిసేయుటకు. క్రీ.శ. ౧౫-వ శతాబ్దోత్తరార్ధమున శివరాయలనునతడు విజయనగరమును బాలించుచుండెను, అంతకు పూర్వమతని పెద్దలచట నేడువందల సంవత్సరముల నుండియు రాజ్యము సేయుచుండిరి. అతని కిద్దఱు పుత్రులుండిరి; అందు పెద్దవాడు తండ్రివెనుక సింహాసనము నధిష్ఠించెను; కాని యతని మంత్రియగు తిమ్మరాజు విషప్రయోగముచే జంపి — మఱియొకచోట నతడు యుద్ధమున గాయపడి చచ్చెనని చెప్పినాడు — అతనితమ్ముని దనచేతి జంత్రపు బొమ్మవలె నాడించుచు, గొంతకాలమైన పిమ్మట సింహాసనము నాక్రమించుకొనెను. మఱియొకచోట కథను ఇంకొక విధముగ మార్చినాడు. శివరాయల మరణానంతర మర్హుకుడైన యతని పెద్దకుమారుడు సింహాసనము నెక్కెను; కాని యల్పకాలముననే యాతడును మరణించెను; అతనితరువాత నతని తమ్ముడు రాజ్యాధిపత్యమును వహించెను; అతడును మృతినందెను. తరువాత రాజ్యమునకు వారసైన మూడుమాసముల పసిపాపను సింహాసనము నెక్కించి ముఖ్యమంత్రి తిమ్మరాజాతనిపేర రాజ్యముసేయ గడగెను. ఆ బాలుడు స్వయముగ రాజకార్యములు నిర్వహించుటకు దగిన యీడురాగనే తిమ్మరాజతనికి విషము పెట్టి చంపి, యాతని వంశమునకు జెందిన మఱియొక పసికూనను గద్దెపై గూర్చుండబెట్టెను. ఇట్లు నలువదియేండ్లధికారమును జెల్లించి క్రీ. శ. ౧౫౩౦ ప్రాంతమున నతడు కాలగతినందెను. తిమ్మరాజు కుమారుడగు రామరాజు. ఇతడు శివరాయల కుమార్తెను బెండ్లి చేసికొనెను. తండ్రి యనంతర మతడు రాయలకును రాజ్యమునకు సంరక్షకుడై ప్రజాపాలనము సేయ గడగెను. *Briggs Ferishta III pp.* 10-13, 80-81.

## ౧౦. రాయచూరు పతనము

గొబ్బూరు రణరంగమునుండి మరలి రాయచూరు దుర్గపు ముట్టడిని కొనసాగించి దాని స్వైవసము గావించుకొను నుద్దేశముతో కృష్ణరాయలా దుర్గము వైపు కూచిచేసిపోయెను. మార్గమధ్యమున క్రిస్తవన్ డి ఫిగ్వై రెడో యను పోర్చుగీసు గుజ్జపు వర్తకుఁడు ఇరువదిమంది తుపాకీబంట్లతోకూడ విజయనగరమునుండివచ్చి రాయలను గలసికొనెను. ఇతఁడు వాగ్మి; శూరుఁడు గుణగ్రహణపారీణుఁ డగు రాయల కాతనియెడ నాదరాభిమానములు గల్గినవి; కావున నాదిల్ఖానుని స్కంధావారమున జూఱగొని తెచ్చిన గుడారములయం దొకదాని నిజ శిబిరముచెంత నెలకొల్పి యం దాతనికి విడిది యేర్పాటు చేయవలసినదని యాజ్ఞాపించెను. రాయచూరు చేరగనే, తొల్లి గొబ్బూరుయుద్ధమునకు వెడలుటకు ముందు విడిసియుండిన శిబిరమునసె కుదురుకొనెను. సామంత దండనాయకాది సమస్త పరిచారమును వారి వారి నిర్ణీతస్థానముల నెల కొనిరి.

రాయలశిబిర మొక మహాపట్టణమువంటిది. కృష్ణరాయలవారి గుడారము రాజధానియందలి రాజనగరిని బోలి విరాజిల్లుచుండెను; సంరక్షణార్థ మొక కంపకోటచేనది పరివృతమైయుండినది. రాక పోకలకొక్కటే ద్వారము. ఈ యావరణములోపల కృష్ణరాయలును యతని కూడిగము సేయు పరిచారకులుమాత్రము నివసించువారు; రాయల వారిని జలకమాడించు బ్రాహ్మణుఁడొక్కఁడు; రాయ లెల్లప్పుడును వెంట గొనిపోవు దేవతార్చన సామగ్రియంతయు నితని యధీనమునసె యుండెడిది. ఇతఁడుగాక యడపము, కత్తి, గిండి, కాళాంజి మున్నగు రాజచిహ్నములను ధరించెడి యూడిగ ములవారును; రాయలసముఖమున నెల్లప్పుడును గాచియుండెడి యన్నగఱును నివసించువారు. కంప కోటచుట్టును అంగరక్షకుల బలగము నిర్ణీతస్థానము లందు గాపుండెను; వీరితోగూడ నగరి యుద్యోగస్తులును విడిసియుండిరి. వారి పురోభాగమున దళనాయకులెల్లను ఎవ్వరెవ్వరి కేర్పఱచియుండిన పాళెములందు వారుడిగిరి. వీరందఱికి వెలుపట వేగులవారి నెలవిడు; రాత్రియంతయు స్కంధావారమునం దెల్లయెడల గస్తుతిరిగి ప్రతి పక్షుల వేగరులు గానవచ్చిన పట్టి బంధించుట వారి కర్తవ్యము. వారి కవ్వలి ప్రక్క దండు చాకళ్ళ పాళెము; ఇది వారుద్యోగముసేయుటకు వలసిన జలసమృద్ధిగల తావునసె ఏర్పఱుచబడియుండెను.

స్కంధావారమునం దెల్లయెడలను పురము లందువలె వీధులు చక్కఁగ దీర్చియుండినవి. ఒక్కొక్క దళనాయకునిపాళెమందును అంగడివీధి యొక్కటికలదు. గొఱ్ఱె, మేక, పంది, కుందేలు మున్నగు సకలవిధ జంతు మాంసములును, కోడి, కౌజు మున్నగు పక్షులపొలయును యథేష్టముగ లభించెడివి. ఇవిగాక యాహారమున కుపయుక్తము లగు బియ్యము, జొన్న, రాగి మున్నగు సకల ధాన్యములను అన్యాహారపదార్థములను విక్ర యించు బాజారులును గలవు. మఱియు, నానావిధ వస్త్రములను సకలవిధ భోగ ద్రవ్యములను విక్ర యించు నంగడివీధియొక్కటి గలదు. ఇందు దొర కనివస్తువులేదు. పలువగల కర్మకారుల వీధులు గలవు. ఇందు స్వర్ణమయభూషణాదులును, వజ్ర వైడూర్య పద్మరాగ మౌక్తికాది నవరత్నములును లభించును. ఇవికాక పచ్చిక, గడ్డి మున్నగునవి వెల్లికొల్లలు. ముప్పదిరెండువేల నాలుగువందల గుఱ్ఱములకును, నైదునూఱుల యేబదియొక్క యేనుగులకును, లెక్కకుమిక్కుటమైన ఖరాశ్వతర వృషభాది భారవాహ జంతువర్గమునకు వలసిన యాహారపదార్థము లెటనుండి వచ్చుచుండెనో చెప్పుటకు సాధ్యముగాదు.

సైన్యమంతయు యథాపూర్వము స్కంధా వారమున గుదురుకొనినపిమ్మట ముట్టడి మరల ప్రారంభమాయెను. న్యూనిజు ముట్టడి నడచిన విధము నిట్లు వర్ణించియున్నాడు: 'ఒకనాడు క్రిస్తవన్ డిఫిగ్వై రెడో తనకు పట్టణములోనికిబోయి చూడవలయునని కోర్కెకలిగెనని రాయలతో విన్నవించెను; కాని యందువలన నతనికాపద వాటిలుననిశంకించి, కృష్ణరాయలు వలదని

నివారించిరి. అందుమీదట యుద్ధకర్మయే పోర్చుగీసుల వృత్తియనియు, దస్నాపట్టణమును ప్రవేశించి తురకలతెరగు నారయనిచ్చుటయు యేలినవారు తనకు ప్రసాదించు ఘనసత్కారమనియు మనవి జేసెను. అంతట రాయలవారాతని కనుజ్ఞనొసంగి యతనికి దోడు కొంత పరివారము నంపెను.

క్రిస్తవ్ డి ఫిగైరెడో తాఱితాఱి కోటగోడల చెంత ద్రవ్వియుండు గాడిని సమీపించెను. తురకలు గడు నిర్భయముగ కోటగోడలపై దిరుగాడుటను గాంచి, తనతోగూడ దోడ్కొని వచ్చియుండిన తుపాకిబంట్లను వారిపై దుపాకులను బేల్వనాజ్ఞాపించి, పెక్కండ్రను హతము గావించెను; తత్పూర్వము దురకలు తుపాకి మొదలగు నాగ్నేయాయుధముల ప్రయోగమువలన జచ్చి యెఱుగరు గావున జాగరూకులైయుండక విచ్చలవిడిగ దిరుగుటవలన నసువుల గోల్పోయిరి; తత్కారణమున కోటగోడల సంరక్షించుటకు నిలువజాలక హతశేషులుపాఱిపోయిరి; అంతటరాయదళమునిర్బాధికముగ కోటగోడలను జేరవలసినటను గుర్తించి సమీపించి, వాని నిడియగొట్టుట కారంభించెను; దళమచటి కన్నియెడల నుండియు మూఁగుటవలన రాయస్కంధావారమున గొప్ప సంభ్రమము గల్గినది. క్రిస్తవ్ డి ఫిగైరెడో నిజభటులతోగూడ దుర్గమును జొచ్చెనను వార్తను గొంచు రాయలవారి కెఱుకపఱచిరి.

కోటవెలుపల నేమి నడచుచుండెనో, పోర్చుగీసుల కెట్లు రాయరాణువయందు ప్రవేశము గల్గెనో కోటలోనివారికి తెలియదు; కాని గొబ్బూరు యుద్ధసమయమున వారు వచ్చి రాయరాణువను గూడిన సంగతి స్మరణకు రాగనే తమకిక చేటు మూడినదని నిశ్చయించిరి. ఏలన సంతదనుక వారు బండలను పై రువ్వియు, బాణబంధుకాద్యాయుధముల ప్రయోగించియు ముట్టడికారులను కోటగోడల చెంగటకె జేరనీక తఱుమగొట్టుచువచ్చిరి. పోర్చుగీసుల యాగమనముతో ముట్టడి పరిస్థితులు మారినవి. క్రిస్తవ్ డి ఫిగైరెడో తనభటులను బురికొల్పి కోటగోడలపై బొడచూపినవారినెల్ల బరిమార్పగడగుటవలన, బయలు మెఱసి వారి కెవ్వరును బోటు చూపఁజాలక పోయిరి. ఇక పోర్చుగీసుల నండ జేసికొని కోటగోడలను ధ్వంసము సేయ రాయదళముల కవకాశము గల్గెను. సంరక్షణార్థమై కోటగోడలపై మోర్చాచేయబడి యుండిన ఫిరంగులున్నతస్థానములందు నెలకొల్పబడి యుండుటవలన వానియగాదులచేత క్రిందగోడల చెంతనుండు శత్రుల కెట్టి యపాయము గల్గుటకును వలనుపడదాయె. కోటగోడల యంతర్భాగమునందు మట్టి నింపి గట్టన జేసియుండుటచే వానియందు గండ్లు పొడచుట కష్టకార్యము గాదు. మఱియు గండ్లను గాపాడదగిన ఆగ్నేయాయుధము లభావమగుటవలన వానిగుండ శత్రులపురమును జొరనీక యడ్డపెట్టుటకు సాధ్యపడకపోయెను.

క్రిస్తవ్ డి ఫిగైరెడో సంగతిని యుద్ధమునకు నడచుటకు రాయ దండనాథు లుత్సుకులైరి; వారిని తృప్తి పెట్టుటకై ముఖ్యులను కొందఱి నరండొక్కొకనాడు వెంటబెట్టుకొని యుద్ధమునకు బోవువాఁడు. ఒకనాడతఁడు తన బంటులను మూడుపాయలుగ విభజించి కోటగోడపై గానవచ్చిన తురకలనెల్ల గాల్పించి చంప నారంభించెను; తత్కారణమున కోటలోని వారెవ్వరును బయట దలచూప వెరచిరి. అంతట పై మూడు పాయలందలి రాయల సైనికులు పారలు, గడ్డపారలు మున్నగునుపకరణములనుధరించి, గోడలనిడియగొట్ట మొదలిడిరి; తక్కిన సైనికులుగూడ నెవ్వరి కనుకూలపడినట్లు వారు కవియవలసినదని యతఁడు వార్త యంపెను; తత్కారణమువలన దుర్గసంరక్షకులు వెలుపలిప్రాకారమును గాపాడ శక్యముగాకపోవుటచే దానిని త్యజింప మొదలిడిరి; స్త్రీలు దమ బిడ్డలతోగూడ లోపలి కోటలోనికిబోయి డాగిరి. పురజనుల యలజడినిగాంచి దుర్గాధ్యక్షుఁడు ధైర్యము చెప్పి వారిని మరల్ప ప్రయత్నము సేయుటయేకాక, కొందఱిని వెంటనిడుకొని ఫిరంగులు రాయదళమునకు బాసటయైనిల్చి యుద్ధము సేయుచుండు స్థలమునకుబోయి, వారెచటినుండి నిజపడమువారిని బోరికొనుచున్నారో స్వయముగ బరిశీలించి చూడనెంచి కోటగోడ పైకెక్కెను

తుపాకి గుండొకటి యశనివలె వచ్చి నెన్నుదుట దాకుటచే విగతప్రాణుండై యతఁడు నేలగూలెను; అతని మరణము రాయచూరు ప్రజలను శోక సముద్రమున ముంచినది. వారియాలగోడు బాల గోడు రాయస్కంధావారమునకు వినవచ్చినది ; కోటగోడను సంరక్షించుట కొక్కడైన నిలువక దుర్గరక్షకులు పాఱిపోయిరి. రాయ సైనికులు వాని నెట్లు ధ్వంసముజేసినను నడ్డపడువారు గానరారైరి కాని వారు కోటను జొరలేదు; కోటలోనివారేమి సేయుదురో చూతమని నాటికి యుద్ధము జాలించి వెనుదిరిగి విడిదలకేగిరి.

మరునటి యుదయమున గోటనుండి తెల్ల జండాలతో గొందఱు సంధికి వచ్చుచున్నారని కృష్ణరాయలకు దెలియవచ్చినది. రాయలంతట సాళువ తిమ్మయనువారికెదురేగి సముఖమునకు తోడ్కొని రా నాజ్ఞాపించెను. సాళువ తిమ్మయను జూడగనే రాయలవారు తమ్మాదరించుననను నాశ వారి హృదయసీమల సంకురించినది. ఈ యాశ వ్యర్థమైపోలేదు. రాయలవారి సముఖమునకువచ్చి శోకావేశపరవశులై యాతని పాదములకడ ద్రెళ్లగనే వారి కాతఁ డభయ మిచ్చెను. 'లెండు, భయమువలదు ; మీ యాస్తిపాస్తులను ప్రాణములను సంరక్షించెదము ; పట్టణమునకు మరలిపొండు ; రేపు పురప్రవేశము గావింతుము,' అని వారి నూరడించి యంపి, దళనాయకులలో నొక్కని బట్టణమును స్వాధీనపఱచుకొనవలయునని యాజ్ఞాపించి యటుపిమ్మట నిజ శిబిరమునకు జనెను. తరువాత దినమంతయు విజయోత్సవ కార్యములందు గడచెను

మరునాడు ప్రభాతమున కాలకృత్యములు దీరినపిమ్మట కృష్ణదేవరాయలు పట్టణమును బ్రవేశించెను ; మొదట దారి దీయుచు నంగరక్షకబలము గదలినది ; వారివెనుక కృష్ణరాయలు సామంత సైన్యాధిపతులతో గూడ నశ్వారూఢుండై చనెను. రాయలవారి రాకను నిరీక్షించుచు బురజనులు వీథులందు బారులుదీరి నిలచియుండిరి ; వారిని దిలకించుచు ముందుకుసాగి కృష్ణరాయలు లోపలి కోటసమీపమును జేరి పౌర ప్రముఖులను బిలువ నంపి, 'మీ సర్వస్వమును మీకే విడిచితిమి ; మీ యిష్టానుసారము వర్తించుచు దానిని వినియోగించుకొనవచ్చును ; ఇచ్చట నిలువనిచ్చగలవారెప్పటివలె నిచటనే యుండవచ్చును ; అట్లుగాక మఱియెచటికేనియు బోదలచువారు తమ సర్వమునుగొని వెంటనే వెడలిపోవచ్చును' అని యానతిచ్చెను. రాయలింతటి చల్లచూపు జూపినందుకు వారెల్లరు భగవంతునికి దమ కృతజ్ఞతా సూచకములగు వందనములను సమర్పించిరి.

కృష్ణరాయ లిట్లు పురప్రముఖుల కభయ ప్రదానము జేయుచుండు సమయముననె పురజనులు కొందఱచటికివచ్చి రాయలవారి సేన పట్టణమును జూఱగొనుచున్నదని మొఱపెట్టిరి. కొల్లను వెంటనే నిలుపవలసినదని రాయ లాజ్ఞాపించెను. ఎవ్వరి యొద్ద కొనిన చూఱద్రవ్యమును వారికి మరల నిప్పించెను ; ఆస్తిపాస్తు లెటుపోయిననేమి ప్రాణము దక్కిన చాలునని పాఱిపోయినవారి సర్వస్వమును కొల్లపోయినది. వీరి విషయమునుగూడ తరువాత రాయలవారికి దెలియరాగా జూఱకాండ్రను బిలువనంపి కఠినముగ శిక్షించెను. కృష్ణరాయ లిట్లాదరించుచుండినను పౌరు లనేకులచట నుండనొల్లక అన్యప్రదేశములకు లేచిపోయిరి. దారి బత్తెములేక పోజాలనివారికి రాయభండారమునుండి వలసిన ద్రవ్య మిప్పించి పంపెను. కోట కైవసమైనపిమ్మట రాయలు కొంతకాలము రాయచూరు నందుండవలసి వచ్చెను. విధ్వస్తమైన కోటగోడలను బాగుచేసి వాని సంరక్షణార్థమువలసిన బలములను తాణ్యముంచెను ; రాష్ట్ర పరిపాలనకు దగిన యేర్పాటులనొనర్చి యవ్వల విజయనగరమునకు దరలిపోయెను[1].

న్యూనిజు వర్ణించిన రాయచూరు పతనకథను బట్టిచూడగా గ్రిసవన్ డిఫిగైరెడో యొక్కడే కృష్ణరాయలవిజయమునకు గారణభూతుఁడైనట్లు తోఁచగలదు ; కాని యది సత్యము గాదు. పోర్చుగీసుల యవక్రపరాక్రమమును బ్రకటించుట కొఱకు వారికి లేనిపోని ప్రాధాన్యతను గల్గించు

1. *Nuniz, Forgotten Empire pp.* 343-49.

కట్లు న్యూనిజు వ్రాసెనని తోచుచున్నది. ఇది కేవల మూహామాత్రమైన యభిప్రాయముగాదు. క్రిస్తవణ్ డి ఫిగైరెడో ప్రథమదివసయుద్ధమును వర్ణించుసందర్భమున దురక లంతకు పూర్వము తుపాకి మొదలగు నాగ్నేయాయుధ ప్రయోగము వలన జచ్చియెఱుగరు ; కావున రాయచూరుకోట గోడలపై నిర్భయముగ దిరుగాడుచుండిరనియు గ్రిస్తవణ్ దన తుపాకిబంట్లచే గోడలపై బోడ చూపిన వారినెల్ల గాల్పించి చంపుటచే వా రటు పిమ్మట దల చూపుటకు వెఱచిరనియు దత్కారణమున రాయల సైనికులకు కోటగోడలనుదాకి ధ్వంసము సేయుటకు సాధ్యపడెననియు న్యూనిజు వక్కాణించియున్నాడు. ఇది సత్యమని నమ్ముటకు వీలులేదు. బుక్కరాయల కాలమునుండియు విజయనగర సైన్యమునందు ఫిరంగి తుపాకి మున్నగు నాగ్నేయ సాధనములు వాడుకయందుండెనని మహమ్మదీయ చరిత్రలవలన దెలియవచ్చుచున్నది.[2] మఱియు రాయచూరుపై నడచిన కృష్ణరాయల సైన్యములో రాయల యంగరక్ష బలమున కధిపతియైన కామానాయకుని యాధిపత్యముక్రింద ముప్పదివేల కాల్బల ముండెననియు వారిలో విలుకాండ్రు, ఖేటకధరులు, తుపాకిబంట్లు, గడలవారును గలరని న్యూనిజే చెప్పియున్నాడు.[3] న్యూనిజునకు సమకాలికుఁడును నతనివలెనె కృష్ణరాయలకాలమున విజయనగరమునకు వచ్చి యప్పటి విజయనగర సైన్యస్థితిని పరికించినవాడును నగు పయసు, విజయదశమినాడు రాజధానియందు గూడిన రాయదళములలో బందుకులు బండ్లవరుసలు మున్నగు నాగ్నేయాయుధధారులను బేర్కొని యున్నాడు.[4] రాయచూరు ముట్టడికి నడచిన తుపాకిబంట్లు దుర్గసంరక్షకులపై దమ యాయుధముల బేల్చకపోయిరని యెంచుట సమంజసము గాదు ; కావున కోటగోడలపై దుర్గసంరక్షకులు నిర్భయముగ నడయాడుటయు, క్రిస్తవణ్ డి ఫిగైరెడో బంట్ల యగ్న్యాయుధ ప్రయోగములకు జడిసి గోడలపై దలచూప వెఱచి డాగిరనుటయు విశ్వాసపాత్రములు గావు. క్రిస్తవణ్ బంట్లు విజయనగరబందుకుధరులకంటె నెక్కుడు కౌశల్యముతో దమ యాయుధముల బ్రయోగించి యుండవచ్చును. తన్మూలముననె కృష్ణరాయలు రాయచూరును సాధింపగల్గెననుట యతిశయోక్తి.

2. *Briggs, Ferishta II p.* 312.
3. *Nuniz, Forgotten Empire, p.* 326.
4. *Ibid. p.* 277.

## సంధి రాయభారములు

ఆదిల్‌ఖానుపై కృష్ణరాయలు పొందిన విజయములవలన నప్పటి భారతీయ మహమ్మదీయ ప్రపంచమున గలవరము పుట్టినది బహమనీ రాజ్యము నధఃకరించి పైకి వచ్చిన తురకసంస్థానాధిపతుల హృదయములందు ముదమును భీతియు బెనగొనెను. తమయందరి యందును బలవత్తముండును, దత్కారణమున దమ స్వాతంత్ర్యమునకు వేరువిత్తుననగు నాదిల్ఖానునకు గల్గిన ఘనపరాభవమువలన వారిహృదయముల సంతోషమంకురించినది. కాని యట్లు ఆదిల్ఖానుని పరిభవించినవాడు హిందూ రాయసురత్రాణుడైన కారణమున నాదిల్ఖానున కాతనిచే జరిగిన మర్యాదయే తమకును గలుగవచ్చుననుభయముకూడ జనించినది:—కావున నిజాముల్ ముల్క్, మదార్ మల్లిక్, దస్తూర్ దీనారు, బరీదు మున్నగు బహమనీసామంతులు దమతమ రాయబారుల మూలమున రాయలపేర లేఖల నంపిరి. రాయచూరునకువచ్చి చేరినంతటనె యంతటి ప్రబలదుర్గము రాయలకు నైవసమగుట యవనదూతల కచ్చెరువు గల్గించినది; రాయల యసంఖ్యాతబలమును పరాక్రమాతిశయమును గాంచినంతనె వారి విస్మయ ముత్కటమైనది. రాయలవారిని దర్శనముజేసికొని తమ ధణీలంపిన యుత్తరములను సమర్పించిరి. వెంటనె వాని నాతఁడు జదువుకొనెను. అందలి వృత్తాంత మిట్లుండెను:—రాయలవా రప్పటివఱ కాదిల్ఖానుపై బొందిన విజయములతో దృప్తినందుట మేలు ; అటుమీగట నింకను యుద్ధము సేయుట యుక్తము గాదు. మనసు పెద్దజేసి యాదిల్ఖాను నోడించికొనిన సర్వమును నాతనికి మరల నిచ్చివేయుట సరి ; అట్లొనర్చిన దా మెల్లవేళల నాతనియాజ్ఞలనౌదల దాల్చియుందుమనియు నట్లుసేయుట కియకొనని పక్షమున దామెల్ల రేకమై యాదిల్ఖానుగూడి రాయలవారితో యుద్ధమొనర్చినయతడు నష్టమందిన

వానినెల్ల నతనికి మరల దీసి యీ వలసివచ్చె ననియు దెల్లము జేసిరి. కృష్ణరాయలు వారంపిన యుత్తరములను జదువుకొని వారందఱకు నొక్క జాబుమూలమున నిట్లు జవాబు వ్రాయించెను. 'నిజామనములుఁ, మదారుములుక దస్తూరు బరీదు మున్నగు మాననీయదక్కను ప్రభువులారా, మీరంపిన యుత్తరముల దిలకించితిమి మీరంపిన సందేశమునకు మిక్కిలియు గృతజ్ఞుఁడను ఆదిల్ఖా నునియెడ మేము నడపిన కార్యక్రమమును, నాచి కొనిన వస్త్వాదికమును, అతని ప్రవర్తనకు దగినట్లె యున్నవి; వానిని మరల నాతనికిచ్చివేయుట సమంజసముగ గన్పట్టదు; అట్లిచ్చివేయు నుద్దేశమును మాకు లేదు మీరు చెప్పినట్లు చేయనిపక్షమున నతనితో గలసి మాపై నెత్తివత్తు మంటిరికదా. అయ్యలారా! మీరంతటి శ్రమ పడవలసిన యవ సరము లేదే. మీరు స్థయిర్యముతో మీ రాష్ట్రము లందు నిలచి యుండనోవుదురేని, మేమే మిమ్ము వెదకుకొని రానున్నారము. ఇదియే మేము మీకంపు ప్రత్యుత్తరము' ఈ కమ్మకాగితమును రాయ బారులకిచ్చి వారి నుచితరీతిని సత్కరించి పంచెను.[5]

దక్కను మహమ్మదీయ ప్రభువులు కృష్ణరా యల సముఖమునకు రాయబారులను తమంతట తామె పంపిరో లేక యాదిల్ఖానుని ప్రేరణపై నంపిరో తెలియదు; కాని యా రాయబారము నిష్ఫలమై పోయిన పిమ్మట విజాపురమునుండి దూత యొకడు విజయనగరమునకువచ్చి కృష్ణరాయల దర్శనముజేసికొని యిట్లు విన్నవించెను. 'దేవా! నన్నాదిల్ఖానుఁడు తమ కడ కంపినాడు తనకు న్యాయము గల్గింపుడని నా ముఖాంతరముగ మిమ్మిట్లు ప్రార్థించుచున్నాడు ఇట్లు విన్నపము సేయవలసినదని నన్నాజ్ఞాపించినాడు. పుడమిలోని రాజులలోనెల్ల బలాధికులును న్యాయమూర్తులును సత్యపరాయణులునునగు దమయెడ తనకు సౌహా ర్దము గలదనియు; దాను నిష్కారణముగ జిర కాలమునుండియు మీపూర్వులు చెక్కుచెదరక కాపాడి తప్పక నాయెడ నెఱపుచువచ్చిన మైత్రికిని, యుభయ రాజ్యములమధ్య జెల్లుచుండిన శాంతికిని భంగముగావించితిరనియు; దామేల నిజరాజ్యమును వదలి దనపై నెత్తివచ్చినదియు దన కెఱుకపడ లేదనియు; నట్లుశంకలేకున్నతరి, తాము వచ్చి రాయచూరు దుర్గమును ముట్టడించి తత్పరిసర ప్రాంతదేశమును కొల్లగొట్టి నాశనమొనర్చితిరన్న వార్తను విని నిజరాష్ట్రమును గాపాడుకొనుట కొఱకు దా రావలసి వచ్చెననియు; నట్లు వచ్చిన పిమ్మట దన యాశ్రితులనెల్ల యుద్ధమున వధించి స్కంధావారమును జూఱగొని నందులకు దామె ప్రత్యక్షసాక్షులనియు; దనకు గలిగిన నష్టమునకు బరిహారముగ దనస్కంధావారమును జూఱపట్టి కైకొన్న యాగ్నేయాయుధ సముదాయమును గుడారులను హస్త్యశ్వాదిసమస్తమును రాయచూరు దుర్గముతోగూడ మరల నిచ్చివేయవలసినదనియు; కోరినట్లు తన యాస్తి పాస్తులను వస్తువాహనాది సమస్త పదార్థముల నిచ్చివేసిన నిరంతరము సఖ్యము పాటింతుననియు; లేనిచో తమ దృష్టి యందు తమ చర్యయెంత న్యాయముగ గన్పట్టినను నది యక్రమముగాక తప్పదనియ విన్నవించెను. అంతట నానాటి సంధి సంప్రతింపు ముగిసినది. పట్టు దుస్తులు మున్నగు నుడుగరలచే రాయబారిని సత్కరించి యతని రాయబారమునకు బ్రత్యుత్త రము మరుదినము జెప్పెదనని యతని విడిది కనిచి కృష్ణరాయలు సభ చాలించెను.

మరుసటిదిన ముదయమున గృష్ణరాయలా రాయబారిని సముఖమునకు రప్పించి, 'యాది ల్ఖానుఁడుమాకు పాదాక్రాంతుడైనచో[5a] నాతఁడు

---

5. *Nuniz, Forgotten Empire. pp* 348-49.

5 *a*. *'Provided Ydallacao (Adilkhan) would come and kiss his foot'* అని న్యూనిజు. దీనిక నూయలు విపరీతార్థ మూహించి కృష్ణరాయలు గర్వో న్మత్తుడై యట్లుకోరెననియు దత్కారణమున మహమ్మ దీయులెల్ల తుదకేకమై రక్షసితంగడి యుద్ధమున విజయ నగర సైన్యమునోడించి యా పట్టణమును ధ్వంసము గావించిరనియువ్రాసియున్నాడు. *'Kiss his foot'* అను మాటలు 'పాబూస్' అను పార్సీమాటలకు భాషాంతరీ కరణము. ఈ మాటలకు 'పాదము ముద్దిడుకొను' అని యథాతథమగు నర్థమైననున్రమత జూపుట యనునర్థము రూఢియై వాడుకలోనికి వచ్చెను.

కోరినమేర కాతనియొద్ద కైకొన్న సమస్తమును మరల నాతని కిచ్చివేయుదుననియును, సలాబత్కానునిగూడ బంధవిముక్తుని గావించి విడిచెద'మనియు దెలియపఱచెను. ఆ దూత యంతట దన విడిదికి బోయి తన యజమానుని కావృత్తాంతమును వ్రాసి యంపెను; ఉత్తరమందగనె అదిల్ఖానుఁడు దానికి ప్రత్యుత్తరము వ్రాసి యంపెను; దానిగైకొని రాయబారి మరల కృష్ణరాయలను దర్శించి, 'రాయలవారు కోరిన ప్రకారము వారికి తాను పాదాక్రాంతుఁడగుట తన యజమానున కెట్టి యాక్షేపములేదనియు బ్రత్యక్షముగ విజయనగరమునకు వచ్చుటకు అతఁడు జంకుచున్నాడనియు విన్నవించెను. కృష్ణరాయ లంతట దాముభయరాజ్యముల సరిహద్దునకు విచ్చేయుదుమనియు నచటి కాదిలుఖాను నిర్భయముగవచ్చి దమకు పాదాక్రాంతుఁడు గావచ్చుననియు నానతిచ్చిరి రాయబారి యందుల కంగీకరించి విజాపురమునకు బయలు వెడలిపోయెను.

## కృష్ణరాయల విజాపురయాత్ర

అదిల్ఖానునిచే మ్రొక్కుగొనునుద్దేశముతో గృష్ణరాయలు విజయనగరమునుండి బయలువెడలి విజాపుర గడిసీమ సమీపమునందుండు ముదుగలు దుర్గమునకు బోయి యతని యాగమనమును నిరీక్షించుచు గొంతకాల మచట విడిసి యుండెను. ఎన్నిదినము లెదురుచూచినను అతడు రాడాయెను; అతనిచే మ్రొక్కుగొనవలయునను కుతూహలముత్కటముకాగా గృష్ణరాయ లచటినుండి బయలు వెడలి దక్కను రాజ్యమును బ్రవేశించెను. రాయల సముఖమునకు వచ్చుట కాదిల్ఖానునకు ధైర్యము చాలక పోయెను; 'ఇదె మారాజు వచ్చుచున్నాడు; అదె మారాజు వచ్చుచున్నా'డని యతని యనుచరులు బల్కుచు వచ్చినను నతని యడపొడగాన రాదాయె. తుదకు కృష్ణరాయలు విజాపురము జేరి యాదిల్ఖానుడు వచ్చునందాక నచటనె విడిసి యుండ నిశ్చయించెను. అదిల్ఖాను డపుడుగూడ మోము చూపలేదు. అతని ప్రవర్తనవలన రాయల కాతనిపై గోపము గల్గినది. తన్నవమానపఱచుట కొఱకై యాతఁడు మ్రొక్కుడుదునని రప్పించి మొగముచూపకపోయెనని యెంచి యతఁడు పర్యాసము సేయవచ్చిన పట్టి బంధించవలయునని నిశ్చయించెను; కాని కృష్ణరాయలకు తా ననుకొనినంత కాలము విజాపురమున నుండుటకు వీలుగాక పోయినది. అది సర్వసంపదల కాకరమైన పట్టణమె! కాని నీటివసతి తక్కువ; పైరుపంటలేకాక పానీయ జలమునకుగూడ జనులు కేవలము వర్షపాతముపైనాధారపడవలసి యుండెను. జనుల యుపయోగార్థము వర్షజలము రెండు పెద్ద చెఱువులందు సేకరింపబడి యుండెను; కృష్ణరాయలను దమ పట్టణమునను౦డనీయక వెడలనంపు నుద్దేశముతో దురకలా చెఱువుకట్టలను నఱకి నీటిని వెలుపలికి బాఱించి వేసిరి. జలాభావము వలన నచట నునికి యసాధ్యమాయెను; జలాభావమునకు దోడు వంట చెఱకునకు కఱవు వచ్చినది. దూరమునుండి వచ్చు కట్టెలమోపు లాగినవి. రాయల సైనికులు పెక్కు కట్టడముల నిడియగొట్టి యందలి కలపను వంట చెఱకున కుపయోగింపవలసి వచ్చెను. ఇందు మూలమున విజాపురమున జాలభాగము పాడై పోయినది. పట్టణ వినాశ వార్త దెలియవచ్చినంతటనె యాదిల్ఖానుఁడు, సందేశహారునిమూలమున 'మా దండ నాయకుల గృహములను నిర్మూలము గావించితిరె, వాని యపరాధమేమని రాయల నడుగ నంపెను. రాయలందులకు 'నిర్మూలము గావించినది మేము కాదు; మా జనులను నివారింప వీలుగాక పోయిన'దని ప్రత్యుత్తరమంపెను. తరువాత కృష్ణరాయలు దండును మరల్చుకొని ముదుగల్లునకుబోయి చేరినపిమ్మట నాదిల్ఖానుఁడు నిజరాజధానికి మరలి వచ్చెను.

## అసద్ఖానుని రాయబారము

ధ్వంసమును సేయబడిన రాజధానిని జూడఁగనె యాదిల్ఖానుని చిత్తమున వ్యథ గలిగినది. ఆ ధ్వంసమున కంతటికిని మూలకారణము దానేయని యతడు చింతించెను. తన రాయబారి కరారుచేసి వచ్చినట్లు తాను కృష్ణ రాయలను భేటీచేసికొని యుండిన, నట్టి ముప్పు వాటిల్లియుండదని తోఁచినది. ఇకమీద నట్టి యపాంతరమును రానీక తొలఁగద్రోయుటకును, దన రాజ్య పురోవృద్ధికిని

కృష్ణరాయలలోడ సఖ్యపడు టావశ్యకమను బుద్ధి పుట్టినది. వెంటనె హితులనెల్లఁగూర్చి తన మనో భావమును వారి కెఱుకపఱచి సలహో చెప్పుఁడని యడిగెను హితులలోనెల్ల ప్రధానుఁడసద్ఖానుఁడు; గొబ్బూరు రణక్షేత్రమునుండి యాదిల్ఖానుని పలాయనమునకు పురికొల్పి తొలఁగఁదోలుకొని పోయిన వాఁడితఁడే. తన్ను విజయనగరమునకు రాయబార మంపినచో తన యజమానుని చిత్తమునకు వచ్చిన తెరగున సర్వవిషయములను జక్కఁబెట్టుకొని వచ్చెదనని యతఁడు మనవిచేసెను. ఆదిల్ఖానుఁ డాతని మాటల నాలకించి యానందించి రాయబారము నంపుటకు అతని విజయనగరమున కంపెను.

అసద్ఖానుఁడు సామాన్యుడుకాడు; గడుసు తనమునందారి తేరినవాడు; కపటి, వంచనయందు వంచకములకు జదువు నేర్పజాలిన మేథావి. అతఁడు విజయనగరమునకు పోగోరినది స్వామి కార్యనిర్వహణార్థము గాదు; స్వకార్యమును సాధించుట కొఱకే. విజయనగరమున చెఱసాలయందు బందీకృతుడై యుండిన సలాబత్ఖానుఁ డతనికి ప్రతిపక్షి; అసద్ఖానుని స్వభావము నతడు చక్కఁగ నెఱుగును గొబ్బూరు రణమునం దసద్ఖానుడుచూపిన పంద తనమును, నాదిల్ఖానునికి దురాలోచన జెప్పి భయముకొల్పి యతని దోడ్కొని రణరంగమునుండి పలాయనము సేయుటయు, దత్కారణమున విజాపుర సైన్యములు నిర్మూలమగుటయు నతనికి దెలియవచ్చెను. బంధనముబాసి మరల విజాపురము జేరినంతటనె యసద్ఖానుని దుష్ప్రవర్తనకు దగినరీతిని శాస్తిచేయించెదనని సలాబత్ఖానుఁడు తనుజూడ వచ్చు మిత్రులతో జెప్పువాడు; ఆ మాటలు కర్ణాకర్ణిగ నసద్ఖానుని చెవిసోకెను. కావున నసద్ఖానుఁడు సలాబత్ఖానుని ప్రత్యాగమనము దనకు శ్రేయస్కరము గాదని గ్రహించి రానున్న యాపదను దొలగబెట్టుకొనుట కుపాయము చింతించి విజయనగరమునకు బయనమాయెను

విజయనగరమును జేరినపిమ్మట నసద్ఖానుఁడు కృష్ణరాయలను సందర్శించి సంధి సంప్రతింపుల కారంభించెను. అతఁడు వాగ్మియు నతి చతురుడు నగుటచే రాయలనునులువుగ సుప్రసన్నునిగావించుకొనెను. పూర్వ రాయబారమును, నందుమూలమున నాదిల్ఖానునివలన దనకైన యవమానమును కృష్ణరాయలు స్మరణకు దేగా, నది తన యజమానుఁడు బుద్ధిపూర్వకముగ జేసిన యపరాధము గాదనియు సలాబత్ఖానుడు పుత్తెంచిన దుర్మంత్రమునకులోనై యట్లొనర్చెననియు, రాయలకాదిల్ఖానుతో సంధి కుదురకపోవుటకు సలాబత్ఖానుడే ముఖ్యకారణమనియు మనవి చేసెను. కృష్ణరాయలకు సలాబత్ఖానుపై గోపము పెల్లురేగెను. అసద్ఖానుని కపటమును గుర్తింపజాలక, ముందు వెనుకలాలోచింపక చెఱయందుండు సలాబత్ఖానుని వధింప నతఁ డాజ్ఞాపించెను. అసద్ఖానుని కుతంత్రమువలన శూరోత్తముడగు సలాబత్ఖాను డిట్లు దుర్మరణము నందెను.

అసద్ఖానుని కిఁక విజయనగరమునందు పని లేదు; వచ్చిన కార్యము ఇష్టానుసారముగ నెఱవేరినది. అటుపైనిలచుట శ్రేయము గాదు; అతని కుట్ర యేనిమిషమునందైన వెల్లడి కావచ్చును; వెల్లడియైన ప్రాణోపద్రవముగల్గుట నిశ్చయము. ఆలస్యము సేయక యెంత శీఘ్రముగ విజయనగరమునుండి వెడలిపోయిన నంత మేలగును. కావున నసద్ఖాను రాయలవారి దర్శనము జేసికొని, సత్వరముగ దానేగి యాదిల్ఖానుని కృష్ణాతీరమునకు దోడ్కొనివచ్చి భేటీ చేయింతుననియు, దనకు స్వదేశమునకుబో ననుజ్ఞ నీయవలసిన దనియు వేడుకొనెను; కృష్ణరాయ లీయకొనడాయె. ఇంకను వివరింపవలసిన విషయము లనేకములు గలవనియు వేగిరపాటు వలదనియు వారించెను. భయభ్రాంత చేతస్కుఁడగు నసద్ఖానుఁ డొకరాత్రి యెవ్వరికిని దెలియనీయక విజయనగరమునుండి పరారియై విజాపురమునకుబోయి, యాదిల్ఖానునితో, 'రాయలు సలాబత్ఖానుని జంపెను; నన్నుగూడ జంప నుద్యుక్తుఁడుకాగా దప్పించుకొని తమ సముఖమునకు వచ్చితిని. అతని నమ్మరాదు; ఎంతటివాడైనను నల్లమనుష్యుడే కదా' యని పల్కి యట నిలువక తన నెలవైన బెల్గామునకుబోయి దానిని బలపఱచుకొనెను; తరువాత నాదిల్ఖానుఁడు దన సముఖము

నకు రా నాజ్ఞాపించినను, నతఁ డటువైపు ముఖము
నైన ద్రిప్పడాయె; ఏలన నాదిల్ఖానునికి తా నొన
ర్చిన ద్రోహకార్య మెఱుక పడెనని యాతడు
గ్రహించెను

### కలుబరిగె దండయాత్ర

అసద్ఖానుడు దన్ను పిడ్కొనక పాఱిపోయి
నను, నతఁడు చెప్పిన ట్లాదిల్ఖానుఁడుగాని యతని
తల్లిగాని తనభేటికి కృష్ణాతటమునకు వచ్చెదరని
యెంచి కృష్ణరాయలు సరిహద్దు ప్రాంతమునకు
బోయెను; కాని యాదిల్ఖానుడుగాని యతని తల్లి
గాని పొడచూపరైరి. అప్పు డాసద్ఖానుని కృత్రిమ
మును కృష్ణరాయలు గ్రహించి క్రోధపరవశుఁడై
కలుబరిగ మీదికి దండయాత్రజేసి యాదుర్గమును
మఱి కొన్నింటిని నేలమట్టమునకు చదును గావిం
చెను; అటనుండి యుత్తర భూములపై దండు
వెట్టవలయునని యుద్యుక్తుఁడాయెను; కాని
మంత్రులది సుకరముగాదని వారించిరి. 'ఉత్తర దేశ
ముపై దండు వెడలిన మిత్రులని మనమిప్పుడు
పరిగణించు నచటి తురక లాదిల్ఖానుని దేశమువలెనే
వారి దేశమునగూడ నాక్రమింతుమని జడిసి యాత
నితో గలసి మనపై యుద్ధము సేయవచ్చును.
అట్లు వారంప జేకమైనను జంకున కవకాశము
లేదనుకొనుడు. జలాభావముచే దండుసేయుట సుల
భము కాదు.' అని విన్నవించిరి. వారు చెప్పిన
సలహా సమంజసమైనదని కృష్ణరాయ లొప్పుకొని
యా యుద్యమమును మానుకొనెను.

కలుబరిగె దుర్గమునందు దక్కను సుల్తాను
పుత్రులు ముగ్గురు కృష్ణరాయలచే జిక్కిరి. తన
సోదరి భర్తయగు సుల్తాను భోగకాంత పుత్రుని
రాజ్యాధిపతిని సేయనెంచి యాదిల్ఖానుఁడు పై
ముగ్గురు పుత్రులను వారి తండ్రి మరణానంతరము
పట్టి బందీకృతులగావించియుండెను. కృష్ణరాయలు
వారిని విడుదలచేసి వారియందు జ్యేష్ఠుని తండ్రి
పదమున బ్రతిష్ఠితుని జేసెను. స్వతంత్రులై యుం
డిన దక్కను సామంత ప్రభువులెల్ల నతని యాజ్ఞా
బద్ధులై నడచుకొన సంసిద్ధులైరి కృష్ణరాయల
భయమువలన నాదిల్ఖానుఁడు నయిత మాతని
నమ్రుఁడాయెను ఇట్లు జ్యేష్ఠుని దక్కను రాజ
పీఠమందు స్థాపించి యతని తమ్ముల నిరువురను
కృష్ణరాయలు తనతోగూడ విజయనగరమునకు
గొంపోయి రాజపుత్రుల యంతస్తులకు దగినమర్యా
దల గావించి దినవెచ్చముగ నైదు సాలు కేబదివేల
బంగారు పర్దావుల వేతనము నేర్పాటుచేసెను.[6]

ఇంతవఱకు న్యూనిజుచే వర్ణింపబడిన రాయ
చూరు ముట్టడి చరిత్రను, దీటుపై నిచ్చిన విజా
పుర విజయనగర పరస్పర సంబంధ వృత్తాంతమును
సంగ్రహముగ వివరించితిని మొత్తముమీద నిది
యంతయు విశ్వాసపాత్రమేయైనను సత్యదూర
మైన విషయమిందు లేకపోలేదు. రెండు రాజ్య
ముల మధ్య చిరకాలమునుండియు శాంతి యవిచ్ఛి
న్నముగ వఱలుచుండెననియు కృష్ణరాయల
రాయచూరు దండయాత్ర మూలమున నది భగ్న
మాయెననియు నాదిల్ఖానుని రాయబారి రాయల
సముఖమున మొరపెట్టినట్లు న్యూనిజు వ్రాసి
యున్నాడు ఇది యసంభవము. విజయనగర
రాయలకును దక్కను మహమ్మదీయ ప్రభువులకును
నిరంతర వైరమేకాని సఖ్య మెన్నడును లేదని
మహమ్మదీయ చరిత్రలు ఘోషించుచున్నవి. ఇది
సత్యమని హంపీ శాసనములును వాఙ్మయమును
నిరూపించుచున్నవి. రాయచూరుముట్టడికి ముందు
కృష్ణరాయలే రెండు పర్యాయములు మహమ్మ
దీయులతో బోరాడెను; వీర నరసింహరాయలొక
మారును, నరసానాయకుడు రెండు మూఁడుసారు
లును యుద్ధము సల్పియుండిరి. కావున చిరకాలము
నుండియు నీరెండు రాజ్యముల మధ్య శాంతి
యవిచ్ఛిన్నముగ వఱలుచుండెననుట కల్ల. వాస్తవ
మిట్లుండగా నాదిల్ఖానుని రాయబారి కృష్ణరాయ
లతో జిరకాలమునుండియు నుభయ రాజ్యముల
మధ్య శాంతి వర్ధిలుచుండెనని మొరపెట్టు టెట్లు?
దాని నాలకించియు కృష్ణరాయలు మిన్నక యా
యసత్యము నంగీకరించు టెట్లు? మరియు కృష్ణ
రాయల సముఖమున నాదిల్ఖాను పంపిన రాయబా

---

6. *Nuniz, Forgotten Empire, pp.* 349-58.

రనుల ప్రస్తావము న్యూనిజు గ్రంథమంతప్ప మఱి యెందును గానరాదు; కావున వాని వాస్తవికతను పరిశీలించి కనుగొనుటకు సాధ్యముగాదు; కాని కలుబరిగె దండయాత్రను గూర్చి న్యూనిజు వ్రాసిన ప్రత్యక్షరమును సత్యమైనదే. బండారు లక్ష్మీనారాయణ తన సంగీత సూర్యోదయ పీఠిక యం దీదండయాత్ర నిట్లు వర్ణించియున్నాఁడు.

'కృష్ణా ముత్తీర్యసోఽయం
యవనజనపదం వహ్నిసాత్కృత్యసర్వం
పీరోజాబాద్ హాసన్ బాదురు
సగర సమాఖ్యాని దుర్గాణిజిత్వా
ఘంక్త్వోచ్చైః పారశీకం
కలుబరిగపురీం ద్రాక్సపాదాద్యన్ మానాన్
క్రాన్త్వా వ్యాకృష్టవాన్ దోర్బల
ఘనమహిమా త్రీన్ సురత్రాణపుత్రాన్.'7

ఇందువలన కృష్ణదేవరాయలు కృష్ణానదిని దాటి యవనజనపదమునంతటిని దహనము గావించె ననియు, పీరోజాబాదు, హాసన్‌బాదు, సగరు మొదలగు దుర్గము జయించెననియు, తరువాత సపాదు ఆదిల్ఖానునిచే సంరక్షితమైన కలుబరిగను దాకి యందు సుల్తాను పుత్రులను మువ్వురఁ బట్టుకొనె ననియు దెలియవచ్చుచున్నది. లక్ష్మీనారాయణ పేర్కొనిన దుర్గములలో హాసన్‌బా దెచట నుండెనో తెలియదు. తక్కినవన్నియు నిప్పటి హైదరాబాదు రాజ్యమునందలి గుల్బర్గ జిల్లాలో నున్నవి. ఇందు మొదట పేర్కొనదగినది సగరు. దీనినిప్పుడు సాగరందురు. ఇది కృష్ణానది కుత్తరమున షోరాపూర్ షాపూరుల మధ్యనున్నది. ఫీరోజాబాదు షోరాపూరునుండి గుల్బర్గకుపోవు బాటమీద రెండు పట్టణములకును గొంచె మించుమించు మధ్యభాగమున నున్నది. కలుబరిగియె ఇప్పటి గుల్బర్గ. హైదరాబాదు రాజ్యము పశ్చిమమునందుండు నా పేరిటి జిల్లాకు ముఖ్యపట్టణము. హాసన్‌బాదుకూడ నా ప్రాంతమునందే యుండవలయును.

ఆముక్తమాల్యద పీఠికయందుగూడ కలుబరిగి, సగరపుర విజయములు వర్ణింపఁబడియున్నవి

'సకాది దివిజమస్కరి ఫాలగోపి
చంద్రన ఘుంద్రవల్లి కల్నాకినాకి
సెలసి హాహాహూహూవుల దండియలతంత్రి
ద్రెవ్వ సింగిణులుగాఁ దివిచి తివిచి

సప్తర్షి కృతవియజ్ఝర వాలు కాలింగ
సమితిముచ్చెల కాళ్లఁజమరి చమరి
రంభా ప్రధానాప్సరః పృథూరోజ కుంభంబు లెచ్చటఁగన్నఁబట్టిపట్టి

తిరుగు హరిపురి సురతరు సురలమరగి
బహుళహాళి హాళిభృత కలుబరగి నగర
సగర పురవర పరిభృఢజవనయవన
పృతన భవనసి ననిఁదెగి కృష్ణరాయ.'8

ఇందు సగరపుర కలుబరిగి విజయములు మాత్రము పేర్కొనబడి యుండుటచేత నా స్థలములందు దక్కినచోట్లకంటె యుద్ధము ఘోరతరముగ జరిగెనని మన మూహింపవచ్చును. కృష్ణరాయలు జలహళ్ళి దేవదుర్గముల సమీపమున కృష్ణానదిని దాటి విజాపుర రాజ్యమును బ్రవేశించియుండవలయును. ఆ ప్రాంతములందు ప్రబలమైన దుర్గము సగరు. తోఘ్లూకులకాలమున నది ఢిల్లీ సామ్రాజ్యమునకు దక్షిణ ద్వారమై యుండెను. బహమనీ సుల్తానుల పాలనయందా ప్రాంతమున ప్రధానగడ దుర్గమై బహమనీ విజయనగర సంగ్రామములందు ముఖ్యరంగముగ వాసికెక్కినది. కావున కృష్ణరాయలు విజాపురముపై దాడిసేయ నారంభము జేసి మొట్టమొదట దానిని గైవసము గావించుకొనెను. తరువాత నా చుట్టుపట్టు సీమలను పరశురామ ప్రీతిసేయుచు నుత్తరాభిముఖుఁడై చని ఫీరోజాబాదసన్ బాదులను సాధించెను. తరువాత బహుమనీరాజుల ప్రాచీన రాజధానియైన కలుబరిగిపై నడచి యాదిల్ఖానునితో ఘోరయుద్ధ మొనర్చి స్వాధీనము జేసికొనెను.

7. *Further Sources of Vijayanagara History Vol. II.* 116 (*a*)

8. ఆముక్త. ౧: ౪౧.

## కృష్ణదేవరాయలు - చరమదశ

కలుబరిగమీది దాడి కృష్ణరాయల దండయాత్రలలో గడపటిది. తరువాత నతఁడు శత్రురాజు లెవ్వరి తోడను యుద్ధము జేసినట్లగపడదు. కాని సామ్రాజ్యములో నల్లరులు రేగుటవలన శాంతిచెడి కొంత సంక్షోభము గలిగెను ఈ యల్లరులకు గారణమును న్యూనిజిట్లు వివరించి యున్నాడు:—అప్పటికి రాయలకు వయసు మీఱినది; వార్ధక్యమునం దతఁడు విశ్రాంతి నంద గోరెను; మఱియు నతని కాఱేండ్ల ప్రాయముగల పుత్త్రుఁడొకదుండెను; తన మరణానంతర మా బాలునికి సామ్రాజ్యాధిపత్య ముబ్బక పోవచ్చునని శంకించి, తాను సజీవుడై యుండగనే యతని సామ్రాజ్యపదమున స్థిరపఱచుట యుక్తమని తలచెను; కావున కృష్ణరాయలు రాజరికమును విడుకొని కుమారునికి రాజ్యాధిపత్య మొసగి తాను ప్రధానియై సాళువ తిమ్మయను దనకు సహాయుని జేసికొనెను; రాజ్యాభిషేకోత్సవము లెనిమిదినెలల పర్యంతము సాగినవి. ఇంతలో నా యువకుఁడు జాడ్యగ్రస్తుఁడై కాలగతినం దెను. పిమ్మట నా బాలునికి సాళువ తిమ్మయ కుమారుఁడగు తిమ్మ దండనాయకుఁడు విషప్రయోగము జేసినాడని తెలియవచ్చెను. కృష్ణరాయ లంత క్రోధపరవశుఁడై యది సత్యమని తలచి సాళువ తిమ్మయను నతని తమ్ముఁడగు గోవిందరాజును వారి బంధువులగు దండనాయకుల బెక్కండ్రను సముఖమునకు బిలిపించి నిందించి చెఱసాలలో బంధించెను. వారి నిట్లు చెఱబెట్టినపిమ్మట కొండమరసు కుమారుడగు నయ్యపరసును బ్రధాని పదమున నియమించెను. కృష్ణరాయల తండ్రి యాజ్ఞానుసారము నరసింగ రాయలను పెనుగొండ దుర్గమున హత్య చేసి చంపినవాడీ కొండమరసే. 8-a

మూడేండ్ల కాలము తిమ్మరసు కుటుంబము కారాగారమున నవయుచుండెను; అప్పుడు తిమ్మరసు పుత్త్రుడు తిమ్మదండనాయకుఁడు తప్పించుకొని పాఱిపోయి దొంగలకును దారిదోపిడికాండ్రకును డెంకియైన పర్వతమును జేరెను. అచటనుండి తన బంధువగు నొక దండనాయకుని సాయము పొంది రాయలపై గత్తికట్టి ఘోరముగ యుద్ధము సేయఁగడఁగెను కావున కృష్ణరాయ లతనిబట్టి తెచ్చుటకుగొప్పసైన్యముతోగూడ దన ప్రధానియగు నయ్యపరసునునియోగించెను అయ్యపరసుతిమ్మదండ నాయకునికి నెలవైన పర్వతమును జుట్టుముట్టి యతని బట్టి బంధించి రాయల సముఖమునకు దెచ్చెను. అంతట రాయలాతని తండ్రి పినతండ్రులతో గూడ వధ్యస్థానమున కంపి బ్రాహ్మణు లగుటచే వధింపక కండ్లను బొడిపించి మరల చెఱసాలయందు నైవ నాజ్ఞాపించెను. తిమ్మదండ నాయకుఁడు చెఱసాల యందే మృతి నందెను అతని తండ్రియగు సాళువ తిమ్మయయు సోదరుఁడగు గుండరాజును చెఱయందే నవయుచుండిరి.9

న్యూనిజు చెప్పు కథ సత్యాసత్యములు నాయని మనవా రనేకులు సంశయపడుచున్నారు ఈ సంశయమున కాధారము కృష్ణరాయలపై మనకుగల యభిమానము అఱుకు మన కారుణ్యప్రాయుఁడైన చక్రవర్తి; నిష్కళంక చరిత్రుఁడని మన భావము; కావున కంటిని రెప్పవలె గాపాడిన తిమ్మరసును, నప్పాజియని తండ్రినిబోలి గౌరవించిన తిమ్మరసును, మహనీయుఁడైన కృష్ణరాయలు కఠచిత్తుఁడై కండ్లూడ బీకించునా? యని పరితాపముంది న్యూనిజు కథ సత్యము గాక పోవచ్చునని యూరడిల్లుచున్నారు. కావున నీ కథయొక్క వాస్తవికత నిచట బరిశీలించుట యుక్తము. ఈ సందర్భమున మనము నిర్ణయింపవలసిన విషయము లివి.

1. కృష్ణరాయల కొక పుత్త్రుఁడుండెనా?

2. ఉండిన నతని కాఱేండ్ల ప్రాయమున రాయలు రాజ్యాభిషేక మొనర్చెనా?

3. అట్లు రాజ్యాభిషిక్తుఁడైన యువకుఁ డెనిమిదినెలల కాలము రాజ్యముజేసి కాలగతి నందెనా?

4. తిమ్మరసు కుమారుఁడు తిమ్మదండనాయకుఁ డతనికి విషముబెట్టి చంపెనా?

---

8-a ఇది పొరపాటు. కృష్ణరాయల యన్న యని యుండవలయును.

9. *Nuniz, Forgotten Empire pp* 359-61.

5. కృష్ణరాయలు తిమ్మరుసును సోదర పుత్రులతో గూడ కారాగార బద్ధులను గావించి యనంతరము కండ్లు పొడిపించెనా ?

ఇందు మొదటి ప్రశ్నకు సమాధానము కృష్ణరాయల కొకపుత్రుఁ డుండెననియే చెప్ప వలయును. ఇచట నీ క్రింది శాసనములను స్మరిం చుట మంచిది

శా. శ. ౧౪౩౯ ఈశ్వర మార్గశిర బ. ౩ (డిసెంబరు. ౧ ౧౫౧౭) నాడు చోళసముద్రమందు చౌడేశ్వరీ యాలయమున రాయసంకొండమర సయ్య కృష్ణరాయలకు సంతానాభివృద్ధియగుగాక యని దాన శాసనము వ్రాయించియున్నాడు.[10] ఇందువలన నప్పటికి కృష్ణరాయలకు సంతానము గలుగలేదని తెల్లమగుచున్నది. అతని దేవేరులయం దెవ్వరేని చూలాలై యుండిన నుండవచ్చును విజయనగరమున కుంభారకుంటెయందు శా. శ. ౧౪౩౯ బహుధాన్యకార్తిక శు (బ ?) ౧౨ (౩౦ అక్టోబరు. ౧౫౧౮) నాడు కృష్ణరాయల పట్టపు మహాదేవి తిరుమల దేవమ్మ తిరుమల దేవ మహా రాయలకు బుణ్యముగా భూదానము జేసెను [11] తరువాత శాసనములందు తిరుమలదేవ మహారాయలు కృష్ణరాయల పుత్రుఁడని తెల్లము సేయబడి యున్నది.[12] కావున కృష్ణదేవరాయలకు పట్టమహిషి తిరుమల దేవియందు శ. ౧౪౩౯ సరియైన క్రీ. శ. ౧౫౧౮ వ సం॥ న తిరుమల దేవ మహారాయలను పుత్రుఁ డొకడు గలిగెనని నిశ్చయింపవచ్చును.

రెండవ ప్రశ్నకు సమాధానము న్యూనిజు వచించినట్లు కృష్ణరాయలు దన పుత్రునకు దన జీవితకాలమందే రాజ్యాధిపత్య మొసగెనని చెప్ప వలసియున్నది. శా. శ. ౧౪౪౬ తారణ వర్షమున మహా రాజాధిరాజ వీరప్రతాప తిరుమలయ్యదేవ మహారాయలు విజయనగర సామ్రాజ్యమును పాలించుచుండెనని యాంధ్ర కర్ణాటద్రావిడదేశ ములందు గానవచ్చు శాసనములందు జెప్పి యున్నది.[13] మద్రాసు శాసన శాఖవారు ౧౯౨౩వ సం॥ నివేదికయందు కృష్ణరాయలు తిరుమల దేవరాయలను యౌవరాజ్యమున కభిషిక్తుని జేసె నని వ్రాసియున్నారు. శాసనములందీ వ్రాత కేమియు నాధారము గానరాదు.[14] శాసన సాక్ష్య మునుబట్టిచూడ నతఁడు మూర్ధాభిషిక్తుఁడైన చక్రవర్తియనియే తోచుచున్నది. ఇక మూడవ ప్రశ్నకు సమాధాన మేమొకనుగొందము తిరుమల దేవ మహారాయలు శా. శ ౧౪౪౦ వ సం॥ న జననమందెనని పైజెప్పియున్నదికదా. అతని శాసనములన్నియు శా. శ ౧౪౪౬ వ సంవత్సరము నందే కానవచ్చుచుండుటచేత నతని ప్రభుత్వ మా వర్షమునందె ప్రారంభమయి తుదముట్టెనని తేలు చున్నది. మఱియునవి యా సంవత్సర వైశాఖము నుండి మార్గశిర మాసమువఱకును, తుల మొదలు ధనస్సువఱకును గానవచ్చుచుండుటచే తిరుమలదేవ మహారాయలు రాజ్యాభిషేక కాలమున నాఱేండ్ల బాలుఁడనియు నతని ప్రభుత్వ మెనిమిది మాసముల కంటె నధికముగ సాగలేదనియు విదితమగుచున్నది.

తక్కిన రెండు ప్రశ్నలకును దృప్తికరమైన సమాధానము చెప్పుట సులభమైన పనికాదు. తిమ్మ రసునకు దిమ్మదండ నాయకుఁడను పుత్రుఁడుండెనని నిశ్చయించి చెప్పుటకు దగిన శాసనాధారము లేదు. కాని, శా శ. ౧౪౪౬ తారణ మార్గశిర శు ౨ శని వారమునాటి యొక కన్నడశాసనమున, మహా రాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప శ్రీ తిరుమ లైయ దేవ మహారాయల యాధిపత్యముక్రింద సాళువ తిమ్మణ దండనాయకుఁడు బెంగుళూరు జిల్లా మాగడి ప్రాంతమును బాలించుచుండెనని చెప్పియున్నది.[15] ఇతఁ డొకవేళ సాళువ తిమ్మర సయ్య పుత్రుఁడై యుండిన నుండవచ్చును. తిమ్మయ దండనాయకుఁడు తిరుమలైయదేవ మహా

10. *S. I. I. IX. ii No.* 507.
11. *Ibid* 510.
12. *EC. IX. Ma*, 82, 116 *of* 191, 1398 *of* 1896.
13. *EC. IV. HS*. 58, 181 *of* 1913, 139 *of* 1896, 115, 116, 117 *of* 1918, 91 *of* 1912, *EC. IX. Ma* 82.
14. *ARE*. 1223 *Part II p*. 79.
15. *Ec. IX. Ma*. 82.

రాయలకు విషముబెట్టి చంపెనని కాని తత్కారణమున గృష్ణరాయలు తిమ్మరుసును సోదరపుత్ర బంధుసమేతముగ కారాగార బద్ధునిజేసి యనంతరము తిమ్మదండ నాయకు చెఱనుండి తప్పించుకొనిపోయి యల్లరి రేపిన నేరమునకు వారెల్లరకు గండ్లూడ బీకించెనని కాని నిరూపింపదగిన యాధారము లెవ్వియు గానరావు. కాని శా. శ. ౧౪౪౬ తారణ తరువాత సాళువ తిమ్మరసయ్య ప్రస్తావము శాసనములం దెచ్చటను గన్పట్టదు. ఇతని పక్షమున కొండవీటి సామ్రాజ్యమును పాలించుచుండిన యితని యల్లుడగు నాదిండ్ల గోపమంత్రి శా. శ ౧౪౪౭ ఫాల్గుణ శుక్ల ౧౫ నాడు కొండవీటిలో పరివార పట్టాభిరామ విగ్రహమును బ్రతిష్ఠించెను.[16] ఇదియె గోపమంత్రి కడపటి శాసనము. మఱియు సాళువ తిమ్మరసు శాసనములు స్వభాను సర్వధారి సంవత్సరముల మధ్య కానరావు. కావున సాళువ తిమ్మరసు మంత్రి యధికారము శా. శ. ౧౪౪౭ నకు సరియైన క్రీ. శ. ౧౫౨౫-౬ తో ముగిసెనని నిశ్చయింపవచ్చును. తరువాత నీ ప్రాంతమును కొండమరసు కుమారుడయ్యపరసు పాలించినట్లు శాసనసాక్ష్యము గలదు న్యూనిజు కథ కిది యనుకూలముగనే యున్నది.[17]

తిమ్మదండనాయకుని యాచూకి శాసనములందు గానరాదు; ఇక నతని నాయకత్వము క్రింద రేగిన యల్లరి ప్రస్తావము లేకపోవుట వింతకాదు గదా కాని కృష్ణరాయల యంత్యదినములలో గొండవీటి రాజ్యమున గొంత సంక్షోభము గలిగెను క్రీ. శ. ౧౫౨౮ వ సంవత్సరమున తంగెడ దుర్గము శత్రులెవ్వరో ముట్టడించిరి. వారితో బోట్లాడి కోటను సంరక్షించినందులకా చుట్టుపట్టు నలుబది నాలుగు గ్రామములవారిద్దరు శూరులకు గొంత భూమి నిచ్చినట్లు దుర్గద్వారమందలి శాసనము దెల్పుచున్నది.[18] గుంటూరు జిల్లా చాగల్లునందలి మఱియొక శాసనమున క్రీ.శ.౧౫౨౭వసంవత్సరముజూన్మాసమునచెన్నమ నాయనింగార్లు కండలకుంటకుత్తరమున నుండు చెఱువుక్రిందిభూమిలో మూడుపాళ్ళు బ్రాహ్మణులకును దక్కిన రెండుపాళ్ళను దేశసంరక్షకులకును బంచిపెట్టెను.[19] ఇందువలన కొండవీటి రాజ్యమున క్రీ. శ. ౧౫౨౭-౨౮ లో శత్రుల యుపద్రవము వలన శాంతి చెడినట్లు తెలియుచున్నది ఈ యశాంతికి గారణమేమో నిశ్చయించి చెప్పుటకు వీలులేదు న్యూనిజు చరిత్ర ప్రకారము విజయనగరమునుండి తిమ్మదండ నాయకుడు తప్పించు

16. కొండవీటి సామ్రాజ్యము, పుట ౯౩.

17. ఒకచోట న్యూనిజు సాళువ తిమ్మయను కారాగారమున బంధించిన పిదప కృష్ణరాయ లతడు పాలించుచుండిన రాష్ట్రము కంతటికిని కొండమ్మరసు కుమారుడైన అయ్యపరసు నధికారిని గావించెనని వ్రాసియున్నాడు. *Nuniz, Forgotten Empire, p.* 360 మఱియొక తావునం దయ్యపరసు కుమారుడు తిమ్మప్ప యుదయగిరి,కొండవీడు, పెనుగొండ, కొదగరలు (?) సిద్ధవటము మున్నగు పట్టణముల బాలించుచుండెననియు, నతని పాలన క్రిందిదేశము గజపతి రాజ్యమును బంగాళాఖాతమును దాకుచుండెననియు దెల్పియున్నాడు. *Ibid. pp.* 385-6. రాయసం కొండమరసు క్రీ. శ. ౧౫౨౫ నవంబరు ౭వ తేదికి ముందు పుణ్యలోక ప్రాప్తి నందెను. అతని పుత్రుడగు నయ్యపరసు పెనుగొండ రాజ్యములోని కుందుర్పి రాజ్యము నేలుచుండెను. (97 *of* 1913). క్రీ.శ. ౧౫౨౭వ సంవత్సరమునం దయ్యపరసుదయగిరిదుర్గాధిపతియైయుండెను.(*NDIII.kr77*); క్రీ. శ. ౧౫౨౯, ఏప్రిలు ౨౩ వ తేదివఱకచటనే దుర్గాధిపత్య మొనర్చుచుండెను.(401 *of* 1926)మఱియు శా. శ. ౧౪౫౧ విరోధి శ్రావణ బహుళ కృష్ణాష్టమి నాడు వేమరసు కుమారుడైన రాయసం అయ్యపరసు భారద్వాజగోత్రాశ్వలాయన సూత్రబుక్శాఖాధ్యాపకుడైన రాయసం తిమ్మరసయ్యగారి యాజ్ఞచే కొండవీటి రాజ్యములోని యద్దంకి సీమకు జెందిన పోలవరం గ్రామమును వెంకటాద్రి నాథునిక దానము జేసెను. (*NDI.I. Darsi* 53) ఇందు పేర్కొనబడిన రాయసం తిమ్మరసు కొండమరసయ్యపరసు కుమారుడు. క్రీ.శ. ౧౫౨౯ వ సం॥ న నితడు కొండవీటికి దుర్గాదిపతియై యుండెనని తెల్లమగుచున్నది. పై సుదాహరింపబడిన శాసనములవలన రాయసంఅయ్యపరసయ్యయు నాతని పుత్రుడు తిమ్మరసయ్యయు న్యూనిజు చెప్పినట్లే కృష్ణరాయల చరమదశయందు కొండవీడు ఉదయగిరి పెనుగొండ దుర్గములను బాలించుచుండిరని తెలియవచ్చుచున్నది.

18. 374 *of* 1926.

19. 388 *of* 1915.

కొనిపోయి పర్వతభూమియందు నెలకొన్న సమయ మిదియె మఱియు నిదే సమయమున తారీఖ్-ఇ-ముహమ్మద్ కుల్లీ కుతుబ్ షాహీ యను మహమ్మదీయ చరిత్రయందు గోల్కొండ కుతుబ్‌షాహీ వంశస్థాపకుఁడైన సుల్తాన్ కుల్లీ కుత్బుశాహు కొండవీడు బెల్లంకొండ మొదలగు దుర్గములను ముట్టడిచేసినట్లును కృష్ణరాయలు దన యల్లుఁడైన శివరాయల యాధిపత్యము క్రింద నొక లక్ష సైన్యము నంపినట్లును, దురకలతో సరి పోరజాలక హిందువు లరిగాపులై సాలుకు మూడులక్షల హొన్నులిచ్చి సంధిజేసికొనినట్లును జెప్పియున్నది.[20] తారీఖ్-ఇ-ముహమ్మదు కుల్లీ కుత్బుశాహీలో జెప్పినదంతయు వాస్తవమని యంగీకరించుటకు కొండవీటిరాజ్యమున గానవచ్చు నప్పటి శాసనముల బరిశీలించిచూడఁగా కుత్బుశాహీ సుల్తాను గాని మఱియే మహమ్మదీయ ప్రభువు గాని ఈ ప్రాంతముల నేలినట్లగపడుటలేదు. మఱియు కృష్ణరాయలకు శివరాయలను నల్లుఁడుండెననుట నమ్మదగినది కాదు మన కెఱుకపడినంతవఱకును కృష్ణరాయల కల్లుండ్రిద్దఱుండిరి అళియ రామరాజొక్కఁడు ; మట్ల వరదరాజు మఱియొక్కఁడు.[21] అళియ రామరాజు తమ్ముఁడగు తిరుమలరాజుకూడ కృష్ణరాయల యల్లుఁడని వాఙ్మయమున నొక యైతిహ్యము గలదు ; కాని యది విశ్వాసపాత్రము గాదు ; కృష్ణరాయలకు శివరాయలను నల్లుడుండెనని రుజువుసేయగల సాధనములులేవు. కాని యచ్యుతరాయలు దన ప్రథమరాజ్య వర్షమున దురకల నోడించెనని శాసనాదులలో జెప్పియున్నది. మఱియు నచ్యుతరాయల మన్నెసామంతులలో నొక్కడైన గని తిమ్మానాయడు, 'గడిదాటి రాకుండ వడిదాకి మలక కాల్బలము నేల కాల్బలము జేసె' నని వెలుగోటి వారి వంశావళియందు కలదు. కావున కృష్ణరాయల కడపటి రాజ్యవర్షములలో గోల్కొండప్రభువు సుల్తాన్ కుల్లీకుత్బుశాహు కొండవీటిపై దండెత్తివచ్చెననుట కల్లకాదు. కాని శాసనములందు ప్రస్తావవశమున బేర్కొనిన శత్రువుల హోవళికిని సుల్తాన్ కుల్లీ కుత్బుశాహు దండయాత్రకును దిమ్మదండనాయకుని యల్లరితో నెట్టి సంబంధముండెనో చెప్పుటకు వీలుకాదు. ఇట్లు న్యూనిజు వర్ణించిన యంశముల నెల్లను శాసనాద్యన్యసాధనముల మూలమున నిరూపించుటకు వీలుగాకపోయినను నతఁడు చెప్పు వృత్తాంతము మొత్తముమీద సత్యాత్మకమనియె యెన్నదగి యున్నది.

## రాజ్యాధిపత్య నిర్ణయము

కుమారుడు తిరుమలయ్య దేవ మహారాయలు కాలగతి నందిన పిమ్మట కృష్ణరాయలకు దన యనంతరము రాజ్యాధిపత్యము వహింప నర్హుడెవ్వఁడో నిర్ణయింపవలసిన యావశ్యకత గల్గెను. సామ్రాజ్యమునకు వారసులుగ బరిగణింప దగిన వారిలో నలువురు ముఖ్యులుండిరి. మొదటివాడు కృష్ణరాయల పుత్రుఁడు. ఇతఁడు పదునెనిమిది మాసముల సిసుగు రెండవవాఁడు కృష్ణరాయల యన్న వీరనరసింహరాయల కుమారుఁడు. ఇతఁడు సామ్రాజ్యాధిపత్యము వహింపదగిన వయసుగలవాఁడే. కృష్ణరాయల యంత్యకాలమునందాతడిరువదెనిమిదేండ్ల ప్రాయముగలవాడై యుండవలయును. మూఁడవవాఁడు కృష్ణరాయల కనిష్ఠ ద్వైమాతురుఁడగు నచ్యుతరాయలు. పై బేర్కొనిన వారిలో ద్వితీయ తృతీయు లిద్దరును కృష్ణరాయల పట్టాభిషేక కాలమునుండియు జంద్రగిరి దుర్గ కారాగారమున బంధితులై యుండిరి. నాల్గవ వా డచ్యుతరాయలయన్న శ్రీరంగరాయల కుమారుఁడగు సదాశివరాయలు. ఈ నలువురుగాక కృష్ణరాయల యల్లుఁడైన యళియ రామరాజునుగూడ నిచట బేర్కొనుట యుక్తము. రామరాజు ఆర్వేటి బుక్కరాజు ముమ్మనుమడు ; రామరాజు మనుమఁడు; శ్రీరంగ రాజు పుత్రుఁడు. మొట్టమొదట నితఁడు

---

20. *Briggs Ferishta III. pp* 365-68.

21. రామాభ్యుదయము. 1 : 55, కకుస్థ విజయము. 1 : 40.

గోల్కొండ సుల్తాన్ కుల్లీకుతుబ్షాహు కొలువునం దుండెను; క్రీ. శ. ౧౫౧౫ ప్రాంతమున సుల్తాన్ కుల్లీ విజయనగర సామ్రాజ్యముపై నెత్తివచ్చి గడిసీమలఁ గొన్నిటిని జయించి స్వాధీనము జేసికొని యా సీమలపై ప్రభుత్వమునకు మహమ్మదీయులను నియమించుట యుక్తముగాదని దలఁచి రామరాజు నచట నెలకొల్పెను. తరువాత నా ప్రాంతముపై నాదిల్ఖాను డెత్తివచ్చెను; అతని ధాటి కోర్వజాలక రామరాజు గోల్కొండకు బాఱిరాగా సుల్తాన్ కుల్లీ యతని పందతనమున కది నిదర్శనమని తలచి నిజరాజ్యమునుండి వెడలిపోవ నాజ్ఞాపించెను. అంతట నతఁడు విజయనగరమున కేగుదెంచెను. కృష్ణరాయలతని శక్తిసామర్థ్యములను గ్రహించి గౌరవించి కూతురు తిరుమలాంబనిచ్చి యుద్వాహ మొనర్చెను.[22] రామరాజునకు విజయనగర సామ్రాజ్యముపై నెట్టి వారసత్వపు హక్కును లేదు. కాని యతని యధికార కాంక్ష మేఱలేనిది. కృష్ణరాయల జీవితకాలమునందే యతఁడు మామగారికి సామ్రాజ్యపరిపాలనయందు చేదోడు వాదోడై యుండెనని కొన్ని యర్వాచీన పోర్చుగీసు చరిత్ర గ్రంథములందు కలదు; కాని యది సత్యమని నిరూపింపగల సాక్ష్యము విశ్వాసపాత్ర మెద్దియు గానరాదు. రామరాజు కృష్ణరాయల యనంతర మతని పుత్రునిపేర ప్రజాపాలనము సేయదలపెట్టి సామ్రాజ్య మల్లకల్లోలము గావించెను. అతనిదృష్టి యప్పటికె సింహాసనముపై బారియుండుననుటకు సంశయములేదు.

వీరందఱి గుణగణములును శక్తిసామర్థ్యములను కృష్ణరాయ లెఱుగనివికావు దీర్ఘము వితర్కించి వితర్కించి వీరందఱిలోను దన యనంతరము సింహాసనము నధిష్ఠింపదగినవా డచ్యుతరాయలే యని నిశ్చయించుకొనెను ఇట్లు నిశ్చయించినది కృష్ణరాయలు జాడ్యగ్రస్తుఁడై ప్రాణముపై నాసవిడిచి మృత్యువు నెదురు చూచుచున్న సమయమందని న్యూనిజు వచించి యున్నాఁడు. ఇది సరికాదు. మరణకాలమునకు రెండుమూడేండ్లకు ముందే రాజ్య వారసత్వనిర్ణయము జరిగియుండవలయును.[23] ఇట్లు నిశ్చయించుకొనిన పిమ్మట నచ్యుతరాయల బంధనము నాపి యతఁడె తన యనంతరము వజ్రసింహాసనాధిపతి యని ప్రకటించెను.

తన నియామకము సర్వసమ్మతము గాదని కృష్ణరాయలు శంకించెను. కావున నది నిర్విఘ్నముగ నెఱవేరుటకు గొన్ని యేర్పాటులను గావించెను. సాళువతిమ్మయ కుటుంబమునెడ మరల సుప్రసన్నుడై చెఱను విడిపించి మరల దన కొలువునందు బునఃప్రతిష్ఠించెను. సర్వధారి సంవత్సరమున మైసూరు మండలములోని మరదీపురమున మహాప్రధాన సాళువగోవిందరాజ వొడయలుగారు వ్రాయించిన శిలాశాసన మిందుకు తార్కాణ.[24] అచ్యుత దేవరాయల కనుకూలుఁడైన సాళువ నరసింగరాయ దండనాయకుని ముఖ్యమంత్రిని జేసికొనెను. ఇతఁడు ప్రబలుఁడు; ప్రతిపక్షులను సింహాసనము నాక్రమించుకొననీయక చంద్రగిరి నుండి యచ్యుతరాయలు వచ్చునందాక సంరక్షించి నాతఁడితడే.[25]

22. *Briggs Ferishta III. pp* 380-81.

23. ఈ క్రింది శాసనము లీ సందర్భమున బరిశీలింపదగినవి:—ఇం దచ్యుతరాయలు రాజ్యము సేయు చుండినట్లున్నది:

(1) *NDI. Nl.* 34.*a.* శా.శ.౧౪౪౮ పార్థివ, ఫాల్గుణ శు. ౧౫ బుధవారము.

(2) *Ec. X. Sd.* 15 శా.శ. ౧౪౬౦ (౧౪౫౦) సర్వధారి భాద్రపద శు. ౧౩.

(3) *Ec. XII.Gb.* 32. శా. శ. ౧౪౫౧ విరోధి చైత్ర శు. ౫.

(4) *MAR.* 1929. *No.*32 శా. శ. ౧౪౬౦ (౧౪౬౦) విరోధి భాద్రపద శు. ౧౩.

(5) 104 *of* 1919 విరోధి. ఆవణి.౨౦.

విరోధిసంవత్సర మాఘ తులామాసముల వఱకును గృష్ణరాయల శాసనములు గానవచ్చుచున్నవి. కావున నీ కాలమున గృష్ణరాయలతో గూడ నచ్యుతరాయలును సామ్రాజ్యమును పాలించుచుండెనని చెప్పవలసియున్నది.

24. *EC. III. Tn.* 76.

25. *Nuniz, Forgotten Empire p.* 367.

## కృష్ణరాయల నిర్యాణము

అచ్యుత దేవరాయల నిట్లు రాజ్యాధిపత్య మును నెలకొల్పుటకు నిశ్చయించినను, కృష్ణరాయలు రాజ్యభారము నతనిపై మోపక తుదదాక సర్వకార్యములను దానె నిర్వహించుచుండెను. ఇట్లుండ రాయలు తనయొద్దనుండి జయించి గైకొన్న రాయచూరు దుర్గమును మరల స్వాధీనపఱచు కొనుటకొఱకు సిజాశ్వదళములను గూర్చికొని యాదిల్ఖానుఁడు కూచిచేసి వచ్చెను ఆ వర్తమానము జెవినోకినంతటనె మండిపడి కృష్ణరాయ లెవ్వఱికిని జెప్పక యశ్వారూఢుఁడై రాయచూరువంక సత్వరముగ స్వారిచేసిపోయెను రాయలు వచ్చుచున్నాడను వార్త యాదిల్ఖానునకు దెలియ వచ్చినది. ఇంక నిచట నాగుట శ్రేయస్కరముగాదని యతఁడు పరారి చిత్తగించెను. అంతట కృష్ణరాయ లాతని కిట్లు సందేశమంపెను.

'ఇప్పటివఱకు రెండు పర్యాయములు బాస దప్పితివి ; ఆడినమాట తప్పినందులకు నీతో యుద్ధము చేసితిని, ఇంకను చేయుదును, నాకు గిగాపు నగుటకుసమ్మతించి పోసెను, బెల్గామును వశపఱచు కొనుటకు నను నిన్ను వినజాలను '

వర్షాకాల మారంభ మగుటవలన దండయాత్రను వెంటనే ప్రారంభము సేయుటకు వీలులేక పోయినది ; కావున కృష్ణరాయలు విజయనగరమునకు మరలి వచ్చెను ; యుద్ధసన్నాహము లను మాన లేదు. వానలు నిల్చినంతటనె యాదిల్ఖానుపై దండువెట్ట నిశ్చయించి తుపాకులు ఫిరంగులు మందుగుండు సామగ్రులను విస్తారముగ సమకూర్చవలయునని దండాచారాధి పతులకాజ్ఞా పించెను ; మఱియు దన యత్నము నిర్విఘ్నముగ గొనసాగుటకు బోర్చుగీసుల సహాయము నపేక్షించి గోవాయందలి వారి ప్రతినిధికి సందేశ మంపెను తనకు దోడ్పడిన బెల్గాము గైవసమైనంతటనె గోవా ద్వీపమున కెదుటనుండు తీరభూముల నిచ్చివేయుదునని మాట నిచ్చెను. కాని కృష్ణరాయల యుద్యమము కొనసాగలేదు. దైవ దుర్విలాసమువలన నతని కారోగ్యము దప్పినది ; జాడ్యగ్రస్తుఁడై యచిర కాలముననె యవతారమును జాలింపవలసి వచ్చెను.

కృష్ణరాయ లెపు డస్తంగతుఁ డాయెనో నిశ్చితముగ నిర్ణయించుటకు దగిన సాధనము లింకను లభ్యపడలేదు. శా. శ. ౧౪౫౧ కి సరియైన విరోధి సంవత్సర తులామాస పౌర్ణమాస్య భానువారము (క్రీ శ ౧౫౨౯ అక్టోబరు ౧౭ వ తేది) నాడు వ్రాయించిన శాసనమునం దింకను కృష్ణరాయలు రాజ్యము సేయుచుండినట్లు వచించి యున్నది.[26] శా. శ. ౧౪౫౧ విరోధి వర్షకార్తిక శు ౧౫ భానువారము (క్రీ. శ. ౧౫౨౯ అక్టోబరు ౨౭ వ తేది) నాటి శ్రీశైల శాసనమునందుగూడ కృష్ణరాయలె రాజ్యపాలన మొనర్చుచుండినట్లు చెప్పియున్నది [27] అందె మఱియొక శాసనమున శా శ. ౧౪౫౨ వికృతి సం॥ చైత్ర బ. ౩౦ సోమవారము (మార్చి, క్రీ. శ. ౧౫౩౦) వఱకును రాజ్యము సేయుచుండి నట్లున్నది.[28] కాని ఇది సంశయాస్పదము. ఏలనగా క్రీ. శ. ౧౫౨౯ డిశంబరు తేది ౨౮ నాడు వ్రాయించిన యచ్యుతరాయల కడ లాడి తామ్రశాసనమునం దప్పటికె కృష్ణరాయలు స్వర్గస్థుడైనట్లు చెప్పియున్నది.[29] కాబట్టి రాబర్టు సూయలుగారు చెప్పినట్లు కృష్ణరాయలు క్రీ. శ. ౧౫౨౯ అక్టోబరు ౨౭ వ తేదికిని డిసెంబరు ౨౮ వ తేదికి మధ్య నెప్పుడో యొకనాడు పరలోకగతుఁడై యుండవలయును.[30]

కృష్ణరాయల నిర్యాణకాలమును దెల్పు పద్య మొకటి వాడుకయందున్నది.

ఉ॥ బోరన యాచక ప్రతతి
భూరి విపద్దశ నొందుచుండఁగా

26. *ARE.* 512 *of* 1919.
27. *ARE.* 15 *of* 1915.
28. *ARE.* 14 *of* 1915.
29. *EI XIV. p* 310. *f p.* 314.
30. *Robert Sewell, Historical inscriptions of Southern India, p.* 245.

నారయ శాలివాహన శకాబ్దము
 లద్రియుగాబ్ధి సోములం
దారణ వత్సరంబు ననిదాఘ
 దినంబున జ్యేష్ఠ శుద్ధష

ష్ఠీరవి వాసరంబున నృసింహుని
 కృష్ణుడు చేరె స్వర్గముం
ద్వారక నున్న కృష్ణుఁ డవతార
 సమాప్తము నొందు కైవడిన్.

ఇటీవల శాసన పరిశోధక శాఖవారు సంపాదించిన అళియ రామరాజు తామ్ర శాసనమునగూడ నీపద్యముదాహరింపబడెనని తోచుచున్నది. ఈ శాసనము శా. శ. ౧౪౪౮ చైత్ర శు. ౧౨ సోమవారమునాడు వ్రాయబడెనట. ( 12 *of* 1946-47. ) ఇది కృత్రిమమను తలంపునకు గొంత యవకాశముగలదు. పై పద్యము నాధారపఱచుకొని కీ. శే. కొమఱ్ఱాజు వేంకటలక్ష్మణరావు పంతులవారు కృష్ణరాయల నిధన కాలమునుగూర్చి చక్కని వ్యాసమును విరచించి, స్థానిక చరిత్రలోని కథలను గృష్ణరాయల కడపటి రాజ్యవర్షములలో వ్రాయబడిన కొన్ని శాసనములను నాధారపఱచుకొని, 'కృష్ణరాయలు శా. శ. ౧౪౪౬ లోనో ౧౪౪౭ లోనో మృతినొందినట్లును, అప్పటినుండియు శా. శ. ౧౪౫౨ (క్రీ. శ. ౧౫౩౦) వఱకు విజయనగర రాజ్యము నాక్రమించుకొనవలయునని అతని కుమారుఁడైన తిరుమల రాయలును, అల్లుడైన రామరాయలును, తమ్ముడైన యచ్యుతరాయలును బ్రయత్నించుచుండినట్లును ఎవ్వరికి వీలయినవారు శాసనములు వేయించుట, కొళ్ళిచ్చుట మొదలయిన పనులు చేయుచుండినట్లును, ఈ కాలమున నెవరి యధికారమును స్థిరపడనట్టును దోచుచున్నది' అని యూహించిరి. (లక్ష్మణరాయ వ్యాసావళి పుట ౫౨ ) ఈ యూహకు బ్రోదిగ లక్ష్మణరావుగా రుదాహరించిన సాధనములలో నెల్ల శా. శ. ౧౪౪౬ తారణ మార్గశిర శు. ౨ శనివారమున వ్రాయించిన తిరుమల దేవ మహారాయల శాసనము ముఖ్యమైనది (*EC. IX. Ma.* 82). ఇందు 'కృష్ణదేవ మహారాయరిగె గంగోదక సేవితరప్ప...కోనప్ప నాయకరు' అను వాక్యమీ సందర్భమున జక్కఁగ గమనింపఁదగినది. ఈ వాక్యమునకు లక్ష్మణరావుగా రిట్లు వివరణమును వ్రాసియున్నారు. 'కృష్ణరాయలకుఁ గోనప నాయకుఁడు గంగోదకము సేవింపజేసెననియునిందుఁ జెప్పఁబడియున్నది. చరమావస్థయందు గొంతులో గంగఁ బోయు నాచారము హిందూదేశ మంతటను గలదు కావున గోనపనాయకుఁడు రాయల చరమదశయందాతని సేవఁజేసి ధన్యుఁడయ్యెనని మనము తలంపవచ్చును. పై చాటు పద్యమునందలి మరణతిథియె నిజమైనయెడల ఈ శాసనము రాయల మరణానంతరమున ఆఱునెలలో వేయబడినదియగును.' (లక్ష్మణరాయణ వ్యాసావళి. పుట ౫౧) కాని పైశాసన పరిష్కర్తయగు లూయీ రైసుగారు 'గంగోదక సేవితరప్ప' యను మాటలకు గంగోదకమును మోయువా (*The bearer of the Ganges Water to Krishnadeva Maharaya*) డని యర్థము జెప్పిరి. కృష్ణరాయలు స్వయముగ యాత్రచేసి గంగలో స్నానము సేయుటకు వలనుపడక పోగా నీ కోనప్ప నాయకు నంపి యతనిచే గంగాజలమును దెప్పించుకొని యందు స్నానమాడి యుండవచ్చును. ఇంగిసంగత మెద్దియులేదు. కావున పైవాక్యము నాధారపఱచుకొని కృష్ణరాయలా శాసనకాలమునకు ముందే మృతిజెందెనని చెప్పుట సమంజసము గాదు. మఱియును లక్ష్మణరావుగారే, 'ఈయూహలకన్నిటికిని వ్యతిరేకముగ గృష్ణరాయని శాసనములు పెక్కులు శా. శ. ౧౪౫౨ వఱకును గలవు. కావుననే సూయలు మొదలయిన తద్‌జ్ఞులు కృష్ణరాయలు శా. శ. ౧౪౫౦ (క్రీ. శ. ౧౫౩౦) వఱకును జీవించియుండెనని వ్రాసియున్నారు' అని యొప్పుకొని యున్నారు. (లక్ష్మణరాయ వ్యాసావళి. పుట. ౫౨). మఱియు శా. శ. ౧౪౪౬-౧౪౫౨ ల మధ్య కృష్ణరాయల కుమారుఁడైన తిరుమల రాయలును అల్లుడైన రాయలును, దమ్ముడైన అచ్యుతరాయలను రాజ్యము కొఱకొండొరులతో బోరుచుండిరని తెల్పు సాక్ష్యము విశ్వాసపాత్రమైన దెద్దియు గానరాదు. కావున పై చాటువునందు జెప్పినట్లు కృష్ణరాయలు శా. శ. ౧౪౪౬ నకు సరియైన తారణ వర్షమున స్వర్గస్థుఁడాయెనని యంగీకరించుటకు వలనుపడదు.

* * *